శ్రీ



# మేఘసందేశము.

మహాకవి కాళిదాస ప్రణీతము.






మల్లినాథ కృత సంస్కృత వ్యాఖ్యాన

వేదం - వేంకటరాయ శాస్త్రి కృతాంధ్రటీకా

సమేతము.




రెండవకూర్పు.



చెన్నపురి:

ఊ. పుష్పరథశెట్టి అండు కంపెనీ వారి

కలా రత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1927.



దీనివెల రూ. 2-8-0] [Price Rs. 2-8-0.

# మేఘసందేశము

## అవతారిక.

"కాళిదాసగిరాం సారం । కాళిదాస స్సరస్వతీ
చతుర్ముఖోఽథవా సాక్షా ద్విదు ర్నాన్యే తు మాదృశః."

అని వృద్ధవాక్య ప్రమాణ పారావార పారీణ మహామహోపాధ్యాయులు వ్యాఖ్యాతృచక్రవర్తి శ్రీమల్లినాథసూరిగారు సామాన్యముగా కాళిదాసకవనముంగూర్చి పల్కియుండఁగా, 'మాఘే మేఘే గతం వయః' అనుతదుక్తిచొప్పున తదీయ వయస్సునెల్ల నాక్రమించిన యీమేఘసందేశ మహాకావ్యంబునం గల సారమును గ్రహించువిషయమున ననుబోంట్లు ఏమి చెప్పకొనవలయునో నేనెఱుంగను. నాశిష్యులకు నేను మేఘసందేశమును చెప్పునప్పుడు, అందు నాబోధించువిషయము లెల్ల గ్రంథరూపమున ముద్రితములయినచో పిమ్మట తాము చింతనచేసికొనుటకు సాధనముగా నుండు నని వారు కోరఁగా మల్లినాథవ్యాఖ్యాశారదా దేవతకు చేటికగా, ఉపాధ్యాయు లలవడనివారికి తన్నిరపేక్షముగానే మూలగ్రంథమునం గల సారము విశదపడునట్లుగా, ప్రతిపదార్థ తాత్పర్య పదప్రయోజనాది రూపమైన యాంధ్రటీకతో మూలవ్యాఖ్యలను ముద్రించినాఁడను.

ప్రాక్తనగ్రంథముల యిదానీంతనముద్రణములందు అవతారికలో గ్రంథకర్తయొక్క కాలము - చరిత్రము-గ్రంథములు-తత్ప్రాశస్త్యము - ఇట్టివిషయములను విరివిగా చర్చించుట యాచారమై యున్నది. కాని కాళిదాస తద్గ్రంథముల విషయమున ఆచర్చలను అనేకులు అదే పనిగా అనవరతము నేయుచున్నారు గాన నేను ఆపని నిటం బూనుకొననైతిని. అయిన నొకటిరెండుమాటలు:—

### కాళిదాసుకాలము.

మేఘసందేశమున ధారాపురప్రస్తావము లేకుండ ఉజ్జయినీనగర ప్రస్తావము ఉండుటచేత దానికర్త భోజరాజసభాలంకారభూతుఁడైన కాళిదాసు కాఁడనియు విక్రమార్కునిసభలోని నవరత్నములలో నొకఁడయిన మఱియొక కాళిదాసనియు ఒకకొందఱు ఊహించినారు. కాని, ఆనవరత్నములలోనే మఱియొకఁడైన యమరసింహునియొక్క శిష్యుఁడు అమరసూరి తనరచించిన కావ్యకల్పలత యను గ్రంథమందు "ఉజ్జయిన్యాం విక్రమార్క ముఞ్జ భోజ నరేశ్వరాః" అని చెప్పియుండుటచేత పైయూహ త్యజింపఁదగినదిగా నేర్పడుచున్నది.

" ధన్వన్తరి క్షపణ కామరసింహ శఙ్కు
వేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య."

అను ప్రాక్తనోక్తిని పాటిసేయక వీర రుపాధ్యాయులవారు కాళిదాసు క్రీ. శ. 11-వ శతాబ్దివాఁ డని సిద్ధాంతింపం గడంగిరి.

పూర్వమేఘము 8-వ శ్లోకమునంగల దిఙ్నాగాచార్య ప్రస్తావనంబట్టియు, క్రీ. శ. 63,-వ సంవత్సరమున పులికేశని వేశితమైన యైహొలుశాసనమునంగల

" యే నాయోజి నవేశ్మ । స్థిర మర్థవిధౌ వివేకినా జినవేశ్మ
స విజయతాం రవికీర్తిః । కవితాశ్రిత కాళిదాసభారవికీర్తిః."

అను కాళిదాసప్రస్తావముంబట్టియు, బహువిషయ పర్యాలోచన పూర్వకముగా రఘునాథగోపాలనందర్గికార పండితులు కాళిదాసు కాలము క్రీ. శ. 6-వ శతాబ్ది యని నిర్ణయించినారు.

కేలు పండితులు మందసోరశాసనాదికమునుబట్టి కాళిదాసు క్రీస్తుశకమునకు పూర్వము 56 సంవత్సరములయప్పు డని నిర్ణయించినారు.

మమ్మటకృత కావ్యప్రకాశమందును భోజమహారాజ ప్రణీత సరస్వతీకంఠాభరణమందును, ధనంజయరచిత దశరూపకమందును, కాళిదాసుని ప్రబంధములనుండి యుదాహరణములు గలవు.

## కాళిదాసోత్కర్ష.

కవనమందు ఈకవిప్రభావము 'కో2హం రఙ్గే భవా నహమ్' ఇత్యాది కథలకు తగినదిగానే యున్నది. ఈయనకును ఇతరకవులకును గల తారతమ్యము శబ్దమందేమి అర్థమందేమి రసమందేమి త్రిభువనవిధాతృ ఘటనిర్మాతృ తారతమ్యము వంటిదే. ఈ విషయమున విప్రతిపత్తి లేమికి-

" పురా కవీనాం గణనాప్రసఙ్గే । కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా,
అద్యాపి తత్తుల్యకవే రభావా । దనామికా సార్థవతీ బభూవ."

అను స్తుత్యుక్తియే నిదర్శనము ఈ మహానుభావుని—

" కవయః కాళిదాసాద్యాః, కవయో వయ మప్యమీ,
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్."

అని మీమాంసాశాస్త్రప్రవర్తకు లయిన భట్టపాదులవారును—

" నిసర్గ సౌరభంశస్య కాళిదాసస్య సూక్తిషు
ప్రీతి ర్మధురసాన్ద్రాసు మఞ్జరీష్వివ జాయతే."

అని బాణభట్టుండును-

"ఏవం చ విద్వద్వదనా ద్వినిర్గతం । ప్రసిద్ధరూపం కవిభి ర్నిరూపితమ్
'సతాం హి సందేహపదేషు వస్తుషు । ప్రమాణ మన్తఃకరణప్రవృత్తయః.' "

అని శాకుంతలోక్తి గ్రహణముచే కుమారిలభట్టాచార్యులును,

" యస్మాలం కరుణానిధి స్సభగవాన్ వల్మీకజన్మా మునిః,
యస్మైకే కవయః పరాశరసుతప్రాయాః ప్రతిష్ఠాం దధుః,
సద్యో యః పథి కాళిదాసవచసాం శ్రీబిల్హణః సోఽధునా
నిర్వ్యాజం ఫలితః సహైవ కుసుమో త్తంసేన కల్పద్రుమః."

అని బిల్హణకవియు,

" తస్మా దాలోచితాశేష లోకశాస్త్రేణ ధీమతా
కర్తవ్యం కాళిదాసాదేః కావ్యానాం పరిశీలనమ్."

అని ప్రాచీనాలంకారికులును,

" కాళిదాసకవితా నవం వయో । మాహిషం దధి సశర్కరం పయః
ఏణమాంస మబలా చ కోమలా । సంభవన్తు మమ జన్మజన్మని."

అని యొకరసజ్ఞుఁడును,

" కవి రమరః, కవి రచలః, । కవి రభినన్ద శ్చ, కాళిదాస శ్చ,
అన్యే కవయః కపయః, । చాపలమాత్రం పరం దధతే."
" సాకూత మధుర కోమల । విలాసినీ కణ్ఠకూజితప్రాయే
శిక్షాసమయేఽపి ముదే । రతలీలా కాళిదాసోక్తిః."

అని కొందఱభిజ్ఞులును,

" ఏకోఽపి దోషో గుణసన్నిపాతే । నిమజ్జతీన్దో రితి యో బభాషే
నూనం న దృష్టం కవినాపి తేన । దారిద్ర్యదోషో గుణరాశినాశీ."

అని యొకదరిద్రకవియు,— వారవించియున్నారు.

## కాళిదాసుని కవనమందలి విశేషము.

కాళిదాసునికవనము ధ్వనిప్రధానము, బహిరన్తఃస్ఫురద్రసము, కవనమున కెల్ల - అందునుం బ్రధానముగా శృంగారకవనమునకు - వరవడి. ఇతని కవనము నెంద సోదాహ్యానముగా నుండిన, ప్రాయికముగా ఇతరులది సాధారణోద్యానంబు[illegible] డును. ఈయన సూక్ష్మముగా సూచించిన విషయములను వానియ[illegible] లను ఇతరకవులు విస్తరింతురు. ఈయన వ్యంగ్యముద్యాదగాఁ జెప్పిన[illegible]

ఇతరులు లక్ష్యవాచ్యభంగులం బ్రకటింతురు. ఈయన యుపమాప్రధానుండునుం గదా. 'ఉపమా కాళిదాసస్య' అను సూక్తి సార్వలౌకికము.

" ఉప మైకా శైలూషీ । సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్
రఞ్జయతి కావ్యరఙ్గే । నృత్యన్తీ తద్విదాం చేతః -
...ఉపమా । సైవోక్తభఙ్గీభేదె నానేకాలంకారభావం భజతె...

త దిదం చిత్రం విశ్వం । బ్రహ్మజ్ఞానాది వోపమాజ్ఞానాత్
జ్ఞాతం భవ తీత్యాదౌ । నిరూప్యతే నిఖిలభేదసహితా సా. "

అని చిత్రమీమాంసాకారుల యనుశాసనము. దానింబట్టి పరికింప కాళిదాసుఁడు ఉపమయం దద్వితీయుం డగుట నలంకారమందెల్ల నట్టివాఁడే, దానం జేసి కవ్యన మాత్రమందే అద్వితీయుఁ డని యేర్పడుచున్నది. ఇతని ప్రతిభావిశేషమును అలంకారములచేతను, అనన్యసామాన్యలోకస్వరూపవ్యవహారాభిజ్ఞతను ఇతరకవి రాడలభ్యవస్తుస్వరూపవర్ణనలచేతను లోకోత్తరార్థాంతరన్యాసాదులచేతను, ఆత్మసంస్కారోత్కర్షను ఉదాత్తవస్తురచనలచేతను, వివేకు లెఱుంగుదురు.

## కాళిదాసరచితగ్రంథములు.

ఈమహాకవి కుమారసంభవ రఘువంశ మేఘసందేశ మహాకావ్యములను మాళవికాగ్నిమిత్ర విక్రమోర్వశీయ శాకుంతల రూపకములను ఋతుసంహారమను చిన్న కావ్యమును శ్రుతబోధమను ఛందోగ్రంథమును రచించినాఁడు. జ్యోతిర్విదాభరణమను గ్రంథమును ఈయన రచించినట్లు తద్గ్రంథపీఠికాశ్లోకములలో నున్నది; కాని, ఆశ్లోకముల తబ్బిబ్బురచనయు లిట్ప్రయోగంబునుం జూడఁగా వినుకలిం బట్టి యెవరో ఇదానీంతనులు ఆశ్లోకములను రచించి రని యెన్నవలసియున్నది. నళోదయము, శృంగారామృతము, రోలంబరాజీయము, శంకరభగవత్పాదప్రణీత మని పరఁగు నాత్మబోధము, ఈయన చేసిన వని వాడుక కలదు; కాని నళోదయము చేసినవాఁడు నారాయణునికుమారుఁడు రవిదేవకవి యని తెలియనయినది; కడమ మూఁటిని ఇతఁడు చేసె ననుటకుం బ్రమాణము లేదు.

## కాళిదాసగ్రంథముల సామాన్యస్వరూపము.

కాళిదాసరూపకములెల్లను శృంగారాంగికములు. మేఘసందేశము శృంగారకావ్యము. కుమారసంభవము మొదటి ఎనిమిదిసర్గములు మాత్రమే మల్లినాథునిచే వ్యాఖ్యాతములు; అంతవఱకే కాళిదాసప్రణీత మని పలువురయభిప్రాయము, అంత

వఱకును శృంగారప్రధానమే. కడమభాగములో వీరరసమును గలదు. రఘువులోను నానారసములు గలవు.

జ్యోతిశ్శాస్త్రగ్రంథములలో కాళిదాసశబ్దము 'మూఁడు' అను సంఖ్యకు వాచకమనియు, ముగ్గురు కాళిదాసు లుండిరనియు, మాళవిక చేసినయతఁ డొకఁడు-నళోదయకారుఁ డింకొకఁడు - రఘువంశాది కర్త వేఱొకఁడు - అని కొందఱు పల్కుట గలదు. మాళవికాకారుఁడు శాకుంతలకారుఁడును వేర్వేఱని ప్రొఫెసరు విల్సను గారు వ్రాసినారు. ఆయభిప్రాయము సరిగా దని శంకరపాండురంగపండితులు నిరూపించినారు. నళోదయముమాట తెలిసినదే గదా.

" కావ్యేషు నాటకే ష్వేవ వయం వా వయ మేవ వా
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే. "

అని కాళిదాసు పలికినట్లు వాడుక కలదు. కాని కాళిదాస భవభూతుల భిన్నకాలికతంబట్టి చూడఁగా పూర్వార్ధము కాళిదాసే చెప్పినదై యున్న నుండుఁగాక ఉత్తరార్ధమును భవభూతితరువాతిపండితు లెవరో చెప్పియుందు రని యెన్నవలసి యున్నది. కాళిదాసునకు భవభూతి కడుంబిమ్మటివాఁ డనుటకు హర్షచరితపీఠికలో బాణకవి పలుపురుకవులలో కాళిదాసుం బేర్కొనుటయు, మహాకవిని భవభూతిని వదలుటయును, తార్కాణము. దీనం జేసి 'రత్యంతవర్ణన' తారతమ్యపరీక్షయు 'రాత్రి రేవ వ్యరంసీత్' కథయు నిక్కము లని తలంప వలనుగాక యున్నది.

" కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకున్తలా
తత్రాపిచ చతుర్థోఽఙ్కః తత్ర శ్లోకచతుష్టయమ్. "

అనియు నభియుక్తోక్తి కలదు.

కాళిదాసునిమాళవికకును ధావకుని ప్రియదర్శికా రత్నావళులకును విశేష సామ్యము గలదు. ఈ రెంటిని మించఁగోరి కాళిదాసు మాళవికను వ్రాసినజాడయు, ప్రియదర్శికమీఁదిమెట్టైదను ఎక్కువమెట్టుఁ గెక్కించి సింగారించి శకుంతలమీఁదికి తెచ్చుకొన్నపోఁడిమియు, ఈ నాలుగు గ్రంథములను సమగ్రముగా జాకరూకతతో పరికించినవారి కగపడకపో వని నామతము. గ్రంథవిస్తరభీతిచే ఆచర్చనిటం దొడంగను.

ఈతనిగ్రంథములప్రభావము వాని ననుసరించి యితరులు నేసిన రచనలచేఁ తెల్ల మగుచున్నది. రఘువంశసరణిలో అశ్వఘోషుఁడు బుద్ధచరిత్రము వ్రాసెను. వితవ్యపరీతముగా కొందఱు పల్కుదురు గాని ప్రామాణికు లయినపండితులు ఇట్లే యభిప్రాయపడియున్నారు. మహాకవి వామన బాణభట్టుఁడు కుమారసంభవకావ్యమును నాటకముగా పార్వతీపరిణయ మనుపేర శబ్దాంతరీకరించెను.

# మేఘసందేశప్రశస్తి.

అమోఘవర్ష మహీనాథునిగురువు జైనమహాకవి జినసేనుఁడు మేఘసందేశము నావేష్టించి పార్శ్వాభ్యుదయ మను మహాకావ్యము రచించినందునను, * భవభూతి మాలతీమాధవములో నవమాంకములో కతిపయశ్లోకములలో లఘువుగా మేఘసందేశము ననుకరించుటచేతను, బిల్హణకవి విక్రమాంకదేవచరిత్రమున త్రయోదశసర్గలో వర్షర్తువర్ణనలో కాళిదాస మేఘసందేశము తద్దయు వరితల తలంపునకు దెచ్చుటచేతను, ఈవలివిద్వాంసులు పలువురు ఇంచుమించుగా మేఘానువాదముగా అనేకులు వృత్తమును సయితము మార్పక ఉద్ధవసందేశము ఉద్ధవదూతము హంససందేశము హంసదూతము పదాంకదూతము అనుగ్రంథములను, మేఘప్రకారముననే బోపదేవుఁడు భ్రమరగీతలను - రచించుటచేతను, మేఘసందేశప్రభావము తెల్లమగుచున్నది.

ఈతని గ్రంథములపై విద్వాంసులచే వ్రాయఁబడిన వ్యాఖ్యల మహత్త్వముచేతం గూడ వానియుత్కర్ష తెలియుచున్నది. మేఘసందేశముపై ఇరువది వ్యాఖ్య లున్నవని పూర్వోక్త నందర్గికారపండితులు తెలిపినారు. అవి యెవ్వి యన:—ఈపాత్తములోని వ్యాఖ్యను రచించిన (౧) మల్లినాథసూరియే తనకుముందు ౨ నాథుడు-౩ దక్షిణావర్తుఁడు అను నిద్దఱను ఏతద్వ్యాఖ్యాతలను ప్రస్తావించియున్నాఁడు. మఱి ౪-వల్లభ ౫ మహిమసింహగణి ౬-సుమతివిజయ ౭-లక్ష్మీనివాస ౮-మేఘరాజ ౯ భరత-౧౦ సనాతన-౧౧ రామనాథ-౧౨ హరగోవింద-౧౩ కల్యాణమల్ల-౧౪ సరస్వతీతీర్థులు అనువారు మేఘముపై వ్యాఖ్యలు వ్రాసిరి. ఇంతియగాక మేఘముపై ౧౫ సారోద్ధారిణియు-౧౬ మేఘలతయు-౧౭-౨౦ నాలుగు-అవచూరులునుకలవు. అల్ప

* 'కచ్చిత్సౌమ్య ప్రియసహచరీ విద్యు దాలిఙ్గతి త్వాం?
ప్రావిర్భూతప్రణయసుభగా శ్చాతకా వా భజన్తే?
పౌరస్త్యో వా సుఖయతి మరు త్సాధు సంవాహనాభిః?
విష్వగ్భిర్భ్రుత్స్ను రపతిధనుర్లక్ష్మ లక్ష్మీం తనోతి?'
'దైవా త్పశ్యే ర్జగతి విచర న్నిచ్ఛయా మత్ప్రియాం చే,
దాశ్వాస్యాదౌ తదను కథయే ర్మాధవీయా మవస్థామ్;
ఆశాతన్తు ర్న చ కథయ తాత్యన్త ముచ్ఛేదనీయః,
ప్రాణత్రాణం కథమపి కరో త్యాయతాక్ష్యాః స వీకః.'

వృత్తము కూడ మందాక్రాంతయే.

సారమేని ఈ కావ్యముపై ఇన్నివ్యాఖ్యలు పుట్టునా? కావ్యములలో మేఘసందేశమునకు సాటిరాఁగలవి - సౌందర్యలహరి - అమరుకము - ఇట్టివి ఒకటిరెండు దక్క మఱి లేవు. మేఘసందేశము లోకములోని శృంగారప్రబంధసర్వస్వమునకు ప్రభవమయినయాటబుగ్గ యనం జెల్లును.

ఈయవతారికలో నుదాహరింపఁ దలంపు గొన్నవాఁడనై మేఘమండలివర్ణనాంశాదికమును ఇతరకవిపుంగవులు ఏపాటి గౌరవించిరో చూతముగాక యని యితరుల దృశ్య శ్రవ్య ప్రబంధములను పెక్కింటిని చదివి చూడఁగా, అందులకు నిదర్శనములు లెక్కలేనివి దొరకినవి. అట్లే + రఘువంశాదులం గలవర్ణనలకును అట్టి నిదర్శనములు బహుళముగా నున్నవి. మేఘసంబద్ధములు మాత్రమే ఒక్కగ్రంథముగా సూత్రించినచో ఆగ్రంథము ఆంధ్రవివరణముతోడి యీ మేఘసందేశగ్రంథముకన్న కడుగొప్పది యగున ట్లేర్పడినది. దానం జేసి దానినెల్ల నిటం బ్రదర్శింపక వేఱుగ్రంథముగా నూల్కొల్పఁ దలంపుగొంటిని. అయిన నిట నించుక * దిక్ప్రదర్శనము.—

## కాళిదాస వర్ణనాదికములను ఇతరకవీంద్రులు మెచ్చుట.

పూర్వమేఘము 26 - వ శ్లోకము.—'త్వత్సంపర్కా త్పులకితమివ ప్రౌఢపుష్పైః † కదమ్బైః'—పులకితదేహమునకును పుష్పితకదంబమునకును మహాకవి సామ్యమును చెప్పినాఁడు. దానినే యితరకవు లిట్లు కూర్చినారు:—

" స్నిగ్ధ స్ఫేర విలోల ముగ్ధ మధురా య న్నేత్రయో ర్విభ్రమాః,
యద్వా స్మృష్టవిలాసపత్త్రలతికా ఘర్మోద్గమా గణ్డయోః,
యచ్చ ప్రౌఢ * కదమ్బకుట్మలసఖీ కాయ్యఙ్గకే విక్రియా
త త్స్యాం కిమపి స్ఫుటం రతిపతే ర్దోర్దణ్డ విస్ఫూర్జితమ్." మల్లిక.

---

* ఒక్కటి యుదాహరించెద:—

" అథ ప్రభావోపనతైః కుమారం । కల్పద్రుమోత్థై రవకీర్య పుష్పైః,
ఉవాచ వాగ్మీ దశనప్రభాభి । స్సంవర్ధితోరస్థ్సలతారహారః". రఘువు.

" అపుడు గంధర్వపతి మహి కవతరించి,
రాజు విస్మయమున హయరాజు డిగ్గ,
నక్కు చేర్చి ముదంబుతో ననియె దంత
కిరణములు హార కాంతులు సరసమాడ."

" కలయతి తదుదన్తాకర్ణనేషు ప్రసక్తిం
కిమపి కిమపి మధ్యే నిశ్చలా ధ్యాయతీవ,
అపిచ వహతి హారస్పర్శమాత్రేణ బాలా
పవనచల * కదమ్బోద్భేదతుల్యా మవస్థామ్. " అదే.

" పుఢమ జలహార వరిస పరోహాంత కదంబకుమ్మల కఠోర రోమంచ కంచుఅ త్థఇఅ సఅలంగిం. " అదే.

" ప్రథమప్రియావచన సంశ్రవస్ఫుర
త్పులకేన సంప్రతి మయా విడమ్బ్యతే
ఘనరాజినూతనపయస్సముక్షణ
క్షణబద్ధకుట్మల *కదమ్బడమ్బరః "! మాలతి.

" వయం తథా నామ, య దాత్థ? కిం వదా
మ్యయం చ కస్మా ద్వికలః కథాన్తరే?
* కదమ్బగోళాకృతి మాశ్రితః కథం
విశుద్ధముగ్ధః కులకన్యకాజనః?" అదే.

" జే ణవస్స తిఉసస్స కంటఆ । జే *కదంబమఉళస్స కేసరా
అజ్జ తుజ్ఝ కరఫంససంగిణో । తే హుఅంతి మహ అంగణిజ్జిదా." కర్పూర.

" తదన్తే శ్రీకాన్తస్మరసమరధాటీ పులకితా
*కదమ్బానాం వాటీ రసికపరిపాటీం స్ఫుటయతి,
త్వ మాసీన స్తస్యాం న యది పరతో నన్దనితతో
విభాతి వ్యర్థా తె ఘనరసనివేశవ్యసనితా. " హంసదూత.

భాస్కరాచార్యునిగోళాధ్యాయములోని యీక్రిందిశ్లోకమువలన కదంబపుష్ప స్వరూపము విశద మగును.—

" సర్వతః పర్వతారణ్య గ్రామచైత్య చయై శ్చితః
కదమ్బకుసుమగ్రన్థిః కేసరప్రకరై రివ. "

పూర్వమేఘము 63-వ శ్లోకము.—'త్వయి తటగతే * స్నిగ్ధభిన్నాఞ్జనాభే - సద్యః *కృత్తద్విరదదశనచ్ఛేదగౌరస్య తస్య అద్రేః'—వర్ణము మాయకుండుటకై చిలికను, కోఁతను, కాళిదాసు చెప్పినాఁడు. ఇతరకవీంద్రులు ఈశక్తిని మెచ్చిన ప్రయోగములు ఒకకొన్ని:—

"నీలోత్పలాభై *ర్భిన్నాఞ్జనత్విషో మధురరావిణో బహుళాః ।
తటిదుద్భాసితదేహాః । ధారాకుశవర్షిణో జలదాః." — బృహత్సంహిత.

"ఏవంవిధం విరహిణీ విరహేణ భిన్నా
*భిన్నాఞ్జనచ్ఛవిఘనే గగనే ఘనర్తౌ
మత్వా ప్రియం త మదయం హృదయం ప్రవిష్టం
బ్రూతేస్మ పేశల మలం పరిహాసమిశ్రమ్" — గోళాధ్యా.

"దివి వ్యావల్గద్భి ర్విజితపవనైః స్యన్దనహయై
ర్జవా దుత్క్రామద్భి ర్జలనిధి మి వాహ్నాయ పతతః
అహో దూరా ద్దూరం వ్రజతి మమ *భిన్నాఞ్జనచయ
చ్ఛవిశ్యామః క్రోడో దినకృతఇవ ధ్వాన్తనిచయః." — చండ.

"ముష్టిగ్రాహ్యం తిమిర మభితో నిహ్నుతే దిగ్విభాగం,
పాదన్యాసః స్ఖలతి విషమే, నిష్ఫలా దృష్టిపాతాః,
ధారా *భిన్నాఞ్జనగిరిసుహృ ల్లుప్తవర్ణా స్తరత్వాత్
లబ్ధాద్వైతః స్ఫురతి పరితో నీలి మే వైకతానః." — అదే.

"కన్దర్పదైవతనికేతనవైజయన్తీ
యాన్తీ విలాసరసమన్థర ముత్పలాక్షీ
దృష్టిం నివేశితవతీ మయి కాలకూట
*లేశాన్ధకారిత సుధాలహరీవిచిత్రామ్."
(లేశ = పగిల్చినఖండములు). — కర్ణసుందరి.

"అమ్హ వ్వవసాఅ సముఇఓ * ణిద్ధోఅ ణీలంజణపుంజ మంసలంధఆర ణిబ్భరో ణిసీథారంభో."

— మల్లికా.

"సంకప్పేసు అ *ణిణ్ణంజణ ణీల మంసలే అ తిమిరే పంచిఅ పరిజణా లఅఘరేసు." — అదే.

"మనఃశిలా *భఙ్గనిభేన పశ్చా న్నిరుధ్యమానం నికరేణ భాసాం
వ్యూఢై రురోభి శ్చ వినుద్యమానం । నభః ససర్పేవ పురః ఖగానామ్." — భారవి.

"జానే స్వప్నవిధా మమాద్య చుళుకో త్సేక్యం పురస్తా దభూత్
ప్రత్యూషే పరివేషమణ్డలమివ జ్యోత్స్నాసపత్నం మహః
త స్యాన్త *[illegible]ఖనిస్తుషీకృతశరచ్చన్ద్రప్రభై రఙ్గకై
ర్దృష్టా [illegible] జటాతకృతవతీ సా మాన్మథం మన్త్ర[illegible]

" దళ * దళితహరిద్రా గ్రన్థిగౌరె శరీరే
స్ఫురతి విరహజన్మా కోప్యఽయం పాణ్డుభావః,
బలవతి సతి యస్మిన్ సార్థ మావర్త్య హేమ్నా
రజతమివ మృగాక్ష్యాః కల్పితా న్యఙ్గకాని." అదే.

" దుకూలం బిభ్రాణో * దళితహరితాళద్యుతిహరం
జపాపుష్ప శ్రేణీరుచిరుచిర పాదాంబుజతలః
తమాలశ్యామాఙ్గో దరహసితలీలాఞ్చితముఖః
పరానన్దాభోగః స్ఫురతు హృది మే కోఽపి పురుషః. హంసదూత.

" బిభ్రాణా మృదుతాం శిరీషకుసుమశ్రీహారిభిః శాద్వలైః
సద్యఃకల్పితకుట్టిమా మరకత * క్షోదైరివ శ్యామలైః
ఏషా సంప్రతి బన్ధనా ద్విగళితై ర్బన్ధూకపుష్పోత్కరై
రద్యాపి క్షితి రిన్ద్రగోపకశతై శ్ఛన్నేవ సంలక్ష్యతే." ప్రియదర్శిక.

" లావణ్ణం ణవజచ్చకంచణణిహం, ణెత్తాణ దీహత్తణం
కణ్ణేహిం ఖుడిదం, కవోలఫలఆ * దోళిండచందోవమా;
ఏసా పంచసరేణ సజ్జిదధణూదండేణ రక్ఖిజ్జఏ
జేణం సోసణ మోహణ ప్పహుదిణో విజ్జుంతి మం మగ్గణా.?' కర్పూర.

" అగ్గమ్మి ఖంగసరణీ ణయణాణ తిస్సి
మజ్ఝే పుణో * కఢిదదుద్ధతరంగమాలా
పచ్ఛా అ సే సరది తంసణిరిక్ఖిదేసు
ఆఅణ్ణ మండలిఅ చావధరో అణంగో." అదే.

" జిణ్ణా పురో ణ హరిదా దళిఆ హళిద్దా,
రోసాణిఅం ణ కణకం, ణ చ చంపఅఇ,
తాఇం సువణ్ణకుసుమేహి విలోఅణాఇ
అచ్ఛేమి జేమి హరిణచ్ఛి ఘుమం దిహిట్ఠా." అదే.

" జం ముక్కా సవణంతరేణ తరలా తిక్ఖా కడక్ఖచ్ఛడా
ఖింగాధిట్ఠిఅ కేలఅగ్గిమదళ ద్దోణీ సరిచ్ఛచ్ఛఈ,
తం కప్పూర * రసేణ ణం ధవళిదో, జొణ్హాఅ ణం హావిదో,
ముత్తాణం ఘణ * రేణు ణెవ్వ ఘురిదో, జాదాహ్మి ఏత్థంతరే." అదే.

" మజ్జళమజ్జనవిశదా। కర్పూర * క్షోదపాణ్డుర [illegible]మ్
సాధత్త జలదధౌతా। ద్యౌరివ శరదిన్దుచన్ది [illegible]దమ్." పార్వతీపరి.

“ త్వత్కాన్త్యాపమవిభ్రమంసి కుచభర, స్త్వద్యానఖేలం గతం,
త్వచ్ఛన్దానుగమ మూరుకాణ్డ, మపితు స్పృష్టం న కార్కశ్యతః,
* శాణోల్లీఢసువర్ణదర్పణతలస్వచ్ఛే కపోలే, సఖే,
త్వద్దన్త * ప్రథమప్రరోహధవళా జాగర్తి కాచి చ్ఛవిః.” మల్లిక.

“ వర్ణాన్తరేణ బిసకాణ్డసహోదరేణ
స్పృష్టం శరీర మకఠోరకరీరముగ్ధమ్
ప్రమ్లాయతీవ కిమపి శ్వసితానిలేన
బిమ్బాధరోఽపి కురువిన్ద * దశాభిరామః.” అదే.

“ ఏత త్ప్రవాళ * దళకోమలకాన్తికాలం
మార్తణ్డమణ్డల మదోషత యాభిరామమ్
లోకాన్ధకారగరళచ్ఛిదురప్రభావ
మాభాతి రత్నమివ కాలమహోరగస్య.” నేమినిర్వా.

“ ఇన్ద్రనీలమణిభేదశోభినా । కాయకాన్తిపటలేన వేష్టితః
ఘర్మరశ్మితనయాహ్రదాన్తర। స్థాయికాళియతులా ముపాహ సః.”అదే.

“ అథాస్య శృఙ్గే సురసిన్ధు నిర్ఝర। ప్రపాతఝాత్కారిణి కారణే ముదః
* నఖాగ్రభాగోల్లిఖితేన్దుపాణ్డుర। శ్రియం హరిః పాణ్డుశిలాముపాయయా.” అదే.

“ ఉత్కణ్ఠాధానహేతు ర్నిఖిలశిఖిగళక్రోడకూజాఙ్కురాణాం
ధారావల్లీలతానాం మధుకరపటలశ్యామలః పల్లవౌఘః
* దీర్ఘద్వైదూర్యరత్నామలగగనతలాదర్శలీలానిచోళః
చోళస్త్రీకేశపాశైః సహ చరతి రతివ్యాకులైః కాలమేఘః. బిల్హ.

“ పరిమృదితమృణాళీమ్లాన మఙ్గం ప్రవృత్తిః,
కథమపి పరివార ప్రార్థనాభిః క్రియాసు,
కలయతి చ హిమాంశో ర్నిష్కళఙ్కస్య లక్ష్మీ
మభినవకరిదన్త * చ్ఛేదపాణ్డుః కపోలః.” మాలతి.

“ అఙ్కం కేఽపి శశఙ్కిరే, జలనిధేః పఙ్కం పరే మేనిరే,
సారఙ్గం కతిచిచ్చ సంజగదిరే, భూచ్ఛాయ మైచ్ఛన్పరే,
ఇన్దౌ య *ద్దళితేన్ద్రనీలశకల శ్యామం దరీదృశ్యతే
త త్సాన్ద్రం నిశి పీత మన్ధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే.” బిల్హ.

పూర్వమేఘము 41-వ శ్లోకము:—‘రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః’—ఇట దట్టమనుటకు ‘సూచిభేద్య’ మని కాళిదాసు ప్రయోగించి నాఁడు. ఇతరులకును కొందఱకు అది ప్రియముగా నున్నది:—

"హన్త * సూచిభేద్యై రన్ధకారై రభివ్యాప్త మేకతమాలోద్యానతుల్యం భువనమ్." మల్లిక.

"పాంసూనాం * సూచిభేద్యై స్సకలమపి కులత్మాభృతాం ఛాదనేచ్ఛా
బద్ధోత్సాహైః ప్రవాహై రనుషిర మభవ ద్వ్యోమసీమాన్తరాళమ్."
కర్ణసుందరి.

ఇట్లే కాళిదాసోక్తములయిన సకలవర్ణనలను సకలపద్ధతులను సకలాభిప్రాయములను ఇతరమహాకవులు అభిమానించినారు.

## వ్యాఖ్యాపరామర్శ.

ప్రాయికముగా మల్లినాథేతరులవ్యాఖ్యలు ఉపాదేయములు గా వని "భారతీ కాళిదాసస్య కువ్యాఖ్యావిషమూర్ఛితా" అనుమల్లినాథవచనముచేతనే తెలియుచున్నది. ఆవ్యాఖ్యలలోని మల్లినాథవిరుద్ధవిషయములను బొంబాయిపండితులు ప్రదర్శించినవానిని ఆయాశ్లోకముల వివరణములందు చర్చించితిని.

## ప్రథమదివస X ప్రశమదివస.

ప్రథమదివస ప్రశమదివస విప్రతిపత్తియందును మల్లినాథుని ప్రథమదివసమే శ్రేయ మనుటకు నాకుం దోంచునుపపత్తులం దెలిపెద.

| | | | |
|---|---|---|---|
| చైత్రవైశాఖములు ... | వసంతము. | ఆశ్వయుజకార్తికములు ... | శరత్తు. |
| జ్యేష్ఠాషాఢములు ... | గ్రీష్మము. | మార్గశీర్షపుష్యములు ... | హేమంతము. |
| శ్రావణభాద్రపదములు ... | వర్షర్తువు. | మాఘఫాల్గునములు ... | శిశిరము. |

ఆషాఢ శుద్ధప్రథమ మొదలు కార్తిక శుద్ధైకాదశి అనఁగా ఉత్థానైకాదశి వఱకు 4 నెలల 10 దినములు. 'శాపాన్తో మె భుజగశయనా దుత్థితే శార్ఙ్గపాణౌ.' అంతవఱకు శాప ముండును. మల్లినాథసూరిమతంబున ఆషాఢశుద్ధప్రథమయందు యక్షునికి మేఘదర్శనము. నాఁడే మేఘుఁడు తరలిన అలకలో యక్షిని కాంచు నాఁటికి శాపము 'శేషాన్మాసా న్గమయ చతురో లోచనే మీలయిత్వా' అనుటచే నాలుగుమాసములు శేషించి యుండును. కడమ 10 దినములకు లెక్కయేమనఁగా ఆ 10 దినములును మేఘునికి పయనమునకుం బట్టునని కవిహృదయము. వివరము:—

పూర్వమేఘములో:—

17 - వ శ్లో. 'అధ్వశ్రమపరిగతం సంశ్రయాయ ప్రాప్తే.'

24 " 'త్వ య్యాసన్నే కతిపయదినస్థాయిహంసా దశార్ణాః.'

26 " 'నీచైరాఖ్యం గిరి మధివసే స్తత్ర విశ్రామ హేతోః.'

36 " 'హర్మ్యే ష్వస్యా అధ్వఖేదం నయేథాః.'

38 } - శ్లో. 'అప్యన్యస్మిన్ కాలే మహాకాళ మాసాద్య స్థాతవ్యం తే నయన
విషయం యావ దత్యేతి భానుః ... కుర్వన్ సంధ్యాబలి
పటహతామ్'
40 } ,, 'నృత్తారమ్భే హర పశుపతే రార్ద్రనాగాజినేచ్ఛామ్'
42 } 'తాం రాత్రిం కస్యాఞ్చి ద్భవనవలభౌ నీత్వా ... చిరవిల
సనాత్ ఖిన్నవిద్యుత్కలత్రః'
47 ,, 'స్కన్దం పుష్పాసారైః స్నపయతు భవాన్'
52 } ,, 'బ్రహ్మావర్తం ఛాయయా గాహమానః'
45 } తస్మా ద్గచ్ఛే ర్జహ్నోః కన్యామ్'
56 } ,, 'అధ్వశ్రమవినయనే తస్య శృఙ్గే నిషణ్ణః'
58 } 'చరణన్యాసం పరీయాః'
66 ,, 'నిర్విశే స్తం నగేన్ద్రమ్'

పూర్వమేఘగ్రంథమెల్లం బరికింపఁగా ఈయుదాహృతశ్లోకములందు అధ్వఖే దాదిప్రస్తావములచేత దినప్రయాణాంతమందు నిలువవలసినతావులును, దినమెల్లను నిలువవలసినవియు, ఒకటిరెండుదినములుపట్టుదూరములును ('కతిపయదిన') చెప్పఁబడినవి. కడమశ్లోకములందు ప్రాయికముగా ఇంచుకసేపే నిలువఁదగినతావులను కవి చెప్పినట్లగపడుచున్నది. దానింబట్టి ఆషాఢశుద్ధప్రథమ కొంతసేపు మార్గాది కథనమందుఁ గడఁపఁగా ఆ 10 దినములును పయనము నడచుటయందును, ఉజ్జయిని-దేవగిరి - చరణన్యాసము - కైలాసము - ఇత్యాదిస్థలములందుమఱికొంతసేపునిలుచుటయందును గడవఁగా ఆషాఢశుద్ధైకాదశియందు మేఘుఁడు యక్షరమణిని గాంచును. అప్పటినుండి సరిగా 4 మాసములకే ఉత్థానైకాదశి అనఁగా శాపావసానము. ఇది గాక ప్రశమదివసపక్షమున, పూర్వోక్తసూచనలచేత పయనము కొన్నిదినములు పట్టును గావున ఆదినములు వర్షర్తువే అగుటచేత యక్షాంగన ఈ మేఘునింగనకముందే విపన్నురా లగును. కావున దశదివసాధిక్యము వివక్షితమే యని నేఁ దలంతును.

ఉన్మత్తునికి యక్షునికి ఇంత లెక్కచూచుకొను తెలివియా యందురేని - రాఁగల శ్రావణమాసమును ఉత్థానైకాదశీదినమును ఏయున్మత్తపంచాంగమునం దెలిసినవో ఈ లెక్కయు దాననే తెలిసిన దని సంతోషింతము. కడమవిషయము లెల్ల పొంకపొంకములుగా చెప్ప నేర్చినవాఁడు ఇదిమాత్ర మెఱుఁగనేరఁడనం బ్రమాణము లేదు.

కవులు ఇంతమెలఁకువతో రచింతురా యనిన - కాళిదాసు గదా. వాస్తవస్థితికి వెలి గాకుండ రఘుమహారాజదిగ్విజయమును - వం గోత్కల [illegible]

హేంద్ర కావేరీ పాండ్య తామ్రపర్ణీ మలయ దర్దుర సహ్య కేరళ త్రికూట పారసీక యవన సిన్ధుతీర హూణ కాంబోజక్రమమునను — మొగిలుదారిని - చుట్టయినచో 'వక్రః పన్థా యదపి'—అని నిమిత్తము వచించుచు - చిత్రకూట మాలామ్రకూట రేవా దశార్ణ విదిశా వేత్రవతీ నీచైర్గిరి నిర్విన్ధ్యావంతి విశాలా గంభీరా దేవగిరి చర్మణ్వతీ దశపుర బ్రహ్మావర్త కురుక్షేత్ర సరస్వతీ కనఖల గంగా హిమవచ్ఛ్రీచరణన్యాస క్రౌంచరంధ్ర కైలాస మాన సాలకా క్రమమునను, ఆయాస్థలములయు జనులయు విశేషములను, సీతారామ పుష్పకప్రయాణమున సముద్రమందలి విశేషములను అనన్యకవిగోచరములను

"సస త్త్వ మాదాయ నదీముఖామ్భః । సమ్మీలయన్తో వివృతాననత్వాత్
అమీ శిరోభి స్తిమయ స్సరన్ధ్రై । రూర్ధ్వం వితన్వన్తి జల ప్రవాహాన్."

"ప్రవృత్తమాత్రేణ పయాంసి పాతు । మావర్త వేగా ద్భ్రమతా ఘనేన
ఆభాతి భూయిష్ఠ మయం సముద్రః । ప్రమథ్యమానో గిరిణేవ భూయః."

అని తూచా తప్పకుండ వర్ణించినమహానుభావునికి పూర్వోక్తమైన లెక్క మెలఁకువ యేపాటి !

## పదప్రయోగౌచిత్యము.

ఈకవి యింత మెలఁకువతో నిర్వ్యాఘాతముగా నిర్వహించు నని నాకుం బోడకట్టినవిధం బెట్టులనినః- పూర్వమేఘములో (7) 'సంతప్తానామ్'—అను శ్లోకమున యక్షుఁడు తన కుపకారము సేయవలసినవాఁ డయిన మేఘుని స్తనయిత్నుతటిద్వదాదినిర్బహుమానశబ్దముల సంబోధింపక — దానశీలతాద్యోతకమగు పయోదశబ్దముచే సబహుమానంబుగ సంబోధించి, తన కపకారియగు కుబేరుని ధనదాది సబహుమానశబ్దముల నిర్దేశింపక లోభితాసూచకధనపతిశబ్దముచే నిర్దేశించుటం గాంచి, ఈకవి యిట్లేగ్రంథ మంతటను నిర్వహించియుండునాయని కుతూహలినై పఠించి చూడఁగా అట్లే నిర్వహణము కానిపించినది. అందులకుం దెలివిడి:—యక్షవాక్యములలో మేఘసంబోధనాదికము ప్రసక్తించినశ్లోకములు.—

## పూర్వమేఘమున.

(6) ఇందు పుష్కలావర్తకవంశ్యుఁడని మేఘునియాభిజాత్యము,(7)'పయోద సందేశం మే హర' - ఉపకారము వేఁడుచో నుపకారితాసూచకసంబుద్ధి,(20) 'ఘన తులయితుం నానిలః శక్ష్యతి త్వామ్'- 'మూర్తోఘనః' అను సూత్రమువలన ఘనశబ్దముచే కాఠిన్యము చెప్పఁబడుటం జేసి - కఠినుని - దట్టమైనవానిని - గొప్పవానిని-నిన్ను వాయువు త్రోయఁజాలఁడని అప్రకంప్యతాసూచకసంబోధనము,

(21) 'తే జలలవముచః'-ఇట నుపకారప్రస్తావము కానందున మేఘునికి 'దానయోగముం దెలుపువిశేషణము లేదు, చిన్న చిన్న బొట్లు విడతీతము లగుటచేత లవశబ్దముగల విశేషణము, (38) 'జలధర సంధ్యాబలిపటహతాం కుర్వన్ గర్జితానాం ఫలం లప్స్యసే'—వృష్టిచే సంధ్యాపూజావసరమున భక్తులరాకపోకలకు వారాంగనానృత్యసేవాదికమునకును ఇబ్బంది కలుగును గాన ఆసమయమున నట వర్షింపఁగూడ దనుసభిప్రాయముచే 'జలద' అనమి. గమ్భీరనిర్హ్రాదము కలుగునట్లుగా జలపూర్ణుఁడవై యుండవలసిన దనుసభిప్రాయముతో 'జలధర' అని సంబోధనము, (47) 'స్కన్దం పుష్పమేఘీకృతాత్మా పుష్పాసారైః స్నపయతు భవాన్ వ్యోమగఙ్గాజలార్ద్రైః'-'మిహ సేచనే—'ఇతనిజలమును పుష్పములుగా మార్చుకొనుమనుటచే జలముం జెప్పనవకాశము లేనందునను కురియుటను మాత్రము చెప్పవలసియున్నందునను 'పుష్పజలదీకృత' అనక పుష్పమేఘీకృత అనుట. పువ్వులతోనేక క్రియ యెట్లునిర్వర్తిల్లు ననఁగా ఆపువ్వులు వ్యోమగంగాజలార్ద్రములుగదా. (66) 'నానాచేష్టైర్జలద లలితైర్నిర్విశేస్తన్నగేన్ద్రమ్'—ఉత్కృష్టమైన మానససరోజలమును ద్రాగి యాయాసమును తగ్గించుకొనుటకే గాక మానసమునకు ప్రత్యర్పణ సేయుటకును - * ఐరావణమునకు ప్రీతిగలుగునట్లుగాను- కల్పద్రుమకిసలయములు పుష్టినొందునటుగాను - 'ఘర్మలబ్ధస్య' అని ముందే చెప్పియున్నందున నిదాఘపీడాశాంతి యగునట్లుగ్గాను - వింతవింతగా పన్నీరుచల్లినట్లుండు సోనలచేతను జడులచేతను శివసేవాసమాగతసురాంగనాదులను మెప్పించుటయొండె - వారితో చిట్టికములు సల్పుటయొండె-నొకభోగముగా, 'నిర్విశేః' అనుభవింపుము అనుసభిప్రాయముచే 'జలద' అని జలదానసూచకసంబుద్ధి. (67) 'ముక్తాజాలగ్రథిత మలకం కామినీవాభ్రబృన్దమ్'—ఇట ముంగురులతోడి సామ్యముకై మేఘునియందు నీలిమ వలసియున్నది గావున - 'నభ్రాజతె ఇత్యభ్రమ్'- అని యేని, స్థైర్యము వలసియున్నదిగావున - 'న భ్రశ్యతీ త్యభ్రమ్' అని యేని, వ్యుత్పత్తిగా అభ్రశబ్దమును ప్రయోగించుటు, ఉపకారప్రస్తావము లేనందున 'జలము' నిచ్చునదియను నర్థము గలశబ్దమును ప్రయోగింపమి.

---

* 'వనతతి వరాహ వాహారి వాయుభుగ్వి
రోధి వారణ వర్షాభు లాధి దొడఁగె,
ఎంద్రి రవిఁ జేర మూర్ఛడవ యెడకుఁ జేరు
తరణి ధరణిం బ్రమోదసంధాయి గాఁడె?

ఉత్తరమేఘమున—

(9) 'ఆలేఖ్యానాం స్వజలకణికాదోష ముత్పాద్య సద్యః జలముచః'-ఉపకారప్రస్తావము కానందునను నీటిబొట్టులను రాల్చుట మాత్రమే వివక్షితమైనందునను దాధాతుయోగమునుమాని ముచధాతుయోగముగా 'జలముచః' అని ప్రయోగించుట, (38) 'విద్ధి మామమ్బువాహమ్'—తనయుపకారశీలతను మేఘుఁడు వచింపవలసినయవసరము గాన 'వహ ప్రాపణే' నీరు పొందించువాఁడు - నీరు తెచ్చియిచ్చువాఁడు - అనునర్థముగల విశేషణము, (55) 'ఏత త్కృత్వా ప్రియ మిష్టాన్ దేశాన్ విచర జలద' — ఉపకారప్రశంసయే గావున జలదశబ్దముచే సంబుద్ధి. ప్రక్షిప్తములనుం దడవఁ బనిలేదు. ఇట్లు ఈసంబుద్ధ్యాదులు సాభిప్రాయంబుల యనుటకు 'జీమూతేన' యన్నచోట 'జీవస్య జీవనస్య మూతః పుటబన్ధో జీమూతః...జీవనార్థం కర్మ జీవనప్రదేనైవ కారయితవ్య మితి భావః' అను వివరణముచే పెద్దిభట్టుగారియంగీకారము సూచిత మగుచున్నది.

కవికి ఇంతజాగరూకత యేని కుబేరప్రస్తావమందును ఇట్లే ఉచితశబ్దప్రయోగనిర్వాహము కలదా యనిన, ఇందు యక్షుఁడు ముమ్మాఱే కుబేరుని పేర్కొన్నాఁడు. ఒకమాఱైనను 'ధన మిచ్చువాఁడు' అనునర్థముచే బహుమానసూచకములగు ధనదాదిశబ్దములతో పేర్కొన్నవాఁడు గాక, ముమ్మాఱును లోభియని తెలియునట్లుగా పూ. మే. (7) 'ధనపతి క్రోధవిశ్లేషితస్య', ఉ. మే. (12) 'మత్వా దేవం ధనపతి సఖమ్,' (14) తత్రాగారం ధనపతి గృహా నుత్తరే ణాస్మదీయమ్' అని ధనపతి శబ్దముచేతనే నిర్దేశించినాఁడు.

ఇట్లు ఈ రెండువిషయములందును పదప్రయోగౌచిత్యము క్షోదక్షమం బగుడు, దశదివసాధిక్యంబును వివక్షితంబు కాఁ దలంచి పరిశీలింపఁగా అది ప్రయాణకాలముగా సూపపన్న మయినది. అటుపయిని ఇట్టిదంటచే ఏపదంబును ప్రయోజననిరపేక్షంబుగా ప్రయుక్తంబై యుండ దని యూహించి పదములప్రయోజనంబుల నరసితిని. నాకుం దోఁచినయాప్రయోజనములు మల్లినాథసూరి సూత్రప్రాయముగా సూచించినవానికి ప్రాపకములుగా వృత్తిప్రాయములుగా సరిపడుచు రాఁగాంచి మదీయంబులును కవిహృదయంబు కా నమ్మికవొడముడు సందర్భశుద్ధ్యాది సమాధానములను సరిఁజూచుకొని ఇందుం బ్రకటించితిని.

కొన్నియాక్షేపములకు సమాధానములు.

ఈమహాకావ్యమున నాయకునిపేరు లేదు, నాయికపేరును లేదు. కాని, ఆలోపమును తీర్చుటకై కవి నాయకునిఁగా భృత్యునే చేసినాఁడుగాని ప్రభువును

జేయలేదు; భృత్యతాదోషపరిహారముగా నాయకుని ధీరోదాత్తునిం జేసినాఁడు. నామకల్పనామాత్రమున కావ్యప్రయోజనవిశేష మేమియు లేదు. పురాణప్రసిద్ధులనే నాయికానాయకులను చెప్పెడుచో తత్తదౌచిత్యనిర్వాహార్థము వారింగూర్చి కొన్నివిశేషములు చెప్పవలసివచ్చును, సర్వమును నిజకల్పనయ యనుకీర్తి యెడలును. మహాకవి యిందు గ్రంథవిస్తరము నిచ్చగింపకయు దీనిని అమరుశతక ఘటకర్పరకావ్యాదులవంటిదానినిగా నుద్దేశించియు విశేషించి సరకుసేయక లీలాప్రాయముగా రచించె ననియు అతని కట్టిదైనను అస్మదాదులకు ఇదే పరమోత్కృష్టముగాను మహాప్రౌఢముగాను ఉన్నదనియు తలంపసగు.

యక్షులకు జరామరణములు లేవని ఆనందోత్థ మిత్యాదిశ్లోక తద్వ్యాఖ్యలవలనం దెలియుచున్నది; అట్లుండ ఈజీవితాలంబనప్రయత్న మెట్లు సంగతపడును? అనిన - కలిగిన కుసుమశరజతాపము అత్యంతదుస్సహ మగుటచే యక్షుఁ డట్లు భయపడెనేగాని యక్షులకు మరణము కల దని కవి యెటను చెప్పలేదు. లే దని తెలిసియు యక్షుఁడు కలుగు నని భయపడుట కుసుమశరజతాపోత్కర్షను తెలుపుచు కావ్యమునకు శోభావహంబ యైనది.

"విద్యాధరాప్సరో యక్ష రక్షో గన్ధర్వ కిన్నరాః
పిశాచో గుహ్యక స్సిద్ధో భూతోఽమీ దేవయోనయః"

అని యమరసింహుఁడు యక్షగుహ్యకులకు భేదమును చెప్పియుండఁగా ఈకావ్యమున 'యక్ష శ్చక్రే' అనియొకచోటను 'గుహ్యక స్తం యయాచే' అని మఱియొకచోటను ఏకార్థంబునం బ్రయోగించుటయెట్లు? అనియు నాక్షేపించువారు కలరు. 'నిధిం రక్షన్తి యే యక్షా స్తే స్యు ర్గుహ్యకసంజ్ఞకాః' అను వ్యాడివచనమువలన యక్షశబ్దము సామాన్యముగా జక్కులకు వాచకంబును వారిలో నిధులను గాచువారికి గుహ్యకశబ్దము వాచకంబును గావున ఈయక్షుఁడు శంఖపద్మనిధులం గాచువాఁ డని 'ద్వారోపాన్తే లిఖితవపుషౌ శఙ్ఖపద్మౌ చ దృష్ట్వా' అనుటచే తెలియుచున్నది గావున ఇతనిని యక్షగుహ్యకాన్యతరశబ్దములచేత నిర్దేశించుట నిరవద్యము.

శాపమును వర్షభోగ్యముగా పెట్టనేల యని పలుకుదురు. అదుగాదు. కల్పవృక్షత్వాదిభేదనిమిత్తకములగు సకలభోగములను ఉపవనవిహార జలక్రీడా చంద్రికాచంక్రమణాదికములను అన్నిటిని ఒకమాఱుమాత్రమే తొలఁగింప కుబేరుని సంకల్పము. రెండవసంవత్సరమున మరల మనుపటివే వచ్చును. వర్షమకంటె తక్కువకాలములో కొన్ని అవశిష్టములుగా నుండును. కావున వత్సరావధి

## కందళీ శిలీంధ్రములు.

ఈగ్రంథములో 'కన్దళీ శ్చానుకచ్ఛమ్' 'ఉచ్ఛిలీన్ధ్రాం మవన్ధ్యామ్' అన్న చోట్ల కందళీశిలీంధ్రశబ్దములకు - పుట్టగొడుగని కొందఱును - నేలతాడి యని మఱి కొంద ఱును - నేలయరఁటి యని ఒకకొందఱును - ఒజ్జలు నానావిధములుగా అర్థములు చెప్పుచున్నారు. శిలీంధ్రము పుట్టగొడుగనియు కందళి నేలతాడి యనియు రెంటి కిని కొందఱు భిన్నార్థములం గఱపుచున్నారు. నేను ఈవిషయమందు పరిశ్రమచేసి యిందు కందళీశిలీంధ్రములు ఏకార్థములనియు రెంటికిని నేలయరఁటియే యర్థ మనియు నిశ్చయించుకొని నావివరణమందట్లే వ్రాసితిని. ఈవిషయమున నాకుం గల్గినయుపపత్తికదంబము మద్విరచితమయిన మోచాకుసుమామోదవిచార' గ్రంథం బున నిరూపితమై యున్నది.

## ముద్రణములపరామర్శ.

వ్యాఖ్యానములో బొంబాయిముద్రణమునకును మదరాసు తెనుఁగుముద్రణము నకును భేదములు మెండుగాఁ గలవు. నేను రెంటినిం బరికించి ఒకదాన లేనిదానిని మఱియొకదానినుండి గ్రహించి నాముద్రణమును ఆరెంటికంటెను పుష్కలము గావించితిని. మత్పూర్వముద్రకులలో సందర్గికారపండితులు ఉ. మే. (47) ధారా సిక్త, (56) ఇత్యాఖ్యాతే, (57) శ్రుత్వావార్తామ్ - అనుశ్లోకములు ప్రక్షిప్తముల నియు వానికి మల్లినాథసూరి వ్యాఖ్య నేయలేదనియు తెలిపి వానిని గ్రంథములో ముద్రింపలేదు. అయినను వానిని విడువ నిచ్చగింపక నేను ముద్రించితిని. 'ధారా సిక్త' - యనుశ్లోకమును మాత్రము మదరాసుపుస్తకములో (45)-వదిగా నున్న దానిని చతుర్విధవినోదమధ్యమునుండి తివిచి (47) - వదానిఁగా ముద్రించితిని. మల్లినాథసూరి ప్రక్షిప్తములని తెలిపిన పూ. మే. (22) అమ్భోబిన్దు, (33) హారాం స్తారాణ్, (34) ప్రద్యోతస్య, (35) పత్రశ్యామాః - అనునాలిగింటిలో కడపటి మూఁడును పార్శ్వాభ్యుదయమహాకావ్యమందుఁ గలవనియు అందు 'పత్రశ్యా మా'అనునది మాత్రము ఉ. మే. లో అలకావర్ణనమందు నివేశితమైయున్న దనియు సందర్గికారపండితులు తెలుపుచున్నారు. ఉ. మే. (3) యత్రోన్మత్త, (4) ఆనన్దో త్థమ్, అను రెండును ప్రక్షిప్తములని మల్లినాథసూరి తెలిపినాఁడు గదా.

గ్రంథమును సుగమతరము నేయుటకై వ్యాఖ్యాదికములలో సంధులు విడఁ దివిచి ముద్రించితిని.

## వ్యాఖ్యాదికమందలి గుర్తులు.

* వ్యాకరణవిషయము.
† అలంకారాదికము.
వి. విశేషవిషయము.

\+ నిఘంటువు.
తా. తాత్పర్యము.
ప. పదప్రయోజనము.

ఇంక కొన్ని సులువుగా తెలియు గుర్తులుగలవు-

దేవభాషాభిమానులగు సహృదయులెల్ల నాయుద్యమమును చిత్తగించి గుణము గ్రహించి దోషములను పొరఁబాటులను మన్నించి ఈగ్రంథమునువ్యాప్తికిం దెత్తురుగావుతమని నావిజ్ఞప్తి.

శ్రీశారదార్పణ మస్తు.

మదరాసు } వే. వేంకటరాయశాస్త్రి.
మే, 1902.

# మేఘసందేశః

## ప్రథమః సర్గః

కశ్చిత్కాన్తావిరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్షశ్చక్రే జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు. 1.

మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే
సద్యో దక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే.
అన్తరాయతిమిరోపశాన్తయే శాన్తపావనమచిన్త్యవైభవమ్
తన్నరం వపుషి కుఞ్జరం ముఖే మన్మహే కిమపి తున్దిలం మహః.
శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్;
కరుణామసృణైః కటాక్షపాతైః కురు మామమ్బ కృతార్థసార్థవాహమ్.
భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యావిషమూర్ఛితా;
ఏషా సంజీవనీ టీకా తామద్యోజ్జీవయిష్యతి.
ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా;
నామూలం లిఖ్యతే కిఞ్చిన్నానపేక్షితముచ్యతే.

అథ తత్రభవాన్ కాళిదాసో నామ కవిః

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే."

ఇత్యాద్యాలఙ్కారికవచనప్రామాణ్యాత్ కావ్యస్యానేకశ్రేయస్సాధనతాం, "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" ఇతి నిషేధశాస్త్రస్యాసత్కావ్యవిషయతాం చ పశ్యన్ మేఘసందేశాఖ్యం కావ్యం చికీర్షుశ్చికీర్షితార్థావిఘ్నపరిసమాప్తిసంప్రదాయావిచ్ఛేదలక్షణఫలసాధనత్వాత్ "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్" ఇత్యాశీరాద్యన్యతమస్య ప్రబన్ధముఖలక్షణత్వాత్ కావ్యాదౌ [illegible]

నివాసరూపం వస్తు నిర్దిశతి కశ్చిదితి.—స్వాధికారాత్, ప్రమత్తః = అనవహితః + 'ప్రమాదోఽనవధానతే'త్యమరః * 'జుగుప్సా విరామ ప్రమాదార్థానా ముపసంఖ్యాన మి'త్యపాదానత్వాత్ పఞ్చమీ, అత ఏవాపరాధా ద్ధేతోః కాన్తావిరహేణ_గురుణా=దుర్భరేణ - దుస్తరేణేత్యర్థః + 'గురుస్తు గీష్పతౌ శ్రేష్ఠేగురౌ పితరి దుర్భర' ఇతి శబ్దార్ణవే, వర్షం (సంవత్సరం) భోగ్యేన = వర్షభోగ్యేణ * 'కాలాధ్వనో రత్యన్తసంయోగ' ఇతి ద్వితీయా * 'అత్యన్తసంయోగే చే'తి సమాసః * 'కుమతి చే'తి ణత్వమ్, భర్తుః = స్వామినః కుబేరస్య, శాపేన, అస్తం = నాశం-గమితః = ప్రాపితః మహిమా = సామర్థ్యం-యస్య సోఽస్తంగమితమహిమా * అస్త మితి మకారాన్తమవ్యయమ్-తస్య * 'ద్వితీయే'తి యోగవిభాగాత్ సమాసః, కశ్చిత్, యక్షః = దేవయోనివిశేషః + 'విద్యాధరోఽప్సరోయక్షరక్షోగన్ధర్వకిన్నరాః। పిశాచోగుహ్యకస్సిద్ధో భూతోఽమీ దేవయోనయ' ఇత్యమరః, జనకతనయాయాః = సీతాయాః-స్నానైః = అవగాహనైః-పుణ్యాని = పవిత్రాణి-ఉదకాని యేషు తేషు-పావనేష్విత్యర్థః, ఛాయాప్రధానాస్తరవః = ఛాయాతరవః * శాకపార్థివాదిత్వా త్సమాసః-స్నిగ్ధాః = సాన్ద్రాః - ఛాయాతరవః = నమేరువృక్షా-యేషు తేషు-వసతియోగ్యేష్విత్యర్థః + 'స్నిగ్ధంతు మసృణే సాన్ద్రే' + 'ఛాయావృక్షో నమేరు స్స్యా'దిత్యుభయత్రాపి శబ్దార్ణవే, రామగిరి రితి చిత్రకూటః-తస్యాశ్రమేషు, వసతిం = స్థితిం, చక్రే = కృతవాన్. అత్ర శేషత స్తత్ర తత్రాద్రినగర నదీ సముద్రాదివర్ణనసంభవాత్ మహాకావ్యత్వమ్. రసశ్చాత్ర విప్రలమ్భశృఙ్గారః, తత్రా వ్యస్తాదావస్థా; అత ఏవైకత్రానవస్థానం సూచిత 'మాశ్రమే ష్వి'తి బహువచనేన. సీతాం ప్రతి రామస్య హనూమత్సందేశం మనసి నిధాయ మేఘసందేశం కవిః కృతవా నిత్యాహుః. అత్ర కావ్యే సర్వత్ర మన్దాక్రాన్తావృత్తమ్ † 'మన్దాక్రాన్తా జలధిషడగై ర్మ్భోభనౌ తాద్గురూ చే'తి లక్షణాత్.

స్వాధికారాత్—స్వ=తనయొక్క-అధికారాత్=కొలువునుండి, ప్రమత్తః=అశ్రద్ధచేసినవాఁడును, (ఆయపరాధముచేతనే), కాన్తావిరహగురుణా-కాన్తా=ప్రియతోడి - విరహ=ఎడఁబాటుచేత - గురుణా=భరింపరానిదియు, వర్షభోగ్యేన—వర్ష=సంవత్సరకాలము - భోగ్యేన=అనుభవింపవలసినదియు, (నైన), భర్తుః=స్వామియైన కుబేరునియొక్క, శాపేన=శాపముచేత, అస్తంగమితమహిమా—అస్తమ్=నాశమును-గమిత=పొందింపఁబడిన-మహిమా=సామర్థ్యము గలవాఁడును, (అయిన), కశ్చిత్=ఒకానొక, యక్షః=యక్షుఁడు, జనకతనయాస్నానపుణ్యోదకేషు—జనకతనయా = సీతాదేవియొక్క-స్నాన=స్నానముచేత - పుణ్య=పవిత్ర

ములైన-ఉదకేషు = నీళ్లుగలవియు, స్నిగ్ధచ్ఛాయాతరుషు—స్నిగ్ధ=దట్టమయిన-ఛాయాతరుషు=నీడగలచెట్లుగలవియు, (నైన), రామగిర్యాశ్రమేషు—రామగిరి=చిత్రకూటపర్వతముయొక్క— ఆశ్రమేషు=ఆశ్రమములయందు, వసతిమ్=నివాసమును చక్రే=చేసెను. మందాక్రాంతావృత్తము: మభనతతగగ; ౪, ౬, ౭ అక్షరముల తర్వాత యతి.

తా.—కుబేరునికొలువులో నున్న యొకానొక యక్షుఁడు తన కొలువు చక్కఁగా చేయక అశ్రద్ధచేసెను. ఆ తప్పిదముచేత ప్రియను వదలిపోయి సంవత్సరకాలము చిత్రకూటమందు ఏకాకిగా నుండవలసిన దని కుబేరుఁడు వానిని శపించెను. ఆశాపముచేత వానిసామర్థ్య మంతయు పోయి వాఁడు పావనములును నివాసయోగ్యములు నైన యాయాశ్రమములయందు నివసించియుండెను. ప్రియనుండి ఎడఁబాసినందువలన ఆశాపము వానికి దుస్తరముగానుండెను.

వ.—'కాన్తావిరహగురుణా' అనుటచేత కొలువులో యక్షుఁ డశ్రద్ధచేసినందుల కారణము అతనికాంతతగులాట మనియు, అందుచేతనే కాంత నెడఁబాయునట్లు కుబేరుఁడు అతనిని శపించినాఁ డనియు, 'జనకతనయాస్నాన పుణ్యోదకేషు' అనుటచే ఏపూర్వకర్మదోషముచేత యక్షుఁడు ఆతప్పిదము చేసినాఁడో ఆ పుణ్యజలములందు స్నానపానములు చేయుటచే ఆదోషము పోయి యతఁడు క్షేమపడుటకై కుబేరుఁడు అతనిని ఆ పుణ్యజలములకడకు పంపె ననియు, అక్కడ కట్టుఁబడి యుండనేల - యక్షుఁడు ఆకాశగమనాది విద్యలచేత కాంతకడకు పోఁగూడదా యనిన-'అస్తంగమితమహిమా' అనుటచే శాపమువలన అతని విద్యలు పోయిన వనియు, యటులైన యతనికడకు రాఁగూడదాయనిన, 'శాపేన' శాపముచేతనే ఆమెకును వచ్చుటకు శక్తిలేదాయె ననియు, 'అస్తమ్' అనుటచేత కొంతకాలము మాత్రము అతనిమహిమ అణఁగియుండునే గాని అస్తమించిన సూర్యుఁడు ఉదయించునట్లు పిమ్మట మరల అతనిమహిమ అతనికి రానే వచ్చు ననియు, ఆమహిమ మరల వచ్చి అతఁడు తన కాంతకడకు పోవుటకు 'స్నిగ్ధచ్ఛాయాతరుషు' అనుటచేత అయాశ్రమములు అతనికి నివాసయోగ్యములుగా నుండెననియు, 'ఆశ్రమేషు' అను బహువచనముచేత అతఁడు విరహోన్మాదమువలన ఒకచోటనుండనెల్లక ఇక్కడి కక్కడికి తిరుగుచుండె ననియు, భావము. మఱియు నిందు కవి 'చిత్రకూట' అనక 'రామగిరి' అని రామనామము గ్రహించుటచేతను జనకతనయా ప్రస్తావముచేతను కవికావ్యోపాధ్యాయ విద్యార్థ్యాదులకు మంగళమును సంపాదించినవాఁడై, జానకీరాములు విరహము తీఱినట్లే ప్రకృత యక్షకాంతా యక్షుల విరహము

గయితము తీఱునని యు, ఆంజనేయులచేత శారి విరహము తీఱినట్లు (వక్ష్యమాణ ప్రబంధమువలన) మేఘునిచేత వీరిథిరహము తీఱు ననియును, సూచించినాఁడు.

తస్మి న్నద్రౌ కతిచి దబలావిప్రయుక్త స్స కామీ
నీత్వా మాసా న్కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః
ఆషాఢస్య ప్రథమదివసే మేఘ మాశ్లిష్టసానుం
వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయం దదర్శ. 2

తస్మిన్నితి.—తస్మి న్నద్రౌ=చిత్రకూటాద్రౌ, అబలా విప్రయుక్తః—అబలయా—కాన్తయా—విప్రయుక్తః=విరహితః, కనకస్య - వలయః=కటకం + 'కటకం వలయోఽస్త్రియా'మిత్యమరః - తస్య - భ్రంశేన=పాతేన - రిక్తః=శూన్యః - ప్రకోష్ఠః=కూర్పరాధఃప్రదేశో - యస్య స తథోక్తః + 'కక్ష్యాన్తరం ప్రకోష్ఠం స్యాత్ ప్రకోష్ఠః కూర్పరా దధ' ఇతి శాశ్వతః - విరహదుఃఖా త్కృశ ఇత్యర్థః. కామీ=కాముకః, సః-యక్షః, కతిచిత్ మాసాన్=అష్టౌ మాసా నిత్యర్థః + 'శేషాన్ మాసాన్ గమయ చతురో లోచనే మీలయి త్వే'తి వక్ష్యమాణత్వాత్. నీత్వా=యాపయిత్వా, ఆషాఢానక్షత్రేణ యుక్తా పౌర్ణమా స్యాషాఢీ *'నక్షత్రేణ యుక్తః కాల' ఇత్యణ్ - ఆషాఢీ పౌర్ణమా స్యస్మి న్మాస ఇత్యాషాఢో మాసః *'సాఽస్మిన్ పౌర్ణమా సీతి' సంజ్ఞాయా మణ్ - తస్య ఆషాఢమాసస్య, ప్రథమదివసే=ఆద్యవాసర ఇత్యర్థః, ఆశ్లిష్టసానుమ్=ఆక్రాన్తతటమ్, వప్రక్రీడాః=ఉత్ఖాతకేళయః + 'ఉత్ఖాతకేళి శ్శృఙ్గాద్యైర్వప్రక్రీడా నిగద్యత' ఇతి శబ్దార్ణవే-తాసు-పరిణతః=తిర్యగ్దన్తప్రహారీ + 'తిర్యగ్దన్తప్రహారీ తు గజః పరిణతో మత' ఇతి హలాయుధః-స చాసౌ గజ శ్చ స ఇవ - ప్రేక్షణీయం=దర్శనీయం, మేఘం దదర్శ. గజప్రేక్షణీయ మి త్యత్ర ఇవశబ్దలోపా ల్లుప్తోపమా.

కేచి 'దాషాఢస్య ప్రథమదివస' ఇత్యత్ర 'ప్రత్యాసన్నే నభసీ' తివక్ష్యమాణ నభోమాసప్రత్యాసత్త్యర్థం 'ప్రశమదివస' ఇతిపాఠం కల్పయన్తి; తదసంగతమ్; ప్రథమాతిక్రమణే కారణాభావాత్. నభోమాసప్రత్యాసత్త్యర్థమి త్యుక్త మితిచే న్న, ప్రత్యాసత్తిమాత్రస్య స్వమాసప్రత్యాసత్త్యైవ దివసస్యా వ్యుపపత్తే, రత్యన్తప్రత్యాసత్తే రుపయోగాభావే నావివక్షితత్వాత్; వివక్షితత్వేవా స్వపక్షేఽపి ప్రశమదివసాత్ప్రాగ్దినక్షణే మేఘదర్శనకల్పనాయాం ప్రమాణాభావేన తదసంభవాత్. ప్రత్యుతాత్యన్తప్రత్యాసత్తి ఏవ కుశలః - సందేశస్య భావ్యనర్థప్రతీకారార్థస్య పురత ఏ వాను ష్ఠానయుక్తం భవే దిత్యుపయోగసిద్ధిః. న నూన్మత్తస్య నాయం వివేక ఇతి చే

న్నః ఉన్మత్తస్య నానర్థప్రతీకారారమ్భః ప్రతిపత్తి రపీతి సందేశ ఏవ మాభూత్; తథా చ కావ్యారమ్భ ఏవ ప్రతిబద్ధః స్యాదిత్యాహో మూలచ్ఛేదీ తవ పాణ్డిత్య ప్రకర్షః। కథం తర్హి, 'శాపాన్తో మే భుజగశయనా దుత్థితే శార్ఙ్గపాణా వి, త్యాదినా భగవత్ప్రబోధావధికస్య శాపస్య మాసచతుష్టయావశిష్టత్వోక్తిః, శయనైకాదశీ మారభ్యోత్థానైకాదశీపర్యన్తం మాసచతుష్టయం భవతి, దశదివసాధిక్యా? దితి చేన్నః స్వపక్షేఽపి కథం సా వింశతిదివసన్యూనత్వా? దితి సంతోష్టవ్యమ్, తస్మా దీషద్వైషమ్య మవివక్షిత మితి సుష్ఠూక్తం 'ప్రథమదివస' ఇతి.

తస్మిన్=ఆ, అద్రౌ=పర్వతమందు, అబ...యుక్తః—అబలా=కాంతతో-విప్రయుక్తః=ఎడఁబాసినవాఁడును, కన...కోష్ఠః—కనక=బంగారపు - వలయ=కడియముయొక్క - భ్రంశ=జాఱి పడిపోవుటచేత - రిక్త=శూన్యమయిన - ప్రకోష్ఠః=ముంజేయిగలవాఁడును, కామీ=కాముకుఁడు, (నయిన), సః=ఆయక్షుఁడు, కతిచిత్=కొన్ని. మాసాన్=నెలలను, నీత్వా=గడపి, ఆషాఢస్య=ఆషాఢమాసముయొక్క, ప్రథమదివసే=మొదటిదినమందు, ఆశ్లిష్టసానుమ్=ఆక్రమింపఁబడినతటముగలదియు (అందుచేతనే), వప్ర...ణీయమ్—వప్రక్రీడా=కోరాడుటయను కేళియందు - పరిణత=అడ్డముగా దంతములతో కొట్టునట్టిదైన - గజ=ఏనుఁగువలె ప్రేక్షణీయమ్=చూడఁదగినదియు, (నైన), మేఘమ్=మబ్బును, దదర్శ=చూచెను.

తా.—ఆయక్షుఁడు చిత్రకూటపర్వతమందు విరహదుఃఖముచేత మిక్కిలి కృశించి కొన్ని (ఎనిమిది) మాసములు గడపఁగా ఆషాఢప్రథమదినమందు ఆకొండచఱియమీఁదికి తొలకరిమేఘము వచ్చె ననియు, ఏనుఁగు కోరాడుచు దంతములతో అడ్డముగా కొట్టుచున్న నెట్లుండునో, అట్లు ఆ మేఘము అగపడె ననియు తా.

వి.—'అబలా' అనుటచేత యక్షుఁడు తనకాంత కోమలగావున తనతోడివిరహమునకు తాళఁజాలక అపాయము పొందునని వగచుచుండె ననియు, ఆమెవిషయమై ఉపేక్షగా నుండరాదా యనిన, 'కామి' అనుటవలన ఆమెయం దనురక్తుఁడు గావున అట్లుండలేకపోయె ననియు, 'కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః' అనుటచేత యక్షునియనురాగమునకును వగపునకును అతఁడు కృశించుటయే తార్కాణ మనియు, 'మాసములు గడచినవి' అనక 'మాసములను గడపెను' అనుటచేత, ఆవిరహతాపములో అతనికి క్షణ మొకయుగముగా నుండె ననియు, 'మేఘ మాశ్లిష్టసానుమ్' అని కౌఁగిలింతను దెలుపు నాశ్లిష్టపదమును ప్రయోగించుటచేత - సానువునాలింగనము చేసికొన్న యామేఘునిఁజూడఁగా యక్షునికి నిజప్రియావక్షోరుహా[illegible] స్మరణము వచ్చి తదభిలాష కలిగెననియు, వప్రక్రీడచేత దంతక్షతాద[illegible]

ముచేత హాసవిలాసములును యక్షునికి స్మృతిగోచరము లాయెననియు, ఆశయము, తిర్యగ్దంతప్రహారియైన యేనుఁగుతో మేఘమును పోల్చుటచేత ఏనుఁగునకు దంతము లున్నట్లు మేఘమునకు తొలకరిమెఱుపు లుండె ననియు, భావము. ఇందు మొదటియె నిమిదినెలలలో యక్షుఁడు పడినవిరహబాధను కవి విశేషించి వర్ణింపలేదు, దాని నెల్ల త త్కార్యమయిన కార్శ్యముచే 'కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః' అనువిశేషణమున సూచించినాఁడు.

తస్యస్థిత్వా కథ మపి పురః కౌతుకాధాన హేతో
ర న్తర్బాష్ప శ్చిర మనుచరో రాజరాజస్య దధ్యౌ
మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథావృత్తి చేతః,
కణ్ఠాశ్లేషప్రణయిని జనే కిం పున ర్దూరసంస్థే. 3

తస్యేతి.—రాజానః=యక్షాః + 'రాజా ప్రభౌ నృపే చన్ద్రే యక్షే క్షత్రియ శక్రయోః' ఇతి విశ్వః - ఝాజ్ఞాం రాజా = రాజరాజః కుబేరః + 'రాజరాజో ధనాధిపః' ఇత్యమరః * 'రాజాహస్సఖిభ్యష్టచ్' ఇతి టచ్ - తస్య, అనుచరః=యక్షః, అన్తర్బాష్పః = ధీరో దాత్తత్వా దన్తః స్తమ్భితాశ్రుః సన్, కౌతుకాధాన హేతోః= అభిలాషోత్పాదన కారణస్య + 'కౌతుకం చాభిలాషే స్యాదుత్సవే నర్మహర్షయోః' ఇతి విశ్వః, తస్య=మేఘస్య, పురః=అగ్రే, కథమపి=గరీయసా ప్రయత్నేన త్యర్థః + 'జ్ఞాతే హేతువిశేషే యా మప్యాది కథ మవ్యయమ్ । కథమాది తథాప్యన్తం యత్నగౌరవబాధయోః' ఇత్యుత్పలమాలాయామ్, స్థిత్వా, చిరం, దధ్యౌ=చిన్తయామాస * 'ధ్యై చిన్తాయామి' తిధాతోర్లిట్ - మనోవికారో వశమనపర్యన్తమితి శేషః; వికారహేతు మేవాహ మేఘాలోక ఇతి:—మేఘాలోకే= మేఘదర్శనే సతి, సుఖినోఽపి=ప్రియాజనసంగతస్యాపి, చేతః=చిత్తమ్, అన్యథాభూతా వృత్తిః (వ్యాపారో)యస్య త దన్యథావృత్తి భవతి - వికృతి మాపద్యత ఇత్యర్థః, కణ్ఠాశ్లేష ప్రణయిని=కణ్ఠాలిఙ్గనార్థిని, జనే, దూరె సంస్థా (స్థితి) ర్యస్య తస్మిన్ =దూరసంస్థే సతి, కిం పునః=సుఖినోఽప్యేవం కిల విరహిణ స్తు కిం వక్తవ్య మిత్యర్థః,విరహిణాం మేఘదర్శనం కామాదివికారోద్దీపనమితి భావః. అత్రార్థాన్తరన్యాసోఽలఙ్కారః - తదుక్తం దణ్డినా + 'జ్ఞేయసో ర్థాన్తరన్యాసో వస్తుప్రస్తుత్యకిఞ్చన । తత్సాధన సమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః' ఇతి.

రాజరాజస్య,—రాజ=యక్షులయొక్క రాజస్య = ప్రభువగునట్టి కుబేరుని యొక్క, అనుచరః=కింకరుఁడైన యా యక్షుఁడు, అన్తర్బాష్పః సన్=లోపలనే

అణఁచుకొన్నకన్నీళ్లు గలవాఁడు అయి, కౌతు... హేతోః—కౌతుక=అభిలాషయొక్క - ఆధాన=ఉత్పాదనముయొక్క - హేతోః=కారణముయిన (కాంతను గూడవలయునని యభిలాషను పుట్టించునదైన), తస్య=మేఘముయొక్క, పురః=ఎదుట, కథమపి=మిక్కిలిప్రయత్నముతో, స్థిత్వా=నిలిచి, చిరమ్ = చాలసేపు - అనఁగా మనోవికారము శమించువఱకు, దధ్యౌ = చింతించెను; మేఘాలోకే—మేఘ=మేఘముయొక్క - ఆలోకే=చూచుటయందు (అనఁగా మేఘమును చూచినప్పుడు), సుఖినః అపి=ప్రియాజనముతోఁ గూడుకొనియున్న వానిదైనను, చేతః=మనస్సు,=అన్యథావృత్తి—అన్యథా=వేఱువిధముయిన - వృత్తి = వ్యాపారముగలది, భవతి=అగును; కణ్ఠా...యిని—కణ్ఠ=మెడయొక్క - ఆశ్లేష = ఆలింగనమందు (అనఁగా మెడను కౌఁగిలించుకొనుటయందు) - ప్రణయిని = కోరిక గలిగిన, జనే=ప్రియాజనము, దూర సంస్థే సతి=దూరమందు ఉన్నదై యుండఁగా, కింపునః=ఏమి చెప్పవలయును.

తా.—మేఘము విరహోద్దీపకము గనుక దానిని చూడఁగానే యక్షునికి కాంతపై యభిలాష గలిగి, ఆమెను కూడుట యసాధ్యమగుటచేత మిక్కిలి దుఃఖమై, కన్నీళ్లు వచ్చెను; వాని నతఁడు ధీరోదాత్తుఁడు గావున అణఁచుకొని ఆ మేఘము నెదుట మిక్కిలి కష్టముతో నిలువఁబడి చింతించుచుండెను. తమ ప్రియతములతోఁ గూడియున్నవారికే మేఘదర్శనముచేత మదనవికారము గలుగుచుండఁగా, ఇతనిని కౌఁగిలింపఁ గోరుచుండు ప్రియతమ నెడఁబాసినయితఁడు అట్లు ఆయాసపడుట ఆశ్చర్యము గాదు.

వి.—'కథమపి' అనుటచే మేఘదర్శనముచేత విరహతాప మతిశయ మాయెననియు, 'కౌతుకాధాన హేతోః' అనుటచే తాపకరమైనను మేఘము ప్రియావిషయక మయినయభిలాషను పుట్టించినదగుటచేత దానియెదుట నిలువఁబూనిక గలిగెననియు, 'చిరమ్' అనుటచే మేఘదర్శనమువలనఁ గలిగినమనోవికారము శమించుటకు చాలసేపు పట్టెననియు - అనఁగా-గొప్పవికారము కలిగె ననియు, 'కణ్ఠాశ్లేషప్రణయిని' అనుటచే ఒల్లనిదానికొఱకైన ఇంతవిరహతాపము గలుగదు, ఆమె యితనిని ప్రేమించినది కావునను ఇతఁడును ఆమెను ప్రేమించినాఁడు కావునను ఇతని కిట్టి వికారము గలిగె ననియు, భావము.

ప్రత్యాసన్నే నభసి దయితాజీవితాలమ్బనార్థీ
జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్ప్రవృత్తిమ్

స ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతః ప్రీతిప్రముఖవచనం స్వాగతం వ్యాజహార. 4.

అథ సమాహితాన్తఃకరణః కిం కృతవా నిత్య త్రాహ ప్రత్యాసన్న ఇతి.— సః=యక్షః - యశ్చిరం దధ్యౌ స ఇత్యర్థః, నభసి = శ్రావణమాసే+'నభః ఖం శ్రావణో నభా' ఇత్యమరః, ప్రత్యాసన్నే=ఆషాఢానన్తర్యా త్సన్నికృష్టే సతి, దయితాజీవితాలమ్బనార్థీ సన్=వర్షాకాలస్య విరహదుస్సహత్వాత్ 'ఉత్పన్న ప్రతీకారా దనర్థ స్యోత్పత్తిప్రతిబన్ధ ఏవ వర' మితి న్యాయేన ప్రాగేవ ప్రియాప్రాణధారణోపాయం చికీర్షుస్సన్ని త్యర్థః, జీవస్య (జీవనస్య) మూతః (పుటబన్ధో)జీమూతః*పృషోదరాదిత్వా త్సాధుః-తేన జీమూతేన=జలధరేణ ప్రయోజ్యేన, స్వకుశలమయీం=స్వక్షేమప్రధానాం, ప్రవృత్తిం=వార్తాం + 'వార్తా ప్రవృత్తిర్వృత్తాన్తః' ఇత్యమరః, హారయిష్యన్ = ప్రాపయిష్యన్ * 'లృట్ శేషే చే' తి చకారాత్ క్రియార్థక్రియోపపదాత్ లృట్ప్రత్యయః - జీవనార్థం కర్మ జీవనప్రదే నైవ [illegible] యితవ్య మితి భావః * 'హృక్రో రన్యతరస్యామి' తి కర్మసంజ్ఞావికల్పాత్ పక్షే కర్తరి తృతీయా, ప్రత్యగ్రైః=అభినవైః, కుటజకుసుమైః=గిరిమల్లికాభిః+'కుటజో గిరిమల్లికే' తి హలాయుధః, కల్పితార్ఘాయ - కల్పితః=అనుష్ఠితః - అర్ఘః = పూజావిధిః- యస్య తస్మై కల్పితార్ఘాయ+'మూల్యే పూజావిధావర్ఘః' ఇత్యమరః, తస్మై=జీమూతాయ * 'క్రియాగ్రహణం కర్తవ్యమి' తి సంప్రదానత్వా చ్చతుర్థీ, ప్రీతిప్రముఖాని (ప్రీతిపూర్వకాణి) వచనాని యస్మిన్ కర్మణి త త్ప్రీతిప్రముఖవచనం యథాతథా, శోభన మాగతం = స్వాగతం - స్వాగతవచనం, ప్రీతః సన్ వ్యాజహార = కుశలాగమనం పప్రచ్ఛేత్యర్థః. నాథేన త్వత్ర 'ప్రత్యాసన్నే మనసీ' తి సాధీయా నేవ పాఠః కల్పితః. ప్రత్యాసన్నే=ప్రకృతిమాపన్నే సతీ త్యర్థః, యస్తు తేనైవ పూర్వపాఠే విరోధః ప్రదర్శితః సోఽస్మాభి 'రాషాఢస్య ప్రథమదివస' ఇత్యేతత్పాఠవిప్లవసమాధానే నైవ సమాహితః.

సః = ఆయక్షుఁడు, నభసి=శ్రావణమాసము, ప్రత్యాసన్నే సతి=సమీపించినది కాఁగా, దయి...నార్థీ—దయితా=కాంతయొక్క— జీవిత = ప్రాణముయొక్క—ఆలమ్బన అర్థీ సన్=నిలుపుటను కోరినవాఁడై (ప్రాణమును కాపాడఁగోరినవాఁడై), జీమూతేన=మేఘుని చేత, స్వ...యీమ్—స్వ=తన - కుశలమయీమ్= క్షేమము ప్రధానముగాఁ గలదైన, ప్రవృత్తిమ్=వార్తను, హారయిష్యన్=అందఁజేయించువాఁడై, ప్రత్యగ్రైః=క్రొత్తవైన, కుటజ కుసుమైః=కొండమల్లె పువ్వుల

చేత, కల్పిత అర్ఘ్యాయ తస్మై=చేయఁబడిన పూజగల యా మేఘునికి (అనఁగా ఆ మేఘుని పూజించి), ప్రీతి...నమ్—ప్రీతిప్రముఖ=ప్రీతిపూర్వకములైన-వచనమ్=మాటలు కలుగునట్లుగా (ప్రీతిపూర్వకములైన మాటలతో), స్వాగతమ్='దయచేయుము కుశలముగా వచ్చితివా?' అనుమాటను, ప్రీతః సన్=సంతోషించినవాఁడై, వ్యాజహార=పల్కెను.

తా.—వర్షాకాలము సమీపించుచుండఁగా ఆయక్షుఁడు ఇట్లు చింతించెను: స్వాభావికముగానే విరహము దుస్సహమైనది, వర్షాకాలమందైననో ప్రాణమునే హరింపఁగలదు. అట్టి యాపత్సమయములో నాప్రియ ఎట్లు బ్రదుకును? నేను జీవించియున్నానని తెలిసినయెడల, మరల నాతో సమాగమము కలుగునని యాశగొని ధైర్యము తెచ్చుకొని ఎట్లయినను ప్రాణములను బిగియఁబట్టుకొని యుండును-కనుక నాకుశలవార్తను ఈ మేఘునిచేత ప్రియకు తెలియఁబఱిచెదనుగాక.—ఇట్లు నిశ్చయించుకొని, తాను అక్కడ నున్నవాఁడును మేఘుఁడు వచ్చినవాఁడును అగుటచే, గృహస్థులు అతిథులకు పూజ చేసినట్లు, మఱియు తాను కార్యార్థి యగుటచేతను, తనపూజకును వినయమునకును మెచ్చి తనకార్యమును మేఘుఁడు నెఱవేర్చునట్లుగాను, ఆయనకు అప్పుడే పూచి నవనవలాడుచున్న కొండమల్లెపుష్పములు అర్ఘ్యము సమర్పించి, విదగ్ధుఁడు గావున సామాన్యయాచకులవలె వెఱ్ఱివెఱ్ఱి ముఖవికారములు చేయక, ఆయన వచ్చినందుచే తనకు కలిగిన సంతోషమువలని ముఖవికాసముతో ప్రీతిపూర్వకముగా 'దయచేయుము, క్షేమముగా వచ్చితివా?' అని కుశలప్రశ్న యడిగెను.

వి.—'ప్రత్యాసన్నే' అనుటచేత చెడుగు వచ్చినపిమ్మట ప్రతిక్రియ చేయుటకంటె రాకుండ తప్పించుట మేలనియు, 'ప్రత్యగ్రైః' అనుటచేత భక్తిగలవాఁడు ఉత్తమములైన పూజాద్రవ్యములతో పూజచేయును గావునను-అట్టిపూజ పూజితులకు మనసున కెక్కును గనుకను యక్షుఁడు భక్తితో పూజించెననియు, ఆపూజకు మేఘుఁడు సంతోషించి యక్షునికార్యము నెఱవేర్చుననియు, 'జీమూతేన' అనుటచేత ఆశబ్దమునకు జీవముయొక్క (అనఁగా జీవనముయొక్క— నీళ్లయొక్క) మూట యని యర్థము గావున జీవనముయొక్క మూట అయిన మేఘుఁడు తప్పకుండ యక్షభార్యయొక్కయు యక్షునియొక్కయు జీవనమును కాపాడుననియు, 'ప్రీతః ప్రీతిప్రముఖవచనమ్' అనుటచేత లోకములో ఇతరునికి ప్రీతిఁజూపిన ఇతరుఁడును తనకు ప్రీతిఁజూపును గావున - ఆప్రకారమే యక్షుఁడు మేఘునికి ప్రీతి యగఁబఱిచెను గాన మేఘుఁడును యక్షుని కుపకారము చేయు ననియు [illegible]

వించుచున్నాఁడు. వర్షాకాలమందు సర్వత్ర కొండలలో కొండమల్లెలు పూచును గాన ఆపుష్పమును చెప్పినాఁడు.

ధూమ జ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః !
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః!
ఇ త్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యక స్తం యయాచే
కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు. 5

నను చేతనసాధ్య మర్థం కథ మచేతనేన కారయితుం ప్రవృత్త ఇత్యాక్షేపం కవిః సమాధత్తే ధూమేతి.—ధూమ శ్చ జ్యోతిశ్చ సలిలంచ మరుద్ (వాయు) శ్చ తేషాం, సన్నిపాతః = సంఘాతః, మేఘః క్వ - అచేతనత్వాత్సందేశహరణానర్హ ఇత్యర్థః, పటుకరణైః-సమర్థేన్ద్రియైః + 'కరణం సాధకతమ క్షేత్ర గా త్రేన్ద్రియే ష్వపి' త్యమరః, ప్రాణిభిః-చేతనైః + 'ప్రాణీ తు చేతనో జన్మీ' త్యమరః, ప్రాపణీయాః-ప్రాపయితుం యోగ్యాః, సందిశ్యన్త ఇతి సందేశాః-త ఏవ వార్తాః, క్వ, ఇతి-ఏవమ్, ఔత్సుక్యాత్=ఇష్టార్థోద్యుక్తత్వాత్ + 'ఇష్టార్థోద్యుక్త ఉత్సుక' ఇత్యమరః, అపరిగణయన్-అవిచారయన్, గుహ్యకః=యక్షః, తం=మేఘం, యయాచే; తథా హి-కామార్తాః, చేతనా శ్చ అచేతనా శ్చ-చేతనాచేతనాః - తేషు విషయే, ప్రకృతి కృపణాః=స్వభావ దీనాః-హి-కామార్తానాం యుక్తాయుక్తవివేకశూన్యత్వా దచేతనయాచ్ఞా న విరుధ్యత ఇత్యర్థః. అత్ర మేఘసందేశయోః విరూపయోర్ఘటనా ద్విరూపఘటనారూపో విషమాలఙ్కారః - తదుక్తం + 'విరుద్ధకార్యస్యోత్పత్తి ర్యత్రానర్థస్య వా భవేత్ । విరూపఘటనా చాసౌ విషమాలఙ్కృతి స్త్రిధా' ఇతి; స చార్థాన్తరన్యాసానుప్రాణిత ఇతి; తత్సమర్థకత్వేనైవ చతుర్థపాదే త స్యోపన్యాసాత్.

చేతనసాధ్యమైనపనిని అచేతనమైన మేఘముచేత చేయింపఁదలఁచినాఁడేమి యక్షుఁడు? అను నాక్షేపమునకు కవి సమాధానము చెప్పుచున్నాఁడు:—

ధూమ...రుతామ్—ధూమః = పొగ-జ్యోతిః = అగ్ని - సలిలమ్ = జలము-మరుత్ = వాయువు - తేషామ్-అనువానియొక్క - సన్నిపాతః=సంఘాతమయిన, మేఘః=మబ్బు, క్వ = ఎక్కడ, (అచేతనముగాన వార్తను కొనిపోవుటకు అసమర్థమని యర్థము): పటుకరణైః—పటు=సమర్థములైన, కరణైః=ఇంద్రియములుగల, ప్రాణిభిః = చేతనులచేత, ప్రాపణీయాః = పంపఁదగినవైన, సందేశార్థాః -సందేశ=[illegible]వైన - అర్థాః = వార్తలు, క్వ = ఎక్కడ, ఇతి = ఇట్లని, ఔత్సు

క్యాత్ = ఇష్టార్థమందుఁ బ్రవేశించినవాఁడగుటచేత, అపరిగణయన్ = విచారింపనివాఁడై, గుహ్యకః = యక్షుఁడు, తమ్ - మేఘుని, యయాచే = అడిగెను. (తథాహి = అట్లేగదా), కామార్తాః — కామ - మన్మథునిచేత - ఆర్తాః - పీడితులైనవారు, చేతనాచేతనేషు = చేతనములయందును అచేతనములయందును, ప్రకృతికృపణాః — ప్రకృతి = స్వభావముచేత - కృపణాః హి - దీనులుగదా. కామాంధులకు యుక్తాయుక్తవివేకముండదుగావున, కామాంధుఁడైనయక్షుఁడు అచేతనమును యాచించుట విరుద్ధముగాదని యర్థము.

తా. — కామార్తులకు ఇది చేతనము ఇది యచేతనము అను వివేకముండదు. యక్షుఁడు కామార్తుఁడును ఉత్సుకుఁడునుగాన వివేకహీనుఁడై చేతనులుమాత్రమే అందఁజేయఁగలవార్తను తనభార్యకు అందఁజేయుమని కేవలాచేతనమయిన మేఘమును వేఁడుకొనెను.

వ. — 'పటు' అనుటచేత నోరులేనిప్రాణులు గోవు మేఁక మొదలైనవి సందేశమందింపలేవు సరిగదా, నరుఁడుసయితము వాక్కు- చెవి మనస్సు మొదలయిన కరణములు సమర్థములు కావేని తబ్బిబ్బుపడి తాను విన్న దొకటి తనజ్ఞప్తి కొకటియొకటి తాను పోయి చెప్పునది ఇం కొకటిగా సందేశమును పాడు చేయు ననియు, ధూమాదులను అన్నిటిని చెప్పుటచేత మేఘునికి కారణము లయిన ద్రవ్యములలో ఒకటియైనను చేతనము కానందున మేఘము కేవల మచేతన మనియు - అందుచేత వార్తాహరణానర్హ మనియు, ఔత్సుక్యమాత్రముచేత యక్షుని కిట్టు వివేకము తప్పునా యనిన - 'కామార్తాః' అనుటచేత యక్షుఁడు కామార్తుఁడయిన యుత్సుకుఁడుగాన అతనిమాట చెప్పవలయునా యనియు, 'ప్రకృతికృపణాః' (స్వభావముచేత దీనులు) అనుటచేత కామార్తిచేత ధీరులకుఁగూడ వారిస్వాభావిక ధైర్యముపోయి దైన్యమే ప్రకృతి యగు ననియు, 'చేతనాచేతనేషు' అను విషయసప్తమిచేత వారు వివేకములేక యన్నిటిని యాచింతు రనియు, భావము.

జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం
జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోనః;
తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబన్ధుర్గతోఽహం,
యాచ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామా. 6

సంప్రతి యాచ్ఞాప్రకార మాహ జాత మితి. — హే మేఘ, త్వాం, భువనే విదితే (ప్రసిద్ధే) భువనవిదితే "నిష్ఠే" తి భూతార్థే క్తప్రత్యయః [illegible]

వర్తమానార్థత్వే తు* 'క్తస్య చ వర్తమానే' ఇతి భువనశబ్దస్య షష్ఠ్యన్తనియమాత్ సమాసో న స్యాత్ *'క్తేన చ పూజాయామి'తి నిషేధాత్, పుష్కలావర్తకాశ్చ కేచి న్మేఘానాం కూటస్థాః పుష్కలావర్తకా ఇత్యుచ్యన్తే - తేషాం, వంశే=కులే, జాతం-మహాకులప్రసూత మిత్యర్థః, కామరూపమ్=ఇచ్ఛాధీనవిగ్రహం-దుర్గాదిసంచారక్షమమిత్యర్థః, మఘోనః=ఇన్ద్రస్య, ప్రకృతిపురుషం=ప్రధానపురుషం, జానామి, తేన = తవ ప్రభుత్వాభిజాత్యాదిగుణయోగిత్వేన హేతునా, విధివశాత్=దైవాయత్తత్వాత్ + 'విధిర్విధానే దైవే' త్యమరః + 'వశ ఆయత్తతాయాంచ వశ ఇచ్ఛాప్రభేదయో రి' తి విశ్వః, దూరే బన్ధు ర్యస్య సః-దూరబన్ధుః=వియుక్తభార్యః, అహం, త్వ య్యర్థిత్వం గతః; నను యాచకస్య యాచ్యగుణోత్కర్షః కుత్రోపయుజ్యత ఇత్యాశఙ్క్య దైవా ద్యాచ్ఞాభఙ్గేఽపి లాఘవదోషాభావ ఏవ ఉపయోగ ఇత్యాహ యాచ్ఞేతి:—తథాహి, అధిగుణే=అధికగుణే పుంసి విషయే, యాచ్ఞా, మోఘా=విఫ లాపి, వరమ్=ఈషత్ప్రియం - దాతుర్గుణాఢ్యత్వాత్ ప్రియత్వం - యాచ్ఞావైఫల్యా దీషత్ప్రియత్వ మితి భావః, అధమే=నిర్గుణే, యాచ్ఞా తు, లబ్ధకామాపి, నవరమ్=ఈషత్ప్రియ మపి న భవతీ త్యర్థః + 'దైవాద్వృతే వర శ్శ్రేష్ఠే త్రిషు క్లీబే మనాక్ప్రియ' ఇత్యమరః. అర్థాన్తరన్యాసానుప్రాణితః ప్రేయోఽలఙ్కారః - తదుక్తం దణ్డినా† 'ప్రేయః ప్రియతరాఖ్యాన' మితి. ఏత చ్చాద్యపాదత్రయే చతుర్థపాదస్యే నార్థాన్తరన్యాసే నోపజీవిత మితి సువ్యక్తమేవ.

ప్రార్థనాప్రకారమును చెప్పుచున్నాఁడు:—

(హే మేఘ=ఓ మేఘుఁడా), త్వామ్=నిన్ను, భువనవిదితే—భువన=లోకములలో-విదితే=ప్రసిద్ధమయిన, పుష్కలావర్తకానామ్=పుష్కలములు ఆవర్తకములు అను పేర్లుగల కూటస్థమేఘములయొక్క, వంశే=కులమందు, జాతమ్=పుట్టినవానినిగాను (గొప్పకులమువానినిగాను అని యర్థము), కామరూపమ్=ఇచ్ఛాధీనమైన యాకారము గలవానినిగాను (దుర్గప్రదేశములయందు సంచరింపఁగలవానినిగాను అని యర్థము), మఘోనః = ఇంద్రునియొక్క, ప్రకృతి పురుషమ్ = ప్రధానపురుషునిఁగాను, జానామి=ఎఱుఁగుదును; తేన=అందుచేత (అనఁగా నీయందు ప్రభుత్వము ఆభిజాత్యము మొదలయిన గుణములుకలవుగాన), విధివశాత్ - విధి=దైవమునకు - వశాత్=ఆధీనతచేత, దూరబన్ధుః—దూర=దూరమందున్న - బన్ధుః=బంధువుకలవాఁడనైన (అనఁగా భార్యను ఎడఁబాసిన), అహమ్ = నేను, త్వయి=నీయందు, అర్థిత్వమ్ = యాచకత్వమును, గతః- పొందితిని, (అనఁగా నిన్ను యాచించుచున్నాను); యాచింపఁబడువాని గుణాతిశయమువలన యాచకున కేమి యుపయోగ మనఁగా - దైవవశమున యాచన నెఱవేఱక పోయెనా లాఘవము లేమియే యుపయో

గము-అని తెలుపుచున్నాఁడు:—(తథాహి = అట్లేగదా), అధిగుణే = గొప్పగుణము గలవానిచోట, యాఞ్చా = ప్రార్థన, మోఘా (అపి)=నిష్ఫల (మయినను), వరమ్ = కొంచెము ఇష్టము (దాత గుణవంతుఁడు గనుక ఇష్ట మనియు - ప్రార్థన విఫల మయినది గనుక కొంచె మిష్టమనియు - భావము), అధమే (తు) = గుణహీనునిచోట (నైననో), (యాఞ్చా=ప్రార్థన), లబ్ధకామా (అపి)=పొందఁబడినకోరికకల (దైనను) (అనఁగా నెఱవేఱినను), న (వరమ్) = (కొంచెమైనను ఇష్టము) కాదు.

తా.—నీచుని యాచించి కార్యము సాధించుటకన్న గొప్పవానిని యాచించి కార్యము కాకపోయినను మేలుగావున, మేఘుఁడు అనేకవిధముల గొప్పవాఁడును యక్షునికార్యమును చేయఁగలవాఁడును అగుటచేతను, యక్షునికష్టము గొప్పది కనుకను, ఆతఁడు మేఘునెడల యాఞ్చాదైన్యము నంగీకరించెను.

వ.—'భువనవిదితే' అనుటచేత 'నీవంశకీర్తి ముల్లోకములలో ఎంతదూరము వ్యాపించియున్నదో అర్థిని అనాదరణచేసితివేని ఆయపకీర్తి కూడ అంతదూరము వ్యాపించును జుమా' అనియు, 'విధివశాత్' అనుటచేత 'నాకు యాచనవృత్తిగాదు నాకష్టమువలన యాచింపవలసివచ్చిన' దనియు, 'నాధమె లబ్ధకామా' అనుటచేత 'ఎంతకష్టమైన రానీ నీచులను యాచింపనొల్ల'ననియు - (అందుచేత యక్షుఁడు ధీరోదాత్తుఁ డనియు), అంతధీరోదాత్తుఁడైన యక్షుఁడుకూడ అన్యుని యాచింపవలసి వచ్చిన మహాపద ఏమనఁగా-'దూరబన్ధుః' అనుటచేత భార్యతోడివియోగమే ఆమహాపద యనియు, వియోగమాత్రమున కింత దైన్యమేల యనిన - ఆవియోగము ఆ వర్షాకాలములో తనకాంతయొక్క జీవితమునే హరించునుగాన 'నాప్రాణము కొఱకైనయెడల ఒకరిని యాచింపను - అబలయైన కాంతయొక్క ప్రాణములకుఁ గావున యాచించినాఁడ'ననియు, విరహిణియైన యక్షికి కలుగునని యక్షుఁడు భయపడుచున్నయాపదకు మేఘుఁడే కారణముగాన 'మాకు నీవు ఉపకారము చేయనక్కఱ లేదు - నీవలనఁ గలుగఁబోవు నపాయమును తప్పించినఁజాలు' ననియు, 'నాకీవార్తాహరణోపకారము చేయుటచేత నీకు అబలాప్రాణదానసుకృతము లభించు' ననియు, సుకృతము చేయుటకు సుకృత ఫలమును మేఘుఁడు ఎఱుఁగునా యనిన-'మఘోనః ప్రకృతిపురుషమ్' అనుటచేత నూఱుమఖములు చేసిన యింద్రునికి ప్రధానుఁడు - కనుక సుకృతఫలమును ఎఱుఁగును - అనియు, అందుచేత, ఏమఖమును (ఏయజ్ఞమును) ప్రాణదానసుకృతమునకు సమానముగాదు గాన - ఈసుకృతమును మేఘుఁడు చేయు ననియు, చేయుటకు మేఘునికి శక్తికలదా అనిన-ఈసుకృతము వార్తాహరణముచేఁగలుగునుగాన 'కామరూపమ్' అనుటచేత ఎక్కడికైనను [illegible]

ఖముగ నైనను పోయి వార్తను చెప్పశక్తి మేఘునికిఁ గలదనియు, 'మోఘా అధిగుణే వరమ్' అనుటచేత 'ఓమేఘుఁడా నీకు శక్తియుఁ గలదు - న్యాయమునుఁ గలదు - చేయుటకుఁగాని మానుటకుఁగాని నీచిత్తము' - అని మిక్కిలి మర్యాదగా అడుగుట యనియు, 'దూరబన్ధుః' అని తనయాచ్ఞాకారణమును అతిస్వల్పముగా నిర్దేశించుట చేత వియోగక్లేశముకన్న కష్టములేమి సర్వవిదితముగావున తన దైన్యము నింద్యము గావనియు, ఎట్టి ధీరుఁడైనను విరహము భాంగఁదీయు ననియు, గొప్పవాఁడును ప్రధానపురుషుఁడును గనుక మేఘుఁడు ఈక్లేశమహిమను ఎఱుఁగకపోఁడని యు, ఎఱిఁగినందులకు ఫలము దానిని తొలఁగించుటయనియు, గొప్పవాఁడుకొలఁదివారి కష్టమునే ఓర్వఁడు - ధీరోదాత్తుఁడైనయక్షునికష్టమునా ఓర్చు? ననియు, భావము

సంతప్తానాం త్వమసి శరణం, తత్పయోద ప్రియాయా
స్సందేశం మే హర ధనపతిక్రోధవిశ్లేషితస్య;
గన్తవ్యా తే వసతి రలకా నామ యక్షేశ్వరాణాం
బాహ్యోద్యానస్థితహరశిరశ్చన్ద్రికాధౌతహర్మ్యా. 7

సంతప్తానా మితి.— హే పయోద = జలద, త్వం, సంతప్తానామ్ = ఆతపేన ప్రవాసవిరహజేన తాపేన చ సంజ్వరితానాం + 'సంతాప స్సంజ్వర స్సమౌ' ఇ త్యమరః, శరణమ్ = ఆతపఖిన్నానాం పయోదానేన ప్రోషితానాం స్వస్థానప్రాపణేన చ రక్షి త్రాసి + 'శరణం గృహరక్షిత్రోః' ఇ త్యమరః, తత్ = తస్మాత్కార ణాత్, ధనపతేః = కుబేరస్య క్రోధేన - విశ్లేషితస్య = ప్రియయా వియోజితస్య, మే = మమ, సందేశం = వార్తాం, ప్రియాయాః హర = ప్రియాం ప్రతి నయే త్యర్థః * సంబన్ధసామాన్యే షష్ఠీ - సందేశహరణే నావయోః సంతాపం నుదే త్యర్థః; కుత్ర స్థానే సా స్థితా? తత్థ్సానస్యవా కిం వ్యావర్తకమ్? తత్రాహ గన్తవ్యేతి;— బహిర్భవం = బాహ్యం * 'బహిర్దేవ పఞ్చ జనేభ్య శ్చే తి వక్తవ్యమి' తి ష్యప్రత్యయః - బాహ్యోద్యానే స్థితస్య హరస్య శిరసి యా చన్ద్రికా తయా ధౌతాని (నిర్మలాని) హర్మ్యాణి (ధనికభవనాని) యస్యాం సా తథోక్తా + 'హర్మ్యాది ర్ధనినాం వాస' ఇ త్యమరః - అనేన వ్యావర్తకముక్తమ్, అలకా నామ = అల కేతి ప్రసిద్ధా యక్షేశ్వరాణాం, వసతిః = స్థానం, తే = తవ, గన్తవ్యా, త్వయా గన్తవ్యే త్యర్థః * 'కృత్యానాం కర్తరి వే' తి షష్ఠీ.

౭. హే పయోద = ఓ మేఘుఁడా, త్వమ్ = నీవు, సంతప్తానామ్ = ఎండచే తను విరహముచేతను వేఁడఁబడినవారికి, శరణమ్ = ఎండతాఁకు తగిలినవారిని జలము

నిచ్చుటచేతను - విరహతాపముగలవారిని స్వస్థానము చేర్చుటచేతను - రక్షించువాఁడవు, అసి = అయి యున్నావు; తత్ = ఆహేతువుచేత, ధన...తస్య—ధనపతి = కుబేరునియొక్క - క్రోధ = కోపముచేత - విశ్లేషితస్య = ప్రియనుండి ఎడఁబాపఁబడినవాఁడనైన, మె = నాయొక్క, సందేశమ్ = వార్తను, ప్రియాయాః = నాప్రియకు, హర = కొనిపొమ్ము (అనఁగా చెప్పుము), బాహ్య...హర్మ్యా—బాహ్య = బయటనున్న-ఉద్యాన = తోఁటయందు-స్థిత = ఉన్న-హర = శివునియొక్క-శిరః = తలయందలి-చన్ద్రికా = వెన్నెలచేత -ధౌత = నిర్మలమయిన-హర్మ్యా = ధనికుల లోఁగిండ్లుగలదైన, అలకా నామ = అలకయని ప్రసిద్ధమైన, యక్షేశ్వరాణామ్ = యక్షప్రభువులయొక్క, వసతిః = స్థానము, తే = నీకు, గన్తవ్యా = పోఁదగినది, (నీవు అక్కడికి పోవలయునని యర్థము).

తా.—ఓ మేఘుఁడా నీవు సంతప్తులకు రక్షకుండవు, మేము విరహసంతప్తులము కనుక మాసంతాపమును తీర్పుము. అందుకై నావార్తను నాప్రియకు చెప్పుము. కుబేరునిశాపముచేత మా కీవియోగము కలిగినది. నాప్రియ అలకాపురములో నున్నది. కనుక నీవు అక్కడికి పోవలయును. ఆపట్టణము యక్షనికులకు నివాసము, నీకు చూడఁదగినదిగా నుండును; మఱియు దానిని కనుంగొనుటకు గుర్తువినుము—దాని బాహ్యోద్యానమందు శివుఁడున్నాఁడు. ఆయన తలలోని చంద్రుని వెన్నెలచేత ఆపట్టణము ఇతరపట్టణములవలెఁ గాక సదా శోభిల్లుచుండును.

వి.—యక్షుఁడు 'అభ్ర' 'స్తనయిత్ను' ఇత్యాది శబ్దములను చెప్పక 'జలము నిచ్చువాఁడు' అనునర్థము గలదయిన 'పయోద' శబ్దమును ప్రయోగించుటచేత మేఘునిదానశీలతను లోకోపకారశీలతను; ధనము నిచ్చువాఁడనునర్థముగల 'ధనద' శబ్దమును ప్రయోగింపక 'ధనపతి' యనుటచేత తనకు కుబేరునియందుఁ గలిగిన యసూయను, తెలుపుచున్నాఁడు. మఱియు తనపొరఁబాటును క్షమింపక తన్ను కుబేరుఁడు అతిక్రూరముగా దండించినాఁడనియు; అందుచేత తన వియోగమునకు తనయపరాధము కారణము కాదనియు, కనుక తాను మేఘునికనికరమునకు పాత్రమనియు, 'యక్షేశ్వరాణామ్' అనుటచేత 'అలకాపురము ధనికుల మేడలతో నిండి నేత్రోత్సవముగా నుండును-ఎంతప్రయాసయైనను పడి పోయి చూడఁదగినది - కనుక నానిమిత్తము పోయిన ఈప్రయాస నీకు వ్యర్థముగాదు - దానిచేత అలకాపురదర్శనమును మహాలాభము నీకు కలుగును' అనియు, 'హరశిరశ్చన్ద్రికాధౌతహర్మ్యా' అనుటచేత ఆపురము శంకరునికృపాకటాక్షమునకు ముఖ్యపాత్ర మనియు, దాని

రమణీయతను నేత్రానందముగా చూచుటచేత ఇహమును, అందు సదా వెలుఁగు చుండెడు హరశిరశ్చంద్రుని దర్శనముచేత అనంత పుణ్యమును కలుగుననియు, 'హరించువాఁడ' ను నర్థముగల 'హర' శబ్దమును ప్రయోగించుటచే 'అక్కడికిపోయి దర్శనము చేయుటచేత ఆదేవుఁడు నీపాపమును హరించు' ననియు, సూచించుచున్నాఁడు.

త్వా మారూఢం పవనపదవీ ముద్గృహీతాలకాన్తాః
ప్రేక్షిష్యన్తే పథికవనితాః ప్రత్యయా దాశ్వసన్త్యః;
కః సన్నద్ధే విరహవిధురాం త్వ య్యుపేక్షేత జాయాం
న స్యా ద న్యోఽప్యహ మివ జనో యః పరాధీనవృత్తిః? 8.

మదర్థం ప్రవృత్తస్య తవ పథికాఙ్గనాసమాశ్వాసన మానుషఙ్గికఫల మిత్యాహ త్వా మితి.—పవన పదవీమ్=ఆకాశమ్, ఆరూఢం, త్వాం, పన్థానం గచ్ఛన్తీతి పథికాః - * 'పథః ష్కన్' ఇతి ష్కన్ప్రత్యయః-తేషాం వనితాః=ప్రోషితభర్తృకాః, ప్రత్యయాత్ = ప్రియాగమన విశ్వాసాత్ + 'ప్రత్యయోఽధీన శపథ జ్ఞాన విశ్వాస హేతుషు' ఇత్యమరః, ఆశ్వసత్యః - శ్వసిధాతో శ్శత్రన్తాత్ * 'ఉగిత శ్చే' తి ఙీప్, తథా, ఉద్గృహీతాలకాన్తాః=దృష్టి ప్రసారార్థ మున్నమయ్య ధృతాలకాగ్రా స్సత్యః, ప్రేక్షిష్యన్తే=అత్యుత్కణ్ఠయా ద్రక్ష్యన్తీ త్యర్థః. మదాగమనేన పథికాః కథ మాగమిష్యన్తీ త్యత్రాహ.—తథాహి, త్వయి, సన్నద్ధే=వ్యాపృతే సతి, విరహేణ విధురాం (వివశాం), జాయాం, కః ఉపేక్షేత=నకోఽప్యుపేక్షే తే త్యర్థః, అన్యోఽపి=మద్వ్యతిరిక్తోఽపి, యో జనః, అహ మివ, పరాధీనవృత్తిః=పరాయత్తజీవికో, న స్యాత్, స్వతన్త్రస్తు న కోఽప్యుపేక్షే తే త్యర్థః. అర్థాన్తరన్యాసోఽలఙ్కారః. తదుక్తమ్ - * 'కార్యకారణసామాన్య విశేషాణాం పరస్పరం । సమర్థనం యత్ర సోఽర్థాన్తరన్యాస ఉదాహృత' ఇతి.

'నాకోసము బయలుదేఱిన నీకు పథికభార్యలను ఊఱడిల్లఁజేయుఫలము కూడ కలుగును.' అని చెప్పుచున్నాఁడు:—

పవన పదవీమ్=గాలియొక్క మార్గమును (అనఁగా ఆకాశమును), ఆరూఢమ్=ఎక్కిన, త్వామ్=నిన్ను, పథిక వనితాః=బాటసారుల స్త్రీలు (భర్తలు దేశాంతరము పోఁగా వారిని బాసి ఇంట నున్నభార్యలు), ప్రత్యయాత్=తమప్రియులు వత్తు రను నమ్మకముచే, ఆశ్వసత్యః=ఊఱడిల్లువారై, ఉద్...కాన్తాః— ఉద్గృహీత = పయికి త్రోయఁబడిన-అలక = ముంగురులయొక్క-అన్తాః=కొనలుగల

హార్యై - అనఁగా ముంగురులను చూపులకు అడ్డపడకుండునట్లుపైకి ఎత్తి పట్టుకొని, ప్రేక్షిష్యన్తే=చూతురు; నేను రాఁగానే పథికులు వత్తురని నిశ్చయ మేమి? అనఁగా చెప్పుచున్నాఁడు:— (తథా హి=అట్లేగదా), త్వయి=నీవు, సన్నద్ధే (సతి) =వ్యాపృతుఁడవై (యుండఁగా), విర...రామ్—విరహ=వియోగముచేత-విధురామ్ =వివశురాలైన, జాయామ్=భార్యను, కః ఉపేక్షేత=ఎవఁడు ఉపేక్షచేయును (ఎవఁడును ఉపేక్షింపఁడు), అన్యోఽపి=(నాకంటె) ఇతరుఁడుకూడ, యః=ఎవఁడు, అహ మివ=నావలె, పరాధీనవృత్తిః—పరాధీన-పరాయత్తమయిన-వృత్తిః =జీవనముకలవాఁడు (అనఁగా అస్వతంత్రుఁడు), న స్యాత్=కాఁడేని, (నావంటి యస్వతంత్రుఁడు ఉపేక్షించునే గాని స్వతంత్రుఁడు ఎవ్వఁడును ఉపేక్షింపఁడు).

తా.—వర్షాకాలమందు విరహిణులు మదనునిబారికి తాళలేరు గనుక మేఘోదయము కాఁగానే నావంటిపరాధీనుఁడు తప్ప ఎక్కడెక్కడిపథికుఁడును తనప్రేయసీక్షేమమునకై యిల్లు నేరును. ఆసంగతి ఎఱిఁగి పాంథస్త్రీలు నీవు రాఁగానే ఇఁక తమభర్తలు శీఘ్రముగా వత్తురుగదా యని ప్రియసమాగమహేతువ వగుటచేత నిన్ను ఆసక్తితో చూచి సంతోషించి ధైర్యము తెచ్చుకొని భర్తలు వచ్చువఱకు ప్రాణములు నిలుపుకొని యుందురు. ఆసుకృతముకూడ నీకు లభించును.

ప.—'ఆకాశమ్' అనక 'పవనపదవీమ్' అనుట యేల యనఁగా - వాయువు మేఘుని ఒకచోటినుండి మఱియొకచోటికి కొనిపోవును గనుక, 'నేత్రా నీతా స్సతతగతినా' అని ముందుచెప్పఁబోవుచున్నాఁడు; 'ఉద్గృహీతాలకాన్తాః' అనుటచేత ప్రోషితభర్తృకలు గావున తలదువ్వుకొనుట మొదలయిన సంస్కారములు చేసికొనందున ముంగురులు కన్నులవఱకుఁగూడ మొగముమీఁద పడుచున్నవనియు, అట్లు స్వదేహసంస్కారమును గూడ మానుదురా యనిన-'వనితాః' యనుటచేత 'వనితా జనితాత్యన్తానురాగాయాం చ యోషితి' వనిత యనఁగా అత్యంతానురక్తయగు స్త్రీగావున - అట్టిస్త్రీలకు విరహమందు స్వజీవితముమీఁదఁగూడ అపేక్ష యుండదు గాన దేహసంస్కారములను మానుకొనుట కేవలము సహజమే అనియు, 'ప్రియామ్' అనక 'జాయామ్' అనుటచేత భర్తకంటె వేఱు శరణము లే దనియు, 'ప్రత్యయాత్' అనుటచేత మేఘునికంటె మదనోద్దీపకము లేనందున మేఘుఁడే విరహిణీప్రాణహారకుఁ డగుటకును ఆహేతువుచేత మేఘాడంబర—
పథికులును ఇల్లు చేరుటకును సందేహము లే దనియు, భావ

మన్దంమన్దం నుదతి పవన శ్చానుకూలో
వామ శ్చాయం నదతి మధురం చాతక

గర్భాధానక్షణపరిచయా న్నూన మాబద్ధమాలాః
సేవిష్యన్తే నయనసుభగం ఖే భవన్తం బలాకాః

నిమిత్తాన్యపి తే శుభాని దృశ్యన్త ఇత్యాహ మన్దంమన్ద మితి.—అనుకూలః, పవనో=వాయు-శ్చ, త్వాం, మన్దంమన్దమ్ = అతిమన్ద మిత్యర్థః * అత్ర కథఞ్చి ద్వీప్సాయా మేవ ద్విరుక్తి ర్నిర్వాహ్యా * 'ప్రకారే గుణవచన స్యే'తి తదాశ్రయణే కర్మధారయవద్భావేన సుబ్లుకి మన్దమన్ద మితి స్యాత్ - త దేవాహ వామనః. *'మన్దంమన్ద మిత్యత్ర న ప్రకారార్థ ఇతి ద్విర్భావ'ఇతి, యథా = సదృశం - భావిఫలానురూప మిత్యర్థః + 'యథా సాదృశ్య యోగ్యత్వ వీప్సా స్వార్థానతిక్రమే' ఇతి. యాదవః, నుదతి = ప్రేరయతి, అయం, సగన్ధః = సగర్వః—సంబన్ధీ కేచిత్ * 'గన్ధో గన్ధక ఆమోదే లేశే సంబన్ధగర్వయో రి'త్యుభయ త్రాపి విశ్వప్రకాశః - తే = తవ, వామో = వామభాగస్థః + 'వామస్తు వక్రే రమ్యే స్యాత్సవ్యే వామస్థితేఽపి చే'తి శబ్దార్ణవే, చాతకః=పక్షివిశేష-శ్చ, మధురం =శ్రావ్యం, నదతి=వ్యాహరతి; ఇదం నిమిత్తద్వయం వర్తతే, వర్తిష్యతే, చాపర నిమిత్త మిత్యాహ గర్భేతి.—గర్భః=కుక్షిస్థజన్తుః + 'గర్భోఽపవరకేఽన్నేఽగ్నౌ సుతే పనససంకటే । కుక్షౌ కుక్షిస్థజన్తౌ చే'తి యాదవః - త స్యాధాన (ముత్పాదనం) త దేవ క్షణః (ఉత్సవః) - సుఖ హేతుత్వాదితి భావః + 'నిర్వ్యాపారస్థితౌ కాలవిశేషోత్సవయోః క్షణ'ఇత్యమరః - తస్మి న్పరిచయా (దభ్యాసా) ద్ధేతోః, ఖే = వ్యోమ్ని, ఆబద్ధమాలాః = గర్భాధానసుఖార్థం త్వత్సమీపే బద్ధపఙ్క్తయ ఇత్యర్థః - ఉక్తం చ కర్ణోదయే + 'గర్భం బలాకా దధతేఽభ్రయోగా న్నాకే నిబద్ధావళయ స్సమన్తాది'తి, బలాకాః = బలాకాఙ్గనాః, నయనసుభగం = దృష్టిప్రియం, భవన్తం, నూనం = సత్యం, సేవిష్యన్తే. అనుకూలవాత చాతకరుత బలాకాదర్శనానాం శుభసూచకత్వం శకునశాస్త్రే) దృష్టమ్; తత్తు విస్తరభయా న్న లిఖితమ్.

నము కలుగఁ బోవుచున్నది, అని చెప్పుచున్నాఁడు:—గర్భా...యాత్—గర్భ = కడుపులోని జంతువుయొక్క— ఆధాన = పుట్టించుటయనెడు, క్షణ = ఉత్స వమునందు - పరిచయాత్ = అభ్యాసముచేత - (అనఁగా గర్భాధానసుఖమునకు అలవాటుపడియుండుటచేత), ఖే = ఆకాశమునందు, ఆబద్ధమాలాః — ఆబద్ధ = కట్టఁబడిన - మాలాః = పంక్తులుకలవై (అనఁగా శ్రేణులు కట్టినవై), బలాకాః = ఆఁడుబెగ్గురుపక్షులు, నయన సుభగమ్—నయన = నేత్రములకు - సుభగమ్ = ప్రియుఁడవైన, భవన్తమ్=నిన్ను, సేవిష్యన్తే=ఆశ్రయింపఁగలవు.

తా.—గాలి అనుకూలమై (అనఁగా నీ వెటుపోవలయునో అటే వీచుచు) మెల్లగా నిన్ను నడపుచున్నది, నీయెడమవైపున వానకోయిల గర్వించి మధుర ముగా కూయుచున్నది. ఇంతేకాక గర్భాధాన సౌఖ్యమును అనుభవించియున్న బెగ్గురులు అందగాఁడవైననిన్ను మరల అందునిమిత్తము ఆశ్రయించును. ఈశుభ శకునములచేత నీకు ప్రయాణమందు సర్వవిధముల మేలు కలుగును.

వి.—'అనుకూలః' అనుటచేత గాలి ఉత్తరదిక్కునకు వీచుచున్నదనియు, అందుచేత ఉత్తరదిక్కునకు పోవుట మేఘునికి సుకర మనియు, 'మన్దంమన్దమ్' అనుటచేత విసరుగాలియైనయెడల నిన్ను ఇక్కడనే ఛిన్నాభిన్నము చేసివేయును - ఈగాలి యట్టిదికాదు గావునను - అట్టిది కామి శుభశకునము గావునను - అలకా పురమునకు సుఖముగా ప్రయాణము జరుగు ననియు, 'యథా' అనుటచేత వా యువు ఎట్లు వీచిన నీకు హాయిగా నుండునో ఆప్రకారము వీచుచున్న దనియు, 'మధురమ్' అనుటచేత చాతకముయొక్క కూఁత కటువుగా నున్నయెడల ఆపరుష శబ్దశ్రవణముచేత ప్రయాణమునందు అపాయము కలుగును - అట్లుగాక శ్రావ్యముగ నుండుటచేత సుఖప్రయాణమును బలాకాంగనాదాంపత్యమును మొదలయినమంగళ ములును కలుగు ననియు, 'సగన్ధః' అనుటచేత చాతకము నేలఁ బడిననీటిని త్రాగదు గావునను వానచినుకులను ఆకాశమందే త్రాగును గావునను జలపూర్ణ మయి వర్షింపనున్న మేఘుని చూచి తనకు సమృద్ధిగా వానచినుకులు దొరకు నని గర్వించె ననియు, 'క్షణ' అనుటచేత గర్భాధానము సౌఖ్యావహ మనియు, 'పరిచయాత్' అనుటచేత బలాకలు అనుభవశాలినులనుటచే-

'నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏ వాభివర్ధతే.'

అని మనువు చెప్పినప్రకారము కామము అనుభవించినకొలఁదియు ఆహుతి [illegible] చిననిప్పువలె వృద్ధినే పొందుచుండును గావునను.

'స్త్రీణాం ద్విగుణ ఆహారో బుద్ధి శ్చాపి చతుర్గుణా
సాహసం షడ్గుణంచైవ కామ శ్చాష్టగుణో భవేత్.'

కామము స్త్రీలకు పురుషులకన్న నెనిమిదింతలు అనఁగా అత్యంతాధికము గావు నను - సహజముగా నున్నయింతకామము 'సుభగమ్' అనుటచేత అంపగాఁడ వయిన నిన్ను చూడఁగానే పట్టరానిదై 'ఆబద్ధమాలాః' ఒకబలాక గాదు రెండు గావు అసంఖ్యము లైనబలాకలు 'సేవిష్యన్తే' అనుటచేత తామే వలచి వచ్చి నినుఁగూడు ననియు, ఆప్రకారము అసంఖ్యముగా కామినులు అతికామముతో వచ్చి నీమీఁది కామాతిశయముచేతను అనురాగాతిశయముచేతను తమలో పరస్పరము అసూయయుమాని గుంపుగా మీఁదఁబడక శ్రేణులు తీర్చి నిలిచి వేచియుండి నీతో పొందు నదృష్టము నీకుఁ గలుగు ననియు, ఆశకునములను ఆదరింపక ఆయుత్తరప్రయాణము చేయనియెడల అనుకూలవాయువు తప్పను గావున కడమ యన్నియు దానివెంటనే తప్పి నీకు నిశ్చయముగా రానున్నమహాభాగ్యము తప్పు ననియు, పోయినయెడల వైమహావైభవ మెల్ల కలుగు ననియు, కనుక నీవు అవశ్యము పోదువుగాక యనియు, భావము.

తాం చావశ్యం దివసగణనాతత్పరా మేకపత్నీ
మవ్యాపన్నా మవితథగతి ర్ద్రక్ష్యసి భ్రాతృజాయామ్;
ఆశాబన్ధః కుసుమసదృశం ప్రాయశో హ్యఙ్గనానాం
సద్యఃపాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి. 10

న చ తస్యా నాశా ద్వ్రతస్ఖలనాద్వా నిష్ఫలస్తే ప్రయాస ఇత్యాహ తాం చేతి.—హే మేఘ, దివసానామ్ = అవశిష్టదినానాం - గణనాయాం = సంఖ్యానే - తత్పరామ్ = ఆసక్తాం + 'తత్పరే ప్రసితాసక్తా' విత్యమరః, అత ఏవ, అవ్యాపన్నామ్=అమృతాం - శాపావసానే మదాగమనప్రత్యాశయా జీవన్తీ మిత్యర్థః, ఏకః పతి ర్యస్యాస్తా - మేకపత్నీమ్=పతివ్రతా మి త్యర్థః - * 'నిత్యం సపత్న్యాదిషు' ఇతి జీవ నకారశ్చ, భ్రాతు (ర్మే) జాయాం = భ్రాతృజాయాం - మాతృవన్నిశ్శఙ్కం దర్శనీయా మి త్యాశయః, తాం=మత్ప్రియామ్, అవితథగతిః = సఫలగమన స్సన్, ద్రక్ష్యసి = ఆలోకయిష్యసి; తథాహి, ఆశా= అతితృష్ణా + 'ఆశా [illegible] గతితృష్ణయో' రితి విశ్వః - బధ్యతే అనే నేతి బన్ధః బన్ధనం వృన్త మితి యావత్ - ఆశైవ బన్ధః ఆశాబన్ధః - కర్తా, ప్రణయి=ప్రేమయుక్తమ్, అత ఏవ, కుసుమసదృశం=కుసుమసుకుమార మి త్యర్థః, అత ఏవ విప్రయోగే -

వియోగే, సద్యఃపాతి = సద్యోభ్రంశనశీలమ్, అఙ్గనానామ్, హృదయం=జీవితం
+'హృదయం జీవితే చిత్తే వక్షస్యాకూత వృక్కయోః' ఇతి శబ్దార్ణవే, ప్రాయశః=
ప్రాయేణ, రుణద్ధి=ప్రతిబధ్నాతీ త్యర్థాన్తరన్యాసః.

మేఘుని ప్రయాస నిష్ఫలము కాదు, ఏల యనఁగా - ఆమె మృతిపొందదు,
వ్రతభంగమును జరుగదు, అని చెప్పుచున్నాఁడు:—

(హే మేఘ = ఓ మేఘుఁడా), దివ...రామ్—దివస = శేషించిన దినము
లయొక్క - గణనా = లెక్కపెట్టుటయందు - తత్పరామ్ = ఆసక్తురాలును, (అందు
చేతనే), అవ్యాపన్నామ్ = చావనిదియు (శాపము ముగియఁగానే నేనే వత్తునను
వాశచేత జీవించియుండు నని యర్థము), ఏకపత్నీమ్ = ఒకఁడే పతిగలవియు
(అనఁగా పతివ్రతయు), భ్రాతృజాయామ్=నీయన్న నైన నాభార్యయు (తల్లినింబోలె
నిశ్శంకముగా పోయి చూడఁదగినదియు, (అయిన), తామ్=ఆనాప్రేయసిని, అవి
హతగతిః సన్ = వ్యర్థముగాని గమనముకలవాఁడవై, ద్రక్ష్యసి = చూచెదవు;
(తథా హి = అట్లేకదా), ఆశాబన్ధః—ఆశా = అతితృష్ణయనెడు - బన్ధః=తొడిమ
(కర్త), ప్రణయి = ప్రేమకలదియు, (అందుచేత), కుసుమసదృశమ్ = పువ్వువలె
సుకుమారమును, (అందుచేతనే), విప్రయోగే = విరహమందు, సద్యఃపాతి=వెంట
నే రాలిపోవుస్వభావముకలదియు, (నైన), అఙ్గనానామ్ = అందగత్తెలయొక్క,
హృదయమ్ = జీవితమును, ప్రాయశః=ప్రాయికముగా, రుణద్ధి=నిలుపును.

తా.—ఓ మేఘుఁడా నీప్రయాణము వ్యర్థముగాదు, ఏల యనఁగా నాకాంత
నేను ఇంక నెన్నాళ్లకు వత్తునో యని మిగతదినములను లెక్కపెట్టుచు, ఆదినములకు
పిమ్మట వత్తునుగదా యని ధైర్యము పూని ప్రాణములు నిలుపుకొని యుండును.
ఆచెలువకడకు నిశ్శంకముగా తల్లికడకుంబోలె పోయి నావార్తను చెప్పవచ్చును.
ఈవిరహతాపములో ఆమె బ్రదుకునా యందు వేని, వాస్తవముగా అనురాగముగల
స్త్రీల ప్రాణము పువ్వువలె అతికోమలము, విరహమునకు తాళక రాలియే పోవును,
గాని భర్తవిషయ మైనయతితృష్ణ తొడిమువలె దానిని పట్టుకొని నిలుపును.

వ.—'దివసగణనాతత్పరామ్' ఆ లెక్కించుట 'ఇంక నెన్నాళ్లు ఉయత్నుండను
శని లేకసుఖముందునో!' అనియా? లేక 'ఇంక నెన్నాళ్లకు ఈవిరహము తీఱి నాకాం
తునిఁ గూడుదునో' అనియా? అనిన - 'ఏకపత్నీమ్' అనుటచేత రెండవపక్షమే గాని
మొదటిది గా దనియు, ఆమె పతివ్రతగావున ఆమెను వదినగా గ్రహించుటకు మేఘు
నికి గౌరవమే గాని అగౌరవము కా దని సూచించుటకు 'భ్రాతృజాయామ్' అని
యు, అట్లు వాని చెప్పుటచే మేఘునికన్నికరమునకు రక్షణకుగ [illegible]

ముగా ఎదుటికి పోయి సందేశము చెప్పుటకును ఆమె పాత్ర మనియు, 'హృదయం కుసుమసదృశమ్' అనుటచేత జీవితము అతిసుకుమార మనియు, ఆసాదృశ్యసామర్థ్యముచేత ప్రణయము మకరందభారమువంటి దనియు, విరహము గాలివంటి దనియు, గాలిచేత పుష్పము రాలుటకు మకరందభారమువలె విరహముచేత జీవితము రాలుటకు ప్రణయము కారణ మనియు, మకరందము ఎంతయధికమో అంతసులువుగా పుష్పము గాలిచే రాలునట్లు ప్రణయము ఎంతయధికమో అంతశీఘ్రముగా జీవితము విరహముచే రాలు ననియు, ప్రణయమునకు రుజువే మనిన 'అఙ్గనానామ్' (అనగా శోభనము లయినయంగములు కలస్త్రీలకు) అనుటచేత 'యత్రాకృతిస్తత్ర గుణా భవన్తి' అను న్యాయముచేత ఆమెయొక్క ఆకృతియే రుజు వనియు, పుష్పమును తొడిమ తా నెంతదృఢమో అంతదృఢముగా పట్టుకొని నిలిపినట్లు జీవితమును ఆశ తా నెంతదృఢమో అంతదృఢముగా నిలుపు ననియు, 'ధివసగణనాతత్పరామ్' అనుటచే ఆమె పునస్సమాగమకాలము దినదినమునకును మఱిమఱి సమీపించుచున్న దని తెలియుటచేత ఆశ దృఢమై 'అవ్యాపన్నామ్'—జీవితమునకు కాలయపాయము తప్పి బ్రదికియే యుండు ననియు, కనుకనే 'అవిహతగతిః'—మేఘునిపోక వ్యర్థముగా దనియు, ఆమె బ్రదికియే యుండునుగదా వార్తపంపనేల యనిన - ఆబ్రదుకు మేఘదర్శన మగుపర్యంతమే, (మేఘదర్శనము కాగానే) జీవితకుసుమము తప్పకుండ రాలిపోవు ననియు, విరహమాత్రము గాలివంటిదైన మేఘదర్శనముతోడివిరహము చెట్లనుకూడ తలక్రిందుచేయు తుపానుగాలి యనియు, ఆమహాపాయములో భర్తృసందేశము దైవబలమువలె ఆమెను కాపాడు ననియు, కనుక అవశ్యము పోయి వార్తను అందింపవలయు ననియు, భావము.

కర్తుం యచ్చ ప్రభవతి మహీ ముచ్ఛిలీన్ధ్రా మవన్ధ్యాం
తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః
ఆకైలాసా ద్బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః
సంపత్స్యన్తే నభసి భవతో రాజహంసాః సహాయాః. 11.

కర్తుమితి—యద్గర్జితంకర్తృ, మహీమ్, ఉచ్ఛిలీన్ధ్రామ్=ఉద్భూతకన్దలికామ్—+ 'కన్దల్యాం చ శిలీన్ధ్రః స్యాత్' ఇతిశబ్దార్ణవే, అత ఏవ, అవన్ధ్యాం=సఫలాం, కర్తుం, ప్రభవతి=శక్నోతి, శిలీన్ధ్రాణాం భావిసస్యసంపత్తి సూచకత్వాదితిభావః. తదుక్తం నిమిత్తనిదానే + 'కాలాభ్రయోగా దుదితాః శిలీన్ధ్రాః సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్' ఇతి, తత్, శ్రుత్వా, మానసోత్కాః—మానసే సరస్యున్మన

# ప్రథమః సర్గః

సః-ఉత్సుకా ఇతి యావత్ * 'ఉత్క ఉన్మనాః' ఇతి నిపాతనాత్సాధుః-కాలాన్తరే మానసస్య హిమదుష్టత్వాద్ధిమస్య చ హంసానాం రోగహేతుత్వా దన్యత్ర గతా హంసాః పున ర్వర్షాసు మానస మేవ గచ్ఛ న్తీతి ప్రసిద్ధిః, బిసకిసలయానాం=మృణాళాగ్రాణాం - ఛేదైః=శకలైః - పాథేయవన్తః=పథి సాధు పాథేయం=పథి భోజ్యమ్ *'పథ్యతిథివసతిస్వపతేర్ఢఞ్'-తద్వన్తః=మృణాళాగ్రశకలసమ్బలవన్త ఇత్యర్థః, రాజహంసాః=హంసవిశేషాః + 'రాజహంసాస్తు తే చఞ్చుచరణై ర్లోహితైః సితాః' ఇత్యమరః, నభసి=వ్యోమ్ని, భవతః=తవ, ఆకైలాసాత్=కైలాసపర్యన్తమ్ * పదద్వయం చైతత్, సహాయాః=సయాత్రాః * 'సహాయ స్తు సయాత్రః స్యాత్' ఇతి శబ్దార్ణవే, సంపత్స్యన్తే-భవిష్యన్తి.

యత్ గర్జితమ్=ఏయుఱుము, మహీమ్ = భూమిని, ఉచ్ఛిలీన్ధ్రామ్-ఉత్-ఉద్భూత=మొలచిన, శిలీన్ధ్రామ్=నేలయరcటికలదానినిగాను, (అతఏవ=ఆహేతువుచేతనే), అవన్ధ్యామ్=ఫలవంతముగాను, కర్తుమ్=చేయుటకు, ప్రభవతి = సమర్థమైయున్నదో, (కాలమేఘముచేత నేలయరcటులు మొలచినయెడల పైర్లు సమృద్ధిగా పుష్కలముగా పెరుcగును), శ్రవణ సుభగమ్—శ్రవణ=చెవులకు - సుభగమ్=ఇంపైన, తే=నీయొక్క, తత్ గర్జితమ్=ఆ యుఱుమును, శ్రుత్వా=విని, మానసోత్కాః-మానస = మానససరస్సునందు-ఉత్కాః=ఉత్కములై-(ఇతరకాలమందు మానససరస్సులో మంచు ఉండును - మంచు హంసలకు రోగకారి - కనుక హంసలు ఇతరకాలమును ఇతరస్థలములయందుc గడపి వర్షాకాలమందు మానససరస్సునకు వచ్చును అని ప్రసిద్ధి), బిస...వన్తః-బిస = తామరతూండ్లయొక్క-కిసలయ = కొనలయొక్క- ఛేద = ముక్కలచేత - పాథేయవన్తః = బత్తెముకలవై (అనcగా తామరతూండ్లకొనలను మార్గభోజనముగా భక్షించునవై), రాజహంసాః=రాజహంసలు, నభసి = ఆకాశమందు, భవతః=నీకు, ఆకైలాసాత్=కైలాసమువఱకు, సహాయాః=తోడిబాటసారులు, సంపత్స్యన్తే = కాcగలవు.

తా.—నేలయరcటులు పుట్టెనేని పైరులు సమృద్ధిగా ఫలించి సుభిక్షము గలుగును; ఆప్రకారము నేలయరcటులను పుట్టించి అందుచేత సుభిక్షమును సూచించు శక్తి నీయుఱుమునకుc గలదుగాన నీయుఱుము లోకులచెవులకు ఇంపుగానుండును. అట్టి నీయుఱుమును వినcగానే హంసలు మానససరస్సునకు పయనమై దారిలో తామరతూండ్లకొనలను భుజించునవై నీతోcగూడ కైలాసపర్యంతము వచ్చును. అట్టి [illegible]త్తముల సహవాసము నీకు దారిపొడుగునను కలుగును.

వ.—'ఉచ్ఛిలీన్ధ్రామవన్ధ్యాం కర్తుం ప్రభవతి, శ్రవణసుభగమ్'—అనుట

ఉపత్రలోభనార్థము-మేఘుడు పరోపకారస్వభావుడని కొనియాడుటయు; 'మానసోత్కాః బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః'—అనుటచేత నత్తగుల్లలు మొదలయిన తుచ్ఛద్రవ్యాలకు గలవిగాక తామరలు ముత్తెములను గలదైన (అనన్యసాధారణ రామణీయకమైన) సరోవరమునకు పోవునవియు మోటుదిండ్ల తినునవిగాక ఒకిపోకలమైన తామరతూండ్లమోసులను ఆరగించునవియు అనుటచేత హంసలు అత్యుత్కృష్టప్రకృతిగలవి యనియు, మరాళాదిశబ్దములను ప్రయోగింపక 'రాజహంసాః' అనుటచేత రాజశబ్దస్వారస్యముచేత అంచరాజులనియు, అట్టి దొడ్డవారి సహవాసము నీకు మార్గమందుఁ గలుగుననియు, అదియు నానిమిత్తమై పోవలసిన యుత్తరదిక్కునకైనఁ గలుగునేగాని మఱియొకదిక్కునకు పోఁదువేని గలుగదనియు, (మేఘుడు గొప్పవాఁడని యింతకుముందే చెప్పియున్నందున) అదొడ్డవారిసాంగత్యము నీవంటి గొప్పవానికి తగినదనియు, కష్టపడి అయినను సంపాదింపఁదగినదనియు, 'శ్రవణసుభగమ్ శ్రుత్వా సహాయాః సంపత్స్యన్తే'—అనఁగా-లోకులచెవులకు ఇంపయిన (నీ యుఱుమును) విని నీకు సహవాసగాండ్రు అగుదురు - అనుటచేత ఉత్తములయిన యామహానుభావులకు నీలోకోపకారశీలతచేత నీయందు స్నేహము కలుగుననియు, వారికి అతిప్రియమైనమానససరస్సు ఇటువైపు తమకు నివాసయోగ్యమని నీవు ఉఱిమి సూచింతువుగాన, వారికిని నీవు ఉపకారివి, ఆకృతజ్ఞతచే వారికి నీయందు స్నేహము గలుగుననియు, 'హంసరాజులు మానసమునకు పోవుదురు వారితోఁగూడి నీవు పొమ్ము' అనక 'రాజహంసాః సహాయాః సంపత్స్యన్తే' అనుటచేత పూర్వోక్తమయిన కృతజ్ఞతచేతను స్నేహముచేతను వారే నీసాంగత్యమునుకోరి నీతోవత్తురు నీవు వారిని ప్రార్థింపవలసినది లేదనియు, అట్టి సత్సంగము మార్గములో కొంతదూరముమాత్రము కలిగి పిమ్మట లేకపోయిన మహా ఖేదము కలుగునుగదా కనుక ఆసత్సంగమును నేను కోరినందువేమో 'ఆకైలాసాత్'—అనుటచేత అట్లుగాదు - ఆ మహాపురుషులసంగము నీకు మార్గముపొడవునను అవిచ్ఛిన్నముగా కలుగును అనియు, వారితోఁబోయి నీవును ఆమానసాది రమణీయప్రదేశములను చూడవచ్చుననియు, ఒకరినిమిత్తము ఇంతప్రయాణమాయనైన, నీవు ఎట్లయినను స్వభావముచేతనే ఎక్కడికో ఒకచోటికి ప్రయాణము చేయువాఁడవే యున్నది, నీవు స్వేచ్ఛచేత కల్పించుకొను నేప్రయాణమును నేను కోరిన యీప్రయాణమంతరమ్యముగా నుండదనియు, కావున ఈపయనమే చేయుట నీకు అత్యంతోచితమనియు, భావము.

ఆపృచ్ఛస్వ ప్రియసఖ మముం తుఙ్గ మాలిఙ్గ్య శైలం
వన్ద్యైః పుంసాం రఘుపతిపదై రఙ్కితం మేఖలాసు,

కాలే కాలే భవతి భవతా యస్య సంయోగ మేత్య
స్నేహవ్యక్తి శ్చిరవిరహజం ముఞ్చతో బాష్ప ముష్ణమ్. 12.

ఆపృచ్ఛస్వేతి.—ప్రియం సఖాయం = ప్రియసఖం * 'రాజాహఃసఖిభ్య ష్టచ్' ఇతి టచ్ సమాసాన్తః, తుఙ్గమ్=ఉన్నతం, పుంసాం, వన్ద్యైః=ఆరాధనీయైః, రఘుపతి పదైః=రామ పాదన్యాసైః, మేఖలాసు=కటకేషు+'అథ మేఖలా। శ్రోణిస్థానే౽ద్రికటకే కటిబన్ధేభబన్ధనే' ఇతి యాదవః, అఙ్కితం=చిహ్నితమ్, ఇత్థం సఖిత్వా న్మహత్త్వా త్పవిత్రత్వా చ్చ సంభావనార్హమ్, అముం శైలం=చిత్రకూటాద్రిమ్, ఆలిఙ్గ్య, ఆపృచ్ఛస్వ = సాధో యామీత్యామన్త్రణేన సభాజయ + 'ఆమన్త్రణసభాజనే ఆపృచ్ఛనమ్' ఇత్యమరః * 'ఆఙి నుప్రచ్ఛ్యో రుపసంఖ్యానమ్' ఇత్యాత్మనేపదమ్. సఖిత్వం నిర్వాహయతి-కాల ఇతి.—కాలేకాలే—ప్రతిప్రావృట్కాలం—సుహృత్సమాగమనకాల శ్చ కాలశబ్దే నోచ్యతే*వీప్సాయాం ద్విరుక్తిః, భవతా, సంయోగం = సంపర్కమ్, ఏత్య, చిరవిరహజమ్, ఉష్ణం, బాష్పమ్ = ఉష్మాణం-నేత్రజలంచ+'బాష్పో నేత్రజలోష్మణోః' ఇతి విశ్వః, ముఞ్చతో, యస్య శైలస్య, స్నేహవ్యక్తిః = ప్రేమావిర్భావః భవతి; స్నిగ్ధానాం హి చిరవిరహసంగతానాం బాష్పపాతో భవ తీతి భావః.

కాలేకాలే=ప్రతివర్షాకాలమందును (మిత్రసమాగమకాలముకూడ సూచింపఁబడుచున్నది), భవతా=నీతో, సంయోగమ్=కూటమిని, ఏత్య=పొంది, (అనఁగా నిన్నుకలసికొని), చిరవిరహజమ్—చిర=దీర్ఘకాలపు - విరహ=వియోగముచే-జమ్=పుట్టినదియు, ఉష్ణమ్=వేఁడిదియు, నైన, బాష్పమ్_ఆవిరిని - కన్నీటిని, ముఞ్చతః=విడుచుచున్న, యస్య=ఏపర్వతునికి, స్నేహవ్యక్తిః - స్నేహ=ప్రేమయొక్క - వ్యక్తిః_ఆవిర్భావము, భవతి=కలుగుచున్నదో, చిరకాలమునకు కలసికొనినమిత్రులకు ఆనందబాష్పములు వచ్చునని భావము), (అట్టి), ప్రియసఖమ్ = ప్రియమిత్రుడును, తుఙ్గమ్=ఉన్నతుఁడును, పుంసామ్=పురుషులకు, వన్ద్యైః=నమస్కారార్హములయిన, రఘుపతిపదైః = శ్రీరాములవారి పాదన్యాసములచే, మేఖలాసు = కొండనడుములయందు, అఙ్కితమ్ = గుర్తులుగలవాఁడును,(అయిన), (ఇట్లుప్రియమిత్రుఁడును పవిత్రుఁడును అగుటవలన సత్కారార్హుఁడయిన), అముం శైలమ్ = ఈపర్వతుని (చిత్రకూటుని,) ఆలిఙ్గ్య = కౌఁగిలించుకొని, ఆపృచ్ఛస్వ = పోయివచ్చెదనని వీడ్కొనుము.

తా.—ఓమేఘుఁడా! ఈశైలేంద్రుఁడు నీకు ప్రియమిత్రుఁడును పవిత్రుఁడును

ఎట్లనఁగా ఇతనికి నీతోడిసాంగత్యము వర్షాకాలమందుమాత్రమేకదా కలుగును, అం దువలననే వర్షాకాలము మొదలుకొని మరల వర్షాకాలమువఱకును ఒక సంవత్సర కాలము నీతోడియెడఁబాపు కలుగును. అంత దీర్ఘకాలము నీయెడఁబాపువలన అతఁడు దుఃఖ మనుభవించుచుండును. అందులకు మరల వర్షాకాలమందు నిన్ను కలయునప్పుడు అతఁడు ఆవిరిరూపమున విడుచునట్టి బాష్పములే సూచకములు. అట్టి వియోగదుఃఖమే నీయం దతనికిఁగల మైత్రికి నిదర్శనము. శ్రీరాములవారు పూ ర్వము ఈశైలేంద్రునిపై సంచరించిరిగదా, వారిపాదములచిహ్నములు ఇతనినడుమునం దుఁ గలవు. వానికి అందఱును నమస్కరింపఁదగునుగదా? వానికతమున ఇతఁడు పవిత్రుఁడుసుమా. ఇట్లు ఓ మేఘుఁడా ఇతఁడు నీకు మిత్రుఁడును పవిత్రుఁడునుగొప్ప వాఁడును గావున నీసత్కారమునకుఁ దగినవాఁడు. కనుక ఇతనిని కౌఁగిలించుకొని పోయివచ్చెదనని చెప్పి సెలవుపుచ్చుకొని మఱిపొమ్ము.

వ.—'తుఙ్గమ్'-అనుటచే గొప్పవాఁడు అనఁగా-గుణోత్కృష్టుఁడు అనియు, ఆశీర్వదింపుమనక నమస్కరింపు మనకయు 'ఆలిఙ్గ్య'—కౌఁగిలించుకొమ్మనుటచేత అతఁడును నీవును ఒకరికొకరు సమానులు అనియు, అందుచేత అతఁడు ఎట్లుగుణశా లియు పవిత్రుఁడునైయున్నాఁడో నీవును గుణశాలివియు పవిత్రుడవును అనియు, సమానులయిన మీయిరువురిసఖ్యము శోభావహమనియు, అందులసంతసమును ఆలిం గనాది సంభావనములచే మీ రనుభవింపవలయుననియు, శ్రీరామపాదచిహ్నములు కల'వనుటచేత ఈచిత్రకూటునికి నీవు చేయుసత్కారములు శ్రీరామపాదములకుం గూడ చెల్లుననియు, అందువలన నీకు మేలుకలుగుననియు,'వన్ద్యైః' అనుటచేత ఆపాద చిహ్నములకు నీవు వందనము చేసికొనవలసినదనియు, 'పుంసామ్'—అనుటచే పు రుషమాత్రులకెల్ల అనఁగా ఎల్లవారికిని రామపాదచిహ్నములు పూజ్యములు, నీవెంత గొప్పవాఁడవైనను నీకును పూజ్యములే, ఆపూజచేభుక్తిముక్తులుకలుగును,నాసందే శమునందిచ్చుట యను నాకార్యమును నీకార్యమును అందువలన నెఱవేఱుననియు, 'పతి' అనుటచే ఆరామమూర్తి ఎట్టిగొప్పవారికైనను కాపాడుప్రభువనియు; 'మేఖ లాసు' అనుటచే ఆదేవుఁడు విహరించుటకు రమ్యములయిన కటకములు ఈకొండ యందుఁగలవనియు, ఆకటకముల మూలముగా ఆయనయొక్క పాదన్యాసానుగ్రహ మునకు ఈశైలేంద్రుఁడు పాత్రమాయెననియు, కంటకాది రహితములయి విహార యోగ్యములయిన యాకటకములయందు రామమూర్తి సంచరించెననియు, రఘు పతిని పేర్కొనుటచేత ఉపలక్షణముగా సీతా లక్ష్మణ పాదన్యాసములుకూడ ఇం దుఁ గలవనియు, ఈదేవతల పాదన్యాసచిహ్నములచే ఈ పర్వతరాజము పవిత్రము

నున్నదనియు, తత్సంపర్కముచేతను ఆ పాదచిహ్నములకు వందనముచేయుటచేతను నీవును పవిత్రుఁడ వగుదువనియు, 'కాలేకాలే' అనుటచేత అతనికి నానాఁటికి నీమీఁద స్నేహము హెచ్చుచున్నదే కాని ప్రాఁతచుట్టమువని ఉపేక్షసంభవింపదనియు,(1)దుఃఖ బాష్పములు వేఁడిగాను ఆనందబాష్పములు చల్లగాను ఉండును గావున 'ఉష్ణమ్' అనుటచే (ఆవిరి వేఁడిగానుండుటయు) ఆఱిపోవుదీపము అధికముగా ప్రజ్వరిల్లునట్లు సీతోడి వియోగమువలని దుఃఖభారము నీదర్శనము కాఁగానే ముగిసిపోవునదై సాతిశయముగా అనుభవమునకు రాఁగా బాష్పములు వేఁడిగానుండుననియు, ఆవేఁడి బాష్పములవలన నీవియోగమువలని దుఃఖము అతనికి దుస్సహముగుట స్పష్టమనియు, అందువలన నీపై అతనికి స్నేహము గొప్పదనియు, కనుక నీకు అతఁడు సామాన్యమైన 'సఖుఁడు' గాఁడు, మఱిఏమనిన 'ప్రియసఖుఁ'డనియు, ఇన్నివిధముల ఉత్కృష్టుఁడుగావున అతనిని ప్రేమతోను సమానమైన గౌరవముతోను వీడ్కొనవలయుననియు, భావము.

సంప్రతి తస్య మార్గం కథయతి:—

మార్గం తావ చ్ఛృణు కథయత స్త్వత్ప్రయాణానురూపం,
సందేశం మే తదను జలద శ్రోష్యసి శ్రోత్రపేయమ్;
ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్య గన్తాసి యత్ర,
క్షీణః క్షీణః పరిలఘు పయః స్రోతసాం చోపభుజ్య. 13

మార్గ మితి.— హే జలద, తావత్ = ఇదానీం, కథయతః - మత్త ఇతి శేషః, త్వత్ప్రయాణస్య - అనురూపమ్ = అనుకూలం, మార్గమ్ = అధ్వానం + 'మార్గో మృగమదే మాసే సౌమ్యర్క్షేఽన్వేషణేఽధ్వని' ఇతి యాదవః, శృణు, తదను = మార్గ శ్రవణానన్తరం, శ్రోత్రాభ్యాం - పేయం = పానార్హమ్ - అతితృష్ణయా శ్రోతవ్య

1ఆనందబాష్పములు చల్లనివి - శోకబాష్పములు వెచ్చనివి - అనుటకుం బ్రమాణము.—

ఆనన్దజః శోకజ మశ్రు బాష్ప స్తయో రశీతం శిశిరో బిభేద
గఙ్గాసరయ్వో ర్జల ముష్ణతప్తం హిమాద్రినిష్యన్ద ఇ వావతీర్ణః. రఘు.
బహుళగళితైః సన్తాపోష్ణై స్తటాన్తవిహారిభిః
దశరథపురీపౌరస్త్రీణాం విలోచనవారిభిః
ఉపచయవతీం సన్తాపోష్ణాం నిజాం దధతీ తనూ
మిహ ముహుర్వహాం మాత ర్లజ్జాం వహామి జహామి చ, ప్రసన్న.

మిత్యర్థః - పేయగ్రహణాత్సందేశ స్యామృతసామ్యం గమ్యతే, మే, సందేశం = వాచికం + 'సందేశవాగ్వాచికం స్యాత్' ఇత్యమరః, శ్రోష్యసి, యత్ర = మార్గే, ఖిన్నః ఖిన్నః = అభీక్ష్ణం క్షీణబలః సన్ *'నిత్యవీప్సయోః' ఇతి నిత్యార్థే ద్విర్భావః, శిఖరిషు = పర్వతేషు, పదం, న్యస్య = నిక్షిప్య, పునర్బలలాభార్థం క్వచిద్విశ్రమ్యే త్యర్థః, క్షీణః క్షీణః = అభీక్ష్ణం కృశాఙ్గః సన్ *అత్రాపి కృదన్తత్వా త్పూర్వవ ద్ద్విరుక్తిః, స్రోతసాం, పరిలఘు = గురుత్వదోషరహితమ్ - ఉపలాస్ఫాలన భేదితత్వాత్పథ్యమిత్యర్థ - తథాచవాగ్భటః + 'ఉపలాస్ఫాలనక్షేపవిచ్ఛేదై ర్ఖేదితోదకాః । హిమవన్మలయోద్భూతాః పథ్యా నద్యో భవన్త్యమూః' ఇతి, పయః = పానీయమ్, ఉపభుజ్య=శరీరపోషణార్థ మభ్యవహృత్య - చ, గన్తాసి=గమిష్యసి * గమేర్లుట్.

ఇప్పుడు యక్షుఁడు మేఘునికి మార్గమును చెప్పుచున్నాఁడు. మేఘ = ఓ మేఘుఁడా, యత్ర = ఏమార్గమునందు, ఖిన్నః ఖిన్నః = మాటిమాటికిబడలినవాఁడవై (అనఁగా బడలినప్పుడెల్ల), శిఖరిషు = పర్వతములయందు, పదమ్ = కాలిని, న్యస్య = ఉంచి (అనఁగా మరల బలముకలుగుటకై ఎచటనైనను విశ్రమించి), క్షీణః క్షీణః = మాటిమాటికి కృశించినవాఁడవై (అనఁగా కృశించినప్పుడెల్ల), స్రోతసామ్ = ప్రవాహములయొక్క, పరిలఘు = గురుత్వదోషరహితమైన, పయః = జలమును, ఉపభుజ్య చ = (శరీరపోషణార్థము) త్రాగియు, గన్తాసి = పోవుదువో, (అట్టిదైన), త్వ...పమ్—త్వత్ = నీయొక్క- ప్రయాణ = పయనమునకు - అనురూపమ్ = అనుకూలమయిన, మార్గమ్ = దారిని, తావత్ = ఇప్పుడు, కథయతః = చెప్పుచున్న నావలన, శృణు = వినుము, తత్ అను = అటు పిమ్మట (అనఁగా మార్గమును విన్నపిమ్మట), శ్రోత్రపేయం - శ్రోత్ర = వీనులచే - పేయమ్ = త్రాగఁదగినదైన-(అనఁగా అతితృష్ణతో వినఁదగినదైన), మే = నాయొక్క, సందేశమ్ = వాచికమును, శ్రోష్యసి = వినఁగలవు.

తా.—ఓ మేఘుఁడా, ఇప్పుడు ముందుగా నీప్రయాణమునకు అనుకూలమయిన మార్గమును చెప్పెదను. నేను చెప్పినట్టి యామార్గములో నీవు ప్రయాణాయాసముచేత అలసినప్పుడెల్ల విశ్రమించుటకు రమ్యములయిన పర్వతములును, వర్షించుటచే నీవు కృశించినప్పుడెల్ల మరల పుష్టినొందుటకై త్రాగుటకుఁగాను గురుత్వదోషరహితములయిన జలప్రవాహములును కలవు. అట్లా నీకు విశ్రామార్హములయిన యాప్రవాహములేవో ఎక్కడెక్కడనున్నవో ఆవిషయమెల్ల చెప్పెదను; దానిని మొదట వినుము. నీవు నాభార్యకు చెప్పవలసిన వాచికమును వీనులవిందుగా అటుపిమ్మట చెప్పెదను; అప్పుడు దానిని విందువుగాక.

ప.—నీవు కామసందేశార్థము పయనమగుచున్నావు గావున 'త్వత్ప్రయాణానురూపమ్' - నేను చెప్పఁబోవుమార్గము అందుల కనుగుణముగా కమనీయముగా నుండుననియు - (సకల సదుపాయములుకలదిగా నుండుననియును), నీవు జలభారముతో నిరవలంబమయిన యాకాశములో పయనము సేయుటచేత 'ఖిన్నఃఖిన్నః' తఱచుగా అలయుదువనియు, నిరవలంబాకాశ గమనఖేదమును తీర్చుకొనుటకై 'పదం న్యస్య'-కాలూని విశ్రమింపఁదగిన తావులను - 'శిఖరిషు' - (అగ్రములుగలకొండలందు) ఉన్నతములై నీవు దూరము వానికై దిగనక్కఱలేకుండ నీకు సమీపమందుండునట్టి వానిని చెప్పెదననియు, 'జలధర' అనక 'జలద' అనుటచే జలమును కూడఁబెట్టుకొని వినియోగము చేయకుండు లోభిమేఘుఁడవు గావు మఱి ఏమనిన లోకోపకారార్థము నీజీవనమునిచ్చి 'క్షీణఃక్షీణః' మాటిమాటికి కృశించువాఁడవనియు, అట్టి మహోపకారివి నీవు మరల లోకోపకారము చేయుటకై పుష్టి నొందఁగోరి త్రాగు జలమున గురుత్వదోషముండెనేని మొదటికే మోసముకలిగి లోకక్షేమముతప్పి నావని చెడును గావునను - లఘుత్వగుణము కల జలమును త్రాగుదువేని మరల పుష్టి నొంది చిరాయువవై వర్షములచే లోకమునకు మేలుచేసి నావని నెఱవేర్తువు గావునను - ఈనిమిత్తమై 'పరిలఘు'-లఘూదకముగల ప్రవాహములను జెప్పెదను-వాని జలములను త్రాగుచుం బోవుదువుగాకయనియు, 'పయ' శబ్దమునకు పాలుగూడ అర్థము గావున లోకములో కృశించినవారు పాలుద్రాగి పుష్టిని ఆయుర్వృద్ధిని బొందునట్లే నీవును లఘూదకములను ద్రాగి పుష్టుఁడవై చిరాయువవై సేమముగాఁ బోయి నాసందేశమును అందింపుమనియు, 'శ్రోతవ్యమ్' అనక 'శ్రోత్రపేయమ్' అనుటచే నేను చెప్పఁబోవు సందేశము అమృతతుల్యముగా నుండుననియు, నీజలము నోటికి మధురముగా నుండునట్లే నాసందేశము వీనులకు మధురముగా నుండుననియు, అట్లనుటచే సందేశముగా అప్రసక్తములును అప్రియములును చెప్పి నిన్ను విసిగింపక నీవే మఱియుమఱియు విన నభిలషించునట్లుగా చెప్పెదననియు, నామీఁది కనికరముచేత సందేశము వినుటకు నీకు ఆసక్తి - మహాపురుషునికి పరమోపకారికి నీకు మంచిదారి చెప్పుటకు నాకు ఆసక్తి - కాని నీబోఁటి మహానుభావునికి స్వక్షేమమందు ఆసక్తియుండదు గాన ముందు సందేశము చెప్పినయెడల పిమ్మట నీక్షేమము కొఱకైన మార్గమును విన లక్ష్యపెట్టవని 'మార్గం తావచ్ఛృణు సందేశం మే తదను శ్రోష్యసి' మార్గమునే ముందు చెప్పుచున్నాననియు, అట్లు చేయుటచే నాకార్యము కన్న నాప్రియసఖుఁడవైన నీక్షేమమే నాకు ముఖ్యమనియు, భావము.

'గ్రంథము ఉత్తరోత్తరము రసవంతముగా నుండుటకై కవి మార్గమునే ముందు వర్ణించి సందేశమును వెనుకచెప్పినాఁడు. మేఘసందేశమను నీగ్రంథము [illegible]తకల్ప

ముగా నుండునని కవి స్వాభిప్రాయమును ఇచట 'శ్రోత్రపేయం సందేశమ్' అని సూచ ముగా తెలిపినాడు.

అద్రేః శృఙ్గం హరతి పవనః కింస్వి దిత్యున్ముఖీభి
ర్దృష్టోత్సాహ శ్చకితచకితం ముగ్ధసిద్ధాఙ్గనాభిః,
స్థానా దస్మా త్సరసనిచులా దుత్ప తోదఙ్ముఖః ఖం
దిఙ్నాగానాం పథి పరిహర న్స్థూలహస్తావలేపాన్. 14.

అద్రేరితి:—పవనః = వాయుః, అద్రేః = చిత్రకూటస్య, శృఙ్గం హరతి కింస్విత్ * కింస్విచ్ఛబ్దో వితర్కార్థే చాదిషు పఠితః, ఇతి శఙ్కయా, ఉన్ముఖీభిః = ఉన్నతముఖీభిః * 'స్వాఙ్గా చ్చోపసర్జనా దసంయోగోపధాత్' ఇతి ఙీష్, ముగ్ధాభిః = మూఢాభిః + 'ముగ్ధః సుందరమూఢయోః' ఇత్యమరః-సిద్ధానాం = దేవయోనివిశేషాణామ్ - అఙ్గనాభిః, చకితచకితం = చకితప్రకారం యథాతథా * 'ప్రకారే గుణవచనస్య' ఇతి ద్విర్భావః, దృష్టోత్సాహః సన్, సరసాః = ఆర్ద్రాః నిచులాః = స్థలవేతసాః - యస్మిం స్తస్మాత్ + 'వానీరే కవిభేదే స్యా న్నిచులః స్థలవేతసే' ఇతి శబ్దార్ణవే, అస్మా త్స్థానాత్ = ఆశ్రమాత్, పథి = నభోమార్గే, దిఙ్నాగానాం = దిగ్గజానాం, స్థూలా శ్చ-హస్తాః = కరాః - తేషామ్ - అవలేపాన్ = ఆశ్లేషాన్, పరిహరన్ + 'హస్తో నక్షత్రభేదే స్యా త్కరేభకరయో రపి' ఇతి విశ్వః, ఉదఙ్ముఖః సన్ అలకాయా ఉదీచ్యత్వాదిత్యాశయః, ఖమ్ = ఆకాశమ్, ఉత్పత = ఉద్గచ్ఛ * అత్రేద మప్యర్థా న్తరం ధ్వనయతి :—రసికో నిచులో నామ మహాకవిః కాళిదాసస్య సహాధ్యాయః పరాపాదితానాం కాళిదాసప్రబన్ధదూషణానాం పరిహర్తా యస్మి న్స్థానే తస్మా త్స్థానా దుదఙ్ముఖో నిర్దోషత్వా దున్నతముఖః సన్ పథి సారస్వతమార్గే దిఙ్నాగానామ్ * పూజాయాం బహువచనం - దిఙ్నాగాచార్యస్య కాళిదాసప్రతిపక్షస్య, హస్తావలేపాన్ = హస్తవిన్యాసపూర్వకాణి దూషణాని పరిహరన్ + 'అవలేప స్తు గర్వే స్యా ల్లేపనే దూషణేఽపి చ' ఇతి విశ్వః, అద్రేః = అద్రికల్పస్య దిఙ్నాగాచార్యస్య; శృఙ్గం = ప్రాధాన్యం + 'శృఙ్గం ప్రాధాన్యసాన్వో శ్చ' ఇత్యమరః, హరతీతి హేతునా, సిద్ధైః - సారస్వతసిద్ధైః = మహాకవిభిః - అఙ్గనాభిః = స్త్రీభిశ్చ, దృష్టోత్సాహః సన్, ఖమ్ ఉత్పత = ఉచ్చై ర్భవ - ఇతి స్వప్రబన్ధ మాత్మానం వా ప్రతి కవే రుక్తి రితి.

'సంసర్గతో దోషగుణా భవ న్తీ త్యేత న్మృషా యేన జలాశ్రయోఽపి,
త్వేతం నుకూలం నిచుల శ్చల న్త మాత్మాన మారక్షతి సిన్ధువేగాత్,'

ఇత్యేతచ్ఛ్లోకనిర్మాణా త్తస్య కవే ర్నిచులసంజ్ఞే త్యాహుః.
పవనః = వాయువు, అద్రేః = (చిత్రకూట) పర్వతముయొక్క, శృఙ్గమ్ = శిఖరమును, హరతి కింస్విత్ = (పెల్లగించి) కొనిపోవుచున్నాఁడాయేమి, ఇతి=అని, (కొనిపోవుచున్నాఁడేమో అను భయముచేత), ఉన్ముఖీభిః = మొగము ఎత్తికొన్న, ము...భిః - ముగ్ధ = మూఢలయిన - సిద్ధాఙ్గనాభిః =సిద్ధస్త్రీలచేత, చకితచకితమ్= భయపడినయట్లుగా, దృ...హః—దృష్ట=చూడఁబడిన - ఉత్సాహః=సంరంభ ముకలవాఁడవై, సర...ళాత్—సరస = తడిగల - నిచుళాత్ = నేలప్రబ్బలి చెట్లు గల, అస్మాత్ స్థానాత్ = ఈచోటినుండి, పథి = ఆకాశమార్గములో, దిఙ్నాగా నామ్ = దిగ్గజములయొక్క, స్థూ...హాన్—స్థూల = లావైన - హస్త = తుండ ములయొక్క - అవలేపాన్ = విసరివేయుటలను, పరిహరన్ = తప్పించుకొనుచు, ఉదఙ్ముఖః=(అలకాపట్టణము ఉత్తరదిక్కున నుండుటచేత) ఉత్తరాభిముఖుఁడవై, ఖమ్ = ఆకాశమునకు, ఉత్పత = ఎగురుము.

తా.—నీవు ఆకస్మికముగా ప్రయాణోత్సాహముతో కొండమీఁదినుండి ఆకా శములోనికి జరుగునప్పుడు నిన్ను కటకములలో విహరించుచుండు సిద్ధాంగనలు కని- ఆకొండ శిఖరమును వాయువు పెల్లగించుకొనిపోవుచున్నది కాఁబోలు - అది తమ నెత్తిమీఁద పడును కాఁబోలు - అని (అట్టిశృంగమ వని తలఁచి) నిన్ను బెదరి బెదరి చూతురు. నీవు సరసములయిన నేలప్రబ్బలిచెట్లున్న యీచోటినుండి ఆకాశ మున కెగసి దారిలో దిగ్గజములతొండవువిసరులను తప్పించికొనుచు ఉత్తర దిక్కును గూర్చి పొమ్ము.

ఇచట అర్థాంతరము ధ్వనించుచున్నది.–సర...ళాత్–సరస=రసికుఁడయిన- నిచుళాత్ = నిచుళుఁడనుకవియున్న (నిచుళుఁడను కవి కాళిదాస సహాధ్యాయి, ఆతఁడు కాళిదాస ప్రబంధములపై ఇతరులు చెప్పిన దూషణములకు సమాధాన ముఖుచెప్పి పరిహరించినవాఁడు), అస్మాత్ స్థానాత్ = ఈచోటినుండి, ఉదఙ్ముఖః సన్=దోషములేమిచేత తలయెత్తుకొన్నవాఁడవై, పథి=దారిలో, దిఙ్నాగానామ్= కాళిదాసుని ప్రతిపక్షియయిన దిఙ్నాగాచార్యునియొక్క, హస్తావలేపాన్ = హస్త విన్యాసపూర్వకములయిన దూషణములను (అనఁగా దిఙ్నాగాచార్యుఁడు చేయు దూషణములను), పరిహరన్ = తప్పించుచు, అద్రేః=పర్వతమువంటివాఁడైన దిఙ్నా గాచార్యునియొక్క, శృఙ్గమ్ = ప్రాధాన్యమును, హరతి ఇతి = హరించుచున్నది (లేక హరించుచున్నాఁడు) అను హేతువుచేత, ముగ్ధ...భిః—(ముగ్ధ=అందముగలవా రైన) - సిద్ధ = సారస్వత సిద్ధులచేత (అనఁగా మహాకవులచేతను)- అఙ్గనాభిః= స్త్రీల

చేతను, దృష్టోత్సాహస్సన్ = చూడఁబడినసంరంభము కలదానవగుచు (కలవాఁడ వగుచు), ఖమ్ ఉత్పత=ఉన్నతమవు (లేక ఉన్నతుఁడవు) గమ్ము, అని తనప్రబంధమునుగూర్చి గాని (తన్నుఁగూర్చి గాని) కవి చెప్పుట.

తా.—ఓ నాగ్రంథమా మేఘసందేశాఖ్యమా రసజ్ఞుఁడయిన నిచుళకవియున్న యీయాశ్రమమునుండి బయలువెడలి సకలదేశములందును వ్యాపింపుము. దారిలో దిఙ్నాగాచార్యుఁడు చేయునట్టి దురాక్షేపములను సరకుసేయకుము, వానికెల్ల నామిత్రము నిచుళకవి సమాధానముచెప్పనులే. ఆసమాధానములముందు ఆదురాక్షేపములు నిలువలేవు. అందుచేత నీవలన శైలమువంటి యాదిఙ్నాగాచార్యునికి శృంగభంగము (అనఁగా అవమానము) కలుగును. అట్లు ఆతనికి నీవు శృంగభంగము కలుగఁజేయుహేతువుచేతను నీయందలిస్వారస్యమునుబట్టియు నిన్ను మహాకవులును విద్వజ్జనులును ఆదరింతురు. అట్లు ఆదృతమవై నిర్దోషమవగుటచేత నీవు పూర్ణోత్సాహముగా గొప్పతావులకెల్ల వ్యాపించి కీర్తిపొందుము.

వ.—సిద్ధాంగనలు స్తనజఘనాది భారమువలన నిరవలంబమయిన యాకాశయానముచేత ఆయాసముంబొంది సేదదేఱుటకును వినోదార్థమును నీక్రింద రమణీయములైన చల్లని చిత్రకూట కటకములయందు విహారపరాయణతనున్నవారై ఆకస్మికముగా నీవు కొండ నెడఁబాసి జరగఁగా నిన్నుఁ జూతురు. అపుడు, వారు క్రిందను, నీవుమీఁదను, ఉండుటచే నిన్ను 'ఉన్ముఖీభిః' తలలెత్తికదా చూతురు. స్త్రీశాపాది మహాపురుష విహారభూములయిన యాకటకములు మనుష్యమాత్రుల కగమ్యములు—'సిద్ధ' సిద్ధాదులకు గమ్యములు. కొండశిఖరము కదలదు – గాలియో 'మన్దం మన్దంనుదతి' మెల్లగా వీచుచున్నది; ఇట్లుండఁగా గాలి కొండశిఖరమును పెల్లగించి కొట్టుకొనిపోవుచున్నదని తెలివిగలవారు తలంపరు–'ముగ్ధ' బేలలైనం దలంతురు. అట్టి బేలతనము 'అజ్ఞనాభిః' స్త్రీలసొమ్ము కాన అంగనలం జెప్పుట; ఆసమయమున అట్టి ముగుదలు నీవు తలపై పడుదువని 'చకితచకితమ్' నిన్ను బెదరుచు బెదరుచుం జూతురు. అట్టి విహారభూములయందు అంగనలుమాత్రమే యుండురా పురుషులుండరా వారుమాత్రము మేఘుని చూడరా వారిని చెప్పమి యేమి యనిన–అబ్దే... నాభిః అంగనలవలె వారు బేలలు కారు – మఱియు ఆయంగనలును వారి బిత్తరిచూపులనురగా మేఘునికి కనులపండువు – కనుక వారివర్ణన మే చేయఁదగినది; పురుషుచేష్టా సామాన్యము ముగ్ధాంగనల హావభావములయందలి ఎవనిచిత్తము నాకర్షింపదు? పయనము తరలఁగానే నీకు అట్టి యభ్యుదయము కలుగును–ఓ మేఘుఁడా అట్టి నేత్రోత్సవము ననుభవించుము; అదియే దివ్యాశకునముగా బయలువెడలుము, అంగనలయొక్క వారిచే చోద్యముగాఁ జూడఁబడు సౌభాగ్యము నీకుఁ గలుగుదుగదా

కావున దానికొఱకేనియు తప్పక నీవు తరలవలయును. ఇక్కడ నీకు 'సరస' రసి కులసహవాసము ఉండినది, అది యెంతప్రియమైనను నాప్రియకును నాకును జీవిత దానముచేయుటకై ఆసహవాసమును నీవు వదలుకోవలసినది; మఱియు మిత్రము లైన యీనిచుళములు 'సరస'ములు గావున ప్రాణదానార్థము పోవు నిన్ను ఆటంక పెట్టవు. ప్రాణదాతవగు నీనేమము నాకు ముఖ్యము గావున నొకటి చెప్పెదను; ఏమనిన—'దిఙ్నా...లేపాన్' - దారిలో ఆకాశమున దిగ్గజములు సంచరించు చుండును. నీకు పైఁజెప్పిన సత్సహవాసము పోయినవెంటనే ఆమోటుల లావుపాటి తుండముల విసరులు తగిలినందగులును; మేలు పోఁగానే కీడు గలిగిన మఱియు కష్ట ముగా నుండును; కనుక నామాట జ్ఞప్తియుంచుకొని వానిని తప్పించుకొనఁ చుం బొమ్ము.

రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్ష్య మేత త్పురస్తా
ద్వల్మీకాగ్రా త్ప్రభవతి ధనుఃఖణ్డ మాఖణ్డలస్య
యేన శ్యామం వపు రతితరాం కాన్తి మాపత్స్యతే తే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః. 15.

రత్నేతి :—రత్నచ్ఛాయానాం = పద్మరాగాది మణిప్రభాణాం-వ్యతికరః = మిశ్రణ-మివ, ప్రేక్ష్యం=దర్శనీయమ్, ఆఖణ్డలస్య=ఇన్ద్రస్య, ఏత ద్ధనుః ఖణ్డమ్ - ఏతదితి హస్తేన నిర్దేశో వివక్షితః, పురస్తాత్ = అగ్రే, వల్మీకాగ్రాత్ = వామలూరువివరాత్ + 'వామలూరు శ్చ నాకు శ్చ వల్మీకం పుంన పుంసకమ్' ఇత్యమరః, ప్రభవతి=ఆవిర్భవతి, యేన - ధనుఃఖణ్డేన, తే=తవ, శ్యామం వపుః; స్ఫురితరుచినా = ఉజ్జ్వలకాన్తినా, బర్హేణ=పిఞ్ఛేన + 'పిఞ్ఛబర్హే నపుంసకే' ఇత్యమరః, గోపవేషస్య విష్ణోః = గోపాలస్య కృష్ణస్య, శ్యామం వపు - రివ, అతితరాం, కాన్తిం=శోభామ్, ఆపత్స్యతే=ప్రాప్స్యతి.

రత్న...ఇవ—రత్న = (పద్మరాగాది) మణులయొక్క - ఛాయా = కాంతులయొక్క - వ్యతికరఇవ = మిశ్రమాయనునట్లుగా, ప్రేక్ష్యమ్ = దర్శనీయమైన, ఆఖణ్డలస్య = ఇంద్రునియొక్క ఏతత్ = ఎదుట అగపడుచున్నయీ, ధనుఃఖణ్డమ్=వింటితునుక (అనఁగా అసమగ్రమైన యింద్రధనుస్సు), వల్మీకాగ్రాత్— వల్మీక = పుట్టయొక్క - అగ్రాత్ = కొననుండి, ప్రభవతి = పుట్టుచున్నది, యేన = ఏధనుఃఖండముచేత (ఆధనుఃఖండముచేత), నీయొక్క, శ్యామమ్=నల్లనైన, వపుః=శరీరము, స్ఫు...నా-స్ఫురిత=ఉజ్జ్వలమైన-రుచినా=కాంతిగల్ల, బర్హేణ =

నెమలిపురిచేత, గోపవేషస్య = గొల్లవేషముగల, విష్ణోః = విష్ణుమూర్తియొక్క (అనఁగా గోపాలకృష్ణునియొక్క), శ్యామం వపుః ఇవ=నల్లని శరీరమువలె, అతితరామ్ = ఎక్కువయిన, కాన్తిమ్ = శోభను, ఆపత్స్యతే = పొందఁగలదో (పొందఁగలదు).

తా.—ఇదిగో నీయెదుట ఇంద్రధనుఃఖండము పుట్టనుండి వెడలినదై పద్మరాగాదిమణిప్రభల కూడికవలె దర్శనీయముగా ప్రకాశించుచున్నది- అది నిన్ను అంటియుండునప్పుడు, శ్యామలదేహుఁడవు నీవు, శ్యామలదేహుఁడై తలను నెమలిపురితాల్చిన శ్రీకృష్ణునింబోలి విశేషముగా శోభింతువు.

వ.—'రత్నచ్ఛాయా'-ముల్లోకములేలు మహాభోగియైన యాఖండలునిదిగాన ఆయుధమైనను అలంకృతమై దర్శనీయముగా నుండును, నీకును రత్నాలంకారము వోలె ధారణీయమగును. 'పురస్తాత్' - మేఘుఁడు పోవుమార్గమున-అనఁగా ఉత్తరమున - ఎదుటనున్నది; అచటఁగాక మఱియేదిక్కునననున్నను అతనిదేహమునకు తగులదు - చెప్పఁబోవు సామ్యము చెల్లదు. 'ఖణ్డమ్' - పూర్ణమేని అర్ధవలయాకారముగానుండును - అంతట బర్హసామ్యము లభింపదు; బర్హము పాదవలయముగా నుండును. 'ఆఖణ్డలస్య'—పరోపకారార్థము నీవు బయలువెడలఁగానే నిన్ను రత్నాలంకారము వేసి సత్కరింప ఇంద్రుఁడు వేచియున్నాఁడు; ఈసుకృతముకైపోయి ఆగౌరవమును పొందుము. 'విష్ణోః'-నీకు ఈధనుఃఖండముచే గోపాలకృష్ణసామ్యము కలుగును. అనఁగా లోకములనెల్ల విష్ణువు కాపాడునట్లు, నీవు, పయనము కదలుదువేని, వర్షించి లోకమును, సందేశమందించి నన్నును, కాపాడుదువు. మఱియు ఈ యుద్యమమ్మాత్రముననే నీకు శ్రీహరి సారూప్యము కలిగిన - కార్యనిర్వాహమునకు ఎంతఫలము కలుగునో నీవే ఊహించుకొమ్ము.—బర్హమునకు నడుమ ఈనెయు రెండువైపులను రెండువరుసల సన్న యీఁకలును ఉండును. అట్టిబర్హము అనులోమముగా (అనఁగా ఒకదానిలో నొకటిగా) నుండు రెండు ఇంద్రధనువులవలె నుండును; కనుక బర్హసామ్యము చెప్పుటచే ఈయింద్రధనుస్సు జంటదియని యేర్పడుచున్నది. జంటయింద్రధనుస్సు ప్రశస్తమనియు సువృష్టిప్రదమనియు చెప్పఁబడియున్నది; (ఉదాహరిష్యమాణబృహత్సంహితాకారికలను జూచునది). తార్కికులు ఒకరు పుట్టనుండి ఇంద్రధనుస్సు లేచుట యసంభవమనియు, వల్మీకమనఁగా 'వల్మీకః సాతపో మేఘః' అని యెండతోడి మేఘమనియు, అట్టి మేఘమునుండి లేచినదని యిచ్చట వివరింపవలసినదనియు, మల్లినాథసూరివ్యాఖ్య సరిగాదనియు, వ్రాసియున్నారు; కాని, మల్లినాథసూరి పొరఁబడలేదు. ఇచట సాతపమేఘమే వల్మీకమైనచో అగ్రము చెప్పుట వ్యర్థమగును. పుట్టయేని కూచిగా నుండును గాన దానికి అగ్ర

మనినఁ జెల్లును. ఈవిషయములకు బృహత్సంహితలో వరాహమిహిరాచార్యులు.:—

సూర్యస్య వివిధవర్ణాః పవనేన విఘట్టితాః కరాః సాభ్రే
వియతి ధను స్సంస్థానా యే దృశ్యన్తే తదిన్ద్రధనుః.
కేచి దనంతకులోరగనిశ్వాసోద్భూత మాహు రాచార్యాః
తద్యాయినాం నృపాణా మభిముఖ మజయావహం భవతి.
అచ్ఛిన్న మవనిగాఢం ద్యుతిమత్ స్నిగ్ధం ఘనం వివిధవర్ణం
ద్విరుదిత మనులోమంచ ప్రశస్త మమ్భః ప్రయచ్ఛతి చ.
జలమధ్యేఽనావృష్టిః భువి సస్యవధ స్తరౌ స్థితే వ్యాధిః
వల్మీకే శస్త్రభయం నిశి సచివవధాయ ధను రైన్ద్రమ్.

జలమందు భూమియందు చెట్టునందు వల్మీకమందు అను సాహచర్యముచే వల్మీకమనఁగా పుట్టయనియే గ్రహించుట యుచితముగా నున్నది. ఇందులకు ఆంధ్రమహాకవులసమ్మతి;—

ఆ. పుట్ట వెడలి నభోభిత్తిఁ బట్టుశక్ర
కార్ముకపుఁ బెద్ద పలువన్నె కట్లజెట్టి
దైననడచెడుకాళ్లగుం పనఁగ గాలిఁ
గార్కొని దిగంతముల వానకాళ్లు నడచె. ఆముక్తమాల్యద.

'నిశి' యన్నందున రాత్రియందును నింద్రధనువు కలుగునని చెప్పియుండుటచే సాతపటీక సరికాదు. ఎండ రాత్రియం దుండదుగదా. ఇంద్రధనుస్సున్నదిక్కునకు పోవుటచే అపజయమును, అది పుట్టలో పుట్టుటచే శస్త్రభయమును, రాజులకుఁ జెప్పఁబడినవిగాని యితరులకుఁగాదు గావున, అందువలన మేఘునికి ఏమియు చెఱువు లేదనియు, ఈబొమ్మకొరడునందు 'అచ్ఛిన్న' మిత్యాది తృతీయకారికాప్రోక్తలక్షణములే విస్తరించి చెప్పఁబడినవి గాన ఇది ప్రశస్తమనియు, నెఱుంగునది.

త్వ య్యాయత్తం కృషిఫల మితి భ్రూవికారానభిజ్ఞైః
ప్రీతిస్నిగ్ధై ర్జనపదవధూలోచనైః పీయమానః,
సద్యః సీరోత్కషణసురభి క్షేత్ర మారుహ్య మాలం
కించి త్పశ్చా ద్వ్రజ లఘుగతి ర్భూయ ఏవోత్తరేణ. 16.

త్వయీతి :—కృషేః = హలకర్మణః - ఫలం = సస్యం, త్వయి * అధికరణవివక్షాయాం సప్తమీ, ఆయత్తమ్=అధీనమ్ + 'అధీనో నిఘ్న ఆయత్తో...'

మరః, ఇతి = హేతోః, ప్రీత్యా స్నిగ్ధైః = అకృత్రిమప్రేమార్ద్రైరిత్యర్థః, భ్రూవికారాణాం=భ్రూవిలాసానామ్-అనభిజ్ఞైః - పామరత్వాదితి శేషః, జనపదవధూనాం= పల్లీయోషితాం - లోచనైః పీయమానః = సాదరం వీక్ష్యమాణః సన్, మాలం = మాలాఖ్యం క్షేత్రం - శైలప్రాయ మున్నతస్థలం + 'మాల మున్నతభూతలమ్' ఇత్యుత్పలమాలాయాం, సద్యః = తత్కాలమేవ, సీరైః = హలైః - ఉత్కషణేన= కర్షణేన - సురభి = ఘ్రాణతర్పణం యథా తథా, ఆరుహ్య - తత్రాభివృష్యేత్యర్థః + 'సురభి ఘ్రాణతర్పణ' ఇత్యమరః, కించి త్పశ్చాద్, వ్రజ = గచ్ఛ, లఘుగతిః = తత్ర నిర్వృష్టత్వాత్ క్షిప్రగమనః సన్ + 'లఘు క్షిప్ర మరం ద్రుతమ్' ఇత్యమరః, భూయః = పునరపి, ఉత్తరేణైవ = ఉత్తరమార్గేణైవ, వ్రజ * 'తృతీయావిధానే ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్' ఇతితృతీయా. యథా కశ్చిద్బహువల్లభః పతిః క్వచిత్క్షేత్రే గాఢం విహృత్య (క్షేత్రం శరీరే కేదారే సిద్ధస్థాన కళత్రయోః' ఇతివిశ్వః) దాక్షిణ్యభఙ్గభయా న్నీచమార్గేణ నిర్గత్య పునః సర్వాధ్యక్ష ఇవ సంచరతి తద్వదితి ధ్వనిః.

కృషిఫలమ్—కృషి=సేద్యముయొక్క - ఫలమ్=ఫలమైనసస్యము, త్వయి = నీయందు (నీకు), ఆయత్తమ్ ఇతి = అధీనము అను హేతువుచేత, ప్రీ...గ్ధైః-ప్రీతి= (అకృత్రిమ) ప్రేమచేత - స్నిగ్ధైః = ఆర్ద్రములును (తడివియు), భ్రూవి...జ్ఞైః - భ్రూ = బొమలయొక్క - వికార = విలాసములను - అనభిజ్ఞైః = ఎఱుఁగనివియు (పామరత్వముచేత నని భావము), అయిన, జన... నైః - జనపద=పల్లెల - వధూ = స్త్రీల - లోచనైః = నేత్రములచేత, పీయమానః (సన్) = అతితృష్ణచే త్రాగఁబడువాఁడవు (అనఁగా చూడఁబడువాఁడవు) అగుచు, మాలం క్షేత్రమ్=మాల మను పేరిటి పొలమును (మాలమనఁగా ఉన్నతభూతలము), సద్యః=తత్కాలమందే, సీరో...భి - సీర = నాఁగళ్లచేత - ఉత్కషణ = దున్నుటచేత - సురభి (యథాతథా) = పరిమళముగలది (అగునట్లుగా), ఆరుహ్య=ఎక్కి (అనఁగా అచట వర్షించి), కిఞ్చిత్ పశ్చాత్ = కొంచెము వెనుకకు (పడమరగా), వ్రజ = పొమ్ము, లఘుగతిః=(అచట వర్షించినందున) త్వరగా పోవువాఁడవై, భూయః=మరల, ఉత్తరేణైవ = ఉత్తరమార్గముననే, వ్రజ = పొమ్ము. ఎవఁడేని బహువల్లభుఁడు ఒక (క్షేత్ర)కళత్రముతో గాఢముగా విహరించి తన దాక్షిణ్యము చెడుననుభయముచేత నీచమార్గమున వెలువడి మరల సర్వాధ్యక్షుఁడుగా సంచరించునుగదా, వానివలె అనిధ్వని.

తా.—నీవు వర్షింపక సేద్యము ఫలింపదు గావున నీ వగపడఁగానే పల్లీవధూటికలు నిన్ను ప్రేమరసస్నిగ్ధలోచనలై అతితృష్ణతోఁ గాంతురు. వారిప్రేమ తాకు

యెక్కుడయినను ఎట్టిదెఱుంగని పామర స్త్రీలగుటచే భ్రూవిలాసముల నగపడదు గాని నేత్రములయందు నిండియుండును. వారికి నేత్రోత్సవముచేసి, అటనుండి మాలమను పేరి యున్నతభూతల మెక్కినవాఁడవై వెంటనే అది దుక్కిఁబొంది పరిమళించునట్లుగా వర్షింపుము. బహువల్లభుఁడు ఒకతెతో గూఢముగా విహరించి ఇతరవల్లభలతోడి తనదాక్షిణ్యము చెడకుండ సందుదారిని దూఁటి వెలువడి మరల సర్వాధ్యక్షుఁడుగా చరించునట్లు నీవును ఆమాలక్షేత్రమున వర్షించి దానికి వెనుకఁగా (పడమరగా) తారి మరల ఉత్తరముగానే పొమ్ము.

వ.—పల్లెస్త్రీలు నీరాకచే, వాన గలుగుననియు, అందువలన 'కృషి' - తమ పురుషులపాటు ఫలించుననియు, సుభిక్షముకలుగుననియు, సంతసింతురు. 'అనభిజ్ఞైః'- ఈపల్లెవధువులు భ్రూవిలాసము లెట్టివో ఎఱుఁగనే యెఱుఁగరు ; మఱివారిప్రీతి యెట్లు తెలియుననఁగా-'ప్రీతిస్నిగ్ధైర్లోచనైః' - చూపులవలననే తెలియును. 'వధూభిః' - అనక 'వధూలోచనైః' అనుట - అనఁగా వధూగత కర్తృత్వమును లోచనములకు ఆరోపించుట తృష్ణాతిశయమును తెలుపును ; దర్శనమాత్ర వ్యాపారలై అన్యమేమియు నెఱుఁగక యుందురని యభిప్రాయము. 'పీయమానః' - (అని మేఘునికి విధేయవిశేషణము) నీదర్శనము అమృతమువలె ఆహ్లాదకరముగానుండును. నీవు భ్రూవిలాసము లెఱిఁగిన సిద్ధాంగనల చూపులను ఇచట ననుభవించి భ్రూవిలాసము లెఱుఁగని ప్రేమసాంద్రములైన జనపదాంగనల చూపులను అచట స్వారస్యవిశేషముగా అనుభవింపుమనుట. వధూగ్రహణము మునుపటివలెనే మేఘునిఁగూర్చి ప్రియకథనపరము. మఱియు పురుషులను సంతసపెట్టుటకన్న అబలలను సంతసపెట్టుట విశేషమనియు వారికి ప్రీతిచేసి సుకృతము పొందుమనియు ధ్వని. ఈరీతిని నా చెప్పెడు మార్గము పొడుగునను నీవు సుఖము లనుభవింపుదువు. 'సీరోత్కషణసురభి'— 'సురతమృదితా బాలవనితా తనిమ్నా శోభన్తే'అనియు 'పరిమళజామవాప్య లక్ష్మీమ్' అనియు కవులు చెప్పినట్లు మదనక్రీడాజనితశోభ కలుగునట్లుగా నని ధ్వని. ఈమాలము మేఘునికి మొదటి మజిలీగాదు. పైశ్లోకమున ఆమ్రకూటము మొదటి మజిలీగా చెప్పఁబడును.

త్వా మాసారప్రశమితవనోపప్లవం సాధు మూర్ధ్నా
వక్ష్య త్యధ్వశ్రమపరిగతం సానుమా నామ్రకూటః;
న క్షుద్రోఽపి ప్రథమ సుకృతాపేక్షయా సంశ్రయాయ
ప్రాప్తే మిత్రే భవతి విముఖః కింపున ర్యస్తథోచ్చైః. 17.

త్వామితి:—ఆమ్రాః = చూతాః - కూటేషు = శిఖరేషు - యస్యస-ఆమ్రకూటో నామ, సానుమాన్ = పర్వతః + 'ఆమ్ర శ్చూతో రసాలో౽సౌ' ఇతి-'కూటో౽స్త్రీ) శిఖరం శృఙ్గమ్' ఇతిచామరః; ఆసారః = ధారావృష్టిః + 'ధారాసంపాత ఆసారః' ఇత్యమరః - తేన - ప్రశమితో వనోపప్లవో (దావాగ్ని) ర్యేన తం - కృతోపకార మిత్యర్థః, అధ్వశ్రమేణ-పరిగతం = వ్యాప్తం, త్వాం, సాధు = సమ్యక్, మూర్ధ్నా, వక్ష్యతి = వోఢా * వహేర్లృట్; క్షుద్రః = కృపణో౽పి + 'క్షుద్రో దరిద్రే కృపణే నృశంసే' ఇతియాదవః; సంశ్రయాయ = సంశ్రయణాయ, మిత్రే = సుహృది + 'అథ మిత్రం సఖా సుహృత్' ఇత్యమరః, ప్రాప్తే = ఆగతేసతి, ప్రథమసుకృతాపేక్షయా = పూర్వోపకారపర్యాలోచనయా, విముఖో న భవతి, యః, తథా = తేనప్రకారేణ - ఉచ్చైః = ఉన్నతః-స ఆమ్రకూటః, కిం పునః = విముఖో న భవ తీతి కిము వక్తవ్య మిత్యర్థః. ఏతేనప్రథమావసథే సౌఖ్యలాభా త్తే కార్యసిద్ధి రస్తీతి సూచితం; తదుక్తం నిమిత్త నిదానే.

† 'ప్రథమావసథే యస్య సౌఖ్యం త స్యాఖిలే౽ధ్వని,
శివం భవతి యాత్రాయా మన్యథా త్వశుభం ధ్రువమ్' ఇతి.

ఆమ్రకూటః = ఆమ్రకూటమను పేరుగల (ఆమ్ర = మామిడిచెట్లు - కూటః = శిఖరములయందుఁగలిగిన), సానుమాన్ = పర్వతుఁడు, ఆసా...ప్లవమ్—ఆసార = ధారావర్షముచేత - ప్రశమిత = చల్లార్పఁబడిన - వన = అడవులయొక్క - ఉపప్లవమ్ = దావాగ్నియనెడి యుపద్రవముగలవాఁడవును (ఉపకారముచేసినవాఁడవును), అధ్వ...గతమ్-అధ్వ = మార్గము నడచుటచేతనయిన - శ్రమ = ఆయాసముతో - పరిగతమ్ = నిండినవాఁడవును, అయిన, త్వామ్ = నిన్ను, సాధు = చక్కఁగా, మూర్ధ్నా = శిరస్సుచేత, వక్ష్యతి = వహింపఁగలఁడు; (అట్లేగదా), క్షుద్రో౽పి = లోభియైనను, సంశ్రయాయ = బసకొఱకు, మిత్రే = చెలికాఁడు, ప్రాప్తే సతి = వచ్చినవాఁడు ఆగుచుండఁగా (వచ్చినప్పుడు), ప్రథ...క్షయా - ప్రథమ = పూర్వముదియైన - సుకృత = ఉపకారముయొక్క - అపేక్షయా = పర్యాలోచనచేత, విముఖః = పెడమొగముగలవాఁడు, న భవతి = కాఁడు, యః = ఎవఁడు, తథా = ఆప్రకారము (ఆమ్రకూటునివలె), ఉచ్చైః = గొప్పవాఁడో (సః = అతఁడు), కిం పునః = విముఖుఁడు కాఁడని చెప్పవలయునా.

తా.—ఇంటినుండి పోవునీకు ఆమ్రకూటపర్వతుఁడు మొదటి మజిలీ అగును. పూర్వము నీవు అతని వనములను నాశము చేయుచున్న దావాగ్నిని నీధారావృష్టిచేత చల్లార్చి యాపర్వతమునకు గొప్ప యుపకారము చేసియున్నావు గావున ఆ

కృతజ్ఞతచేత నతఁడిప్పుడు మార్గాయాసపరిశ్రాంతుని నిన్ను చక్కఁగా నెత్తిమీఁద పెట్టుకొని సత్కరించును. లోభివాఁడుసయితము తనయింటికి బసకొఱకు ఉపకారి వచ్చినప్పుడు పెడమొగము పెట్టఁడు, ఆమ్రకూటునివంటి గొప్పవాఁడు పెడమొగము పెట్టునా? మొదటి మజిలీలో సౌఖ్యము కలిగిన కార్యలాభ మగు నని శాస్త్రము.

వ.—'ఆమ్రకూటః' అనుపేరువలన ఆకొండయందు మామిడిఫలములు విశేషముగా నున్నవని తెలియవచ్చుచున్నది; అందువలన 'వనోపప్లవమ్' అనఁగా మామిడివనములకే ఉపప్లవమని తెలియుచున్నది; మామిడివనములు మిగుల నుత్తమధనము గావున అవి దావాగ్నిచే ఎంతకొంచెము కాలిపోయినను ఆమ్రకూటునికి నష్టిమాత్రము విస్తారముగా నేయుండును, సామాన్యవృష్టిచేత దావాగ్నిని చల్లార్చుటకు చాలసేపు పట్టును, ఈలోపల దావాగ్నియు కొంతవనమును కాల్పనేకాల్చును, కొంతనష్టి తప్పక సంభవించును, కావున ఎంతమాత్రమును నష్టి గలుగకుండుటకై మేఘుఁడు 'ఆసార' ధారావృష్టులచేత పూర్ణప్రయత్నముతో క్షణములో దావాగ్నిని అది మామిడిచెట్లమీఁదికి మరలకముందే ఆర్పివేసి ఆమ్రకూటునికి పూర్ణోపకారియు మహోపకారియు ఆయెను. ఇట్టియుపకారమును ఆయామ్రకూటుఁడు గ్రహింపఁ గలవాఁడాయెనని-'సానుమాన్'-'గొప్పసానువులు గలవాఁడు' అనఁగా గొప్పవాఁడనుట - గొప్పవారు స్వల్పోపకారమును కూడ గొప్పగా నెంచి కృతజ్ఞతాబద్ధు లగుదురు, మహోపకారము విషయము చెప్పవలయునా? కనుక మార్గశ్రాంతుని పూర్వోపకారిని నిన్ను ఆమ్రకూటుఁడు 'మూర్ధ్నా వక్ష్యతి' నెత్తిని పెట్టుకొనును అనఁగా ఉత్తమోత్తముముగా సత్కరించుననుట. మేఘుఁడు కొండశిఖరమున నిలుచును గదా - ఆనిలుచుటకే శిరమున వహించు సత్కారముగా వర్ణన. 'క్షుద్రః' - లోభియు, -స్వల్పపరిమాణముకలవాఁడును. 'ఉచ్చైః' కృతజ్ఞతౌదార్యాది గుణములు గల గొప్పవాఁడును - ఎత్తయినవాఁడును.

ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రైః
స్త్వయ్యారూఢే శిఖర మచలః స్నిగ్ధవేణీసవర్ణే
నూనం యాస్య త్యమరమిథునప్రేక్షణీయా మవస్థాం
మధ్యే శ్యామః స్తనఇవ భువః శేషవిస్తారపాణ్డుః. 18.

ఛన్నేతి.—హే మేఘ, పరిణతైః = పరిపక్వైః - ఫలైః-ర్ద్యోతన్త ఇతి తథోక్తైః

† ఆషాఢే వనచూతాః ఫలన్తి పచ్యన్తే చ మేఘవాతే నేత్యాశయః, కాననామ్రైః = వనచూతైః, ఛన్నోపాన్తః=ఆవృతపార్శ్వః, అచలః = ఆమ్రకూటాద్రిః, స్నిగ్ధవేణీసవర్ణే = మసృణ కేశబన్ధ సచ్ఛాయే-శ్యామవర్ణ ఇత్యర్థః; 'వేణీతు కేశబన్ధే [illegible]

ఇతి యాదవః, త్వయి, శిఖరం = శృఙ్గమ్, ఆరూఢేసతి*'యస్యచ భావేన భావలక్ష ణమ్' ఇతిసప్తమీ, మధ్యే శ్యామః, శేషే = మధ్యాదన్యత్ర-విస్తారే = పరితః-పాణ్డుః= హారిణః + 'హారిణః పాణ్డురః పాణ్డుః' ఇత్యమరః, భువః స్తనఇవ, అమరమిథునా నాం = ఖేచరాణా మితిభావః - ప్రేక్షణీయాం=దర్శనీయామ్, అవస్థాంనూనంయా స్యతి, మిథునగ్రహణం కామినామేవ స్తనత్వే నోత్ప్రేక్షా సంభవ తీతి కృతమ్. యథా పరిశ్రాన్తః కశ్చిత్కామీ కామిన్యాః కుచకలశే విశ్రాన్తః స స్వపితి తద్వ ద్భువానపి భువో నాయికాయాః స్తన ఇతి ధ్వనిః.

(హే మేఘ = ఓ మేఘుఁడా), పరి...తిభిః—పరిణత=పండిన-ఫల = పండ్లచేత - ద్యోతిభిః = ప్రకాశించుచుండెడు (ఆషాఢమందు అడవిమామిడులు ఫలించి మేఘ వాయువుచేత పండును అని అభిప్రాయము), కాననామ్రైః = అడవిమామిడి చెట్ల చేత, ఛన్నోపాన్తః - ఛన్న = కప్పఁబడిన - ఉపాన్తః = పార్శ్వములు గలదైన, అచలః = ఆమ్రకూటపర్వతము, స్ని...ణ్ణే - స్నిగ్ధ = మసృణమైన - వేణీ = జడతో - సవర్ణే = సమానమయినవన్నెగలవాఁడవైన (అనఁగానల్లని), త్వయి = నీవు, శిఖ రమ్ = శృంగమును, ఆరూఢేసతి = ఎక్కినవాఁడ వగుచుండఁగా, మధ్యే = నడు మ, శ్యామః = నల్లనిదియు, శే...ణ్డుః—శేష = మధ్యతప్ప కడమదియైన - విస్తార =విరివియందు- పాణ్డుః=తెల్లనిదియు, (నయిన), భువః = భూమియొక్క, స్తనఇవ =కుచమో అని, అమ...యామ్—అమరమిథునానామ్=ఖేచరద్వంద్వములకు-ప్రేక్ష ణీయామ్ = చూడఁదగినదైన, అవస్థామ్=స్థితిని, నూనమ్=నిశ్చయముగా, యాస్య తి=పొందఁగలఁడు.

తా.—నీవు ఎక్కియున్నప్పుడు, నల్లనివాఁడవు నీవు శిఖరమందుండుటచేత ను, పండ్లచే ప్రకాశించు మామిడివనములు దానిప్రక్కలను ఆవరించుకొని యుండుట చేతను, ఆయామ్రకూటపర్వతము, దూరమునుండి చూచు ఖేచరమిథునములకు నల్లని చూచుకము గలిగి కడమయెల్ల తెల్లగానుండు భూదేవీ స్తనముగా ఉత్ప్రేక్షింపఁదగి నదిగా శోభిల్లుచుండును.

వ.—'పరిణత'—పచ్చికాయలు పసరువన్నెగా నుండును, పండినపండ్లయిన పసుపుగాను తెల్లగాను ఉండును, మేఘవాతముచే కాయలు పండును, అట్లుపండుట చే కొండకు కుచవర్ణము కలుగును. 'ద్యోతిభిః'—ఫలములు పెక్కులై ఆకుల నగపడ నీయక తామే అగపడుచున్నవని భావము. 'కానన' అడవిమామిళ్లు ఆకారమందును వన్నెయందును సంఖ్యయందును మిక్కిలి పుష్టములుగానుండును, మేఘవాతమునకు ఉండునవి యడవిమామిళ్లేగాని కడమమామిళ్లు కావు, కావున 'కానన' గ్రహణము. 'ఆరూఢే'— కువన్నెలు అగ్రమందు నలుపు కడమయంతట పాండువర్ణమును పొందఁ

డు ఆకొండ నెక్కినఁ గలుగును, తత్పూర్వము ఉండవు. అగ్రమందు ఇతఁడుండుటచే ఆనలువు ఇతనివలననే గలుగునది, కాయలు ఈ మేఘుని గాలిచేతనే పండుటచే కడమ చోటి పాండిమయు ఇతనివలననే గలుగునది. 'స్నిగ్ధవేణీసవర్ణే'—ఈ విశేషణముచే మేఘునియందు జలసమృద్ధి తెలియఁజేయఁబడుచున్నది; నిర్జలమేఘము తెల్లగానుండును; సజలమేఘముమీఁదిగాలికే మామిడికాయలు పండును గాని నిర్జలమేఘవాతమునకు పండవు. 'మిథున'—మిథునమైనయెడల కాముకత్వముచే కొండను స్తనముగా నుత్ప్రేక్షించునని 'మిథున' గ్రహణము. 'ప్రేక్షణీయామ్'—నీవలన ఆమ్రకూటునికి దేవతలు సయితము ప్రీతితోచూచి సంతసిల్లునట్టి శోభ గలుగును. అట్టి యలంకారభూతుని నిన్ను అతఁడు తప్పక సత్కరించును. నీవు ఆకొండమీఁద నుండుట రతిపరిశ్రాంతుఁడయిన కాముకుఁడు తనకామినికుచకలశమందు విశ్రాంతికై నిద్రించుట ఎట్లుండునో అట్లుండును అనిధ్వని. 'భువః'—కొండ గొప్పదిగావున కొండంత స్తనముగల నాయిక గొప్పయాకారముగలదిగా నుండవలయునని కొండ భూమి స్తనముగా వర్ణింపఁబడినది.

స్థిత్వా తస్మి న్వనచరవధూభు క్తకుఞ్జే ముహూ ర్తం
తోయోత్సర్గద్రుతతరగతి స్తత్పరం వర్త్మ తీర్ణః
రేవాం ద్రక్ష్య స్యుపలవిషమే విన్ధ్యపాదే విశీర్ణాం
భ క్తిచ్ఛేదై రివ విరచితాం భూతి మఙ్గే గజస్య. 19.

స్థిత్వేతి.—హే మేఘ, వనే చరన్తీతి వనచరాః*'తత్పురుషే కృతి బహుళమ్' ఇతి బహుళగ్రహణా దలు క్భవతి - తేషాం వధూభి ర్భుక్తాః - కుఞ్జాః = లతాగృహాః - యత్ర తస్మిన్ + 'నికుఞ్జకుఞ్జౌ వా క్లీబే లతాదిపిహితోదరే' ఇత్యమరః, తత్ర తే సయనవినోదోఽస్తీత్యర్థః, తస్మిన్ = ఆమ్రకూటే, ముహూ ర్తమ్=అల్పకాలం-నతు చిరం-స్వకార్యవిరోధాదితి భావః + 'ముహూ ర్తమల్పకాలే స్యా ద్ఘటికాద్వితయేఽపిచ' ఇతిశబ్దార్ణవే, స్థిత్వా = విశ్రమ్య, తోయోత్సర్గేణ = 'త్వామాసార—' ఇత్యుక్తవర్షణేన-ద్రుతతరగతిః=లాఘవా ద్ధేతో రతిక్షిప్రగమనః సన్, తస్మా చ్చామ్రకూటాత్పర మనన్తరం తత్పరం, వర్త్మ=మార్గం, తీర్ణః=అతిక్రాన్తః, ఉపలైః = పాషాణైః - విషమే, విన్ధ్యస్యాద్రేః - పాదే = ప్రత్యన్తపర్వతే + 'పాదాః ప్రత్యన్తపర్వతాః' ఇత్యమరః, విశీర్ణాం = సమన్తతో విసృమరామ్ - ఏతేన కస్యాశ్చిత్కాముక్యాః ప్రియతమచరణపాతోఽపి ధ్వన్యతే, రేవాం = నర్మదాం 'రేవాతు నర్మదా సోమోద్భవా మేకలకన్యకా' ఇత్యమరః, గజస్య, అఙ్గే=శరీరే, భక్తయో=రచ

నాః-రేఖా ఇతి యావత్ + 'భక్తిర్నిషేవణే భాగే రచనాయామ్' ఇతిశబ్దార్ణవే. తాసాం-ఛేదైః=భఙ్గిభిః, విరచితాం, భూతిం=శృఙ్గారమివ భసితమివ వా + 'భూతిర్మాతఙ్గశృఙ్గారే జాతౌ భస్మని సంపది' ఇతి విశ్వః, ద్రక్ష్యసి; అయమపి మహాం స్తే నయనకౌతుకలాభ ఇతి భావః.

(హే మేఘ = ఓయి మేఘుఁడా), వన...ఞ్జే—వనచర = ఆటవికులయొక్క-(అడవిజనులయొక్క-)-వధూ = భార్యలచేత-భుక్త-భోగింపఁబడిన-కుఞ్జే=పొదరిండ్లు గలదైన- (అచట నీకు చూడఁదగిన వినోదమునైతము కలుగుననిభావము),తస్మిన్= ఆమ్రకూటమందు, ముహూర్తమ్ = అల్పకాలము(సందేశకార్యవిరోధముచేత చాల నేవు ఉండవలదని భావము), స్థిత్వా = విశ్రమించి, తో...తిః—తోయ=జలము యొక్క-ఉత్సర్గ-విడుచుటచేత - ద్రుతతర=అధికవేగమైన-గతిః=గమనముకల వాఁడవై, తత్పరం - తత్=ఆయామ్రకూటమునకంటె-పరం=అవతలిదైన, వర్త్మ= మార్గమును, తీర్ణః=దాఁటినవాఁడవై, ఉపలవిషమే-ఉపల=ఱాలచేత - విషమే= ఎగుడుదిగుడైన, విన్ధ్యపాదే - విన్ధ్య = వింధ్యపర్వతముయొక్క-పాదే = [illegible] తిప్పయందు, విశీర్ణామ్ = అంతటవ్యాపించినదైన, (ఇందుచే అతికాముకి యగు స్త్రీ ప్రియతముని పాదములఁ బడుట ధ్వనించుచున్నది), రేవామ్=నర్మదానదిని, గజస్య = ఏనుఁగుయొక్క, అఙ్గే = దేహమందు, భక్తిచ్ఛేదైః - భక్తి = రేఖలయొక్క- ఛేదైః = ప్రకారములచేత, విరచితామ్=రచియింపఁబడిన, భూతిమివ=సింగారము నుంబోలె-లేక-బూడిదనుబోలె, ద్రక్ష్యసి=చూడఁగలవు, (ఇదియు నీకు గొప్పనేత్రవినోదమని భావము).

తా—ఆయామ్రకూటముయొక్క పొదరిండ్లయందు ఆటవిక కాంతలు కామక్రీడ లనుభవింతురు. అట్టి యావినోదస్థానమందు కొంచెము నేవు విశ్రమింపుము. చిరకాలము అచటనే యుండిన నాసందేశకార్యము విలంబపడును గావున చిరకాలము ఉండవలదు. అచట కొంత వర్షించి బరువు తగ్గించుకొని పిమ్మట త్వరత్వరగా [illegible]వై మార్గమును దాఁటి పోవుచు ముఱియొక వినోదమును చూడఁగలవు. ఏదనఁగా, అచట ఱాలచే విషమమయిన వింధ్యపాదమునందు అంతట వ్యాపించినదై నర్మదానది, ఏనుఁగు దేహమందంతట రేఖలు రేఖలుగా రచియింపఁబడిన సింగారమువలె, [illegible]ముగా నుండును. అట్లున్న యానది కఠినహృదయుఁడైన నాయకుని పాదములఁ బ్రాలి యనునయించుచుండెడి యతికాముకి [illegible] నీకు నయన వినోదము చేయును.

వ.—వధూ—అతి[illegible] రామణీయకముచేతను, [illegible] [illegible] అలిగితములు [illegible] మొదలైన యత్యుత్కృష్టభోగసాధనములచే

తను, ఆకృష్టమానసలై ఉద్దీపితమదనలై వనచరాంగనలు తామే కోరుకొని భర్తల నచటికిఁదార్చి భోగింతురనియు, అట్టిభోగచిహ్నము అకాముఁడవుగాని నీకు నయన వినోదము నొసంగుననియు భావము. 'ముహూర్తమ్'—చాలసేపున్న సందేశము నకు విలంబము కలుగును. 'తోయోత్సర్గ'—పై చెప్పిన భోగచిహ్నదర్శనముచేత కాముకుల చిత్తమందు కామవికారము గలుగును గావున అట్టి వికారమును నీవును పొంది తత్ఫలమును దేహమందును గని, 'ద్రుతతరగతిః'—ఇఁక నిటనున్న నీవికా రము హెచ్చునని శంకించి యవలికి త్వరత్వరగా పోవువాఁడవై అని భావము. మఱి యు సందేశకార్యమునకు విలంబము కాకుండునట్లు అచట నిలిచినముహూర్తమును కూడఁదీసికొనుటకై 'ద్రుతతర' మునుపటికంటె త్వరగా పోవువాఁడవై 'తోయోత్స ర్గ'—జలభారమున్న వడి హెచ్చించుట శక్యముగాదు గావున ఇంతవఱకే సాధ్య మయినంత త్వరగానే పోవుచున్నావు గావునను వేగముకొఱకు ఆకొండలో వర్షించి జలభారము తగ్గించుకొని యని భావము. 'తీర్ణః' అనుటచే నడకకాదు దాఁటుటయని సూచితమగుచున్నది. 'రేవామ్'—స్త్రీలింగ స్వారస్యముచే నాయిక స్ఫురించుచు న్నది. 'ఉపలవిషమే'—రాతివలె కఠినమయిన హృదయముగల-అనఁగా కనికరము లేని-అనియు స్ఫురించుచున్నది. అందువలన పాదమే ఇంతక్రూరమయిన, ఆపాదము గలప్రభువు వింధ్యుఁ డెంతక్రూరుఁడో యని ధ్వనించుచున్నది. 'విన్ధ్య'—ఈశబ్దము యొక్క శ్రుతిచేతనే మోటుపట్టు స్ఫురించుచున్నది. 'విన్ధ్యపాదే'—మూర్ఖుఁడైనవిం ధ్యుఁ డనునాయకుని చరణములయందు అని ధ్వని. 'విశీర్ణామ్'—అతికాముకురాలై ఎంతప్రార్థించినను లొంగని యామూర్ఖనాయకునిపాదములమీఁద అతిదీనయై చది కిలఁబడినది అని భావము. అరసికుఁడును మూర్ఖుఁడును అగు వింధ్యునిపాదములమీఁ దఁబడి రేవ అతిదైన్యముతో అనునయించుచున్న దనుటచే ఆచోటు అత్యంతమదనో ద్దీపనకారియనియు అందువలన అతిరమణీయమనియు నభిప్రాయము. తిప్పమీఁదఁ బడి చీలి తిప్పకన్నిపార్శ్వములను నది జాఱుచున్నది, ఏనుఁగుయొక్క సింగారము దేహమంతట అన్నివైపుల పట్టెపట్టెగా నిలువుగా నుండును, కావున ఈయుపమా నము సామ్యపుష్టి కలిగి హృదయంగమముగా నున్నది.

తస్యా స్తిక్తై ర్వనగజమదై ర్వాసితం వాన్తవృష్టి
ర్జమ్బూకుఞ్జ ప్రతిహతరయం తోయ మాదాయ గచ్ఛేః;
అన్తస్సారం ఘన తులయితుం నానిలః శక్ష్యతి త్వాం;
రిక్తః సర్వో భవతి హి లఘుః, పూర్ణతా గౌరవాయ. 20.

తస్యా ఇతి.— హే మేఘ, వాన్తవృష్టిః=ఉద్గీర్ణవర్షః -సన్-కృతవమనశ్చ వ్యజ్యతే, తిక్తైః = సుగన్ధిభిః - తిక్తరసవద్భిశ్చ + 'తిక్తో రసే సుగన్ధే చ' ఇతి విశ్వః, వనగజమదైః, వాసితం_సురభితం-భావితం చ, 'హిమవద్విన్ధ్య మలయా గజానాం ప్రభవా నగాః' ఇతి విన్ధ్యస్య గజప్రభవత్వాదితి భావః, జమ్బూకుఞ్జైః - ప్రతిహతరయం = ప్రతిబద్ధవేగం - సుఖపేయమిత్యర్థః- అనేన లఘుత్వం కషాయభావనా చ వ్యజ్యతే, తస్యాః = రేవాయాః, తోయమ్, ఆదాయ-గచ్ఛేః=వ్రజ, హే ఘన=మేఘ, అన్తః సారో = బలం - యస్య తం త్వామ్, అనిలః = ఆకాశవాయుః-శరీరస్థశ్చ గమ్యతే, తులయితుం, న శక్ష్యతి = శక్తో న భవిష్యతి; తథా హి, రిక్తః = అన్తఃసారశూన్యః, సర్వోఽపి, లఘుర్భవతి = అప్రకమ్ప్యో భవతీత్యర్థః, పూర్ణతా=సారవత్తా, గౌరవాయ = అప్రకమ్ప్యత్వాయ భవతీత్యర్థః. అయమత్ర ధ్వనిః—ఆదౌ వమనశోధితస్య పుంసః పశ్చాచ్ఛ్లేష్మశోషణాయ లఘుతిక్తకషాయామ్బుపానాల్లబ్ధబలస్య వాతప్రకోపో న స్యాదితి-యథాహ వాగ్భటః—'కషాయాశ్చ హిమాస్తస్య విశుద్ధౌ శ్లేష్మణో హితాః। కిము తిక్తకషాయా వా యే నిసర్గాత్కఫాపహాః। కృతశుద్ధేః క్రమాత్పీతపేయాదేః పథ్యభోజినః॥ వాతాదిభిర్న బాధా స్యాదిన్ద్రియైరివ యోగినః' ఇతి.

(హే మేఘ=ఓయి మేఘుఁడా), వాన్తవృష్టిః-వాన్త =క్రక్కఁబడిన-వృష్టిః సన్ = వర్షముగలవాఁడవై -(వర్షించియనియర్థము) - (వమనార్థమౌషధము పుచ్చుకొని) వమనముచేసికొన్నవాఁడవై అనియు ధ్వనించుచున్నది, తిక్తైః = పరిమళముగలవి (చేఁదువి)యు, ఐన, వన గజ మదైః = అడవి యేనుఁగుల మదములచేత, వాసితమ్ = పరిమళితమును (భావన చేయఁబడినదియు), జ...యమ్—జమ్బూకుఞ్జ=నేరేటిపొదలచే - ప్రతిహత = అడ్డగింపఁబడిన - రయమ్ = వేగముకలదియు (వడితగ్గినందున సుఖముగా త్రాగఁదగినదని యర్థము, ఇందువలన జలములో లఘుత్వమును కషాయ భావనయు ధ్వనించుచున్నవి), అయిన, తస్యాః = ఆ రేవానదియొక్క, తోయమ్ = నీటిని, ఆదాయ = గ్రహించి, గచ్ఛేః = పొమ్ము. (హే) ఘన = (ఓయి) మేఘుఁడా, అన్తస్సారమ్—అన్తః = లోపల - సారమ్ = బలముగలవాఁడవైన, త్వామ్ = నిన్ను, అనిలః = ఆకాశవాయువు (దేహమందలి వాయువును ధ్వనించుచున్నది), తులయితుమ్ = కదలించుటకు, న శక్ష్యతి = సమర్థుఁడు కాఁడు; (తథా) హి = అట్లేగదా, రిక్తః = అంతస్సారములేనివాఁడైన, సర్వః = ఎల్లవాఁడును, లఘుర్భవతి = బరువులేనివాఁడు అగును (కదలింప శక్యుఁడగుననియర్థము); పూర్ణతా = సారముగలిగియుండుట, గౌరవాయ = కదలింపశక్యముగామికొఱకు, (భవతి = అగును).

తా.—ఓమేఘుఁడా, నీవు వర్షించి, అడవి యేనుఁగుల మదముచేత పరిమళిం చునవియు నేరేటిపొదల యడ్డగింతచే వడితగ్గినవియు నగు రేవాజలములను త్రాగి తరలుము. అట్లుచేసిన నీకు లోపల బలము కలుగును. అంతట నిన్ను వాయువు కద లింపఁజాలఁడు. సారహీనుఁడు చులకనయై కదలింప శక్యుఁడగునుగాని సారవంతుని కదలింప శక్యముగాదుగదా. నీవు పై చెప్పినట్లు చేయునపుడు నీచర్యయెట్లుండునో వినుము:—లోకములో ఎవ్వఁడేని దేహబలాపేక్షియై ముందుగా ఔషధములచేత వమనము గావించుకొని శుద్ధకోష్ఠుఁడై అనంతరము కఫము నిగురఁ జేయుటకై చేఁదు గలిగి భావనపొందిన తేలిక కషాయజలమును త్రాగి లబ్ధబలుఁడై వాతప్రకోపము నడంచి సుఖంబునం బోవును.—అట్టిదిగా నీచర్య యుండును.

ఇందు, వర్షించుట వమనము సేయుటగాను, తిక్తశబ్దశ్లేషచే పరిమళము చేఁదు గాను, వనగజమదము కలసి పరిమళవంతమగుట ద్రవ్యవిశేషభావనగాను, నేరేటి పొదలం గూడినజలము కషాయముగాను, దానిం ద్రాగుటచే మేఘుఁడు నీటితో నిండుట బలముతో నిండుటగాను, బరువెక్కిన మేఘుని మింటిగాలి కదలింప నేరమి శారీరవాయువు ప్రకోపింపలేమిగాను, సూచింపఁబడినవి.

గజమదము ఏడాకుల యరఁటివలె పరిమళించును:—

"స ప్తచ్ఛదక్షీరకటుప్రవాహ మసహ్య మాఘ్రాయ మదం తదీయ
ముల్లఙ్ఘితాధోరణతీవ్రయత్నా స్సేనాగజేన్ద్రా విముఖా బభూవుః." రఘు.

నేరేడాకులు జలమునందలి దోషములను హరించును. నేరేడు అనూపజము (నీటికడఁ బెరుగునది) అగుటచే ఏళ్లలో నేరేటిపొద లుండును:—

"జమ్బ్వా వేతస వానీర కదమ్బోదుమ్బరార్జునాః
బీజపూరక మృద్వీకా లకుచా శ్చ సదాడిమాః
వఞ్జులో న క్తమాల శ్చ తిలకః పనసస్తథా
తిమిరోఽమ్రాతక శ్చైవ షోడ శానూపజాః స్మృతాః." బృహత్సంహిత.

"ఇహ సమదశకున్తాక్రాన్త వానీరవీరుత్ప్రసవసురభిశీతస్వచ్ఛతోయా వహన్తి
ఫలభరపరిణామశ్యామజమ్బూనికుఞ్జ స్ఖలనముఖరభూరిస్రోతసో నిర్ఝరిణ్యః."
ఉత్తరరామచరిత.

"ఇదం జమ్బూకుఞ్జస్ఖలితజలఝాత్కారలహరీ
గభీరాయాః సిన్ధో ర్ముదితవిహగధ్వానిని తటే
క్రమోద్గాఢాఘ్రానజ్వరవిధురకర్ణాటయువతీ
కపోలాపాణ్డు ద్రాగ్గళతి రుచిరం కేతకవనమ్." మల్లి[illegible]

నీపం దృష్ట్వా హరితకపిశం కేసరై రర్ధరూఢై
రావిర్భూతప్రథమముకుళాః కన్దలీ శ్చానుకచ్ఛమ్
జగ్ధ్వారణ్యే ష్వధికసురభిం గన్ధ మాఘ్రాయ చోర్వ్యాః
సారఙ్గా స్తే జలలవముచః సూచయిష్యన్తి మార్గమ్. 21

నీపమితి.—సారఙ్గాః=మతఙ్గజాః కురఙ్గా వా + 'సారఙ్గశ్చాతకేభృఙ్గేకురఙ్గే చ మతఙ్గజే' ఇతి విశ్వః, అర్ధరూఢైః—ఏకదేశోద్గతైః, కేసరైః=కిఞ్జల్కైః, హరితం =పాలాశవర్ణం-కపిశం=శ్యావవర్ణం, శ్యామారుణమితియావత్ + 'పాలాశో హరితో హరిత్' ఇతి + 'శ్యావః స్యాత్కపిశో ధూమ్రధూమలౌ కృష్ణలోహితే' ఇతి చామరః- హరితం చ తత్కపిశంచ*వర్ణోవర్ణేన' ఇతిసమాసః, నీపం=స్థలకదమ్బకుసుమమ్+'అథ స్థలకదమ్బకే నీపః స్యాత్పులకే' ఇతి శబ్దార్ణవే, దృష్ట్వా=సంప్రేక్ష్య- విదిత్వేతియావత్, తథా, కచ్ఛే ష్వనూపే ష్వనుకచ్ఛమ్ * 'అవ్యయం విభక్తి' ఇత్యాదినా విభక్త్యర్థేఽవ్యయీభావః+'జలప్రాయ మనూపం స్యాత్పుంసి కచ్ఛ స్తథావిధః' ఇత్యమరః, ఆవిర్భూతప్రథమాః ప్రథమోత్పన్నా ముకుళా యాసాం తాః, కన్దలీః=భూమికదళీః + 'ద్రోణపర్ణీస్నిగ్ధకన్దాకన్దలీ భూకదల్యపి' ఇతిశబ్దార్ణవే, జగ్ధ్వా=భక్షయిత్వా *'అదో జగ్ధిః' ఇతి జగ్ధ్యాదేశః, అరణ్యేషు, అధిక సురభిమ్=అతిఘ్రాణతర్పణం, 'దగ్ధారణ్యేషు' ఇతిపాఠే 'దగ్ధమ్' ఇత్యధికవిశేషణ మర్థవత్స్యాత్ -కన్దళీశ్చ దృష్ట్వైవేత్యన్వయో ద్రష్టవ్యః, ఉర్వ్యాః = భూమేః, గన్ధ మాఘ్రాయ, జలలవముచః మేఘస్య, తే =తవ, మార్గం, సూచయిష్యన్తి = అనుమాపయిష్యన్తి, యత్రయత్రవృష్టికార్యం నీపకుసుమాదికం దృశ్యతే తత్రతత్ర త్వయా వృష్ట మిత్యనుమీయత ఇతిభావః-

సారఙ్గాః = లేళ్లుగాని ఏనుఁగులుగాని, అర్ధరూఢైః—అర్ధ = ఏకదేశమందు (అనఁగా నొకభాగమందు)- రూఢైః = మొలచినట్టి, కేసరైః = కింజల్కములచేత, హరితకపిశమ్—హరిత = పసరువన్నె గలదియు - కపిశమ్ = నలుపుచేరిన యెఱుపుగలదియు, (అయిన), నీపమ్ = కదంబ (కడిమి) పుష్పమును, దృష్ట్వా=చూచియు, (అట్లే), కచ్ఛేషు = జలప్రాయ ప్రదేశములయందు (కసెములయందు), ఆ...ళాః —ఆవిర్భూతప్రథమ = ప్రథమమందు పుట్టినట్టి - ముకుళాః = మొగ్గలుగలవైన- కన్దళీః = నేలయరఁటులను, జగ్ధ్వాచ = భక్షించియు, అరణ్యేషు = అడవులలో, అధికసురభిమ్=మిక్కుటపరిమళవంతమైన, ('దగ్ధారణ్యేషు' అనుపాఠమున 'అధిక' అను నీ విశేషణము సార్థకమగును. ఏల యనఁగా కాలిన యడవులయందు భూమి నుండి వానచినుకులవలన పరిమళము అధికముగా లేచును. ఆపక్షమున 'కన్దళీశ్చ దృష్ట్వా' అని యన్వయము చేసికోవలయును), ఉర్వ్యాః=భూమియొక్క, గన్ధమ్= పరిమళమును, ఆఘ్రాయ చ = ఆఘ్రాణించియు, జలలవముచః=ఉదకబిందువుల

వర్షించువాఁడవైన, తే = నీయొక్క, మార్గమ్ = దారిని, సూచయిష్యన్తి=ఊహింపఁజేయుచున్నవి, (ఎక్కడెక్కడ వర్షకార్యమయిన కడిమిపువ్వులు మొదలగునవి అగపడునో అక్కడక్కడ నీవు వర్షించితివని చూపరు తెలిసికొందురని యర్థము).

'నీపం దృష్ట్వా' యను పాఠమున దృష్ట్వా=కొఱికి.

తా.—ఓ మేఘుఁడా నీచినుకులకు కడిమియు నేలయరఁటియు పూచును. కాలిన యరణ్యప్రదేశములయందు అధికపరిమళము లేచును. ఇందువలన నీవు అక్కడక్కడ వర్షించుచు పోయినదారిని కనుంగొనుటకు చూపఱకు ఒక సాధనము కలదు, అది ఏదనఁగా నీవు పోయినదారిని ఏనుఁగులును లేళ్లును కొంచెము కేసరములు మొలచిన కడిమిపూవులను భక్షించుచు, తొలిమొగ్గలుదాల్చినవైన నేలయరఁటిపిలకలను తినుచు, కాలిననేలలయందలి యధికపరిమళము నాఘ్రాణించుచుఁ బోవును. అట్లు చేయుచుంబోవు నాగజహరిణములను చూచువారు ఈదారిని మేఘము పోయినదిగదా అని యూహింతురు.

వి.—'అర్ధరూఢైః' - అప్పుడే మొలచినవి గావున ఇంక కేసరములు నిండలేదు. 'ప్రథమముకుళాః' - అప్పుడే మొలచినవి ; ఈ రెండు విశేషణములు ఆదారిని మేఘముపోయి ఎంతోసేపు కాలేదని తెలుపుచున్నవి. మేఘముపోయినదారి తడిచేతను నీళ్ల చేతను తెలియదా ఊహింపనేల యనిన-ఇది జడివాన కురిసినతావులను గుఱించి చెప్పుమాట కాదు, మఱియేమన-'జలలవముచః'-కొంచెముకొంచెముగా చినుకులు రాలినచోటి వర్ణనము. ఆకొంచెముచినుకులు త్వరలోనే అగపడక పోవును, నేలయందును జలము నిలువదు, చెట్లమీఁదను ఆకులలో తడి ఇంకిపోవును, కావున ఆమార్గము ఊహచే తెలిసికోవలసినదై యున్నది. జనులే ఈనీపకందళీభూసౌరభములవలన మేఘమార్గము నూహింపలేరా, సారంగములను చెప్పనేల యనిన—తమకు రుచ్యములైన నీపకుసుమములను కందళీముకుళములను ఏనుఁగులును లేళ్లును వానిచేతఁగూడ అతిశీఘ్రముగా కనిపట్టును, మనుష్యులకయిననో ఇవి అంత శీఘ్రముగా ఇతరలతాగుల్మవృక్షాదులనుండి భేదిల్లి అగపడవు, కనుక ఆసారంగములను కనుపెట్టినచో తన్మూలముగా నీపకందళికలు సులువుగా తెలియును, వీనివలన మేఘమార్గము తెలియును.

అమ్భోబిన్దుగ్రహణచతురాం శ్చాతకాన్ వీక్షమాణాః
శ్రేణీభూతాః పరిగణనయా నిర్దిశన్తో బలాకాః
త్వా మాసాద్య స్తనితసమయే మానయిష్యన్తి సిద్ధాః
సోత్కమ్పాని ప్రియసహచరీ సంభ్రమాలిఙ్గితాని. 22.

ప్రక్షిప్తమపి వ్యాఖ్యాయతే:—

అమ్భ ఇతి.—అమ్భోబిన్దూనాం=వర్షోదబిన్దూనాం-గ్రహణే=† 'సర్వంసహాపతిత మమ్బు నచాతకానామ్' ఇతి శాస్త్రాద్భూస్పృష్టోదకస్య తేషాం రోగహేతుత్వాదన్తరాల ఏవ స్వీకారే-చతురాం శ్చాతకాన్, వీక్షమాణాః=కౌతుకా త్పశ్యన్తః, శ్రేణీభూతాః=బద్ధపఙ్క్తీః * అభూతతద్భావేచ్విః, బలాకాః=బకపఙ్క్తీః, పరిగణనయా=ఏకా ద్వే త్రిస ఇతి సంఖ్యానేన, నిర్దిశన్తః=హస్తేన దర్శయన్తః, సిద్ధాః, స్తనితసమయే=త్వద్గర్జితకాలే, సోత్కమ్పాని=ఉత్కమ్పాపూర్వకాణి, ప్రియసహచరీణాం-సంభ్రమేణాలిఙ్గితా న్యాసాద్య-స్వయంగ్రహణాశ్లేషసుఖ మనుభూయేత్యర్థః, త్వాం మానయిష్యన్తి-త్వన్నిమిత్తత్వా త్సుఖలాభ స్యేతి భావః.

ఈశ్లోకము కాళిదాసుది గాదు, ఎవరో చేసి యీగ్రంథములో వేసినారు, అట్లయినను చక్కఁగా నున్నదని మల్లినాథసూరిగారు దీనికి వ్యాఖ్య చేసినారు.

అమ్భో...రాన్.—అమ్భః = వర్షోదకముయొక్క - బిన్దు=బొట్లయొక్క-గ్రహణే = గ్రహించుటయందు (వానచినుకులను నేలఁబడనీయక నోటఁగొనుటయందని యర్థము. నేలఁబడినజలము చాతకములకు రోగహేతువగుటచే అవి వానచినుకులను ఆకాశమందే గ్రహించును.) -చతురాన్=నేర్పుగలవైన, చాతకాన్=వానకోయిలలను, వీక్షమాణాః=చూచుచున్నవారును, శ్రేణీభూతాః=బారులుతీరియున్న, బలాకాః=బెగ్గురులను, పరిగణనయా=ఒకటి రెండు మూఁడు అని లెక్కించుటచేత (లెక్కించి), నిర్దిశన్తః=చేతితో చూపుచున్నవారును, అయిన, సిద్ధాః=సిద్ధులు, స్తనితసమయే = నీయురుము వేళలో, సోత్కమ్పాని=తమకముతోఁగూడుకొన్నవైన, ప్రియ...తాని—ప్రియసహచరీ = అనుఁగుఁగాంతల-సంభ్రమాలిఙ్గితాని=తొట్రుపాటుతోడి కౌఁగిలింతలను, ఆసాద్య=పొంది, (కాంతలే స్వయముగా తమ్ము కౌఁగిలించుకొను సుఖమును అనుభవించి), త్వామ్=నిన్ను, మానయిష్యన్తి=గౌరవింతురు, (ఆసుఖము నీవలనం గలిగిన దవుటచేత నని భావము).

తా.—నీవు వర్షించుచుం బోవునపుడు, వానకోయిలలు నీచినుకులను నేలఁబడనీయక ఆకాశముననే నోటఁగొని యారగించు నేర్పును చూచువారును, నీచుట్టును గర్భాధానార్థము బారులుతీరు బెగ్గురులను ఒకటి రెండు మూఁడు అని యీరీతిగా లెక్కపెట్టి (ప్రియులకు) చూపువారునుగా నుండు సిద్ధులు, ఈలోపల నీవు పెటపెట ఉఱిమినచో ఆయురుమునకు తమకముతో ప్రియలు తమ్ము స్వయముగా కౌఁగిలించుకోఁగా సుఖించి ఆసుఖము నీవు గలిగించినదిగా నాయెను నిన్ను గౌరవింతురు.

ప.—'చతురాం శ్చాతకా౯ వీక్షమాణాః'-వానకోయిలల నేర్పునకను పెట్టుచు అని ఫలితార్థము. 'చాతకా౯'-పక్షిమాత్రమున కింతనేర్పా యని యాశ్చర్యము. 'శ్రేణీభూతాః'-గర్భాధానార్థము మబ్బుచుట్టును బారులు తీరినవి-'గర్భాధానక్షణ పరిచయాన్నూనమాబద్ధమాలాః.' 'సిద్ధాః'—సిద్ధులు ఆకాశసంచారశీలు రగుటచే మేఘమునకు ఎంతసమీపమందేనియు నుండఁగలరు, కావున వారికి వానచినుకులను వానకోయిలలు గ్రహించుటయు బలాకలును స్పష్టముగా నగపడును, నేలమీఁదనుండు మనుష్యులకైన ఇవి స్పష్టముగా నగపడవు. 'సోత్కంఠాని'-సిద్ధాంగనల కౌఁగిలింతలు ఉత్కంఠాపూర్వకములు కావేని కేవలభయజనకము లగును, అందుకై సిద్ధులు మేఘునిచేఁతను రోయుదురే గాని గారవింపరు; మఱియు 'మేఘాలోకే భవతి సుఖినో ఽప్యన్యథావృత్తి చేతః'-మేఘమును చూచినంతనే సిద్ధులకు కాంతలం గౌఁగిలింపఁ గోరిక గలుగును, కాంతలకును అట్లే వీరిం గౌఁగిలింపఁ గోర్కి కలుగును. అది 'బలాకాః'-బలాకాగర్భాధానాదిదర్శనముచే గాఢోత్కంఠగా ముదురును. అట్లయినను, పరులు సరసనుండుటచేత ఆలింగనము వలనుపడకయుండఁగా, మేఘ ముఱుమఁగా, ఆ కాంతలు ఉఱుమునకు ఉలికిపడు తొట్రుపాటున కాంతులఁ గౌఁగిలించుకొని యుత్కంఠం దీర్చుకొందురు. అట్లు పరసాన్నిధ్యాదిహేతువులచే దుర్ఘటమైన యాలింగనమును సుఘటము గావించి నిరాశుల తమ్ము పూర్ణమనోరథులం గావించిన మేఘుని సిద్ధులు గారవింతురు. 'ప్రియ'-అప్రియల యాలింగనమున కెవఁడు గారవించును! 'సహచరీ'—ఎప్పుడును ఎడఁబాయనొల్లరు, అత్యంతోత్కంఠకలవా రనుట కిదియే తార్కాణము. 'సంభ్రమాలిఙ్గితాని'—సంభ్రమముచే కలిగినవి గాన గాఢములు, కావున మిక్కిలి మనోహరములు: మేఘమండలమునకు సమీపమందుండుటచేత ఉఱుము పెటపెట ఎక్కువగా వినఁబడును, సంభ్రమము ఎక్కువగా నుండును, ఆలింగనము గాఢతరమై మనోహరతరముగా నుండును.

ఉత్పశ్యామి ద్రుత మపి సఖే మత్ప్రియార్థం యియాసోః
కాలక్షేపం కకుభసురభౌ పర్వతే పర్వతే తే;
శుక్లాపాఙ్గైః సజలనయనైః స్వాగతీకృత్య కేకాః
ప్రత్యుద్యాతః కథమపి భవా న్గన్తు మాశు వ్యవస్యేత్, 23.

ఉత్పశ్యామీతి—హే సఖే=మేఘ, మత్ప్రియార్థం యథాతథా, ద్రుతం=శీఘ్రం + 'లఘు క్షిప్ర మరం ద్రుతమ్' ఇత్యమరః, యియాసోః=యాతు మిచ్ఛోః
* యాతేః సన్నన్తాదుప్రత్యయః, తే=తవ, కకుభైః=కుటజకుసుమైః సురభౌ=సుగ

న్ధిని + 'కకుభః కుటజేఽర్జునే' ఇతిశబ్దార్ణవే, పర్వతే పర్వతే = ప్రతిపర్వతం * వీప్సాయాం ద్విరుక్తిః, కాలక్షేపం = కాలవిలమ్బనం + 'క్షేపో విలమ్బే నిన్దాయామ్' ఇతివిశ్వః, ఉత్పశ్యామి = ఉత్ప్రేక్షే. విలమ్బహేతుం దర్శయన్నాశుగమనం ప్రార్థయతే శుక్లేతి. — సజలాని = సానన్దబాష్పాణి నయనాని యేషాం తైః, శుక్లాపాఙ్గైః = మయూరైః + 'మయూరో బర్హిణో బర్హీ శుక్లాపాఙ్గః శిఖావలః' ఇతి యాదవః, కేకాః = స్వవాణీః + 'కేకా వాణీ మయూరస్య' ఇత్యమరః, స్వాగతీకృత్య = స్వాగతవచనీకృత్య, ప్రత్యుద్యాతః = ప్రత్యుద్గతః మయూరవాణీకృతాతిథ్య ఇత్యర్థః, * భవాన్, కథమపి = యథాకథంచిత్, ఆశుగన్తుం, వ్యవస్యేత్ = ఉద్యుఞ్జీత * ప్రార్థనే లిఙ్ * 'శేషే ప్రథమః' ఇతి ప్రథమపురుషః. శేషశ్చాయం భవచ్ఛబ్దో యుష్మదస్మచ్ఛబ్దవ్యతిరేకాత్. 'స్వాగతీకృత్య కేకాః' ఇత్యత్ర కేకాస్వారోప్యమాణస్య స్వాగతవచనస్య ప్రకృత ప్రత్యుద్గమనోపయోగిత్వాత్పరిణామాలంకారః - తదుక్తమలంకారసర్వస్వే + 'ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామః' ఇతి.

హే సఖే = ఓమిత్రుఁడా (మేఘుఁడా), మత్ప్రియార్థమ్ = నా ప్రియముకొఱకు, ద్రుతమ్ = శీఘ్రముగా, యియాసోః = పోవఁగోరుచున్న, తే = నీకు, కకుభసురభౌ — కకుభ = కొండమల్లెపువ్వులచే - సురభౌ = పరిమళవంతమైన, పర్వతే పర్వతే = ప్రతిపర్వతమందును, కాలక్షేపమ్ = కాలవిలంబమును; ఉత్పశ్యామి = ఊహించుచున్నాను; (విలంబహేతువును చెప్పుచున్నాఁడు, త్వరగా పొమ్మనియు ప్రార్థించుచున్నాఁడు:—) స...నైః — సజల = ఆనందబాష్పములతోఁగూడుకొన్న - నయనైః = నేత్రములుగలవైన, శుక్లాపాఙ్గైః = నెమళ్లచేత, కేకాః = తమ కేకలను, స్వాగతీకృత్య = 'రమ్ము క్షేమమా' అని స్వాగతవచనముగా చేసి, ప్రత్యుద్యాతః = ఎదురుగాపోవుటయను సమ్మానముచేయఁబడినవాఁడవు, (ఆతిథ్యము చేయఁబడినవాఁడవనియర్థము), భవాన్ = నీవు, కథమపి = ఎట్లో, ఆశు = త్వరగా, గన్తుమ్ = పోవుటకు, వ్యవస్యేత్ = ప్రయత్నించుదువుగాక.

తా. — ఓయిమిత్రుఁడా నాకార్యముకొఱకు ఎంతత్వరగాఁబోవలయునని నీవు పోయినను నీకు అక్కడక్కడ విలంబము తప్పదు, కొండమల్లెల పరిమళించుచుండు ప్రతికొండయందును నిన్నుఁ గన్నందులకై కన్నుల నానందబాష్పములు గ్రమ్మ కేకలను నీకొఱకు స్వాగతవచనములనుగా ప్రయోగించుచు, నీమిత్రములగు మయూరములు నీకు ఎదురువచ్చును. వానినేస్నేహముచే ఆదరించుచు ఆయాకొండలలో కొంచెకొంచెము నేను నిలుతువుగాని, అచ్చట విలమ్బము చేయక త్వరత్వరగానే అట్టిమిత్రములను నీతో బాటు నాకార్యముకై పోవుదువుగాక యని నిన్ను వేఁడెదను.

ప.—'సఖే'—సఖుఁడవుగావున నే 'ద్రుతం యియాసోః' - నా కార్యము కై శీఘ్రముగా పోఁగోరుచున్నావు. 'కకుభసురభౌ'—ఆ సౌరభము నిన్నాకర్షించుననియు, పోనీయదనియు, నీవు వత్తువని నీకొఱకు మిత్రములు మయూరములు తమ నగరమయిన యీకొండకు ఆకొండముల్లెపువ్వులతో నగరాలంకారములు చేసిరనియు, భావము. 'సజలనయనైః'—నిన్నుఁగన్న సంతోషముచేత; 'స్వాగతీకృత్య కేకాః'-నెమలికూఁతకు కేక యని పేరు గావున వాని కేకయెల్ల స్వాగతమే అగుట నీరాకకైన హర్షాతిశయమును సూచించును. 'ప్రత్యుద్యాతః'—మేఘము మున్నయున్నత భూములకు సమీపించి నెమళ్లు నృత్యముచేయును. 'పర్వతే పర్వతే'—పర్వతాగ్రములందు నిలుచుటయు పర్వతసానువులయందు చెట్లయాకులు మేయుటయు మేఘస్వభావము, వర్షములకు వికసిల్లుట కొండముల్లెలస్వభావము, మేఘదర్శనముచే సంతోషించి మిక్కుటముగా కూయుటయు నృత్యములుచేయుటయు నెమళ్లస్వభావము.

పాణ్డుచ్ఛాయోపవనవృతయః కేతకైః సూచిభిన్నై
ర్నీడారమ్భైః గృహబలిభుజా మాకులగ్రామచైత్యాః
త్వయ్యాసన్నే పరిణతఫలశ్యామజమ్బూవనాన్తాః
సంపత్స్యన్తే కతిపయదినస్థాయిహంసా దశార్ణాః. 24.

పాణ్డ్వితి.—హే మేఘ, త్వయి, ఆసన్నే = సంనికృష్టే - సతి, దశార్ణా[illegible]మజనపదాః, సూచిభిన్నైః - సూచిషు = ముకుళాగ్రేషు - భిన్నైః = వికసితైః + 'కేతకీముకుళాగ్రేషు సూచిఃస్యాత్' ఇతిశబ్దార్ణవే, కేతకైః = కేతకీకుసుమైః, పాణ్డుచ్ఛాయాః = హరితవర్ణాః - ఉపవనానాం - వృతయః = కణ్టకశాఖావరణాః - యేషు తే తథోక్తాః + 'ప్రాకారో వరణః సాలః ప్రాచీరం ప్రాన్తతోవృతిః' ఇత్యమరః, తథా, గృహబలిభుజాం = కాకాదిగ్రామపక్షిణాం, నీడారమ్భైః = కులాయనిర్మాణైః + 'కులాయో నీడ మస్త్రియామ్' ఇత్యమరః, చిత్యాయా ఇమాని చైత్యాని = రథ్యావృక్షాః + 'చైత్య మాయతనే బుద్ధబిమ్బే చోద్దేశపాదపే' ఇతిరుద్రః - ఆకులాని = సంకీర్ణాని గ్రామేషు చైత్యాని యేషు తే తథోక్తాః, తథా, పరిణతైః = పక్వైః - ఫలైః - శ్యామాని యాని జమ్బూవనాని - తైః - అన్తాః - రమ్యాః + 'మృతా వవసితే రమ్యే సమాప్తా వన్త ఇష్యతే' ఇతి శబ్దార్ణవే, తథా, కతిపయేష్వేవ దినేషు స్థాయినో హంసా యేషు తే తథోక్తా ఏవంవిధాః, సంపత్స్యన్తే = భ[illegible] యావతి స్తోక కతిపయ[illegible] ఇత్యాదినా కతిపయ శబ్దస్యోత్తరపద[illegible]స్యోత్తరత్వ మస్య[illegible] ప్రామాణికత్వాత్.

(హే మేఘ = ఓ మేఘుఁడా), త్వయి = నీవు, ఆసన్నే=సమీపగతుఁడవు కాఁగా, దశార్ణాః = దశార్ణములను పేరిటి దేశములు, సూచిభిన్నైః - సూచి = మొగ్గతుదలయందు - భిన్నైః = వికసించినవైన, కేతకైః = మొగలిపువ్వుల చేత (గ్రీష్మాంతమున మొగలిపూచును - అది ఆదేశములందు విశేషముగాఁ గలదని ప్రసిద్ధి), పాణ్డు...యః—పాణ్డు=తెల్లని - ఛాయా=వర్ణముకలవైన - ఉప వనవృతయః=తోఁటలవెలుగులు కలవియు, (మఱియు), గృహబలిభుజామ్=కాకులు మొదలయిన గ్రామ్యపక్షులయొక్క, నీడారమ్భైః—నీడ = గూండ్లయొక్క—ఆరమ్భైః = కట్టుటలచేత - (గూండ్లుకట్టుకొనుటచేత), ఆకు...త్యాః—ఆకుల = సంకులము లయిన - గ్రామచైత్యాః=పల్లెలరచ్చచెట్లుకలవియు, (మఱియు), పరి...న్తాః —పరిణత=పండిన - ఫల = ఫలములచేత - శ్యామ = నల్లనైన - జమ్బూవన = నేరేడువనములచేత - అన్తాః=రమ్యములును, కతి...స్థాః—కతిపయ = కొంచెమైన దిన = దినములు - స్థాయి = నిలిచియుండు - హంసాః=హంసలుకలవియు, సం పత్స్యన్తే=కాఁగలవు.

తా.—నీవు దశార్ణదేశములకు పోయినప్పుడు - అచటియుపవనముల వెలుగుల లోని మొగలిచెట్లు విస్తారముగా పూచును, ఆపువ్వులచే ఆవెలుగులు తెల్లగాఁ ప్రకా శించుచుండును, మఱియు గ్రామరథ్యలలోని చెట్లయందు కాకులు మొదలైనపక్షులు విశేషముగా కూడి గూండ్లుకట్టుకొనును, నేరేడువనములు విస్తారముగాపండి ఆపండ్ల కాంతిచే నల్లగా రమణీయములగును. అట్లు ఆప్రదేశము లెంతరమణీయములైనను వానిని హంసలు నీమూలముగా త్వరలోనే విడిచిపోవును.

వ.—'పాణ్డు'- మొగలిపువ్వుల యతిబాహుళ్యమును తెలుపును ; అతి అతిబ హుళమైనఁగదా వెలుగులకు పాండిమకలుగును. 'చైత్యాః'—రథ్యావృక్షములు నీడ కొఱకు జనులచే రక్షింపఁబడునవి కావున కొమ్మలు నఱికివేయుట మొదలయిన పాటుపులులేక దట్టముగా ఎదిగియుండుటంబట్టి పక్షులకు నివాసముగా ఇమ్ముగా నుండును. 'ఫలశ్యామ'—పండ్లచేత నల్లనివి అనుటచే పండ్లు మెండని తెలియు చున్నది. 'కతిపయదిన'—కొంచెది దినములె ఉండుట మేఘమువలని యుపద్రవము చేతను[illegible] కొంచెది దినములయినను ఉండుట వానికి ఆప్రదేశము మిగుల రమణీయముగుటచేత. మఱియు ఆదేశములో పదిదుర్గభూములుండుటచేత మేఘుఁడు దుర్గభూములయందు [illegible] నిలుచుటచేతను అతనికి దశార్ణ దేశమును దక్షిణ మునుండి ఉత్తరమునకు దాట[illegible] కొంచెదిదినములు పట్టును. హంసలును అవరు సనే మేఘుఁడు ఎక్కడికి వచ్చినా అక్కడినుండి ఉత్తరముగా పోవుచుండును,

అందుచే అవియు కొలఁదిదినములకే గాని ఆదేశమును బొత్తిగా విడిచిపోవు. దశార్ణ దేశము సహజముగానే రమణీయమనియు నీవలన రమణీయతరమగుననియు భావము. మొగలిపూచుట, కాకాదులు గ్రుడ్లు పెట్టుటకై గూండ్లు కట్టికొనుట, నేరేడు పండ్లు పండుట, హంసలు పలాయనమగుట, ఇవియెల్ల వర్షాకాలస్వభావములు. ‘వనాన్తాః’—మల్లినాథసూరి ‘అన్త’ శబ్దమున కిచట ‘రమ్యమయిన’ అని యర్థము వ్రాసినాఁడు. కొందఱు వ్యాఖ్యాతలు ‘ప్రదేశ’మని వివరించినారు. ఈరెండవయర్థమున కనుగ్రాహకములుగా—

అస్త్యైవాసీన్మహతి శిఖరే గృధ్రరాజస్య వాసః
తస్యాధస్తాద్వయమపి రతాస్తేషు పర్ణోటజేషు
గోదావర్యాః పయసి వితతశ్యామలానోకహశ్రీ
రన్తఃకూజన్ముఖరశకునో యత్ర రమ్యో వనాన్తః. ఉత్తరరామ.

తణఇల్లతరుయలాణం అనెవ్వకలునుణ్ణా పల్లలజలాణ
దురాలోయెచ్ఛియ పాయుసమ్మి లచ్ఛి వణన్తాణ. గౌడవహము.

ఇట్టిప్రయోగములు పరశ్శతములు గ్రంథములందుఁ గానంబడుచున్నవి. కాన ఈవివరణంబును గ్రాహ్యముగానేయున్నది. అయినను, భారవిలో

స్నపితనవలతాతరుప్రవాళై రమృతలవస్రుతిశాలిభిర్మయూఖైః
సతత మసితయామినీషు శమ్భో రమలయ తీహ వనాన్తమిన్దులేఖా.

రఘువంశములో

వసిష్ఠధేనో రనుయాయినం త మావర్తమానం వనితా వనాన్తాత్
పపౌ నిమేషాలసపక్ష్మపఙ్క్తి రుపోషితాభ్యా మివ లోచనాభ్యామ్.

అని విశేష్యముగా ప్రయుక్తమైయున్న వనాంతపదముగల శ్లోకములను విచారించిన వ్యాఖ్యాతృచక్రవర్తి మేఘసందేశములోని యీశ్లోకమందు అన్తాః = రమ్యాః అనుటయే మేలని భావించినట్లు అగపడుచున్నది.

తేషాం దిక్షు ప్రథితవిదిశాలక్షణాం రాజధానీం
గత్వా సద్యః ఫల మవికలం కాముకత్వస్య లబ్ధా,
తీరోపాన్తస్తనితసుభగం పాస్యసి స్వాదు యత్తే
స్సభ్రూభఙ్గం ముఖమివ పయో వేత్రవత్యా శ్చలోర్మి. 25.

తేషామితి.—దిక్షు ప్రథితం = ప్రసిద్ధం విదిశాలక్షణాం = నామ [illegible]
స్తాం + ‘లక్షణం నామ్ని చిహ్నే చ’ ఇతి విశ్వః, [illegible]

'నీమ్*శీయ స్తేఒన్యా మితిధానీ*కరణాధికరణయోశ్చ 'ఇతిల్యుట్-రాజ్ఞాంధానీ-రాజధానీ *'కృద్యోగా చ షష్ఠీ సమస్యతే' ఇతి వక్తవ్యాత్సమాసః-తాం=ప్రధాననగరీం + 'ప్రధాననగరీరాజ్ఞాం రాజధానీతి కథ్యతే' ఇతి శబ్దార్ణవే, గత్వా=ప్రాప్య, సద్యః, కాముకత్వస్య=విలాసితాయాః + 'విలాసీ కాముకః కామీ స్త్రీపరో రతిలమ్పటః' ఇతిశబ్దార్ణవే, అవికలం=సమగ్రం, ఫలం=ప్రయోజనం, లబ్ధా=లప్స్యతే, త్వయేతి శేషః *కర్మణి లుట్, కుతః, యత్=యత్కారణాత్, తత్, స్వాదు=మధురం, చలాఊర్మయోయస్యతత్=చలోర్మి=తరఙ్గితం, వేత్రవత్యా నామ నద్యాః,పయః, సభ్రూభఙ్గం=భ్రుకుటియుక్తం=దశనపీడయేతిభావః, ముఖమివ=అధరమివేత్యర్థః, తీరోపాన్తే-తటప్రాన్తే.యత్-స్తనితం=గర్జితం-తేనసుభగం యథాతథా-స్తనితశబ్దేన మణిత మపి ధ్వన్యతే+'ఊర్ధ్వముచ్చలితకణ్ఠనాసికం హుఙ్కృతం మణిత మభ్రఘోషవత్' ఇతి లక్షణమ్; పాస్యసి *పిబతే ర్లృట్ + 'కామినా మధరాస్వాదః సురతా దతిరిచ్యతే' ఇతి శాస్త్రనియమా దితి భావః.

దిక్షు = దిక్కులయందు, ప్ర...ణామ్—ప్రథిత=ప్రసిద్ధమైన - విదిశా లక్షణామ్ = విదిశయను పేరుగలదైన, తేషామ్=ఆదేశముయొక్క, రాజధానీమ్ = రాజుండెడు ప్రధాన నగరమునకు, గత్వా = పోయి, సద్యః=తత్క్షణమే, కాముకత్వస్య = విలాసవంతుడవగుటకు, అవికలమ్ = పూర్ణమైన, ఫలమ్ = ప్రయోజనము, లబ్ధా = పొందఁబడును; (ఏల అట్టిఫలము కలుగుననఁగా:—) యత్ = ఎందుచేత, తత్ = ప్రసిద్ధమయిన, స్వాదు = మధురమైన, చలోర్మి — చల = చంచలములయిన - ఊర్మి = తరంగములుగలదైన, వేత్రవత్యాఃపయః = వేత్రవతీనదియొక్క జలమును, సభ్రూభఙ్గమ్=బొమముడితోఁ గూడుకొన్న (దంతక్షతపీడచేసనిభావము), ముఖమివ = అధరమునుంబోలె, తీర...గమ్—తీర = గట్టుయొక్క-ఉపాన్త = చెంతయందు - స్తనిత = ఉఱుముచేత - సుభగమ్ = మనోహరముగా (స్తనితశబ్దముచే మణితము ధ్వనించుచున్నది), పాస్యసి = పానముచేయుదువో - అందుచేత అనిశేషము. కాముకులకు అధరాస్వాదము సురతముకన్న ఆహ్లాదకరమని శాస్త్రనియమము.

తా.—దశార్ణదేశమున రాజధాని విదిశ యనునది దిక్ప్రసిద్ధమై యున్నది. అచటికి పోయిన నీవు వెంటనే విలాసితయొక్క పూర్ణఫలమును పొందుదువు. అది ఏమనఁగా—అచటనుండు వేత్రవతీనదియొక్క చంచలములయిన చిన్నతరంగములతోఁడి జలమును గట్టునొద్ద మణితమువోలె నుఱుముచు బొమముడితోడి యధరోష్ఠమునుంబోలె ఆస్వాదింతువు.

వ.—'దిక్షుప్రథిత' అనుటచే విదిశాశబ్దమునకు 'విఖ్యాతా దిక్షు' దిక్కులలో ప్రసిద్ధమైనది అని వ్యుత్పత్తి ధ్వనితమవుచున్నది. 'ప్రథిత'—భోగములకు పేరుపొందిన నెఱజాణలకు 'సభ్రూభఙ్గమ్'—అధరచుంబనమందలి దంతక్షతివలనిపీడచే బొమముడి కలుగును. 'సద్యః' వెంటనే ఫలము గలుగుననుట అవశ్యము పోవలయునని మేఘునికి ఆశ కలిగించుటకు. 'అవికలం ఫలమ్' కాముకులకు అధరాస్వాదము సురతముకంటె ఆహ్లాదకరము కావున ఆఫలము అవికలమని అనఁగా పూర్ణమని చెప్పఁబడినది. 'గత్వా'—కాముకుఁడైనవాఁడు నెఱజాణలనుకోరి రాజధానులకు పోయి నట్లనిభావము. 'పాస్యసి' అనుటచే మహానదులయందు జలపానము చేయుటయను మేఘుస్వభావము చెప్పఁబడినది. అధరపానముకన్న ఎక్కువగా సురతాదికమును అపేక్షించుచో మేఘము నదిలో పడి అనఁగా వర్షించి నష్టిపొందును గావునఆఫలము వికలమే అవును, అధరాస్వాదమాత్రమయిన అవికలమవును. 'వేత్రవత్యాః' బెత్తముకలది గావున నీవు ఆజాణకు తృప్తిగా నాగరకవృత్తిగా అధరాస్వాదము చక్కఁగా చేయవేని నిన్ను బెత్తముతోఁగొట్టి మఱియుమఱియు ఆస్వాదింపుమనియు దండించును - ఇదియే అవికలఫలము. 'స్తనితసుభగమ్'—సుభగమనుటచే కఠోరమైన యుఱుముగాక మణితధ్వనివంటి మంద్రగంభీరమైన యుఱుము చెప్పఁబడినది.

నీచై రాఖ్యం గిరి మధివసే స్తత్ర విశ్రామ హేతో
స్త్వత్సంపర్కా త్పులకితమివ ప్రౌఢపుష్పైః కదమ్బైః
యః పణ్యస్త్రీరతిపరిమళోద్గారిభి ర్నాగరాణా
ముద్దామాని ప్రథయతి శిలావేశ్మభి ర్యౌవనాని. 26.

నీచైరితి.—హే మేఘ, తత్ర=విదిశాసమీపే, విశ్రామో=విశ్రమః = ఖేదాపనయః * భావార్థే ఘఞ్ ప్రత్యయః-స ఏవ హేతుః-తస్య = విశ్రామహేతోః=విశ్రామకారణాత్-విశ్రామార్థమిత్యర్థః * 'షష్ఠీ హేతుప్రయోగే' ఇతిషష్ఠీ * విశ్రామేత్యత్ర *'నోదాత్తోపదేశస్య మాన్తస్యానాచమేః' ఇతి పాణినీయే వృద్ధిప్రతిషేధేఽపి*'వాశ్రమోః' ఇతి చాన్ద్రవ్యాకరణే వికల్పేన వృద్ధివిధానా ద్రూపసిద్ధిః, ప్రౌఢపుష్పైః=ప్రబుద్ధకుసుమైః, కదమ్బైః=నీపవృక్షైః, త్వత్సంపర్కాత్ = తవసఙ్గాత్, పులకా అస్యసంజాతాః పులకితః *తారకాదిత్వా దితచ్ప్రత్యయః, పులకితమివ=సంజాతపులకమివ-స్థితం, నీచైరి త్యాఖ్యా యస్య తం నీచైరాఖ్యం-గిరి మధివసేః-గిరౌ వసేరిత్యర్థః*'ఉపాన్వధ్యాఙ్వసః' ఇతికర్మత్వం, యో=నీచైర్గిరిః, పణ్యాః = క్రయ్యాః-స్త్రియః-పణ్యస్త్రియః=వేశ్యాః+'వారస్త్రీ గణికా వేశ్యా పణ్యస్త్రీ రూపజీవినీ' ఇతి శబ్దార్ణవే-తాసాం రతిషు యః-పరిమళో=గన్ధవిశేషః+ 'విమర్దోత్థే పరిమళో [illegible]

మనోహరే' ఇత్యమరః-తథా-ఉద్గిరన్తి=ఆవిష్కుర్వన్తి-ఇతి తథోక్తాని-తైః, శిలావేశ్మభిః=కన్దరైః, నాగరాణాం = పౌరాణామ్, ఉద్దామాని = ఉత్కటాని, యౌవనాని, ప్రథయతి = ప్రకటయతి-ఉత్కటయౌవనాః క్వచిదనురక్తా వారాఙ్గనా విస్రమ్భవిహారకాఙ్క్షిణో మాత్రాదిభయా న్నిశీథసమయే కంచన వివిక్తం దేశమాశ్రిత్య రమన్తే-తచ్చాత్ర బహుళమస్తీతి ప్రసిద్ధిః. అత్రోద్గారశబ్దో గౌణార్థత్వాన్న జుగుప్సావహః. ప్రత్యుత కావ్యస్యాతిశోభాకర ఏవ-తదుక్తం దణ్డినా 'నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాదిగౌణవృత్తి వ్యపాశ్రయమ్। అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే' ఇతి.

(హే మేఘ = ఓ మేఘుఁడా), తత్ర = ఆవిదిశానగరమునకు సమీపమున, విశ్రామహేతోః = విశ్రాంతికొఱకు, ప్రౌఢపుష్పైః = వికసించిన పుష్పములుకలవైన, కదమ్బైః = కడిమిచెట్లచేత, త్వత్సంపర్కాత్—త్వత్ = నీతోడి - సంపర్కాత్ = కూటమివలన, పులకితమివ = గగుర్పాటునొందియుఁబోలె, (స్థితమ్ = ఉన్నటువంటి), నీచైరాఖ్యమ్ = 'నీచైః' అను పేరుగలదైన, గిరిమ్ = కొండను, అధివసేః = అధివసింపుము, (కొండయందు వసింపుము), యః = ఏనీచైర్గిరి, ప...భిః—పణ్యస్త్రీ = వేశ్యలయొక్క - రతి = సురతములయందలి - పరిమళ = గంధవిశేషమును - ఉద్గారిభిః = వెడలఁగ్రక్కునవియైన, శిలావేశ్మభిః = రాతియిండ్లచేత (గుహలచేత), నాగరాణామ్ = పౌరులయొక్క, ఉద్దామాని = ఉత్కటములయిన, యౌవనాని = యౌవనములను, ప్రథయతి = ప్రకటించునో (ఉత్కటయౌవనలయిన వారాంగనలు ఎవరియందేని అనురక్తలై వారితో స్వేచ్ఛావిహారము గోరి తల్లి మొదలగువారి భయముచేత నిశీథసమయమున ఏదేనొక యేకాంతప్రదేశముచేరి క్రీడలం జేయుదురు. అది ఇచట విశేషముగా కలదని ప్రసిద్ధి).

తా.—ఆ రాజధానినుండి ఆవలికి జరిగి నీచైర్గిరియందు విశ్రమింపుము. ఆగిరియు మిత్రుండవైన నీవు వచ్చినందులకు సంతోషించును, నిన్ను కవుఁగిలించినందుచేత గగుర్పొన్నదియుఁబోలె నీసంపర్కమువలన వికసించిన పుష్పములుకల కదంబవృక్షములచే నగపడును. మఱియు నాగిరియం దొకవినోదము కలదు. ఏమనిన అందలి కందరములయందు నగరపురుషులు వారస్త్రీలను గవసిన రతిపరిమళములు కల్పించుచు వారి యుత్కట యౌవనములను ప్రకటించుచుండును.

వి.—'గిరిమ్'—మేఘము కొండలయందు నిలుచుట స్వాభావికము కాన నీచైర్గిరి యందు విశ్రాంతిపొందు మని చెప్పుచున్నాఁడు. 'సంపర్కాత్' - కౌఁగిలింతచేతననిస్ఫురించుచున్నది. 'పులకితమ్' మేఘపర్వతములకు సహజమైత్రి గావున ఇట్లు వర్ణించినాఁడు. 'ప్రౌఢ' వికసించిన-అనుట పులకసామ్యముకొఱకు. 'పణ్యస్త్రీ'-వేశ్యలు

ళయితము సురతార్థినులై వచ్చిరనుటచేయావనముయొక్క ఉత్కటత్వము తెలియుచున్నది. పణ్యస్త్రీలు గావుననే రతిపరిమళముకదంబించుచున్నది. 'పరిమళ'-వేశ్యలు గావున భోగవిశేషములకు విమర్దాతిశయమునకును ఆస్పదము, కావున పరిమళము చెప్పఁబడినది. 'నాగరాణాం శిలావేశ్మభిః'-నాగరులయినను శిలాతిపలకలమీఁద క్రీడించిరనుటచే వారియావనోత్కటత తెలియనగుచున్నది. 'వేశ్మభిః' అను బహువచనము అట్టి క్రీడోపయోగిస్థానములు ఆకొండయందు అనేకములుకలవని తెలుపుచున్నది. 'ప్రథయతి'-అంతరంగమిత్రు లిట్టివినోదముల నొకరొకరికి చూపుదురు కావున నీమిత్రుఁడైననీచైర్గిరి ఈవినోదములను నీకు చూపించుచు సత్కారి త్రిప్పు నని భావము. ఈవర్ణనమున ఆచోటు కాముకులకు దర్శనీయముగాను ఉత్కణ్ఠాజనకముగాను ఉండుననియు అందువలన విశ్రాంతికై నిలుచుటకు తగినదనియు భావము.

విశ్రాన్తః స న్వ్రజ వననదీతీరజాతాని సిఞ్చ
న్నుద్యానానాం నవజలకణై ర్యూథికాజాలకాని
గణ్డస్వేదాపనయనరుజాక్లాన్తకర్ణోత్పలానాం
ఛాయాదానా త్క్షణపరిచితః పుష్పలావీముఖానామ్. 27.

విశ్రాన్త ఇతి.—విశ్రాన్తః సన్=తత్రనీచైర్గిరౌ వినీతాధ్వశ్రమః సన్, వనే = అరణ్యే-యానద్యస్తాసాంతీరేషు-జాతాని =స్వయంరూఢాని-అకృత్రిమాణీత్యర్థః-'నద నదీ—' ఇతిపాఠే * 'పుమాన్ స్త్రియా' ఇత్యేకశేషో దుర్వారః, ఉద్యానానామ్ = ఆరామాణాంసంబన్ధీని, యూథికాజాలకాని = మాగధీకుసుమముకుళాని + 'అథ మాగధీ గణికా యూథికా' ఇత్యమరః + 'కోరక జాలక కలికా కుడ్మల ముకుళాని తుల్యాని' ఇతి హలాయుధః, నవజలకణైః, సిఞ్చన్=ఆర్ద్రీకుర్వన్-అత్ర సిఞ్చతేరార్ద్రీకరణార్థత్వా ద్ద్రవద్రవ్యస్య కరణత్వం-యత్ర తు క్షరణ మర్థ స్తత్ర ద్రవద్రవ్యస్య కర్మత్వం-యథా † 'రేతః సిక్త్వా కుమారీషు' 'సుఖై స్త్రిషిఞ్చన్త మివామృతం త్వచి' ఇత్యేవమాది-[illegible]కిరతిత్యాదీనామపి 'రజః కిరతిమారుతః' 'అవా కిరన్ వయోవృద్ధా స్తంలాజైః పౌరయోషితః' ఇత్యాది ష్వర్థభేదాశ్రయణేన తజ్జో లాజాదీనాం కర్మత్వ కరణత్వే వేదితవ్యే, తథా, గణ్డయోః = కపోలయోః-స్వేదస్య-అపనయనేన=ప్రమార్జనేన-యా-రుజా = పీడా * భిదాదిత్వా దఙ్ ప్రత్యయః-తయా-క్లాన్తాని=మ్లానాని-కర్ణోత్పలాని యేషాం తేషాం తథోక్తానాం, పుష్పాణి [illegible] న్తీతి-పుష్పలావ్యః=పుష్పావచాయికాః స్త్రియః* 'కర్మణ్యణ్' * 'టిడ్ఢాణఞ్ [illegible] తాసాం-ముఖానాం, ఛాయాదానాత్ = అనాతపస్య [illegible]

దానం చ ధ్వన్యతే + 'ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' ఇత్యమరః-కాముకదర్శనా త్కా-ముకీనాం ముఖవికాసో భవతీతి భావః, క్షణపరిచితః = క్షణం సంస్పృష్టః సన్-నతుచిరం-కార్యవిలమ్బనాత్, వ్రజ = గచ్ఛ.

(తత్ర = ఆనీచైర్గిరియందు), విశ్రాన్తః సన్ = మార్గాయాసము తీర్చుకొన్నవాఁడవై, వన...ని—వన = అరణ్యమందలి-నదీ = ఏళ్లయొక్క- తీర = గట్లయందు-జాతాని = పుట్టినవానిని, ఉద్యానానామ్=తోఁటలయొక్క, యూథికాజాలకాని = అడవిమొల్లమొగ్గలను, నవజలకణైః=క్రొత్తనీటిబిందువులతో, సిఞ్చన్ = తడుపుచు, (తథా = మఱియు), గణ్డ...నామ్—గణ్డ = చెక్కిళ్లయందలి-స్వేద= చెమటయొక్క - అపనయన=తుడుచుటచేతనయిన - రుజా = పీడచేతను - క్లాన్త= వాడిన - కర్ణోత్పలానామ్=చెవులయందలి కలువలుగలవైన, పుష్పలావీముఖానామ్—పుష్పలావీ = పువ్వులుకోయు స్త్రీలయొక్క- ముఖానామ్ = మొగములకు, ఛాయాదానాత్ - ఛాయా = నీడయొక్క - దానాత్ = ఇచ్చుటచేత (కాంతిదానముకూడ ధ్వనించుచున్నది.-కాముకదర్శనముచేత కామినులకు ముఖవికాసము కలుగునని భావము), క్షణపరిచితః—క్షణ = అల్పకాలము - పరిచితః = తగిలినవాఁడవై (చాలసేపున్నం గార్యవిలంబ మగునని భావము), వ్రజ = పొమ్ము.

తా.—నీచైర్గిరియందు విశ్రమించి మరల పయనమై పోవుచు అడవియేళ్లగట్టులయందు తోఁటలలో స్వయముగా మొలచిన యడవిమల్లెమొగ్గలను నీవే మొదటి మేఘమవగుటచే తొలిమాఱు నీటిచినుకులతో తడుపుము. మఱియు నాతోఁటలయందు పువ్వులుకోయుచుండుపుష్పలావికలు అలనీయుందురు, వారిచెక్కిళ్ల చిఱుఁజెమ్మటను పలుమాఱు తుడుచుటచేవారికర్ణాభరణములయినకలువలు వాడియుండును, అట్టి యాకర్ణావతంసములు కలవైన వారిముఖములకు నీవు ఇంచుకంత సేపు నీడను (కాంతిని) గలుగఁజేసి వారికి మిత్రుఁడవు గమ్ము. వారి ముఖసౌందర్యమును నాకార్య గౌరవముచే క్షణముసేపుమాత్రమే అనుభవించి అవతలికి పొమ్ము.

వ.—'విశ్రాన్తః'-యూథికలనెడు బహునాయికలనుగవయఁబోవుచున్నాఁడుగావున విశ్రాంతి అత్యావశ్యకము. 'వననదీతీరజాతాని'—ఆయూథికానాయికలు అడవియేటులయొద్దనునే పుట్టి పెరిగినవారు. 'జాతాని'—ఆయడవిమల్లెలు స్వయముగా మొలచినవేగాని ఎవరును వానిని మొలవవేయలేదు. 'సిఞ్చన్'—ఆయూథికానాయికలకు నిషేకముచేయుచు. 'ఉద్యానానామ్'—ఆయూథికానాయికలు కామక్రీడాయోగ్యములయిన తోఁటలలో నుందురు. 'యూథికాజాలకాని'—మొగ్గలుగానున్న యూథికలు అనఁగా కన్యావస్థలోనున్న నాయికలు. అందుచేతనే

వారికి 'నవజలకణైః'—'నవ'—నీవేకన్నె ఱికము తీర్పుదువు, నీవే ప్రథమమేఘమవు గావున ఇంతకు పూర్వము ఆ యూథికలు వానచినుకుల నెఱుఁగవు. 'కణైః'—పాదులో ఎంతయు సమృద్ధిగా నీరు పోయుటకంటె మొగ్గలమీఁద వానచినుకులు కొంచెము కురిసిన మిగుల పుష్టిగా అధికపరిమళముతో ఆ మొగ్గలు వికసిల్లును. 'గణ్డస్వేదాపనయనరుజా'—గండముమీఁద వస్త్రముండదు గావున దానిమీఁది చిఱుఁజెమట చీర కంటుకొనిపోక అట్లే యుండును, గండమున కొంత యలంకారముగా నుండును, అధికమైనప్పుడు దానిని 'అపనయన' తుడుచుకోవలసియుండును. 'స్వేద'-ఈ దినములు చెమరుకలుగుచు ఆఱిపోవుచునుండు తొలకరి దినములు కావున చెమరు కలుగును, పుష్పలావికలు పెయిలుక త్తెలు గావున ఆ చెమరును చేతులతోఁగాని చీర చెంగుతోఁగాని తుడువక పుష్పలావికలగుటచే 'కర్ణోత్పల'-అందఱికన్న తామే అవతంసాది పుష్పాభరణములు సమృద్ధిగా ధరింతురు గావునను, చెక్కిటిని తుడుచు సాధనము అవతంసోత్పలము చెక్కిటికడనే 'కర్ణ'-చెవియందే ఉండుటచే దూరస్థసాధనమును కోరక ఆ యవతంసోత్పలముతోనే తుడుచుకొందురు. 'ఉత్పల'—చల్లఁగాను పరిమళించుచును మృదువుగాను ఉండును గావున చెమరు తుడుచుకొనుటకు మిగుల నుత్తమసాధనము. 'క్లాన్త'—వాడినదానిని పాఱవేసి మఱియొకదానిని ధరింపరాదాయనిన, చెమరు తుడుచుటచే ఏపాటి వాడును? కొంచెమే వాడును. మఱియు ఆ యవతంసోత్పలమే ఒకవేళ చెక్కిటిమీఁదికిజాఱియుండునట్లే ధరింపఁబడి గాలిమొదలైన కారణములచే కదలినప్పుడు ఆ చెక్కిటియందలి చెమటను వారి ప్రయత్నములేకయే హరించి వారికి తెలియకయే వాడియుండును. వారికి తెలిసినప్పుడు దానిని తీసివైచి వాడనిదానిని ధరింతురు. 'ముఖానాం పరిచితః'-నీనీడ కలుగఁగానే వారు మొగమెత్తి నిన్ను చూతురు, కడమ యవయవములెల్లను నట్లే యుండఁగా మొగముమాత్రమే హర్షముతో నీవైపు మరలుటచే నీ ప్రధానపరిచయము మొగముతోనే అనియు, నీకును తన్ముఖవికాసదర్శనముచేతనే ప్రధానముగా హర్షము కలుగును గావునను, 'ముఖానాం పరిచితః' అనుట. 'పుష్పలావీ'—ఇతరులయిన యాటవికస్త్రీలను జెప్పక పుష్పలావికలను జెప్పుట వారు సరసురాండ్రును (కామదూతికలును) శిథిలవ్రతలును కాముకాధీనలును కావున. అందుచేతనే వారి ముఖములకు సరసుఁడయిన మేఘునిఁ జూడగానే 'ఛాయా'— వికాసము కలుగును. 'క్షణ'-చిరకాలమున్న నాకార్యము చెడును - కనుక దారిని పోవుచునే వారికి ఛాయను ఇత్తువుగాని నిలిచి ఆలస్యము చేయకుము; పోవుచున్న నీ ఛాయ యొకడను ఎంతసేపు అడ్డగించునో అంతసేపే వారికి నీడ; అది కొంచెము కాలము మాత్రముండును గావున 'క్షణ' యనుట.

వక్రః పన్థా యదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం
సౌధోత్సఙ్గప్రణయవిముఖో మాస్మభూ రుజ్జయిన్యాః
విద్యుద్దామస్ఫురితచకితై ర్యత్ర పౌరాఙ్గనానాం
లోలాపాఙ్గై ర్యది న రమసే లోచనై ర్వఞ్చితః స్యాః. 28.

వక్ర ఇతి.—ఉత్తరాశామ్=ఉదీచీం దిశం ప్రతి, ప్రస్థితస్యభవతః, పన్థాః=ఉజ్జయినీమార్గః, వక్రోయదపి=దూరోయద్యపీత్యర్థః-విన్ధ్యాదుత్తరవాహిన్యా నిర్విన్ధ్యాయాః ప్రాగ్భాగే కియత్యపిదూరే స్థితోజ్జయినీ-ఉత్తరాపథస్తు నిర్విన్ధ్యాయాః పశ్చిమ ఇతివక్రత్వం, తథాపి, ఉజ్జయిన్యాః = విశాలానగరస్య + 'విశాలోజ్జయినీసమే' ఇత్యుత్పలః, సౌధానామ్-ఉత్సఙ్గేషు = ఉపరిభాగేషు-ప్రణయః=పరిచయః + 'ప్రణయః స్యాత్పరిచయే యాచ్ఞాయాం సౌహృదేఽపి చ' ఇతియాదవః-తస్య-విముఖః=పరాఙ్ముఖో, మాస్మభూః=నభవే రిత్యర్థః * 'స్మోత్తరేలఙ్చ'ఇతిచకారాదాశీరర్థే లుఙ్ *'నమాఙ్యోగే' ఇత్యడాగమప్రతిషేధః, యత్ర=ఉజ్జయిన్యాం, విద్యుద్దామ్నాం =విద్యుల్లతానాం-స్ఫురితేభ్యః = స్ఫురణేభ్యః-చకితైః-భీతైః-లోలాపాఙ్గైః=చఞ్చలకటాక్షైః, పౌరాఙ్గనానాం, లోచనైః నయనైః, నరమసేయది, వఞ్చితః=ప్రతారితః, స్యాః, జన్మవైఫల్యం భవే దిత్యర్థః.

ఉత్తరాశామ్ = ఉత్తరదిక్కునకు, ప్రస్థితస్య = బయలువెడలిన, భవతః = నీకు, పన్థాః = ఉజ్జయినీమార్గము, వక్రః యదపి = చుట్టయినను, ఉజ్జయిన్యాః = ఉజ్జయినీనగరముయొక్క, సౌధో...ఖః-సౌధ = మేడలయొక్క-ఉత్సఙ్గ = ఉపరిభాగములయొక్క - ప్రణయ = పరిచయమునకు - విముఖః = పెడమొగముపెట్టినవాఁడవు; మాస్మభూః = కాకుము; యత్ర=ఏయుజ్జయినియందు, విద్యు...తైః—విద్యుద్దామ = మెఱుపుఁదీఁగలయొక్క- స్ఫురిత=మెఱయుటలనుండి - చకితైః=బెదరినవియు, లోలాపాఙ్గైః - లోల = చంచలములగు - అపాఙ్గైః = కటాక్షములుకలవియు, (అయిన), పౌరాఙ్గనానామ్ = నగరస్త్రీలయొక్క, లోచనైః = నయనములతో, నరమసేయది = క్రీడింపవేని, వఞ్చితః = మోసపోయినవాఁడవు, స్యాః =అగుదువు, (అనఁగా జన్మ నిష్ఫలమగును అని యర్థము).

తా.—తిన్నగా ఉత్తరదిక్కునకు పోవలసిన నీకు ఉజ్జయినికి పోవుట చుట్టుదారి అయినను ఉజ్జయినీసౌధముల యొక్క పరిభాగములయందు నిలువకమాత్రము పోవలదు. అచటి జాణలయొక్క [నీమెఱుపులకు] బెదరిన చూపుల విలాసములను చూడవేని నీయీజన్మము వ్యర్థము సుమా.

వ.—'ఉత్తరాశామ్'-స్త్రీలింగస్వారస్యముచేత ఉత్తరదిక్కు-నెడునాయికను కూర్చియని ధ్వనించుచున్నది. 'ఉజ్జయిన్యాః సౌధోత్సఙ్గ'—బహుభోగములను ఇచ్చునట్టి యుజ్జయినీ నాయికయొక్క మేడనెత్తములనెడి యొడితో పరిచయము చేసికొనక - అనఁగా ఆనాయికను పొందక - పోవుట యుచితముకాదు. 'పౌరాఙ్గనానామ్'-పౌరాంగనలు జాణలు, వీక్షణాదివిలాసములకు జన్మభూములు, వారి సాధారణదృష్టులవిలాసములే అమోఘములు, 'చకితైః'—చకితదృగ్విలాసములను జెప్పవలయునా? అట్టి చకితదృగ్విలాసములను అనుభవించుటకు సాధనము నీయందే యున్నది. 'విద్యుద్దామస్ఫురిత'—నీమెఱపు మెఱయుటయే అందుల సాధనము. కావున నీకు తృప్తియగువఱకు ఆజాణలను మెఱపులచే వెఱపించి వారి బెదరు చూపులను నీవు చూడవచ్చును. 'లోలాపాఙ్గైః' - చంచలకటాక్షములే బెదరునకు ఫలము, అవియే నీకు 'వఞ్చిత'—జన్మసాఫల్యమును కలిగించునవి. జన్మమెత్తిన వానికి వానిం జూచుటకన్నభాగ్యముండదు. అవి అంత రమణీయములు. అట్టి లోలాపాంగములయిన 'నయనైః'—నయనములతో 'యది న రమసే'—క్రీడింపవేని - అనుటచే నీకిచ్చయయినపౌరాంగనలనెల్ల మెఱసి బెదరించి చూపులుచూచి, పిమ్మట వారు భయముతీఱియున్నప్పుడు మరల ఆకస్మికముగా మెఱసి బెదరించి చూపులు చూచుచు, ఇట్లు తనివితీఱువఱకు వారితో క్రీడింపవచ్చును, అని భావము. అట్టి దృగ్విలాసములను చూచు మహానందములో ప్రయాణమునకుఁ గలుగువిలంబము ఒక లెక్కలోనిదే కాదనియు కావుననే 'వక్రః పన్థా అపి'-చుట్టుదారియైనను పోవలసిన దనియు భావము.

వీచిక్షోభ స్తనితవిహగశ్రేణికాఞ్చీగుణాయాః
సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః
నిర్విన్ధ్యాయాః పథి భవ రసాభ్యన్తరః సన్నిపత్య
స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు. 29.

సంప్ర త్యుజ్జయినీం గచ్ఛత స్తస్య మధ్యేమార్గం నిర్విన్ధ్యాసంబన్ధ మాహ వీచీతి.—హే మేఘ, పథి=ఉజ్జయినీపథే, వీచిక్షోభేణ=తరఙ్గచలనేన- స్తనితానాం=ముఖరాణాం * కర్తరి క్తః-విహగానాం = హంసానాం-శ్రేణిః=పఙ్క్తిః-రేవ-కాఞ్చీ గుణో యస్యా స్తస్యాః, స్ఖలితేన=ఉపలస్ఖలనేన మదస్ఖలితేన చ-సుభగం యథా తథా సంసర్పన్త్యాః=ప్రవహన్త్యా గచ్ఛన్త్యాశ్చ, తథా, దర్శితా=ప్రకటితా-[illegible] మ్భసాం భ్రమ ఏవ నాభి ర్యయా + 'స్యా దావర్తోఽమ్భసాం [illegible]

ప్రాక్ప్రస్థా విన్ధ్యాన్నిర్విన్ధ్యా నామ నదీ * 'నిరాదయః క్రాన్తాద్యర్థే పఞ్చమ్యా' ఇతి సమాసః * 'ద్విగుప్రాప్తాపన్నాలమ్'—ఇత్యాదినా పరవల్లిఙ్గతాప్రతిషేధః - తస్యా నద్యాః, సన్నిపత్య = సంగత్య, రసః=జలమ్- అభ్యన్తరే యస్యసః-అన్యత్ర-రసేన =శృఙ్గారేణ - అభ్యన్తరః=అన్తరఙ్గః, భవ-సర్వథా తస్యా రస మనుభవేత్యర్థః + 'శృఙ్గారాదౌ జలే వీర్యే సువర్ణే విషశుక్రయోః। తిక్తాదావమృతే చైవ నిర్యాసే పారదే ధ్వనౌ। ఆస్వాదే చ రసం ప్రాహుః' ఇతి శబ్దార్ణవే, నను తత్ప్రార్థనా మన్తరేణ కథం తత్రానుభవో యుజ్యత ఇత్యత ఆహ స్త్రీణామితి.— స్త్రీణాం ప్రియేషు విషయే, విభ్రమః = విలాస ఏవ, ఆద్యం ప్రణయవచనం = ప్రార్థనావాక్యం, హి, స్త్రీణా మేష స్వభావో య ద్విలాసైరేవ రాగప్రకాశనం నతు కణ్ఠత ఇతి భావః. విభ్రమ శ్చాత్ర నాభిసందర్శ నాది రుక్త ఏవ.

ఉజ్జయినికై తూర్పుగా తిరిగిపోవు మేఘునికి దారిలో నిర్వింధ్యానదితోఁ గలుగు సంబంధమును చెప్పుచున్నాఁడు.

(హే సఖే = ఓయిమిత్రుఁడా), పథి = ఉజ్జయినీమార్గమందు, వీచి...యాః —వీచి = అలలయొక్క- క్షోభ = చలనముచేత- స్తనిత = ధ్వనించుచున్న - విహగ = పక్షులయొక్క - శ్రేణి = వరుసయే - కాఞ్చీగుణాయాః= మొలనూలుగాఁ గలదియు, స్ఖలితసుభగమ్ - స్ఖలిత = జాఱుటచేత (మదస్ఖలనముచేతనని అర్థాంతరము) - సుభగమ్=సొంపుగా, సంసర్పన్త్యాః = ప్రవహించుచున్నదియు (నడచుచున్నదియు), దర్శితావర్తనాభేః—దర్శిత = ప్రకటింపఁబడిన - ఆవర్త = సుడి అనెడు = నాభేః - బొక్కిలిగలదియు, (అగు), నిర్విన్ధ్యాయాః = నిర్వింధ్యయనెడు నదితో, సన్నిపత్య = సంగమించి, రసాభ్యన్తరః—రస=జలము - అభ్యన్తరః = లోపలఁగలవాఁడవు (రస = శృంగారముచేత - అభ్యన్తరః = అంతరంగుఁడవు అని యర్థాంతరము), భవ = కమ్ము (అన్నివిధములను రసమనుభవింపుము అని భావము), (దానిప్రార్థనలేక దాని నెట్టు కవయుదు ననిన), స్త్రీణామ్= స్త్రీలకు, ప్రియేషు = ప్రియులవిషయమై, విభ్రమఏవ = విలాసమే, ఆద్యమ్ = మొదటిదైన, ప్రణయవచనంహి = ప్రార్థనావాక్యముకదా- (లోకములో స్త్రీల కిది స్వభావము, ఏమనఁగా విలాసములచేత రాగమును ప్రకటింతురేగాని వాక్కుచే ప్రకటింపరు. నాభిసందర్శనాదికము నిర్వింధ్య చూపెడు విభ్రమము.)

తా.—నిర్వింధ్య నిన్నువలచిన నాయికగా నీకడకు వచ్చును. ఎట్లనిన, అలల చలనమునకు కూసెడుపక్షులరుతమే కింకిణ్యాదిరణితముగాను, పక్షిశ్రేణియే మొలనూలుగాను, జలముజాఱుటయే మదస్ఖలనముగాను, సుడిచూపుటయే నాభిచూపుట

గాను, నీయొద్దికి వచ్చును. నీవును ఆనదిని పొంది దానిరసమును గ్రహింపుము. ఆనాయికతో సంగమించి శృంగారరసముచే ఆమెకు అంతరంగప్రియుఁడవు కమ్ము. ఎటుఁగనిదానిని అప్రార్థితుఁడనై యెట్లు కవయుదు నందువేమో, స్త్రీలు ప్రియులవిషయమై తమప్రార్థనను విభ్రమములచే తెలుపుదురుగాని నోటిమాటచే తెలుపరు, ఆవర్తనాభి ప్రకటనామలే ఆమెయొక్క ప్రార్థనను తెలుపు విభ్రమములు. కావున యథేచ్ఛముగా ఆమెతో విహరింపుము.

వ.—'వీచి' అనుటచేత వళిత్రయము స్ఫురించుచున్నది. నడుచుటయందు వళిత్రయమునకు 'క్షోభ'-చలనము కలుగునుగదా. 'విహగ'-పక్షులే కింకిణులు. 'సుభగమ్' ఇందలి యర్థాంతరమును విద్యార్థులే యూహించుకొనవచ్చును. 'నిర్విన్ధ్యా'-వింధ్యని అనఁగా మూర్ఖుఁడు అరసికుఁడునగు పతిని వదలి లేచివచ్చినది, నీవు జాణవు సరసుఁడవు నని నీయొద్దికి 'సంసర్పన్త్యాః'- చక్కఁగావచ్చుచున్నది. 'దర్శిత' తనయనురాగమను ప్రార్థనను నీకు నాభిప్రకటనచే తెలుపుచున్నది. 'ప్రియేషు'—నీవుప్రియుఁడవు, 'రసాభ్యన్తరోభవ' ఆమె మనోరథము నీడేర్పుదువుగాని-తనంతట వలచి వచ్చిన దని చులకన నేయకుము, అని లోట్ప్రయోగ స్వారస్యము.

వేణీభూతప్రతనుసలిలా సా త్వతీతస్య సిన్ధుః
పాణ్డుచ్ఛాయా తటరుహతరుభ్రంశిభి ర్జీర్ణ పర్ణైః
సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా వ్యఞ్జయన్తీ
కార్శ్యం యేన త్యజతి విధినా స త్వ యై వోపపాద్యః. 30.

నిర్విన్ధ్యాయా విరహావస్థాం వర్ణయం స్తన్నిరాకరణం ప్రార్థయతే:—

వేణీతి.—అవేణీ వేణీ భూతం = వేణ్యాకారం-ప్రతను = స్తోకంచ-సలిలం-యస్యాః సా తథోక్తా - అన్యత్ర వేణీభూత కేశపాశేతి చ ధ్వన్యతే, * రోహన్తీతి రుహాః. ఇగుపధలక్షణః క ప్రత్యయః - తటరుహా రుహా యే తరవ స్తేభ్యో భ్రశ్య న్తీతి తథోక్తైః, జీర్ణపర్ణైః శుష్కపత్రైః, పాణ్డుచ్ఛాయా = పాణ్డువర్ణా, అతఏవ, హేసుభగ, విరహావస్థయా - పూర్వోక్తప్రకారయా కరణేన, అతీతస్య = ఏతాపన్తం కాల మతీత్య గతస్య - ప్రోషితస్యేత్యర్థః, తే = తవ, సౌభాగ్యం = సుభగత్వం * 'హృ ద్భగ సిన్ధ్వన్తే పూర్వపదస్యచే' త్యుభయపదవృద్ధిః, వ్యఞ్జయన్తీ = ప్రకాశయన్తీ, స ఖలు సుభగో య మఙ్గనాః కాముయన్త ఇతి భావః, సా = పూర్వోక్తా, సిన్ధుః = నదీ నిర్విన్ధ్యాఖ్యా + 'స్త్రీ) నద్యాం నా నదే సిన్ధు ర్దేశభేదే [illegible] ఇతి వైజయన్తీ, యేన, విధినా = వ్యాపారేణ, కార్శ్యం త్యజతి స విధి [illegible] ఉపపాద్యః = కర్తవ్య ఇత్యర్థః, సచవిధి రేకత్రవృష్టి రన్యత్ర సంభోగః [illegible]

త్వా త్వా-ర్శ్యస్యేతి భావః. ఇయం పఞ్చమీ మదనావస్థా, ఉక్తం చ రతిరహస్యే
+'నయనప్రీతిః ప్రథమా చిత్తాసఙ్గ స్తతో౽థసంకల్పః। నిద్రోచ్ఛేద స్తనుతావిషయ
నివృత్తి స్త్రపానాశః। ఉన్మాదో మూర్ఛా మృతి రిత్యేతాః స్మరదశా దశైవ స్యుః'
ఇతి. 'తామతీతస్య' ఏపాఠ మాశ్రిత్య సిన్ధుర్నామ నద్యన్తరమితి వ్యాఖ్యానం తు -
సిన్ధుర్నామ కశ్చిన్నదః కాశ్మీరదేశే౽స్తి నదీ తు కుత్రాపినాస్తి - ఇత్యుపేక్ష్య మి
త్యాచక్షతే.

నిర్వింధ్యనుగురించియే చెప్పుచున్నాఁడు.—

వేణీ...లా— వేణీభూత = వేణ్యాకారమైన - ప్రతను = సూక్ష్మమైన-సలి
లా = నీళ్లుకలదియు (ఏకవేణిగానైన తలవెంట్రుకలు గలది యనియు ధ్వని),
తట...భిః—తట = గట్టునందు - రుహ = మొలచిన - తరు = చెట్లనుండి - భ్రంశి
భిః = రాలుచున్న, జీర్ణపర్ణైః = ఎండుటాకులచేత, పాణ్డుచ్ఛాయా = తెల్లనివర్ణము
గలదియు, (అందుచేతనే), (హే) సుభగ = (ఓయి) యందగాఁడా, విరహావస్థ
యా = పైచెప్పఁబడిన విరహావస్థయనెడు సాధనముచేత, అతీతస్య- ఇంతకాలము
దేశాంతరముపోయియున్నట్టి, తే = నీయొక్క, సౌభాగ్యమ్ = అందమును, వ్యఞ్జ
యన్తీ = తెలియఁజేయుచున్నదియు, (ఎవనిని స్త్రీలు కామింతురో వాఁడుగదా
సుభగుఁడు), అయిన ,సానిన్ధుః = అనది, యేన విధినా = ఏపనిచేత (నీవు ఏఁ పనిని
చేయుటచేత), కార్శ్యమ్ = కృశత్వమును, త్యజతి = విడుచునో, సఃవిధిః =
ఆపని, త్వయైవ = నీచేతనే, ఉపపాద్యః = చేయఁబడఁదగినది, (ఒకవిషయమున
వర్షించుటయు - రెండవవిషయమున సంభోగించుటయు ఆపని - యని యెఱుఁగ
వలయును. అది లేనందున ఆకార్శ్యము కలిగినది, అది కలిగిన తీఱును.)

తా.—ఆనిర్వింధ్య సంవత్సరముక్రిందట నీవు తన్నుంబాందిపోయినప్పటినుండి
నీవిరహముచేత దినదినము కృశించుచు, గట్టుమీఁదిచెట్లనుండి సంవత్సరము పొడుగు
నను రాలుచున్న యెండుటాకులనెడు విరహపాండిమ గలదై నీరుతగ్గుటచేనయినసన్న
ప్రవాహమనెడి యేకవేణిని ధరించి, నీకొఱకు విరహవ్రతమును ఆచరించుచున్నది.ఆహా
నీసౌభాగ్యము! ఎంత సుభగుఁడవుగాక నీకొఱకు ఆమె విరహవ్రత మాచరించును!
కావున నీవు వర్షించుట యనుసంగముచే ఆమెయొక్క-కార్శ్యమును తీర్పవలయును.

వ.—'వేణీ' 'పాణ్డు' - 'కార్శ్యమ్'— ఇవి విరహతాపచిహ్నములు,'వేణీ'-
విరహవ్రతచిహ్నము. 'అతీతస్య' నీవు ఆమెను గూడిపోయి సంవత్సరమైనది, అది.
మొదలుగా ఆమెకు కార్శ్యమే, దినదినమునకు నీరు తగ్గిపోవును గదా. 'వ్యఞ్జ
యన్తీ'—విరహవ్రత మాచరించునట్టి పతివ్రత పద్మిని గావలెజ్జ గావున మగని సౌభాగ్య

ము ను నోట చెప్పదు. ఆమెయవస్థను జూడఁగా ఆసౌభాగ్యము తెలియుచు న్నది. 'త్వయైవ'-ఏవ యనుట పాతివ్రత్యమును తెలుపుచున్నది. నది సన్నగిల్లిన ధ్వనియు అది వెల్లిగొనునట్లు వర్ణింపు మనియు శ్లోకభావము.

ప్రాప్యావన్తీ నుదయనకథాకోవిదగ్రామవృద్ధా
న్పూర్వోద్దిష్టా మనుసర పురీం శ్రీవిశాలాం విశాలాం
స్వల్పీభూతే సుచరితఫలే స్వర్గిణాం గాం గతానాం
శేషైః పుణ్యై ర్హృతమివ దివః కాన్తిమ త్ఖణ్డ మేకమ్. 31.

ప్రాప్యేతి.-విద న్తీతి విదాః * ఇగుపధలక్షణః కః - ఓకసో వేద్యస్థానస్య వి దాః = కోవిదాః * ఓకారలోపః పృషోదరాదిత్వా త్సాధుః - ఉదయనస్య=వత్స రాజస్య - కథానాం = వాసవదత్తాహరణాద్యత్యద్భుతోపాఖ్యానానాం - కోవి దాః = తత్త్వజ్ఞాః-గ్రామేషు యే వృద్ధా స్తే సన్తి యేషు తాన్, అవన్తీన్ = తన్నామ జనపదాన్, ప్రాప్య, తత్ర, పూర్వోద్దిష్టాం = పూర్వోక్తాం 'సౌధోత్సఙ్గప్రణయ విముఖో మా స్మభూ రుజ్జయిన్యాః' ఇత్యుక్తాం, శ్రీవిశాలాం = సంపత్తిమహతీమ్ +'శోభా సంపత్తిపద్మాసు లక్ష్మీః శ్రీరివ దృశ్యతే' ఇతిశాశ్వతః, విశాలాం పురీమ్=ఉజ్జ యినీమ్, అనుసర = వ్రజ, కథమివ స్థితామ్? సుచరితఫలే = పుణ్యఫలే - స్వర్గ భోగలక్షణే, స్వల్పీభూతే = అల్పావశిష్టే సతీత్యర్థః, గామ్ = ఇలాం, గతానాం +'గౌ రిలా కుమ్భినీ క్షమా' ఇత్యమరః - పునరపి భూలోకభాజా మి త్యర్థః, స్వర్గి ణాం = స్వర్గవతాం జనానాం, శేషైః = భుక్తావశిష్టైః, పుణ్యైః = సుకృతైః, హృతమ్=ఆనీతం - స్వర్గార్థానుష్ఠితకర్మశేషాణాం స్వర్గవాస స్యావశ్యంభావా దితి భావః, కా న్తిరస్యా స్తీతి - కా న్తిమత్ = ఉజ్జ్వలం - సారభూత మిత్యర్థః, ఏకం= ముఖ్యం - యద్వా భుక్తాదన్యత్ +'ఏకే ముఖ్యాన్యకేవలాః' ఇత్యమరః, దివః=స్వ ర్గస్య, ఖణ్డమివ స్థితా మి త్యుత్ప్రేక్షా. ఏతే నాతిక్రా న్తసకలభూలోకనగరసౌభాగ్య సారవత్త్వ ముజ్జయిన్యా వ్యజ్యతే.

ఉద...ద్ధాన్—ఉదయన = వత్సరాజుయొక్క—కథా=వాసవదత్తాహరణము మొదలగు యద్భుతోపాఖ్యానములయొక్క—కోవిద = తత్త్వము నెఱిఁగినవారయిన- గ్రామవృద్ధాన్=ఊరులపెద్దలుకలదైన, అవన్తీన్=అవన్తిదేశమును, ప్రాప్య=పొంది, (అచట), పూర్వోద్దిష్టామ్—పూర్వ=పైని-ఉద్దిష్టామ్=చెప్పఁబడినదైన, శ్రీవిశాలామ్ శ్రీ—శ్రీ = సంపత్తిచేత-విశాలామ్ = గొప్పదైన, విశాలామ్ = ఉజ్జయినీపురిని, అనుసర = పొమ్ము; (ఆపురి ఎట్టిదనఁగా), సుచరితఫలే - సుచరిత = పుణ్యము

యొక్క - ఫలే = స్వర్గభోగరూపమయిన ఫలము, స్వల్పీభూతే సతి = అల్పావశిష్టముపుచుండఁగా, గామ్ = భూలోకమునకు, గతానామ్ = మరలవచ్చినట్టి, స్వర్గిణామ్ = స్వర్గవంతులైన జనులయొక్క, శేషైః = అనుభూతావశిష్టములైన, పుణ్యైః = సుకృతములచేత, హృతమ్ = భూలోకమునకు తేఁబడిన, (స్వర్గార్థము చేసిన కర్మశేషముగలవారికి స్వర్గవాసము తప్పదుగావున అని భావము), కాన్తిమత్ = కాంతిగలదైన (ప్రకాశమానమైన - సారభూతమైన యనియర్థము), ఏకమ్ = ముఖ్యమైన - (లేక - అనుభవింపఁబడిన దానికంటె వేఱయిన), దివఃఖణ్డమివ = స్వర్గఖండమోయనునట్లు, (స్థితామ్=ఉన్నదానిని, అని 'విశాలామ్' అను దానికి విశేషణము).

తా.—నిర్వింధ్యను దాఁటి అవంతిదేశము ప్రవేశింపుము. వత్సరాజు వాసవదత్తను హరించుట మొదలైనచిత్రకథలను ఎఱిఁగినవృద్ధులు ఆదేశమందలి గ్రామములలో ఇప్పటికిని ఉన్నారు. నీవుకూడ వానిని వినవచ్చును. పిమ్మట తద్రాజధానియైన విశాలానగరమును దర్శింపుము. స్వర్గవాసులైనజనులు స్వర్గార్థమైన సుకృతము కొంత మిగిలియుండఁగానే భూలోకమునకు వచ్చుచు ఆమిగతసుకృతంపు ఫలముగా ఈలోకమునకుఁ దెచ్చుకొన్నది స్వర్గమందెల్ల సారభూతమయినఖండమే ఆవిశాలానగరము అనునట్లుగా ఆనగరము సకలసంపత్సమృద్ధముగానుండును. ఆ స్వర్గవాసులు వీరే అనఁదగినట్లుగా అందలిజనులు మహాభోగులుగా నుందురు.

వ.—'కథాకోవిదగ్రామవృద్ధాన్' - నిర్వింధ్యనుండి విశాలానగరమునకు పోవుదారిలో గ్రామములలో నీవు వాన కురియుచున్నప్పుడు జనులు అరఁగులమీఁదఁగాని చలిమంటలయొద్దఁగాని చేరి, 'కోవిద'-చక్కఁగా ఎఱిఁగిన వృద్ధులు కథలు చెప్పుటయు ఇతరులు వినుటయుఁ గా వినోదించుచుందురు. అప్పుడు నీవును విని ఆహ్లాదింపవచ్చును. కనుక ఆరవంత పయనముకూడ నీకు మనోహరముగానే యుండును. 'శ్రీవిశాలామ్' అనుట విశాలాశబ్దమునకు వ్యుత్పత్తిని ధ్వనించుచున్నది. 'స్వర్గిణామ్-దివఃఖణ్డమ్' అనుటచే ఆనగరంపు సౌభాగ్యము సకలేతరనగరసౌభాగ్యములను అతిక్రమించినదనియు, అందలిజనులు లోకాతీతభోగభాక్కులనియు, భావము. అట్టియుత్తమోత్తమనగరము గావున చుట్టుదారి యైనను పోవలయు నని భావము.

దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః

యత్ర స్త్రీణాం హరతి సురతగ్లానిమఙ్గానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః. 32.

దీర్ఘీకుర్వన్నితి.—యత్ర = విశాలాయాం, ప్రత్యూషేషు = అహర్ముఖేషు +'ప్రత్యూషోఽహర్ముఖం కల్య' మిత్యమరః, పటు = ప్రస్ఫుటం, మదకలం = మదేనావ్యక్తమధురం+'ధ్వనౌ తు మధురాస్ఫుటే కలః' ఇత్యమరః, సారసానాం = పక్షివిశేషాణాం+'సారసో మైథునీ కామీ గోనర్దః పుష్కరాహ్వయః' ఇతి యాదవః - యద్వా - సారసానాం = హంసానాం+'చక్రాఙ్గః సారసో హంసః' ఇతి శబ్దార్ణవే, కూజితం = రుతం, దీర్ఘీకుర్వన్ = సంతానయన్నిత్యర్థః - యావద్వాతం శబ్దానువృత్తేరితి భావః, ఏతేన ప్రియతమః స్వచాటువాక్యానుసారిక్రీడాపక్షికూజితమవిచ్ఛిన్నీకుర్వన్నితి చ గమ్యతే, స్ఫుటితానాం = వికసితానాం - కమలానామ్ - ఆమోదేన = పరిమళేన సహ యా - మైత్రీ = సంసర్గః - తేన - కషాయః = సురభిః +'రాగద్రవ్యే కషాయోఽస్త్రీ నిర్యాసే సౌరభే రసే' ఇతి యాదవః - అన్యత్ర విమర్దగన్ధీత్యర్థః+'విమర్దోత్థే పరిమళో గన్ధే జనమనోహరే। ఆమోదః సోఽతినిర్హారీ' ఇత్యమరః, అఙ్గానుకూలః = మాన్ద్యాత్ గాత్రసుఖస్పర్శః, అన్యత్ర గాఢాలిఙ్గనదత్తగాత్రసంవాహన ఇత్యర్థః - భవభూతినా చోక్తమ్ † అశిథిలపరిరమ్భైర్దత్తసంవాహనాని' ఇతి - సంవాహ్యన్తే చ సురతశ్రాన్తాః ప్రియై ర్యువతయః-ఏత త్కవి రేవ వక్ష్యతి - 'సంభోగాన్తే మమ సముచితో హస్తసంవాహనానామ్' ఇతి, శిప్రానామా కాచిత్తత్రత్యా నదీ - తస్యా వాతః = శిప్రావాతః - శిప్రాగ్రహణం శైత్యద్యోతనార్థం, ప్రార్థనా సురతయాచ్ఞా-తత్ర చాటు కరోతీతి తథోక్తః - పునఃసురతార్థం ప్రియవచనప్రయోక్తేత్యర్థః * కర్మణ్యణ్ప్రత్యయః, ప్రియతమః = వల్లభ - ఇవ, స్త్రీణాం, సురతగ్లానిం = పూర్వరతిఖేదం, హరతి = నుదతి, చాటూక్తిభి ర్విస్మృతపూర్వరతిఖేదాః స్త్రియః ప్రియతమప్రార్థనాం సఫలయన్తీతి భావః, 'ప్రార్థనాచాటుకారః' ఇత్యత్ర 'ఖణ్డితనాయికానునేతా' ఇతి వ్యాఖ్యానే సురతగ్లానిహరణం న సంభవతి, తస్యాః పూర్వం సురతాభావాత్-పశ్చాత్తనసురతగ్లానిహరణం తు నేదానీన్తనకోపశమనార్థ చాటువచనసాధ్య మిత్యుపేక్షైవోచితా వివేకినామ్; †జ్ఞాతేఽన్యాసఙ్గవికృతే ఖణ్డితేర్ష్యాకషాయితా' ఇతి దశరూపకే.

యత్ర = ఏవిశాలయందు, ప్రత్యూషేషు = ప్రభాతకాలములయందు, పటు = స్ఫుటమును, మదకలమ్ — మద = మదముచేత-కలమ్ = అవ్యక్తమధురమును, (అగు), సారసానామ్ = బెగ్గురుపక్షులయొక్క - లేక - హంసలయొక్క, కూజితమ్ = కూతను, దీర్ఘీకుర్వన్ = దీర్ఘముచేయుచు (గాలిపోవునంతదూరము

నాదము పోవుటచేత నని భావము - ప్రియతముని పక్షమందు తనవాక్యముల ననుసరించెడు క్రీడాపక్షులకూఁతలను తెంపులేనివానినిగాఁ జేయుచు అని ధ్వనించుచున్నది,) స్ఫుటి ... యః — స్ఫుటిత = వికసించిన - కమల = తామరల. ఆమోద = పరిమళముతోడి - మైత్రీ = చెలిమిచేత - కషాయః = పరిమళించునదియు-(సురతవిమర్దగంధముకలిగి యని ప్రియతమపరముగు నర్థము), అఙ్గానుకూలః =మాంద్యముచే స్పృశింప సుఖమును - (గాఢాలింగనముచే అవయవము లొత్తునదియు అని ప్రియతమపరము), అగు, శిప్రావాతః = శిప్రానదియొక్క-గాలి (శిప్రను చెప్పుట గాలియందు శైత్యముకొఱకు), ప్రార్థ ... రః — ప్రార్థనా = మరల సురతముకొఱకైన యాచనయందు - చాటుకారః = ప్రియవచనములు పలుకునట్టి-ప్రియతమ ఇవ = వల్లభునివలె, స్త్రీణామ్ = స్త్రీలకు, సురతగ్లానిమ్ = పూర్వరతిచేతనయిన బడలికను, హరతి = పోఁగొట్టును, స్త్రీలు చాటువచనములచే పూర్వరతిఖేదమును మఱచి మరల ప్రియతముల మనోరథమును సఫలముచేయుదురని భావము, తాం విశాలా మనుసర (31) అని అన్వయము.

తా.—ఆవిశాలానగరమందు ప్రభాతకాలములయందు చల్లని శిప్రావాయువు స్ఫుటమును మదముచే అవ్యక్తమధురము నైన హంసలనాదమును దీర్ఘముచేయుచు వికసించిన కమలముల పరిమళమును వెదచల్లుచు స్త్రీలయొక్క- సురతాయాసమును తీర్చును. అది ఎట్లుండుననఁగా ప్రియతముఁడు ప్రభాతకాలమున చాటువచనములతో పునస్సురతమునకు వేఁడుచు పూర్వసురతవిమర్దపరిమళము గలవాఁడై బిగికౌఁగిలింతలచే పూర్వసురతగ్లానిని పోఁగొట్టుచు స్త్రీని మరలఁ గవయుటవలె నుండును.

వ.—'మదకలమ్' - 'కషాయః' - ఉద్దీపకములు - కావుననే వాయువునకు ప్రియతమసామ్యము, సారసకూజితములు ఉపమేయము-ప్రార్థనాచాటువులు ఉపమానము- 'ప్రత్యూషేషు'—ప్రభాతములయందు ప్రియతములు భావివిరహాసహిష్ణువులై మరల ప్రియలతో క్రీడించుట ప్రసిద్ధము. 'ఆమోద' — వాయువునకు కమలపరిమళమును - ప్రియతమునకు పూర్వసురతవిమర్దపరిమళమును - కలవు, ఈరెంటికి సామ్యము.

హారాం స్తారాం స్తరళగుటికా న్కోటిశః శఙ్ఖశుక్తీః
శష్పశ్యామా న్మరకతమణీ నున్మయూఖప్రరోహాన్
దృష్ట్వా యస్యాం విపణిరచితా న్విద్రుమాణాం చ భఙ్గాన్
సంలక్ష్యన్తే సలిలనిధయ స్తోయమాత్రావశేషాః. ౩౨.

ఇతఃపరం ప్రక్షిప్తమపి శ్లోకత్రయం వ్యాఖ్యాయతే:—

హారానితి:— యస్యాం = విశాలాయాం, కోటిశః, విపణిషు = పణ్యవీథికాసు + 'విపణిః పణ్యవీథికా' ఇత్యమరః, రచితాన్ = ప్రసారితాన్ - ఇదం విశేషణం యథాలిఙ్గం సర్వత్ర సంబధ్యతే, తారాన్ = శుద్ధాన్ + 'తారో ముక్తాదిసంశుద్ధౌ తరణే శుద్ధమౌక్తికే' ఇతి విశ్వః, తరలగుటికాన్ = మధ్యమణీభూత మహారత్నాన్ + 'తరలో హారమధ్యగః' ఇత్యమరః - 'పిణ్డే మణౌ మహారత్నే గుటికా బద్ధపారదే' ఇతి శబ్దార్ణవే, హారాన్ = ముక్తావళీః, తథా, కోటిశః, శఙ్ఖాన్ = కమ్బూంశ్చ - శుక్తీశ్చ = ముక్తాస్ఫోటాంశ్చ + 'ముక్తాస్ఫోటః స్త్రియాం శుక్తిః శఙ్ఖః స్యాత్కమ్బుర స్త్రియామ్' ఇత్యమరః, శష్పం = బాలతృణం - తద్వచ్ఛ్యామాన్ + 'శష్పం బాలతృణం ఘాసో యవసం తృణ మర్జునమ్' ఇత్యమరః, ఉన్మయూఖప్రరోహాన్ = ఉద్గతరశ్మ్యఙ్కురాన్, మరకతమణీన్ = గారుడరత్నాని, తథా, విద్రుమాణాం భఙ్గాన్ = ప్రవాళఖణ్డాం - శ్చ, దృష్ట్వా, సలిలనిధయః = సముద్రాః, తోయమాత్రోఽవశేషో యేషాం తే తాదృశాః సంలక్ష్యన్తే = తథానుమీయన్త ఇత్యర్థః - రత్నాకరాద వ్యతిరిచ్యతే రత్న సంపద్భిరితి భావః.

ఈ మూఁడుశ్లోకములును ప్రక్షిప్తములు.

యస్యామ్ = ఏ విశాలయందు, విపణిషు = బజారులయందు, కోటిశః = కోట్లుగా, రచితాన్ = విక్రయార్థమై పఱచి పెట్టఁబడిన, (ఈ విశేషణమును లింగమును మార్చి అంతట అన్వయించుకొనవలయును), తారాన్ = శుద్ధములును, తరళగుటికాన్ - తరళ = నాయకమణులైన - గుటికాన్ = మహారత్నములు కలవియు, (నగు), హారాన్ = ముత్యాలపేరులను, (మఱియు), కోటిశః = కోట్లుగా, శఙ్ఖశుక్తీః — శంఖ = శఙ్ఖములను - శుక్తీః = ముత్తెపుఁజిప్పలను, శష్పశ్యామాన్ - శష్ప = పచ్చిగడ్డివలె - శ్యామాన్ = పచ్చనైనట్టియు, ఉన్మయూఖప్రరోహాన్ - ఉత్ = ఉద్గతములైన - మయూఖ = కిరణములయొక్క - ప్రరోహాన్ = అంకురములుకలవియు, అయిన, మరకతమణీన్ = గరుడపచ్చలను, (మఱియు), విద్రుమాణామ్ = పగడములయొక్క, భఙ్గాంశ్చ = తునకలను, దృష్ట్వా = చూచి - (చూడఁగా), సలిలనిధయః = సముద్రములు, తోయ...షాః — తోయమాత్ర = నీళ్లుమాత్రమే - అవశేషాః = మిగతగాఁగలవిగా, సంలక్ష్యన్తే = తలఁపఁబడుచున్నవో (అగుపడుచున్నవో), తాం విశాలా మనుసర (31) అని యన్వయము.

తా.— విశాలానగరమందలి బజారువీథులలో అమ్మకమునకొఱకు [illegible] నాయకమణులుగల శుద్ధమౌక్తికముల హారములను, శంఖములను, ముత్తె[illegible]

గఱికవంటి పచ్చవన్నె గలవై కిరణాంకురములతో వెలుఁగుచుండు గరుడపచ్చలను పగడపుఁదీఁగలఖండములను కోట్లుకోట్లుగా పఱచిపెట్టియుందురు. వానివిస్తారమునుం గనిన సముద్రములలోని మౌక్తికాదులెల్ల నచ్చటికే తేఁబడినవనియు మఱి సముద్రములలో నీళ్లేకాని మౌక్తికాదులు ఉండవనియు తోఁచును. ఆపురిబజారులలో మౌక్తికాదులు విస్తారముగా కలవు - అది మహాసంపత్తి సమృద్ధము. .

వ.—ముక్తా శంఖ శుక్తి మరకత ప్రవాళములు అన్నియు సముద్రమునఁ బుట్టునవి.—'సలిలనిధయః' - సకలసముద్రముల మౌక్తికాదులన్నియు ఇక్కడనే ఉన్నవి అనియు, అందుచే ఇక్కడిమౌక్తికాదులు బహువిస్తారము లనియు భావము.

"ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే,
హైమం తాలద్రుమవన మభూ దత్ర తస్యైవ రాజ్ఞః,
అత్రోద్భ్రాన్తః కిల నళగిరిః స్తమ్భ ముత్పాట్య దర్పా,"
ది త్యాగన్తూ_న్ రమయతి జనో యత్ర బన్ధూ నభిజ్ఞః. 31.

ప్రద్యోతస్యేతి.—అత్రప్రదేశే, వత్సరాజః = వత్సదేశాధీశ్వర ఉదయనః, ప్రద్యోతస్య ప్రద్యోతనామ్న ఉజ్జయినీనాయకస్యరాజ్ఞః, ప్రియదుహితరం=వాసవదత్తాం, జహ్రే = జహార, అత్రస్థలే, తస్యైవరాజ్ఞః = ప్రద్యోతస్య, హైమం = స్వార్ణం, తాళద్రుమవన మభూత్, అత్ర నళగిరిర్నామ మేన్ద్రదత్తస్తదీయోగజః-దర్పాత్ = మదాత్, స్తమ్భమ్=ఆలానమ్, ఉత్పాట్య = ఉద్ధృత్య, ఉద్భ్రాన్తః = ఉత్ప్లుత్య భ్రమణం కృతవాన్, కిల, ఇతి=ఇత్థంభూతాభిః కథాభి రిత్యర్థః, అభిజ్ఞః=పూర్వోక్త కథాకోవిదో జనః, ఆగన్తూన్=దేశాన్తరా దాగతాన్ * 'సి తని గమి'త్యాదినా ఔణాదిక స్తున్ప్రత్యయః- బన్ధూ న్యత్ర, విశాలాయాం, రమయతి = వినోదయతి, అత్ర భావికాలంకారః, తదుక్తమ్ † 'అతీతానాగతం యత్ర ప్రత్యక్షత్వేన లక్ష్యతే। అత్యద్భుతార్థకథనా ద్భావికం త దుదాహృతమ్' ఇతి.

యత్ర=ఏవిశాలానగరమందు, అత్ర=ఈచోట, వత్సరాజః=వత్సదేశ రాజగు నుదయనుఁడు, ప్రద్యోతస్య=ప్రద్యోతనుఁ డను నుజ్జయినీరాజుయొక్క, ప్రియదుహితరం = అనుఁగుఁగూఁతునువాసవదత్తను, జహ్రే=హరించెను; అత్ర = ఇచట,తస్యైవరాజ్ఞః = ఆరాజుదియే - అనఁగా - ఆప్రద్యోతునిదియే, హైమమ్ = బంగారపుదియైన, తాళద్రుమవనమ్ = తాటిచెట్లయడవి, అభూత్ = ఉండెను. అత్ర ... ఈచోట, నలగిరిః = ఆప్రద్యోతునికి ఇంద్రుఁడిచ్చిన యేనుఁగు, న[illegible]యను పేరిది, దర్పాత్ = మదముచేత, స్తమ్భమ్ = కట్టుకంబమును, ఉత్పాట్య =

వెకలించి, ఉద్భ్రాన్తః కిల = దుమికితిరిగెనుజుమా, ఇతి = ఇట్టికథలచేతను, అభిజ్ఞః = పూర్వకథల నెఱిఁగినజనుఁడు, ఆగన్తూన్ = దేశాంతరమునుండివచ్చిన, బన్ధూన్ = చుట్టములను, రమయతి = వినోదపెట్టునో; తాం విశాలా మనుసర (31) అని యన్వయము.

తా.—ఆవిశాలానగరమందు పూర్వకథ లెఱిఁగినవారు దేశాంతరమునుండి క్రొత్తగావచ్చినతమబంధువులను-ఇదిగో ఈచోట వత్సరాజు ప్రద్యోతప్రియతనయను వాసవదత్తను హరించి కొనిపోయెను-ఇదిగో ఈచోట ప్రద్యోతునిది బంగారపుది తాటిచెట్లయడవి యుండెను-ఇదిగో ఈచోట ప్రద్యోతునియేనుఁగు నలగిరియనునది మదమెక్కి ఆలానస్తంభమును పెల్లగించుకొని దుముకులాడెను! - అనునీకథలను చెప్పుచు అవి జరిగినయాయాతావులను చూపుచు వినోదపెట్టుదురు.—ఆనగరము బహువినోదచరిత్రములు జరగినస్థాన మని భావము.

> పత్త్రశ్యామా దినకరహయస్పర్ధినో యత్ర వాహాః,
> శైలోదగ్రా స్త్వమివ కరిణో వృష్టిమన్తః ప్రభేదాత్,
> యోధాగ్రణ్యః ప్రతిదశముఖం సంయుగే తస్థివాంసః
> ప్రత్యాదిష్టాభరణరుచయ శ్చన్ద్రహాసవ్రణాఙ్కైః. 35.

పత్త్రేతి.—హేజలద, యత్ర = విశాలాయాం, వాహాః = హయాః, పత్త్రశ్యామాః = పలాశవర్ణాః, అతఏవ, దినకరహయస్పర్ధినః = వర్ణతో వేగత శ్చ సూర్యాశ్వకల్పాః, తథా, శైలోదగ్రాః = శైలవదున్నతాః, కరిణః, ప్రభేదాత్ = మదస్రావాద్ధేతోః, స్త్వమివ, వృష్టిమన్తః, అగ్రం నయన్తీ త్యగ్రణ్యః * 'సత్సూద్విష' ఇత్యాదినా క్విప్ * అగ్రగ్రామాభ్యాం నయతేః' ఇతి వక్తవ్యా ణ్ణత్వం-యోధానా మగ్రణ్యః = భటశ్రేష్ఠాః, సంయుగే = యుద్ధే, ప్రతిదశముఖమ్ = అభిరావణం, తస్థివాంసః = స్థితవన్తః, అతఏవ, చన్ద్రహాసస్య = రావణాసేః - వ్రణాః = క్షతాన్యేవ, అఙ్కాః = చిహ్నాని - తైః+'చన్ద్రహాసో రావణాసౌ వనీమాత్రేఽపిచ క్వచిత్ 'ఇతిశాశ్వతః, ప్రత్యాదిష్టాభరణరుచయః = ప్రతిషిద్ధభూషణకాన్తయః, శస్త్రప్రహారా ఏవ వీరాణాం భూషణ మితి భావః - అత్రాపి భావికాలంకారః.

(హేమేఘ = ఓమేఘుఁడా), యత్ర=ఏవిశాలయందు, వాహాః = గుఱ్ఱములు, పత్త్రశ్యామాః=పత్త్ర = ఆకువలె - శ్యామాః = పచ్చవర్ణముకలవి, (అందుచేతనే), దినక...నః-దినకర = సూర్యునియొక్క—హయ = గుఱ్ఱములతో-స్పర్ధినః=ద్వేషించునవి (వర్ణమందును వేగమందును సూర్యాశ్వసమము లని భావము), (మఱియు)

శైలోదగ్రాః - శైల = కొండలవలె- ఉదగ్రాః=ఉన్నతములైన, కరిణః=ఏనుఁగులు, క్షరణాత్ = మదము ఓడుటవలన, త్వమివ = నీవలె, వృష్టిమన్తః = వర్షముకలవి (మదమును వర్షించుచుండునవి), యోధాగ్రణ్యః=భటశ్రేష్ఠులు, సంయుగే=యుద్ధమందు, ప్రతిదశముఖమ్ = రావణుని ఎదిరించి, తస్థివాంసః = నిలిచినవారు, (కావుననే), చన్ద్ర...కైః - చన్ద్రహాస=చంద్రహాసమనుపేరి రావణునికత్తిచేతనైన-వ్రణ=గాయములనెడు-అఙ్కైః = గుఱుతులచేత-ప్రత్యా...యః—ప్రత్యాదిష్ట = ప్రతిషిద్ధములైన - ఆభరణ=నగలయొక్క-రుచయః = కాంతులుగలవారు, (వీరులకు కత్తిగాయములే యాభరణము లని భా) - తాం విశాలా మనుసర(31) అనిఅన్వయము.

తా.—ఆవిశాలానగరమందు గుఱ్ఱములు వేగమందు సూర్యునిగుఱ్ఱములకు సమానములు, వానివలెనే పసరువన్నెవి. నీవెట్లు కొండవలె నున్నతుఁడవై జలమును వర్షించుచున్నావో అచటి యేనుఁగులును అట్లే కొండలవలె నున్నతములై విస్తారముగా మదధారలు గురియుచుండును. పూర్వము అచటి వీరభటులు యుద్ధములో రావణాసురు నెదిరించి వానిచంద్రహాసముచే గాయములుపొంది ఆగాయముల కాంతులే యాభరణములుగా ఇతరాభరణములను ధరింపక యున్నవారు.

వి.—'పత్త్రశ్యామాః' — పసరువన్నె యుత్తమాశ్వలక్షణము. 'దినకరహయస్పర్ధినః'—వేగమున సూర్యాశ్వములవంటివనుటచే మహావేగములని భావము. సూర్యాశ్వములు ౧౨ గంటలకాలములో అపారమైన యాకాశమును ఈమూలనుండి ఆమూలవఱకు దాఁటునుగదా. 'శైలోదగ్రాః'—కొండపై నుండుటచేత మేఘుఁడు కొండంతయున్నతుఁడు. 'త్వమివ వృష్టిమన్తః' నీవలె వర్షము కలవియనుటచే మేఘుఁడెంతజలమును వర్షించునో అవి అంతమదము స్రవించును అనఁగా విస్తారము మదము స్రవించును, ఇది బలిష్ఠమయిన యుత్తమగజలక్షణము. 'ప్రతి దశముఖం సంయుగే తస్థివాంసః'—'యుద్ధములో రావణు నెదిరి నిల్చినవారు'—రావణుఁడు మహావీరుఁడు, యమధర్మరాజాదులను జయించినవాఁడు, వాని నెదిరి నిలిచినవారనుటచే మహాబలశాలులని భావము- 'చన్ద్రహాసవ్రణాఙ్కైః' చంద్రహాసపుగాయము లనుటచే సాక్షాత్తు రావణునితో పోరియు చావక గెలిచివచ్చినవారు, కావున [illegible] భావము, గెలిచినవారి [illegible] వానిచేత వచ్చియుండును, పలాయితులయిన [illegible] గాకున్న గెలిచినారని తెలియఁగవలయును. 'ప్రత్యాదిష్టాభరణరుచయః'—యుద్ధమునందేయుండిరిగాని సౌఖ్యపరాయణులు గారు. అచటి చతురంగబలము [illegible]కోత్తరమని భా. (చెప్పిన గజ తురగ పాదాతములు రథములకు నుపలక్షణములు.

జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపై
ర్బన్ధుప్రీత్యా భవనశిఖిభి ర్దత్తనృత్తోపహారః
హర్మ్యే ష్వస్యాః కుసుమసురభి ష్వధ్వఖేదం నయేథాః
పశ్యన్ లక్ష్మీం లలితవనితాపాదరాగాఙ్కితేషు. ౩౨.

జాలోద్గీర్ణై రితి. — జాలోద్గీర్ణైః = గవాక్షమార్గనిర్గతైః + 'జాలం గవాక్ష ఆనాయే జాలకే కపటే గణే' ఇతి యాదవః, కేశసంస్కారధూపైః వనితాకేశవాసనార్థై ర్గన్ధద్రవ్యధూపై రిత్యర్థః * అత్ర సంస్కారధూపయో స్తాదర్థ్యేఽపి యూపదార్వాదివత్ ప్రకృతివికారత్వాభావా దశ్వఘాసాదివత్ షష్ఠీసమాసో న చతుర్థీసమాసః, ఉపచితవపుః = పరిపుష్టశరీరః, తథా, బన్ధో బన్ధు రితివా ప్రీత్యా, భవనశిఖిభిః = గృహమయూరైః, దత్తో నృత్యమేవోపహార (ఉపాయనం) యస్మై స తథోక్తః + 'ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథోపదా' ఇత్యమరః, కుసుమైః సురభిషు = సుగన్ధిషు, 'లలితవనితాః = సున్దర స్త్రియః + 'లలితం త్రిషు సున్దరమ్' ఇతి శబ్దార్ణవే - తాసాం - పాదరాగేణ = చరణలాక్షారసేన - అఙ్కితేషు = చిహ్నితేషు, హర్మ్యేషు = ధనికభవనేషు, అస్యాః = ఉజ్జయిన్యాః, లక్ష్మీం పశ్యన్, అధ్వనా = అధ్వగమనేన - ఖేదం = క్లేశమ్ - అధ్వశ్రమం, నయేథాః = అపనయ.

జాలో... ద్గీర్ణైః - జాల = కిటికీలగుండ - ఉద్గీర్ణైః = వెలువడినట్టి (ధూపములకు విశేషణము), కేశ... ధూపైః - కేశ = తలవెండ్రుకలయొక్క - సంస్కార = అధివాసనకొఱకైన - ధూపైః = ధూపములచేత (అగురు మొదలైన గంధద్రవ్యముల ధూపములచేత నని యర్థము), ఉప ... వపుః — ఉపచిత = పుష్టినొందిన - వపుః = శరీరము కలవాఁడవై, బన్ధుప్రీత్యా — బన్ధు = బంధువనెడి - ప్రీత్యా = సమ్మోదముతో, భవనశిఖిభిః - భవన = ఇంటి (అనఁగా - పెంపుడు) - శిఖిభిః = నెమళ్లచేత, దత్త ... రః - దత్త = ఇయ్యఁబడిన - నృత్య = నర్తనమనెడు - ఉపహారః = కానుక కలవాఁడవై, కుసు ... భిషు — కుసుమ = పుష్పములచేత - సురభిషు = పరిమళవంతములును, లలి ... తేషు - లలిత = సుందరమైన - వనితా = స్త్రీల యొక్క - పాద = చరణములయొక్క - రాగ = లత్తుకచేతను - అఙ్కితేషు = గుర్తింపఁబడినవియు, (నగు), హర్మ్యేషు = మేడలయందు, అస్యాః = ఉజ్జయినీపురియొక్క, లక్ష్మీమ్ = శోభను, పశ్యన్ = చూచుచు, అధ్వఖేదమ్ - అధ్వ = దారి [illegible] చేతనయిన - ఖేదమ్ = బడలికను, నయేథాః = తీర్చుకొనుము.

తా.—ఓ మేఘుఁడా నీవు ఉజ్జయినీనగరపు మేడలయూఁదల నిలిచి మార్గాయాసము తీర్చుకొనుము. ఆ మేడలయందు కిటికీలగుండ వెడలు కేశసంస్కారధూపముల చేత నీకు పుష్టికలుగును. నేత్రోత్సవముగా పెంపుడు నెమళ్లు ప్రీతితో నీయెదుట నర్తనముచేయును; గృహాలంకారార్థమై చల్లఁబడిన పువ్వులు పరిమళించుచుండును. అందగత్తెల పాదముల లత్తుకజాడలు నీకు దర్శనీయములుగానుండును. అట్టియామేడలనుండి యుజ్జయినీనగరశోభను నీవు చూడవచ్చును. అందు నీకు విశ్రాంతియు వినోదమును రెండును విశేషముగాఁ గలుగును.

వ.—'హర్మ్యేష్వధ్వఖేదం నయేథాః' — మేడ లత్యున్నతములు మేఘమండలము నంటియున్నవి. 'జాలోద్గీర్ణైః'—కిటికీలనుండి వెడలునవి యనుటచే వంటయింటిధూపము గాదు, అది యయిన మేఘమునకు దూరమగు క్రిందిభూములనుండి లేచుటచే చెదరి ఆకాశమున వ్యాపించునుగాని తటాలునఁబోయి యీమేఘములోఁ గలయదు. మేఘమునకు దగ్గఱగానుండు మేడల కిటికీలధూపమైన చేరువచే వెంటనే యీమేఘముతోఁ గలయును. మేఘముక్రమ్ముకొని నిలిచినప్పుడు గాలియుండదుగావున, ధూపములపొగ ఇటునటుచలింపక మేఘమునకు దూరముగా పోక తిన్నగా పైకేపోయి మేఘముతోనే కలియును, కావున 'నిర్గీర్ణైః' అనక 'ఉద్గీర్ణైః' అనుట. 'ఉపచిత'—ధూపముచే మేఘుని దేహము పుష్టినొందును, 'ధూమ జ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః' అని చెప్పఁబడియున్నదిగదా. 'వపుః' - ప్రాయికముగా వపుశ్శబ్దము అందమైన దేహమునకుఁ బ్రయోగింపఁబడును. కేశసంస్కారధూపములచే మేఘుఁడు అందగాఁడు అవును; మేఘుఁడు ధూమపరిణామము, దేహములు అన్నపరిణామములు, దానింబట్టి యిచట మేఘునికి ప్రయాణపుబడలిక తీఱుటకై కేశసంస్కారధూపరూపమగు విందుభోజనము చెప్పఁబడినది. 'అన్నానురూపం తనురూపవృద్ధి'మ్మని నైషధములోఁ జెప్పినట్లు మంచిభోజనముచే వపుశ్శోభ కలుగును, చెడ్డభోజనముచే చెడును; కావున దావాగ్ని, కుమ్మరావము, వంటయిల్లు, ఇత్యాదుల పొగచేనయిన యెడల కారణగుణానుగుణతా న్యాయముచే మేఘునికి వపుశ్శోభ కలుఁగదు. పరిమళించుచున్న కేశసంస్కారధూపములచే నయిన, అంగమును దేహపరిమళమును గలుగును. 'బన్ధుప్రీత్యా' మేఘునికిని నెమళ్లకును గలచెలిమి సుప్రసిద్ధము. ఆనెమళ్లు మేఘునికై-అతనియెదుట చేయునృత్యము కూలికి చేయునది గాదు-బంధుప్రీతిచే అనన్యప్రేరితముగా చేయునది, గావున కూలినృత్యమువలెఁగాక అత్యుత్కృష్టముగానుండును. బహుమతికి నృత్యముచేయు వారాంగనాదులకు అభ్యాసపాటవముచే నృత్యమందు నైపుణ్యము కలుగును, ఈ నెమళ్లకు అట్టికారణములేమిచేత

అట్టినై పుణ్య ముండదుగదా, కావున వీనినృత్యము ప్రీతివలనఁగలిగినను ఉత్కృష్టము గాదని శంకింపఁగూడదు; ఏలయన అవి 'భవనశిఖిభి' ఇంటినెమళ్లు పెంపుడునెమళ్లు-అడవినెమళ్లు గావు. ఈనెమళ్లు ఆహార్యములకలంకారభూతములైన కలావతులకు 1 శిష్యులైన నర్తనమందు పూర్ణప్రావీణ్యమును పొందియున్నవి. కావున వీనినృత్యము అత్యుత్కృష్టముగానే యుండును. 'దత్త' ఇయ్యఁబడిన, అమ్మఁబడినదిగాదు. కావుననే 'ఉపహార'ము - అనఁగా - కానుక. అట్టియానృత్యమును నేత్రోత్సవముగా చూడవచ్చును. మేఘోదయముచే తాపముతీఱినెమళ్లు ఆహ్లాదముచే ఆడుననిభావము; నేత్రోత్సవముగాక ఘ్రాణోత్సవముకూడ కలుగును- 'కుసుమసురభిషు' - ఇట్టిసంపద 'హర్మ్యేషు'-'హర్మ్యాదిర్ధనినాం వాసః' అనియమరము-ఆ మేడలు ధనికనివాసములు గావున నందు సిద్ధముగానుండును. మేడలు విశ్రమించుటకు ఒడలూరనీ గీఱలు గాయములగునట్లు కఠినముగానుండునేమో గదా-విశ్రమించుటకు సుఖముగా నుండునా అనిన-'కుసుమ' - స్పర్శసుఖముగా చల్లఁబడిన పువ్వులుగలవి-దీనిచే ఆపూవులపై అనఁగా పుష్పబాన్పులపై 'లలితవనితా పాదరాగాఙ్కితేషు'-పొలయలుగత్తెలు విహరించిన తావులందు - సుఖకరముగానితావుల వారేల తిరుగుదురు? కావున స్ఫటిక మరకతాదిమణిమయములయి మిగుల నునుపులై యతిసుఖకరములుగాను అతిమనోహరములుగాను ఉండుతావులందు-సేదదేరవచ్చునని భావము. మేడలనుండి ఉజ్జయినియొక్క సౌభాగ్యమును చూడుమనుట - ఉన్నతప్రదేశమునుండి చూచినఁగదా నగరమును దానిసొంపును అంతయు నేకమారుగానే అగపడును. 'హర్మ్యేషు'-బహువచనముచే అట్టిమేడలు ఆనగరములో అనేకములు-ఒక్కొక్కదానియందును వేఱువేఱువిధముల సౌభాగ్యములు వినోదములును గలుగును-వానినెల్ల ననుభవింపుము, అని యభిప్రాయము. ఇట్లు ఆనగరమున మేడలయందు నీకు విందులు ఆటకచ్చేరీలు రాజభోగములు జరగు నని భావము.

---

1. తాళైః శిఞ్జావలయసుభగైర్నర్తితః కాన్తయా మే
యామధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః. ఉ. మేఘ.

వాసన్తి.—సోఽపి దేవః పశ్యతు.—

అతరుణమదతాణ్డవోత్సవాన్తే । ప్వయి మచిరోద్గతముగ్ధలోలబర్హః
మణిముకుటఇవోచ్ఛిఖః కదమ్బే । నదతి స ఏష వధూసఖః శిఖణ్డీ॥

రామ.—భ్రమిషు కృతపుటాన్తర్మణ్డలావృత్తి చక్షుః
ప్రచలితచతురభ్రూతాణ్డవైర్మణ్డయన్త్యా
కరకిసలయతాళైః కాన్తయా నర్త్యమానం
సుతమివ మనసా త్వాం వత్సలేన స్మరామి. ఉ. రా. చ.

భర్తుః కణ్ఠచ్ఛవి రితి గణైః సాదరం వీక్ష్యమాణాం
పుణ్యాం యాయా స్త్రిభువనగురో ర్ధామ చణ్డీశ్వరస్య
ధూతోద్యానం కువలయరజోగన్ధిభి ర్గన్ధవత్యా
స్తోయక్రీడానిరతయువతిస్నానతిక్తై ర్మరుద్భిః. 37.

భర్తురితి.—భర్తుః = స్వామినో నీలకణ్ఠస్య భగవతః - కణ్ఠస్యేవ-ఛవిర్యస్యాస్సా కణ్ఠచ్ఛవిః, ఇతి = హేతోః, గణైః = ప్రమథైః + 'గణ స్తు గణనాయాం స్యాద్గణేశే ప్రమథే చయే' ఇతిశబ్దార్ణవే, సాదరం యథా తథా, వీక్ష్యమాణఃసన్, ప్రియవస్తుసాదృశ్యా దపి ప్రియత్వం భవే దితిభావః, త్రయాణాం భువనానాం సమాహార స్త్రిభువనమ్ + 'తద్ధితార్థ—' ఇత్యాదినా సమాసః * 'పాత్రాదిభ్యః ప్రతిషేధో వక్తవ్య' ఇతి స్త్రీలిఙ్గతాప్రతిషేధః-తస్యగురోః = త్రైలోక్యనాథస్య, చణ్డీశ్వరస్య = కాత్యాయనీవల్లభస్య, పుణ్యాం = పావనం, ధామ = మహాకాలాఖ్యం స్థానం, యాయాః = గచ్ఛ * విధ్యర్థేలిఙ్ - శ్రేయస్కరత్వా త్స[illegible] యాతవ్యమితి భావః - ఉక్తంచ స్కాన్దే † 'ఆకాశే తారకం లిఙ్గం పాతాళే హాటకేశ్వరమ్ । మర్త్యలోకే మహాకాళం దృష్ట్వా కామ మవాప్నుయాత్' ఇతి, న కేవలం ముక్తిస్థాన మిదం కిన్తు విలాసస్థాన మపీత్యాహ ధూ మేతి-కువలయరజోగన్ధిభిః = ఉత్పలపరాగగన్ధవద్భిః, తోయక్రీడాసు = జలవిహారేషు-నిరతానామ్ = ఆసక్తానాం - యువతీనాం-స్నానం = స్నాత్యనేనేతి స్నానీయం చన్దనాది * కరణేల్యుట్ + 'స్నానీయేఽభిషవే స్నానమ్' ఇతియాదవః-తేన-తిక్తైః = సురభిభిః + 'కటుతిక్తకషాయాస్తు సౌరభేఽపిప్రకీర్తితాః' ఇతిహలాయుధః, సౌగన్ధ్యాతిశయార్థం విశేషణద్వయమ్, గన్ధవత్యాఖ్యానద్యా స్తత్రత్యాయాః, మరుద్భిః = మారుతైః, ధూతోద్యానం = కమ్పితాక్రీడ మితి ధామ్నో విశేషణమ్.

భర్తుః = తమప్రభువైన శివునియొక్క, కణ్ఠచ్ఛవిః—కణ్ఠ = [illegible]యొక్క - ఛవిః = కాంతివంటి - ఛవిః = కాంతికలవాడవు, ఇతి = [illegible] తువుచేత, గణైః = ప్రమథులచేత, సాదరమ్ = ఆదరముతో, వీక్ష్యమాణః = [illegible]చబడుచున్నవాడవై, త్రిభువనగురోః—త్రి = మూడయిన - భువన = లోకములయొక్క - గురోః = నాథుడైన, చణ్డీశ్వరస్య = చణ్డీపతియైనశివుని యొక్క, పుణ్యామ్ = పావనమయిన, ధామ = మహాకాళమను నాలయమునకు, యాయాః = పొమ్ము; ఆయాలయము ఎట్టిదన్న, కువ ... భిః — కువలయ = కలువలయొక్క - రజః = [illegible]యొక్క - గన్ధిభిః = పరిమళము గల

వైన, తోయ...కైః— తోయక్రీడా = జలకేళులయందు - నిరత = ఆసక్తలయియున్న - యువతి = గుబ్బెతలయొక్క - స్నాన = స్నానద్రవ్యములచేత-తిక్తైః=పరిమళముగలవైన, గన్ధవత్యాః = గంధవతియనునదియొక్క, మరుద్భిః= వాయువులచేత, ధూతోద్యానమ్ — ధూత = కదలింపఁబడిన - ఉద్యానమ్ — తోఁటకలది (ధామ అనువానికి విశేషణము).

తా.—నీవు బడలికతీఱి నర్తనాద్యుత్సవము లనుభవించినపిమ్మట అచటినుండి మహాకాళాలయమునకు పోవునప్పుడు నీదేహచ్ఛాయ శివకంఠచ్ఛాయవలె నుండునుగాన ఆసాదృశ్యముచే చోద్యముచే ప్రమథులు నిన్ను ఆదరముతో చూచుచుందురు. అటుకు పోవుటచే నీశ్వరదర్శనమునఁ బుణ్యముకలుగును సరియేగదా ఆలయోద్యానమున వినోదముకూడ కలుగును. ఎట్లన - దానిప్రాంత గంధవతీనది ప్రవహించుచుండును. అందు మిటారిగుబ్బెతలు జలక్రీడలు సల్పుచుందురు, ఆదర్శనము కన్నులపండువుగా నుండును; వారు స్నానార్థమయి యుపయోగించు గంధపొడి మొదలగువస్తువుల పరిమళమును నదియందలి కలువపువ్వుల పరిమళమును గాలి ఆయుద్యానమందెల్ల వెదచల్లుచు అందలివృక్షలతాదులను కదలించుచుండును.

వ.—'కణ్ఠచ్ఛవిః' - శివునికంఠము కాలకూటపానముచే నలుపు - గ్రీష్మవర్షామేఘము శరన్మేఘమువలెఁ గాక నల్లగానుండును-పైగా జాలోద్గీర్ణ కేశసంస్కారధూపముచే వన్నెయెక్కియున్నది. 'సాదరమ్' - ప్రియవస్తువును చూచిన నెట్లో తత్సదృశవస్తువును జూచినను అట్లే ప్రీతి కలుగును, ప్రమథులకు శివకంఠనైల్యము ప్రియము, ఆసాదృశ్యముచే మేఘచ్ఛవిదర్శనంబును ప్రియము. మఱి పోవుచోటి అనూయతో మాతులుమ్ముఁచుకొని అప్రియముగా చూచువారున్న అచటికి పోవుట పోవలసినవానికి అప్రియముగా నుండును, ప్రీతివికసితవదను లై చూచువారున్న చోటికి పోనిచ్చగలుగును, కావున ఆచోటికి పోవుట నీకు ప్రియముగా నుండునని భావము. 'త్రిభువన' - సర్వలోకనాథుఁడు. 'చణ్డీశ్వరస్య'—ఆభర్గవంతుఁడు ఇతరదేవతలవలె కొంచెపాటివాఁడు కాఁడు, సర్వాధికమహిమకు చండికి ప్రాణనాథుఁడు, కావున నీకు అవశ్యసేవ్యుఁడు, అతనిసేవకు మహాఫలము కలుగును, 'పుణ్యమ్' — పుణ్యము లభించును. ఇంతేగాక వినోదముకూడ గలుగును. ఎట్లన: - నీవటు జలకేళిలోలలగుయువతులు పరిమళసంయుక్తమైన వాయువుపుష్పఫలభరితమయిన యుద్యానము వీని నెల్లననుభవింపవచ్చును. 'గన్ధవత్యాః'-సార్థకనామము. 'కువలయరజః' - రాత్రియెల్ల కలువలనుండి దుమారము రేఁగి నదియెల్లనిండియుండుపుప్పొడి. 'యువతుల' క్రీడానిరతలు (బాలలు భయపడుదురు, వృద్ధలు భక్తివశాయణలు, కావున ఆట్టివారికి

స్నానమాత్రమే కాని క్రీడ సంభవించదు), తోయక్రీడానిరతయువతిసౌభాగ్యము అత్యంతదర్శనీయము. 'తిక్తైః'—యువతులును క్రీడానిరతలును గావున నే సుగంధ ద్రవ్యములతో స్నానము. 'గన్ధవత్యా మరుద్భిః' — నదిమీఁదివాయువు గావున చల్లగా కూడ నుండును.

అ ప్యన్యస్మి న్జలధర మహాకాళ మాసాద్య కాలే
స్థాతవ్యం తే నయనవిషయం యావ ద త్యేతి భానుః
కుర్వ న్సంధ్యాబలిపటహతాం శూలినః శ్లాఘనీయా
మామన్ద్రాణాం ఫల మవికలం లప్స్యసే గర్జితానామ్. 38.

అపీతి.—హే జలధర, మహాకాళం నామ పూర్వోక్తం చణ్డీశ్వరస్థానమ్, అన్యస్మిన్ = సంధ్యాతిరిక్తే. కాలే, ఆసాద్య = ప్రాప్యాపి, తే (తవ) స్థాతవ్యం త్వయా స్థాతవ్య మిత్యర్థః* 'కృత్యానాం కర్తరి వా' ఇతి [illegible], యావత్ = యావతా కాలేన, భానుః = సూర్యః, నయనవిషయం = దృష్టిపథమ్, అత్యేతి = అతిక్రామతి, ఆ స్తమయాత్ తే స్థాతవ్యమిత్యర్థః-యావది త్యవధ్యర్థే+ 'యావత్తావచ్చ సాకల్యే ఽవధౌ మానేఽవధారణే' ఇత్యమరః, కిమర్థమత ఆహ-'కుర్వన్ని'తి—శ్లాఘనీయాం = ప్రశస్యాం, శూలినః = శివస్య, సంధ్యాయాం బలిః (పూజా) తత్ర పటహతాం, కుర్వన్ = సంపాదయన్, ఆమన్ద్రాణామ్ = ఈషద్గమ్భీరాణాం, గర్జితానామ్, అవికలమ్ = అఖణ్డం, ఫలం, లప్స్యసే = ప్రాప్స్యసి*లభేః కర్తరి లృట్-మహాకాళనాథ బలిపటహత్వేన వినియోగా త్తే గర్జితానాం సాఫల్యం స్యా దిత్యర్థః.

హే జలధర = ఓయిమేఘుఁడా, మహాకాళమ్ = పూర్వోక్తమయిన యా చణ్డీశస్థానమును, అన్యస్మిన్ = సంధ్యాకాలమందుఁగాక ఇతరకాలమందు, ఆసాద్యాపి = పొందినను, యావత్ = ఎప్పటికి, భానుః = సూర్యుఁడు, నయనవిషయమ్ అత్యేతి = అస్తమించునో అంతవఱకు, తే స్థాతవ్యమ్ = నీవుకను పెట్టుకొని యుండవలసినది [illegible] విలంబనఁగా, శ్లాఘనీయామ్ = కొనియాడఁదగినదైన, శూలినః = శివునియొక్క, సంధ్యాబలిపటహతామ్ — సంధ్యా = సాయంకాలపు - బలి = పూజయందలి - పటహతామ్ = ఢక్కావాద్యత్వమును, కుర్వన్ = కలుఁగఁజేయుచు (అనఁగా ఢక్కాశబ్దమువలె ఉఱిమి), ఆమన్ద్రాణామ్ = కొంచెము గంభీరములయిన, గర్జితానామ్ = ఉఱుములకు, అవికలమ్ = పూర్ణమయిన, = ఫలమ్ = ప్రయోజనమును, లప్స్యసే = పొందఁగలవు.

తా.—ఓయి మేఘుఁడా నీవు ఆమహాకాళస్థానమునకు సాయంకాలమునఁ గాక మఱి యేకాలమునఁ బోయినను సాయంకాలమువఱకు నచట కనుపెట్టుకొని యుండుము. అపుడు జరుగునట్టి చండీశపూజయందు నీవు ఆమంద్రములయిన నీ యుఱుములచే ఢక్కాసేవ చేసికొనుము; అట్టిసేయుఱుములకు అట్టిసేవయే ఫలము.

వ.—'ఆమన్ద్రాణామ్' — ఈషద్గంభీరములయిన యుఱుము లనుట యేల యన నవియే చెవుల కింపుగాను ఢక్కాశబ్దసదృశముగాను ఉండును. ఘళఘళ ఉఱిమిన భయంకరముగాను అత్యంతమంద్రమయిన ఇంపుదక్కువగాను ఉండును. 'స్థిత్వా' - కాలవిశేష సేవకు ఫలవిశేషము ప్రసిద్ధము. 'స్థాతవ్యమ్' - మేఘుఁడు పటహధ్వానసదృశముగా ఉఱుమనేర్చును. అట్టిసేవకు సాయంకాలపూజలోనే గాని అవసరములేదు, కావున కనుపెట్టియుండు మనుట. 'అవికలమ్' — శివసేవా ఫలము పూర్ణముగా నుండునుగాని అల్పముగా నుండదు.

పాదన్యాసక్వణితరశనా స్తత్ర లీలావధూతై
రత్నచ్ఛాయాఖచితవలిభి శ్చామరైః క్లాన్తహస్తాః
వేశ్యా స్త్వత్తో నఖపదసుఖా న్ప్రాప్య వర్షాగ్రబిన్దూ
నామోక్ష్యన్తే త్వయి మధుకరశ్రేణిదీర్ఘా న్కటాక్షాన్. 39.

పాదేతి.—తత్ర = మహాకాలే, పాదన్యాసైః = చరణనిక్షేపైః నృత్యాఙ్గైః క్వణితాః = శబ్దాయమానాః రశనాః యాసాం తా స్తథోక్తాః - క్వణతేరకర్మకత్వాత్ * 'గత్యర్థాకర్మక' ఇత్యాదినా కర్తరి క్తః, లీలయా = విలాసేన అవధూతైః = కమ్పితైః, రత్నానాం = కఙ్కణమణీనాం - ఛాయయా = కాన్త్యా - ఖచితాః = రూషితాః వలయః = చామరదణ్డాః యేషాం తైః + 'వలి శ్చామరదణ్డే చ జరావిశ్లథచర్మణి' ఇతి విశ్వః, చామరైః = వాలవ్యజనైః, క్లాన్తహస్తాః - ఏతేన దైశికనృత్యం సూచితమ్, తదుక్తం నృత్యసర్వస్వే † 'ఖడ్గ కన్దుక వస్త్రాది దణ్డికా చామర స్రజః। వీణాది ధృత్వా యత్కుర్యా న్నృత్యం తద్ దైశికం భవేత్' ఇతి, వేశ్యాః = మహాకాళనాథ ముపేత్య నృత్యన్త్యో గణికాః, త్వత్తః, నఖపదేషు = నఖక్షతేషు సుఖాన్ = సుఖకరాన్ * సుఖశబ్దాత్ తత్కరోతీతి ణ్యన్తాత్ పచాద్యచ్ - యద్వా - సుఖాన్ = సుఖహేతూన్ + 'సుఖహేతౌ సుఖే సుఖమ్' ఇతి శబ్దార్ణవే, వర్షస్య అగ్రబిన్దూన్ = ప్రథమబిన్దూన్, ప్రాప్య, త్వయి, మధుకరశ్రేణిదీర్ఘాన్, కటాక్షాన్ = అపాఙ్గాన్, ఆమోక్ష్యన్తే, 'పరై రుపకృతాః సన్తః సద్యః ప్రత్యుపకుర్వతే' ఇతి భావః. కామి దర్శనీయత్వలక్షణం శివోపాసనాఫలం సద్యో లభ్యత ఇతి ధ్వనిః.

తత్ర = ఆసంధ్యాపూజయందు, పాద ... నాః — పాద = అడుగుల యొక్క - న్యాస = ఉంచుటచేత - క్వణిత = శబ్దించుచున్న - రశనాః = మొలనూళ్లుగలవారును, లీలా ... తైః - లీలా = విలాసముగా - అవధూతైః = కదలింపఁబడిన (వీవఁబడిన), రత్న...శిభిః — రత్న = (మురుగుల) మణులయొక్క - ఛాయా, = కాంతులచేత - ఖచిత = కప్పఁబడిన - వలిభిః = దండములు (పిడులు) గలవైన, చామరైః = వింజామరలచేత, క్లాన్తహస్తాః - క్లాన్త = అలసిన - హస్తాః = చేతులుగలవారును, అయిన, వేశ్యాః = వారస్త్రీలు - మహాకాళనాథునికి నృత్యసేవ యొనర్చుచున్న గణికలు, త్వత్తః = నీవలన, నఖ ... క్షాన్ — నఖపద = నఖక్షతములయందు - సుఖాన్ = సుఖకరములయిన, వర్షాగ్రబిన్దూన్ = వానయొక్క తొలిచినుకులను, ప్రాప్య = పొంది, త్వయి = నీయందు, మధు = ర్ఘాన్ — మధుకర = తుమ్మెదలయొక్క - శ్రేణి = బారులవలె, దీర్ఘాన్ = నిడుపులైన, కటాక్షాన్ = కడకంటిచూపులను, ఆమోక్ష్యన్తే = నిగిడింతురు.

తా. — అచట సంధ్యాపూజయందు వారాంగనలు వింజామరలు వీచుచు నృత్యముచేయుదురు. వారికంకణముల కాంతులు ఆవింజామరలదండములపై నిగిడి వానినలంకరించు చుండును. ఆవీచుటచే నా వేశ్యల చేతులు అలసియున్నప్పుడు నీవు కొన్ని చినుకులను రాల్చిన నవి వారికుచములపై నఖక్షతములపై పడి నొప్పిఁబాపి సుఖము కలుఁగఁజేయును, అందులకు వారు ప్రీతితో నీవైపు కటాక్షింతురు.

వ.— 'పాద'— హస్తవిక్షేపములకు మొలనూలు శబ్దింపదు, పాదవిన్యాసములకైన శబ్దించును. - 'గమన' అనక 'పాదన్యాస' అనుటచే నృత్యము తెలుపఁబడినది. 'రశనాః'- మొలనూలుమాత్రమేగాక కాలిగజ్జెలుగూడ శబ్దించినను మొలనూలి చిఱుగంటలశబ్దము మిగుల కలమధురముగావున రశన చెప్పఁబడినది. మఱియు రశనాకింకిణులు పాదన్యాసములచే ఆనుషంగికముగా శబ్దించుటగాక, ఆకింకిణులు యథాభిలషితముగా శబ్దించునట్లుగానే పాదన్యాసము చేయుదురని భావము. 'లీలా'— విలాసముగా అనఁగా ఒయ్యారముగా వీచోపులు వీతురు, అవర్జనీయమని ప్రయాసతోఁగాదు, లీల ప్రధానముగాను వీచుట లీలకొఱకుఁగాను వీతురని భా. అట్లు లీలగావీచినను 'క్లాన్తహస్తాః'- వారిచేతులు అలసినవి కావున వారు 'పయిగాలి సోకినన్ వెన్నవలెంగరఁగునలివేణులు' అన్నట్లు మిగుల నబలలు. 'రత్న'— అమూల్యవస్త్రాభరణములు ధరించినవారు, మిక్కిలి దర్శనీయలైన కోమలాంగులు. 'హస్తాః'- ఏ యవయవమునకు పనియో అది యలయుట యుచితము. 'వేశ్యాః'- నృత్యము శాస్త్రీయముగా నభ్యసించువారు, హొయలుగలవారు; కులస్త్రీలు గారు కావున, వారిం

జూచుటయందు దోషములేదు. మఱియు కులస్త్రీలకైన సురత విద్యాప్రాగల్భ్యము లేమిచేతను అత్తయు నాఁడుబిడ్డయు మొదలగువారివలనిలజ్జచేతను నఖక్షతాదిప్రసంగ ముండదు. వేశ్యలకైన సురతప్రపంచమే విద్య యగుటచేతను లజ్జలేమిచేతను ఇంక నితరకారణములచేతను వారియందు నఖక్షతాదికము సుసంభవము. 'సుఖాః'— చల్లగా ఒంటొంటిబిందువులు ఆక్షతములపై పడిన సొప్పితీఱును. వానిసొప్పియే గాక ఆసుఖపారవశ్యముచేత చేతుల బడలికకూడ తీఱును. 'వర్షాగ్రబిన్దూః' = పెద్దవాన గాక ముందురాలునట్టి తొలితొలిపెద్దచినుకులు; పెద్దవానయేని వేశ్యలు అవలికిపోదురు, మేఘమును జూచుట సంభవింపదు. కొంచెపాటిచినుకులైన అవలికి పోనక్కఱలేదు గావున, వానివలన మేలే కలుగుచుండుటచేత వానికొఱకు ఇంక నచటనే బయలనే ఉందురు, మేఘునిఁ జూతురు. దేహంబు దన్యత్ర పడుచినుకులు కొంచెమగుటచే దుస్సహములుకావు, క్షతములయందుఁ బడునవి సుఖకరములు, వీనికొఱకు కడముచినుకులను సహింపఁదగినవే యగును. వేశ్యలను కాముకులు సురతముల చీకాకుపెట్టుదు రని క్షతములచే సూచింపంబడుచున్నది. వీరికేమి స్తనాంశుకముండదా చినుకులు ఎట్లు నఖక్షతములం బడుననిన-క్షతస్థానములపై స్తనాంశుకమందు పడినను సుఖము లే యగును కావున నట్లు చెప్పుట. 'బిన్దూః'—విటకార్యముగా పువ్వుల రువ్వి నట్లు అని ధ్వని. అందులకుసంప్రీతలై ఆసరాఙ్గ సుందరులు 'మధుకరశ్రేణిదీర్ఘాః' —తుమ్మెదలబారులవలె నల్లగాదీర్ఘములయిన 'కటాక్షైః'-కడకంటిచూపుల నిన్నుఁ జూతురు.† కడకంటిచూపులఁజూచుట విలాసము. నిన్ను విలాసపూర్వకముగా ప్రియకాముకునిఁ జూచినట్లు చూతురు. మధుకరశ్రేణి సామ్యముచే నేత్రనైల్య సౌందర్యము చెప్పఁబడినది. దానిచే వారి సౌందర్యాతిశయమును సూచింపఁబడి నది. 'దీర్ఘాః' అనుటచే మేఘునిమీఁది ప్రీత్యతిశయము సూచింపఁబడినది. 'ఆమోక్ష్యన్తే'—ఆఙ్పూర్వకమయిన ముచధాతువు ధరణార్థకంబవును గావున 'నిన్ను కటాక్షములనలంకరింతురు' అని యర్థము, అందువలన నీవుశోభింతువు ధన్యుఁడవగుదువు;

†. తోఁకచుక్కలఁబోలుదృక్కోయజముల వెలితి లేకుండ మీబోఁటిచెలులఁజూచు. కాంత వీక్షింప దరగంటఁగాని మమ్ము! మేము చేసినయపరాధ మేమి చెపుమ. నైష.

కాత్స్న్యేన నిర్వర్ణయితుం చ రూప! మిచ్ఛన్తి తత్పూర్వ సమాగతానామ్ న చ ప్రియే ష్వాయతలోచనానాం! సమగ్రపాతీని విలోకితాని. మాళవి.

అని భావము. అట్టిసుందరీజనముల ప్రీతిపూర్వక ప్రేక్షణములు †కూటమితో సరిగా నాహ్లాదకములు కదా. అట్టి చూపులకు కాముకు లువ్విళ్లూరుదురు గదా. తమపై వానచినుకులు రాల్చిన నీయుపకారమునకు వారు కృతజ్ఞతచే వెంటనే నీకు తమయా వాలుఁగలుజూపు లనునలంకారము లొసంగుదురు. ఎవ్వరినిని వలవని వేశ్యలకు దర్శనీయుఁడ వగుటకన్న సౌభాగ్య మేమున్నది. అట్టిసౌభాగ్యము శివసేవాఫలముగా అచట నీకుఁ గలుగును.

పశ్చా దుచ్చై ర్భుజతరువనం మణ్డలే నాభిలీనః
సాన్ధ్యం తేజః ప్రతినవజపాపుష్పరక్తం దధానః
నృత్యారమ్భే హర పశుపతే రార్ద్రనాగాజినేచ్ఛాం
శాన్తోద్వేగ స్తిమితనయనం దృష్టభక్తి ర్భవాన్యా. 40.

పశ్చాదితి.- పశ్చాత్=సంధ్యాబల్యనన్తరం, పశుపతేః=శివస్య, నృత్యారమ్భే=తాణ్డవప్రారమ్భే, ప్రతినవజపాపుష్పరక్తం = ప్రత్యగ్రజపాకుసుమారుణం, సంధ్యాయాం భవం తేజో దధానః, ఉచ్చైః = ఉన్నతం-భుజా ఏవ తరవ స్తేషాం వనం, మణ్డలేన = మణ్డలాకారేణ, అభిలీనః=అభివ్యాప్తః సన్ *కర్తరి క్తః, భవాన్యా = భవపత్న్యా *'ఇన్ద్ర వరుణ భవ శర్వ రుద్ర మృడ హిమారణ్య యవ యవన మాతులాచార్యాణా మానుక్' ఇతి ఙీష్ ఆనుగాగమశ్చ, శాన్త-ఉద్వేగః=గజాజినదర్శనభయం - యయోస్తే - అతఏవ - స్తిమితే-నిశ్చలే-నయనే-యస్మిన్కర్మణి తత్తథోక్తమ్ +'ఉద్వేగ స్త్వరితే క్లేశే భయే మన్థరగామిని,' ఇతిశబ్దార్ణవే, భక్తిః= పూజ్యేష్వనురాగః*భజేః భావార్థే క్తిన్ప్రత్యయః - దృష్టం దృష్టా వా భక్తి ర్యస్య స దృష్టభక్తిః సన్, పశుపతేః, ఆర్ద్రం=శోణితార్ద్రం - యన్నాగాజినం=గజచర్మ +'అజినం చర్మకృత్తిః స్త్రీ' ఇత్యమరః-తత్రేచ్ఛాం, హర=నివర్తయ, త్వమేవ తత్స్థానే భవేత్యర్థః. గజాసురమర్దనానన్తరం భగవా న్మహాదేవ స్తదీయ మార్ద్రాజినం భుజమణ్డలేన బిభ్ర త్తాణ్డవం చకారేతిప్రసిద్ధిః *దృష్టభక్తి రితి కథం రూపసిద్ధిః, దృష్టశబ్దస్య*'స్త్రియాః పుంవ' దిత్యాదినా పుంవద్భావస్య దుర్ఘటత్వాత్ - కుతః- *'పూరణీప్రియాదిష్వి'తి నిషేధాత్-భక్తిశబ్దస్య ప్రియాదిషు పాఠా దితి? తదేతచ్చోద్యం దృఢభక్తిరితిశబ్దమాశ్రిత్య ప్రతివిహితం గణవ్యాఖ్యానే - దృఢం భక్తి రస్యేతి నపుంసకం పూర్వపదమ్ అదార్ఢ్యనివృత్తిమాత్రపరే దృఢశబ్దే లిఙ్గవిశేష స్యానుప

† మాలుదాగమవార్తయాపి శూన్యే। సమయే జాగ్రతి సంప్రవృద్ధతాపే
అబలాను విలాసినోఽన్వభూవ। న్నయనై రేవ నవోపగూహనాని. భోజప్రబన్ధః.

కారకత్వాత్ స్త్రీత్వ మపపక్షిత'మితి. భోజరాజస్తు * 'భక్త్యాచ కర్మసాధనాయా' మిత్యనేన సూత్రేణ భజ్యతే సేవ్యత ఇతి కర్మార్థత్వే భవానీభక్తి రిత్యాది భవతి, భావసాధనాయాం తు స్థిరభక్తి ర్భవాన్యా మిత్యాది భవతి' ఇత్యాహ- ఇతి త దేత త్సర్వం సమ్యగ్వివేచితం రఘువంశసంజీవిన్యాం 'దృఢభక్తి రితి జ్యేష్ఠే'' ఇత్యత్ర-తస్మా ద్దృష్టభక్తి రిత్యత్రాపి మతభేదేన పూర్వపదస్య స్త్రీత్వే నపుంసకత్వే చ రూపసిద్ధి ర స్తీతి సిద్ధమ్.

పశ్చాత్=సంధ్యాబలితర్వాత, పశుపతేః=శివునియొక్క, నృత్యా...మ్భే— నృత్య=తాండవముయొక్క-ఆరమ్భే=ప్రారంభమందు, ప్రతి... క్తమ్—ప్రతినవ=మిగుల క్రొత్తయైన - జపాపుష్ప = దాసానిపువ్వువలె - రక్తమ్=ఎఱ్ఱనయిన, సాంధ్యం తేజః = సాయంకాలపుఁగాంతిని(సంధ్యారాగమును),దధానః=ధరించినవాఁడవై, ఉచ్చై...నమ్ - ఉచ్చైః = ఉన్నతమైన-భుజ=బాహువులనెడు-తరు = చెట్లయొక్క-వనమ్ = అరణ్యమును, మణ్డలేన = మండలాకారముగా, అభిలీనః = అంతటను వ్యాపించినవాఁడవై, భవాన్యా=గౌరిచేత, శా న్త...నమ్=శా న్త= అణఁగిన-ఉద్వేగ=భయముగలవియు - (అందుచేతనే) - స్తిమిత = నిశ్చలములును - (అగు)-నయనమ్ = నేత్రములుగలుగునట్లుగా (అనఁగా భయములేమిచే నిశ్చలములయిన చూపులతో), దృష్టభక్తిః — దృష్ట=చూడఁబడిన - భక్తిః = పూజ్యానురాగము కలవాఁడవై,పశుపతేః = శివునియొక్క, ఆర్ద్ర...చ్ఛామ్-ఆర్ద్ర = రక్తముచే తడిగానున్న-నాగాజిన = ఏనుఁగు తోలుయొక్క-ఇచ్ఛామ్ = కోరికను, హర = తీర్పుము. గజాసురుని చంపి శివుఁడు వానిచర్మమును భుజములందు ధరించి తాండవము చేసెనని పురాణప్రసిద్ధి.

తా.—సంధ్యాపూజానంతరము, శివుఁడు తాండవ మారింభించుసమయమున నీవు సంధ్యారాగముచే మిగులనెఱ్ఱనై ఆయనభుజములపై మండలాకారముగా చుట్టుకొనుము. అట్లు చేయుటచే ఈశ్వరునికి పూర్వము తాను గజాసురుని సంహరించి వానితోలును అప్పుడే ఒలిచితీయుటచే నెత్తురోడుచున్నదానిని ఉత్తరీయముగా ధరించి తాండవము చేసినకాలము మొదలుగా ఆనెత్తుటితడి ఎండిపోయినందున మరల నట్టిది లభించవలెనే గదా యని యాయనమనస్సులోఁ గలుగుకోరికను నీవు అట్టి రుధిరార్ద్రనాగాజినమువలె నుందువుగావునఁ దీర్పుదువు. వాస్తవముగా అట్టి భయంకరనాగాజినమవు కావుగాన గౌరియు చూచియు చూడకముందే నిశ్చలితభయము తీఱి నీయందవమును వన్నెలను తనభర్తకు-ఉత్తరీయముగా నీవుండుట నీవును నేత్రోత్సవముగా చూచుచుండును.

వ.—'తరు-భుజములు మిక్కిలి యున్నతములు. 'వన'-భుజముల నేకములు. భుజములు గొప్పవియు ననేకములు నని చెప్పుట మేఘమునంతయుత్తరీయమును ధరించుటకు తగిన వని సూచించుటకు. 'మణ్డలేన'-చుట్టుకొనుట ఉత్తరీయవేష్టనము గా నుండుటకు. 'అభిలీనః' అంతటను వ్యాపించి అంటుకొనియుండుట తాండవారభటియందు జాఱి దూరముగా పడకుండుటకు- అభినయమందు చేతుల కడ్డపడకుంటకును. 'ప్రతినవ'-ఎక్కువ యెఱుపును చెప్పుటకు- దాసానిపువ్వు వాడిన నల్లఁబడిపోవును - వాడకున్న అత్యంత మెఱ్ఱగా నుండును. అట్టి యెఱుపును చెప్పుట నెత్తుటి సామ్యముకొఱకు. 'అరమ్భే'- కొంతసేపయినపిమ్మట సంధ్యారక్తిమ తగ్గిపోవును. మేఘునికి ఆర్ద్రాజినసామ్యము పోవును. కావున నృత్యారంభము చెప్పఁబడినది, 'పశుపతేః గొల్లవానికి గొంగళివలె అని ధ్వని. 'శాన్త' - పూర్వము గౌరి ఆర్ద్రనాగాజినోత్తరీయముతోడి యాశివతాండవమును చూచినదిగావున నీయందలి యాసామ్యముచే ఆర్ద్రాజినమవే యని భయమై పర్యాలోచనచే కావని భయము తీఱి 'స్తిమిత' - ఆనీలాంగుఁ దర్శనీయముగాన ఱెప్పవాల్పక ఇతరమును చూడక భయములేమిచే కనులుమూయక తదేకనిష్ఠగా నిన్నుఁ గౌరి చూచి 'దృష్టభక్తిః'- భక్తిపూర్వకమైన నీయాసేవకు సంతోషించును. అట్టిసేవచే నీవు గౌరీపరమేశ్వరులను ఉభయులను సంప్రీతులను జేసికొందువు: మహాపుణ్యాత్ముఁడవు సౌభాగ్యవంతుఁడవు నగుదువు. కావున తప్పక యట్లు చేయుమనియు భావము. శివాలయమందు ఉజ్జయినిలో శివుఁడు ప్రత్యక్షముగా తాండవమాడునా? ప్రమథులు సంచరింతురా? 'సాదరం వీక్ష్యమాణః' ఇట్టివర్ణన లెట్లు పొసంగును? అని యాక్షేపమేని - ఈయాక్షేపించినవి జరుగుచునే యుండును - మనుష్యులకు గోచరింపవుగాని దివ్యులకు గోచరించును - మేఘుఁడు దివ్యుఁడుగాన ('తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే') అతనికి గోచరించును - అని సమాధానము కవిహృదయము.

గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యైస్తమోభిః
సౌదామన్యా కనకనికషస్నిగ్ధయా దర్శ యోర్వీం
తోయోత్సర్గస్తనితముఖరో మాస్మభూ ర్విక్లబా స్తాః. 41.

ఇత్థం మహాకాళనాథ సేవాప్రకార మభిధాయ పున ర్నగరసంచార మేవాహ గచ్ఛన్తీనా మితి.—తత్ర = ఉజ్జయిన్యాం, నక్తం = రాత్రౌ, రమణవసతిం = ప్రియభవనంప్రతి + 'వసతీ రాత్రివేశ్మనోః' త్యమరః, గచ్ఛన్తీనాం. యోషితామ్ - అ

సారికాణా మిత్యర్థః, సూచిభిర్భేద్యైః=అతిసాన్ద్రై రిత్యర్థః, తమోభిః, రుద్ధాలోకే =నిరుద్ధదృష్టిప్రసారే, నరపతిపథే=రాజమార్గే, కనకస్య - నికషో - నికష్యత ఇతి వ్యుత్పత్త్యా నికషోపలగతరేఖా-తస్యేవ-స్నిగ్ధం=తేజో-యస్యాస్తయా + 'స్నిగ్ధంతు మసృణే సాన్ద్రే రమ్యే క్లీబే చ తేజసి' ఇతి శబ్దార్ణవే*సుదామ్నాద్రిణైకదిక్సౌదామనీ విద్యుత్ * 'తేనైకదిక్' ఇత్యణ్ప్రత్యయః - తయా, ఉర్వీం=మార్గం, దర్శయ కించ, తోయోత్సర్గస్తనితాభ్యాం = వృష్టిగర్జితాభ్యాం - ముఖరః = శబ్దాయమానః, మాస్మభూః, కుతః, తాః=యోషితః, విక్లబాః=భీరవః, తతో వృష్టిగర్జితే న కార్యే ఇత్యర్థః * నాత్ర తోయోత్సర్గేస్తనిత మితి విగ్రహః-విశిష్టస్యైవ కేవలస్తనిత స్యాప్యనిష్టత్వాత్ - న చ ద్వన్ద్వపక్షేఽల్పాచ్తరపూర్వనిపాతశాస్త్రవిరోధః * 'లక్షణ హేత్వోః క్రియాయాః' ఇతిసూత్ర ఏవ విపరీతనిర్దేశేన పూర్వనిపాతశాస్త్ర స్యానిత్యత్వజ్ఞాపనా దితి.

ఇట్లు మహాకాలనాథసేవాప్రకారము చెప్పి మరల నగరసంచారమును చెప్పచున్నాఁడు.—

తత్ర=ఉజ్జయినియందు, నక్తమ్ = రాత్రియందు, రమణవసతిమ్—రమణ= ప్రియునియొక్క—వసతిమ్ = స్థానమునకు, గచ్ఛన్తీనాం యోషితామ్=పోవుచున్న స్త్రీలకు - (అభిసారికలకు), సూచిభేద్యైః - సూచి=సూదిచే - భేద్యైః = గ్రుచ్చి సందుచేయఁదగినవైన (అనఁగా మిగులదట్టమయిన), తమోభిః=చీకటులచే, రుద్ధాలోకే - రుద్ధ = అడ్డగింపఁబడిన - ఆలోకే = దృష్టిప్రసారముగలదైన, నరపతిపథే=రాజమార్గమందు, కనక...యా - కనక = బంగారముయొక్క - నికష = ఒరయికగీఱవంటి-స్నిగ్ధయా=దీప్తిగలదైన, సౌదామన్యా-మెఱుపుఁదీఁగచే, ఉర్వీమ్= దారిని, దర్శయ = చూపుము, తోయో...రః—తోయ = నీటియొక్క—ఉత్సర్గ= జాఱవిడుచుట(అనఁగా వాన)చేతను - స్తనిత=ఉఱుములచేతను - ముఖరః=అఱచువాఁడవు, మాస్మభూః=కాకుము, (ఏలయన), తాః = ఆ స్త్రీలు, విక్లబాః=భయస్వభావముకలవారు.

తా.—శివసేవానంతరము నీవు నగరమునఁ బోవునప్పుడు అభిసారికలు కాంతుని తావునకు దట్టంపుఁజీకటిలో రాజమార్గమునఁ బోవుచుందురు. నీవు మెఱుపుసీ వారికి దారిచూపుదువుగాని వాన కురిసియు ఉఱిమియు అపకరించి బెదరింపకుము. దానికి వారోర్వఁజాలరు, భయపడి యుపాయముపా లగుదురు.

వ.—'గచ్ఛన్తీనామ్' - దూత్యాది ప్రయత్నము లక్కఱలేకయే ఉద్రిక్తకామలై స్వయముగా కాంతార్థినులై ఒంటరిగాఁబోవు నభిసారికలయతిలాలస సూ

చింపఁబడుచున్నది. మగని యింటికైనచో చీకటిలోఁ బోనక్కఱలేదు. 'రమణ' యనుటచే ఆకాంతులయందాయభిసారికలకుఁ గలప్రీత్యతిశయమును జారరతియు సూచితములు; 'వసతిమ్'-ఆయభిసారికలు తాము తమరమణులయింటికే పోదురు కాని, వారికి గృహము విడిచి యెచటికేని సంకేతస్థలమునకు పోవు ప్రయాసను కలుగఁజేయరు; రమణులమీఁదిమక్కువ యట్టిది. మఱియు, చెట్లు పొదరిండ్లు పాడు గృహములు పాడుదేవళములు మొదలగు చోట్లకు రమణులం దార్పక వారి వసతులకు పోవుట క్రీడాస్వాస్థ్యార్థము. 'రుద్ధాలోకే'—కామాతురతయు ఇతరులకు తెలియనీక పోవుట కానుకూల్యమును చెప్పఁబడినవి. ఇంత చీకటిలోఁ బోయినందుకై రమణులకు వీరియం దనురాగము అతిశయిల్లును. అసహాయముగా నెట్లు పోదురనిన మదనసహాయులై పోవుదురు. 'నరపతిపథే' — రాజమార్గమునఁ బోవుట సులువుగా త్వరగా చేరుటకు, సందుగొందులఁబోయిన కాలుతడఁబడి పడుట ఇత్యాద్యాటంకములు కలుగును. 'సూచిభేద్యైః'-ఆచీకటులలోనికి సూదిమొనయైనఁ దూఱునుగాని అంతకన్న లావుపాటిదేదియుఁ దూఱదు, మిగుల దట్టములు. 'తమోభిః'-బహువచనముచే చీకటియొక్క బాహుళ్యము మొత్తముమొత్తముగా నుండుటయుఁ జెప్పఁబడినవి. అంతచీకటిలో సాహసమేల ఇంటన యుండరాదా యనిన—సాహసము వలసినను చీకటియే జారరతిసాధకము గావున దానిని వ్యర్థపుచ్చుకొనరు. అట్టి యంధకారోపకారమునకు కామోద్రేకమునకును రెంటికిని నీవే కారణమవుగాన, ఓమేఘుఁడా వారిని 'తోయోత్సర్గస్తనితముఖరః మాస్మభూః'-వర్షించియుఱిమి విఘ్నములపాలునేయుట నీకు మిక్కిలి యనుచితముగాన, అట్లు నీవు చేయరాదు. తోయోత్సర్గముచే అట్టిదుర్వృత్తి కూడదని మంచిమాటగా బోధించుటయు స్తనితముచే గట్టిగా బెదరించుటయు ధ్వనితములు. ఏల యట్లు చేయఁగూడదనిన - వారు 'విక్లబాః'-ఆవిఘ్నమునకు ప్రాణములు విడుతురు. ఆదోషము నిన్నుఁదగులును. మఱి నీవేమి చేయవలసినవాఁడ వనఁగా 'దర్శయోర్వీమ్'-వారి నింటినుండి లేపినవాఁడవు నీవే గావున దారిచూపి గంతవ్యస్థానము చేర్చి పుణ్యము కట్టుకొమ్ము. దారిచూపు సాధనము 'సౌదామన్యా'—నీకాంత యగుమెఱుపుఁదీఁగ సిద్ధముగనే యున్నది. స్త్రీలకు స్త్రీలపై కనికరముండును, కావున నీభార్య స్వయముగానే యభిసారికలకు తోడ్పడఁగోరుచుండును, కాన నామెనునియమించిన నామె చక్కఁగా చూపును. మఱియు రమణాభిముఖులగు పరకాంతలతో స్వకాంతాముఖముగా వ్యవహరించుట యుక్తముగాని స్వయముగా వ్యవహరించుట యుక్తముకాదు. ఆహేతువుచేత నీవు స్వయముగాఁగాక నీభార్యచేత ('విద్యుత్కళత్రః') వారి కుపకరింపుము. 'కనకనికష'-చపలముగ్గా తళుక్కురను మెఱపయిన భయపెట్టును, దానిని చక్కఁ

గా చూపదు; నింపాదియై సరళమై అందమైన మెఱపు చక్కఁగా చూపును బెదరు పెట్టదు, అట్టి మెఱపని విశేషణ స్వారస్యము. ఇంత సాహసము చేయు స్త్రీలకు భయమా యనిన-వారు భీరువులేగాని మదనవశంవదలై సాహసింతురనియు, యక్షుఁడు కాముకుఁడును వియుక్తుఁడునుగాపున నతనికి కాముకురాండ్రపైని పక్షపాతమనియు, నెఱుఁగవలయును.

తాం కస్యాంచి ద్భవనవలభౌ సుప్తపారావతాయాం
నీత్వా రాత్రిం చిరవిలసనాత్ ఖిన్నవిద్యుత్కళత్రః
సూర్యే దృష్టే పునరపి భవా న్వాహయే దధ్వశేషం
మన్దాయన్తే న ఖలు సుహృదా మభ్యుపేతార్థకృత్యాః. 42.

తామితి.—చిరం-విలసనాత్ = స్ఫురణాత్ - ఖిన్నం -విద్యుదేవ కళత్రం యస్య స భవాన్, సుప్తాః - పారావతాః = కలరవా-యస్యాం తస్యామ్-వివిక్తాయామిత్యర్థః+'పారావతః కలరవః కపోతః' ఇత్యమరః - జనసంచార స్తత్రాసంభావిత ఏవేతి భావః, కస్యాంచిత్ - భవనస్య - వలభౌ = ఆచ్ఛాదనే - ఉపరిభాగ ఇత్యర్థః + 'ఆచ్ఛాదనం స్యా ద్వలభీ గృహాణామ్' ఇతిహలాయుధః, తాం రాత్రిం నీత్వా, సూర్యే - 'దృష్టే సతి = ఉదితేసతీత్యర్థః, పునరపి, అధ్వ శేషం వాహయేత్; తథాహి - సుహృదాం = మిత్రాణామ్, అభ్యుపేతా = అఙ్గీకృతా - అర్థస్య = ప్రయోజనస్య - కృత్యా = క్రియా - యైస్తే - అభ్యుపేత సుహృదర్థా ఇత్యర్థః,*సాపేక్షత్వేఽపి గమకత్వాత్సమాసః+ 'కృత్యా క్రియాదేవతయోః కార్యే స్త్రీ కుపితే త్రిషు' ఇతియాదవః *'కృఞశ్చ' ఇతిచకారాత్క్యప్' న మన్దాయన్తే ఖలు = న మన్దా భవన్తిహి - నవిలమ్బన్త ఇత్యర్థః, * 'లోహితాదిడాజ్భ్యః క్యష్' ఇతిక్యష్ * వాక్యషః' ఇత్యాత్మనేపదమ్.

చిరవిలసనాత్—చిర=చాలసేపు-విలసనాత్ = మెఱయుటచేత,ఖిన్న... త్రః—ఖిన్న=అలసిన-విద్యుత్=మెఱపుఁదీఁగయను-కళత్రః = భార్యకలవాఁడవు, భవాన్ = నీవు, సుప్త...యామ్—సుప్త = నిద్రించిన-పారావతాయామ్=పావురములుగలదైన, కస్యాంచిత్ భవనవలభౌ = ఏదేని యొకయింటి పైభాగమందు, తాం రాత్రిమ్ = ఆ రాత్రిని (ఆ రాత్రిశేషమును), నీత్వా=గడపి, సూర్యే=సూర్యుఁడు, దృష్టేసతి = అగపడఁగా-అనఁగా-ఉదయింపఁగా, పునరపి = మరల,అధ్వశేషమ్ - అధ్వ = మార్గముయొక్క, శేషమ్ = మిగతను, వాహయేత్ =నడపవలయును, సుహృదామ్ = మిత్రులకు, అభ్యు...త్యాః—అభ్యుపేత = పూనుకోఁబడిన-అర్థ=ప్రయో

జనముయొక్క-కృత్యాః=చేయుటగలవారు, అనఁగా సుహృత్ప్రయోజనమును నెఱవేర్పఁబూనుకొన్నవారు, మన్దాయన్తేనఖలు = విలంబింపరు గదా.

తా.—చాలనేఁవు మెఱసి నీకాంత మెఱుపుఁ దీఁగ అలసియుండును గావున నీవును ఆరాత్రిశేషమును, ఎక్కడనైన ఒకయింటివలభియందు విశ్రాముముకై గడపుము. అందలిపావురములు అప్పటికి నిద్రించియుండునుగాన నీకళత్రమునకు నీకును నిశ్శబ్దముచే చక్కఁగా విశ్రాంతి కలుగును. తెల్లవాఱఁగానే మరల పయన మగుము. మిత్రప్రయోజనధురంధరులు కాలవిలంబము చేయరుగదా. అట్టివారిలో ఉత్తమో త్తముఁడవు నీవా చేయుదువు!

వ.—'కస్యాంచిత్'—మేఘునకి విశ్రామోచితములయిన వలభులు ఎత్తయినవి అనేకములు గలవుగావున 'ఏదేనొక వలభియందు' అనుట. 'హర్మ్య' అనక 'భవన' అనుట-ఆపట్టణమందలి యిండ్లెల్ల హర్మ్యములే కావున 'హర్మ్య' అన నక్కఱలేదు. ఇండ్లెల్ల మేఘమండలము నంటునవియే. 'వలభౌ'—వలభి గృహోపరిభాగము - విశ్రామార్థము రమణీయతమము. ఎట్లన దానిక్రింది యుప్పరిగయే యౌవనవంతులకు పడుకటిల్లుగా నుండును.—

"ప్రాసాదానా ముపరివలభీతుఙ్గవాతాయనేషు
భ్రాన్త్వావృత్తః పరిచితసురాగన్ధ సంస్కారగర్భః
మాల్యామోదీ ముహురుపచిత స్ఫీతకర్పూరవాసో
వాయు ర్యూనా మభిమతవధూసన్నిధానం వ్యనక్తి." మాలతీ.

'సుప్తపారావతాయామ్'-పావురములు నిద్రించినవనుటచే నిశ్శబ్దముగా సుఖనిద్ర కలుగుననియు, అచటి రతిభవనములయందలి రమణీమణులును రమణులును రత్యంత నిద్ర నుస్నారనియు, కాన వారిచే మేఘునికిఁగాని మేఘునిరాకచే వారికిఁగాని నిద్రాభంగము లుండవనియు, భావము: అందలివారలు క్రీడాసక్తులయి యున్నచో మణితధ్వనులచే స్వజాతిరుతభ్రమ కలిగి పావురములు గుబాళించుచుండును. అట్టి మణితములు శాంతించిన, పావురములును ఆయుత్కంఠ తీఱి నిద్రించును. మణితధ్వని కపోతరవముం బోలుననుటకు.—

"తచ్చ లావక కపోత కోకిలా హంస కోక సదృశై రుతక్రమైః
మిశ్రితం ప్రహరణే ప్రయుజ్యతే చాన్యథాపి రుత మిష్యతే బుధైః." కామశా.

"దధతి గృహచకోరా శ్చన్ద్రికామ్భఃసిలోఞ్ఛం
క్వచన కనకశాలాజాలకాభ్యన్తరేషు,
అపి రతిభవనాని వ్యఞ్జయన్తి ప్రియాణాం
నిధువనసుఖనిద్రాం మూకపారావతాని." బిల్హ.

"ఉన్మృష్టా శయనేషు చిత్రసురతక్రీడావిధేః సాక్షిణీ
లాక్షారాగమయీ లిపిః; క్లమవశాః పారావతాః శేరతే;
సర్వం సాధక, మత్ర కం ప్రతివిధిం కుర్యాః కురఙ్గీదృశః
తాదృశ్యః ప్రసరన్తి యద్గురుజన స్యాగ్రే శుకానాం గిరః." బిల్హ.

"గాఢపీడితపరస్పరాధరం కణ్ఠగర్భితకపోతకూజితం
అత్రపావరణ మాత్తసీత్కృతం విస్మరామి కిము తే రతోత్సవమ్." వరదా.

"వీరాయితేషు మృగశాబవిలోచనానాం
కణ్ఠోదితా న్యచరమం కలకూజితాని
ఆమ్రేడయద్భి రథ సౌధగతైః కపోతైః
శజ్కే గృహీత ఇవ సంప్రతి శిష్యభావః." కాశీపతి.

ఇట్టి పారావతకథనము ఆ తావుయొక్క సంపదను సౌఖ్యాతిశయమును విశ్రామార్హతనుఁ దెలుపును. 'నీత్వా' (గడపి) యనుట ఆరాత్రి విశ్రామార్థ మచ్చట నిలుచుట యావశ్యకమని తెలుపుచున్నది. అందుల కారణము? 'ఖిన్నవిద్యుత్కళత్రః'-భార్యయగు మెఱపుఁదీఁగ యలసియుండుట. అలయుటకుఁ గారణము? 'చిరవిలసనాత్.' చాల సేపు మెఱయుట యేలయనఁగా పూర్వశ్లోకమందుఁ గోరఁబడినప్రకారము అభిసారికలకు దారిచూపుటకు. ఆవిలసన మెంత సేపనఁగా 'చిర'-చాల సేపు, శివతాండవము ముగియుట మొదలు అభిసారికలపరువులు తీఱువఱకు-రమారమి అర్ధరాత్రము వఱకు; అప్పటికే పూర్వోక్తవలభీసంబద్ధ రతిభవనములందును మదనకోలాహలము శాంతించి స్త్రీపురుషులు నిద్రించియుందురు, పావురములును నిద్రించియుండును. కావున ఇంచుమించుగా ఒకటియు నరయామము విలసనమని భావము. అభిసారికలంతవఱకు నడచుచుందురా యనిన-జంజాటము లేని దొకతె-[1] కై సేఁతలో నాసక్తురా లొకతె-శిశువును నిద్రపుచ్చి తరలవలసిన దొకతె-అత్తమామలనిద్ర నెదురు సూచున దొకతె-మగనిని గాటపునిదుర నమర్చి లేచున దొకతె-ఇట్టిలబనలకు ఎవతె కెప్పటికి తరల వలను పడునో - కావున చాలరాత్రివఱకు మెఱపుఁగొమ్మకు పని కలిగియే యుండును.

---

1. ఉత్క్షిప్తం కరకజ్కణద్వయ మిదం, బద్ధా దృఢం మేఖలా,
యత్నేన ప్రతిపాదితా ముఖరయో ర్మఞ్జీరయో ర్మూకతా,
ఆరబ్ధే రభసా న్మయా ప్రియసఖి, క్రీడాభిసారోత్సవే
చణ్డాల స్తిమిరావగుణ్ఠనపటాక్షేపం విధత్తే విధుః. దర్పణము.

'ఛిన్నవిద్యుత్' అనుటచే-మఱియూవలభియందు మెఱపు మెఱయుట లేదని సూచన; మెఱసినయెడల పావురములు మేలుకొని కలవరపడును, ఇంటివారును కోలాహలపడుదురు, వారికిని భంగము మేఘునికిని భంగము; ఇందువలననే ఉఱుముట యు లేదని తెలియనగు. 'దృష్టే'—సూర్యుని చూచినపిమ్మట ఆలస్యముచేయక వెంటనే మిత్రకార్యసంపాదనపరాయణత్వముచే నని భావము. మఱియు ఆలస్యము చేసిన ఇంటివారు మేలుకొందురు, నిన్నుఁగాంచి కలవరపడుదురు. ముందుగానే మేలుకోరాయనిన సురతశ్రాంతులు నీమీఁదిచల్లగాలియు తగిలి గాఢముగా నిద్రింతురుగావుననే త్వరగా మేల్కొనరు. సూర్యుఁడు పొడుచుచున్నపుడు నిద్రింపఁగూడదు గాన, అటుపై నిద్రింపరుగానను. వారు మేలుకొనకముందే నీవు తరలవలయు. నీవు వలభిలోను వారు గదులలోను ఉందురుగావున వారికన్న ముందు నీవే సూర్యునిఁ జూతువు. కావున వారు సూర్యోదయమెఱిఁగి లేవకముందే నీవు తరలిపోవచ్చును. నీవును పూర్ణవిశ్రాంతినే పొందుదువుగాక-తెల్లవాఱకముందే తరలకుము. తెల్లవాఱిన పిమ్మట నిద్ర మహాపురుషునికి నీకును తగదు. కనుక అప్పుడు తరలవలయును.

తస్మిన్కాలే నయనసలిలం యోషితాం ఖణ్డితానాం
శాన్తిం నేయం ప్రణయిభి రతో వర్త్మ భానో స్త్యజాశు,
ప్రాలేయాస్రం కమలవదనా త్సోఽపి హర్తుం నలిన్యాః
ప్రత్యావృత్త స్త్వయి కరరుధి స్యా దనల్పాభ్యసూయః. 43.

---

ఉత్తరమేఘమున 11-వ శ్లోకముం గనునది.

ఉరసి నిహిత స్తారో హారః, కృతా జఘనే ఘనే
కలకలవతీ కాఞ్చీ, పాదౌ రణన్మణినూపురౌ,
ప్రియ మభిసర స్యేవం ముగ్ధే త్వ మాహతడిణ్డిమా,
యది కి మధికత్రాసోత్కమ్పా దిశః సముదీక్షసే? అమరు.

అభిసారికాభేదము లభిసరించు ప్రకారములు:—

సంలీనా స్వేషు గాత్రేషు మూకీకృతవిభూషణా
అవగుణ్ఠనసంవీతా కులజాఽభిసరే ద్యది.
విచిత్రోజ్జ్వలవేషా తు వలన్నూపురనిస్వనా
ప్రమోదస్మేరవదనా స్యా ద్వేశ్యాఽభిసరే ద్యది.
మదస్ఖలితసంలాపా విభ్రమోత్ఫుల్లలోచనా
ఆవిద్ధగతిసంచారా స్యా త్ప్రేష్యాఽభిసరే ద్యది. దర్పణము.

తస్మిన్నితి.—తస్మిన్కాలే = పూర్వోక్తే సూర్యోదయకాలే, ప్రణయిభిః =ప్రియతమైః, ఖణ్డితానాం యోషితాం=నాయికావిశేషాణామ్ †'జ్ఞాతేఽన్యాసఙ్గవికృతే ఖణ్డితేర్ష్యాకషాయితా' ఇతి దశరూపకే, నయనసలిలం శాన్తిం- నేయం = నేతవ్యమ్*నయతి ర్ద్వికర్మకః, అతో = హేతోః, భానోః, వర్త్మ = మార్గమ్, ఆశు = శీఘ్రం, త్యజ, తస్యావరకో మాభూ రిత్యర్థః; విపక్షేఽనిష్టమాచష్టే—సోఽపి భానుః, నలాని (అమ్బుజాని) అస్యాః సన్తీతి = నలినీ=పద్మినీ + 'తృణేఽమ్బుజే నలం నాతు రాజ్ఞి నాలే తు నస్త్రియామ్' ఇతిశబ్దార్ణవే- తస్యాః స్వకాన్తాయాః, కమలం = స్వకుసుమమేవ - వదనం - తస్మాత్, ప్రాలేయం=హిమమేవ - అస్రమ్=అశ్రు, హర్తుం=శమయితుం, ప్రత్యావృత్తః = ప్రత్యాగతః, నళిన్యాశ్చ భర్తు ర్భానో ర్దేశాన్తరే నళిన్యన్తరగమనా త్ఖణ్డితాత్వ మిత్యాశయః, అత స్త్వయి, * కరాన్ (అంశూన్) రుణద్ధీతి కరరుత్ - క్విప్ - తస్మి న్కరరుధి సతి-హస్తరోధిని సతీతి చ గమ్యతే + 'బలి హస్తాంశవః కరాః' ఇత్యమరః, అనల్పాభ్యసూయః = అధికవిద్వేషః, స్యాత్, ప్రాయే ణేచ్ఛావిశేషవిఘాతా ద్ద్వేషరోషవిశేష శ్చ కామినాం భవతీతి భావః, కించ† 'బ్రహ్మాణ మర్క మీశానం విష్ణుం వా ద్వేష్టి యో జనః। శ్రేయాంసి తస్య నశ్యన్తి రౌరవం చ భవే ద్ధ్రువమ్.' ఇతి నిషే ధాత్కార్యహాని శ్చ భవిష్య తీతి ధ్వనిః.

తస్మిన్ కాలే = ఆసూర్యోదయకాలమందు, ఖండితానాం యోషితామ్ = ఖండిత నాయికలయొక్క (తనకాంతుఁడు మఱియొక కాంతంగూడె నని తెలిసి యీర్ష్యాకుపితయగు కాంత ఖండిత యనఁబడును), నయనసలిలమ్ = నేత్రజలము (బాష్పము), శాన్తిం నేయమ్=శాంతి పొందింపఁదగినది (అనఁగా మాన్పఁదగినది); అతః = ఆహేతువువలన, భానోః = సూర్యునియొక్క, వర్త్మ = మార్గమును, ఆశు = త్వరగా, త్యజ=వదలుము; (అట్లు తొలఁగనియెడల చెఱుపుగలదు. ఏమన), సోఽపి=ఆసూర్యుఁడును, నళిన్యాః=తామరతీఁగ (యనెడు తనకాంత)యొక్క, కమ...నాత్—కమల=తామరపువ్వను-వదనాత్ = ముఖమునుండి,ప్రాలే...స్రమ్—ప్రాలేయ=మంచనెడు-అస్రమ్ = బాష్పమును, హర్తుమ్=మాన్పుటకు, ప్రత్యావృత్తః = మరలవచ్చినవాఁడయి, (సూర్యుఁడు దేశాంతరములో మఱియొక నళినిని గూడినాఁడు గావున ఇచటినళిని ఖండితయైనది యని యభిప్రాయము), త్వయి = నీవు, కరరుధి—కర = కిరణములను (చేతులను) - రుధి = అడ్డఁగా, అన...యః—అనల్ప=విస్తారమయిన - అభ్యసూయః = ద్వేషముగలవాఁడు, స్యాత్=అగును.

తా.—సూర్యోదయకాలమందు ఖండితనాయికల బాష్పములను నాయకులు వచ్చి తుడిచి మాన్పుట యావశ్యకము గావున సూర్యుఁ డను నాయకుఁడు ఇచటి

నళినిని వదలిపోయి దేశాంతరమందు నళినీసంగతిచేసి వచ్చియుండుటచేత ఖండిత నాయికయైన యిచటినళిని ఆదుఃఖముచే మంచుమిషచే కమలమనుముఖమెల్ల బాష్పములుగా శోకించుచుండును. అబాష్పములను తుడిచి ఆమెశోకమును మాన్పుటకు సూర్యుఁడు వచ్చి కిరణములనెడుహస్తములనుచాఁచును. ఆకరములకు నీవడ్డపడిన ఆభగవంతుని కధికద్వేషము నీపైఁగలుగును, కావున ఆయన కడ్డపడక త్వరత్వరగా తొలఁగి పోవుచుండుము. సూర్యుఁడు నాయకుఁడుగాను నళిని ఖండితనాయికగాను కమలము ముఖముగాను మంచు బాష్పములుగాను కిరణములు చేతులుగాను కిరణములు కమలములపై ప్రసరించి మంచును కరఁగించి జాఱి పోఁజేయుట కన్నీళ్లు తుడుచుట గాను వర్ణింపఁబడినవి.

వి.—'నయన'-బాష్పమనక 'నయనసలిల'మనుటచే నయనశబ్దమువలన నేత్రములయారుణ్యము మొదలగు శోకకార్యము స్ఫురించుచున్నది. 'నేయమ్' - శాంతి పొందించుట ఆవశ్యకము, పొందింపనియెడల ఖండితలు మృతిపొందుదురని స్ఫురించుచున్నది. 'ప్రణయిభిః'- స్త్రీ)కి తనప్రియుఁడు అన్యను గూడినయెడల దుఃఖముగాని అప్రియుఁ డన్యనుగూడిన దుఃఖములేదు గాన ప్రణయము చెప్పఁబడినది. ప్రణయము గల యాప్రియుఁడు ప్రమాణాదికములు చేసిన ఆదుఃఖముశాంతిపొందును గావునను ప్రణయము చెప్పఁబడినది. 'నయనాదస్రమ్'—అనక 'వదనాదస్రమ్' అనుటకు మొగమెల్ల బాష్పములు గా నేడ్చుట యభిప్రాయము, అందుచే దుఃఖాతిశయము స్ఫురించుచున్నది. 'ప్రాలేయాస్రమ్'-రాత్రి యెల్ల మొత్తమై యున్నమంచు తెల్లవాఱినంతట క్రమక్రమముగా పెద్దపెద్దబొట్టులయి జాఱుచుండును; అట్లుంట కన్నీళ్లు విడుచుచు ఏడ్చుచుండుటవలె నుండును. సూర్యకిరణప్రసారముచే ఆబొట్టులు త్వరత్వరగా మఱియు పెద్దపెద్దవిగా కూడుకొని పడిపోవును, క్రమముగా కమలమునుండి మంచెల్లఁబోవును. అది ఆబాష్పముల నతఁడు చేతులతో తుడిచివేయుటవోలె నుండును. 'హర్తుం ప్రత్యావృత్తః' - బాష్పములు తుడుచుటకు సూర్యుఁడు కోరి వచ్చెనని యభిప్రాయము; అట్లు కోరుటకు 'ప్రణయి' యగుట కారణము.' అనల్పాభ్యసూయః' - సూర్యుఁడును నళినిపై మిగుల ప్రణయిగావున సూర్యునికి అసూయ. నళిని సూర్యోదయముదు వికసించి పగలెల్ల శోభిల్లుచుండుటచే నళినీ సూర్యులకు నాయికానాయకభావమును కవులు వర్ణింతురు.

గమ్భీరాయాః పయసి సరితశ్చేతసీవ ప్రసన్నే
ఛాయాత్మాపి ప్రకృతిసుభగో లప్స్యతే తే ప్రవేశమ్;

తస్మా దస్యాః కుముదవిశదా న్యర్హసి త్వం న ధైర్యా
న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని. 44.

గమ్భీరాయా ఇతి.—గమ్భీరానామ సరిత్, ఉదాత్తనాయికా చ ధ్వన్యతే, తస్యాః, ప్రసన్నే = అనురక్తత్వా ద్దోషరహితే, చేతసీవ, ప్రసన్నే = అతినిర్మలే, పయసి, ప్రకృత్యా = స్వభావేనైవ - సుభగః = సున్దరః + 'సున్దరేఽధికభాగ్యే చ సుభగః' ఇతిశబ్దార్ణవే, తే=తవ, ఛాయా చాసావాత్మా చ సోఽపి- ప్రతిబిమ్బశరీరం వా, ప్రవేశం లప్స్యతే, అపిశబ్దాత్ సాక్షాత్ప్రవేశ మనిచ్ఛేర పీతి భావః, తస్మాత్ = ఛాయాద్వారాపి ప్రవేశస్యావశ్యం భావిత్వాత్, అస్యాః = గమ్భీరాయాః, కుముదవత్ - విశదాని = ధవళాని, చటులాని = శీఘ్రాణి - శఫరాణాం = మీనానామ్ - ఉద్వర్తనాని = ఉల్లుణ్ఠనాన్యేవ ప్రేక్షితాని = అవలోకనాని + 'త్రిషు స్యాచ్చటులం శీఘ్రమ్' ఇతి విశ్వః—ఏత దేవ గమ్భీరాయా అనురాగలిఙ్గమ్, ధైర్యాత్ = ధార్ష్ట్యాత్ - ధౌర్త్యా దితి యావత్, మోఘీకర్తుం = విఫలీకర్తుం - నార్హసి, నానురక్తా విప్రలబ్ధవ్యేత్యర్థః. ధూర్తలక్షణం తు + 'క్లిశ్నాతి నిత్యం దయితా మజస్రం మతిసున్దరః। అక్షిచ్ఛిద్ర త్యక్తాం యస్త్వేన రక్తాం ధూర్తో విముఞ్చతి' ఇతి.

గమ్భీరాయాః సరితః = గంభీరయనెడు పేరుగల నదియొక్క (ఉదాత్తనాయికయొక్కయని ధ్వనించుచున్నది), ప్రసన్నే = అనురక్తమగుటచేత దోషరహితమైన, చేతసీవ = మనస్సునందుఁబోలె, ప్రసన్నే = స్వచ్ఛమయిన, పయసి = నీటియందు, తే = నీయొక్క, ప్రకృతిసుభగః —ప్రకృతి = స్వభావముచేతనే - సుభగః = సుందరమైన, ఛాయాత్మాపి - ఛాయా = ప్రతిబింబరూపమైన - ఆత్మాపి = స్వరూపమయినను - (నీవాస్తవరూపము గాకపోయినను అని అపిశబ్దార్థము), ప్రవేశమ్ = ప్రవేశమును, లప్స్యతే = పొందును, తస్మాత్ = ఆహేతువుచేత, అస్యాః = ఈగంభీరయొక్క, కుము...ని - కుముద = తెల్లగలువలవలె - విశదాని = తెల్లనివైన, చటులాని = శీఘ్రములయిన, శఫ ...ని — శఫర = మీనములయొక్క - ఉద్వర్తన = పైకి తూలుటయనెడు - ప్రేక్షితాని = చూపులను - (ఇదియే గంభీరయొక్క యనురాగమునకు సూచకము), త్వమ్ = నీవు, ధైర్యాత్ = దిట్టతనముచేతను (వంచకత్వముచేతను), మోఘీకర్తుం = వ్యర్థముచేయుటకు, నార్హసి = తగవు, అనురక్తురాలిని వంచించుట తగ దని యర్థము.

తా.—ఆయుజ్జయినిని దాటఁగానే నీకు ఉదాత్తనాయికవంటిది గంభీరయనెడినది తగులును. అట నిలువక మిత్రకార్యార్థము త్వరపడి పోవుచున్నను అలుక

లేక సంతోషముతో నిండినహృదయమువంటి యానదీస్వచ్ఛజలమందు నీప్రతిబింబ స్వరూపమైనను ప్రవేశింపకతప్పదు, నాయికాప్రేమస్వచ్ఛదృష్టులవంటి సదీశఫరో ద్వర్తనములను నీవు వంచించిపోవుట యుచితము గాదు, నాయికను గలసి తనియించు నట్లు నదిని వర్షించి నిండింపవలయు నని తాత్పర్యము.

వ.—'చేతసీవ'— స్వచ్ఛజలమును మహాకవులు స్వచ్ఛహృదయమునకుఁ బోల్తురు. 'ప్రకృతిసుభగః'—అందగాఁడవుగాన నీవు కోరకున్నను నాయిక నిన్ను వలచును. 'విశదాని' - ప్రేమాతిశయముచే స్వచ్ఛములు, కుటిలములు గావు. 'చటుల శఫరోద్వర్తన' — మబ్బుసమీపించినప్పుడు ఆచలువకు నీటినుండి జేడిసచేఁపలు. తూలుట ప్రసిద్ధము. 'చటుల'-శీఘ్రతచే జేడిసలకు చూపులతో ఎక్కువసామ్యము లభించును. 'మోఘీకర్తుం నార్హసి'—వర్షింపుము. 'లప్స్యతేప్రవేశమ్ ... ప్రేక్షి తాని' - గంభీరనాయిక మనోహరుని నిన్ను ప్రేమతో వీక్షించును.

తస్యాఃకించి త్కరధృతమివ ప్రాప్తవానీరశాఖం
హృత్వా నీలం సలిలవసనం ముక్తరోధోనితమ్బమ్
ప్రస్థానం తే కథమపి సఖే లమ్బమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః. 45.

తస్యాఇతి.—హేసఖే, ప్రాప్తా - వానీరశాఖా = వేతసశాఖా - యేనతత్త థోక్త - మతఏవ - కిఞ్చిత్ = ఈషత్-కరధృతం=హస్తావలమ్బిత - మివ స్థితం, ముక్తః=త్యక్తః - రోధః=తటమేవ - నితమ్బః=కటి-ర్యేన త త్తథోక్తమ్ + 'నిత మ్బః పశ్చిమే శ్రోణిభాగే2ద్రికటకే తటే' ఇతియాదవః, నీలం=కృష్ణవర్ణం, తస్యాః =గమ్భీరాయాః సరితః, సలిలమేవ వసనం, నీలామ్బరధారణం విరహతాపనివారణ మితి ప్రసిద్ధిః, హృత్వా=అపనీయ, లమ్బమానస్య=పీతసలిలభారా ల్లమ్బమానస్య- అన్యత్ర జఘనారూఢస్య, తే = తవ, ప్రస్థానం=ప్రయాణం, కథమపి=కృచ్ఛ్రేణ, భావి; కృచ్ఛ్రత్వహేతు మాహ జ్ఞాతేతి:—జ్ఞాతాస్వాదః = అనుభూతరసః, కః పుమాన్, వివృతం=ప్రకటీకృతం-జఘనం=కటి స్తత్పూర్వభాగోవా-యస్యా స్తామ్+ 'జఘనం స్యా త్కటౌ పూర్వశ్రోణిభాగాపరాంశయోః' ఇతి యాదవః, విహాతుం =త్యక్తుం, సమర్థః=శక్తః, న కో2పీత్యర్థః.

హేసఖే = ఓయిమిత్రుఁడా, ప్రాప్త ... ఖమ్— ప్రాప్త = పొందఁబడిన- వానీర శాఖమ్ = ప్రబ్బలికొమ్మగలదైన - (అనఁగా ప్రబ్బలికొమ్మకుఁ దగులు చున్న)- (అందుచేతనే), కిఞ్చిత్ = కొంచెము, కరధృతమివ - కర = చేతితో,

ధృతమివ = పట్టుకొనఁ బడినట్లున్నదియు, ము క్త...బమ్ —ము క్త = విడువఁబ డిన-రోధః = గట్టనెడు - నితమ్బమ్ = పిఱుఁదుగలదియు - (అనఁగా పిఱుఁదునుండి జాఱినదియు), నీలమ్ = నల్లనిదియు, నగు, సలిల వసనమ్ = నీ ర నెడువస్త్రమును, హృత్వా = తొలఁగించి, లమ్బమానస్య = త్రాగినజలముయొక్క బరువుచే క్రిందికి వ్రాలుచున్న, (జఘనస్థలముపై ఎక్కిన), తే = నీయొక్క, ప్రస్థానమ్ = ప్రయాణము, కథమపి = ఎట్టకేలకు, భావి=జరుగునది; (విలంబమునకు హేతువును చెప్పుచున్నాఁడు), జ్ఞా ... దః — జ్ఞాత = అనుభూతమైన - ఆస్వాదః = రసము గలవాఁడు, కః = ఎవఁడు, వివృ ... ఘనామ్ — వివృత = ప్రకటింపఁబడిన - జఘనామ్ = కటిపురోభాగముగలదానిని, విహాతుమ్ = వదలుటకు, సమర్థః = శక్తుఁడు? (ఎవఁడును శక్తుఁడు గాఁ డని యర్థము).

తా.—నాయిక తననితంబబింబమునుండి నల్లనివస్త్రము జాఱఁగా, దానిని కొంచెము చేతఁబట్టుకొని యుండఁగా, నాయకుఁడు ఆవస్త్రమును తొలఁగించివేసి ఆమెయొక్క జఘనమందుఁ జేరినవాఁడు తత్పూర్వము రసమనుభవించిన వాఁడు విడిచి పోలేక ఎట్లు క్రీడించియే పోవునో, అట్లే ఆగంభీరానదియొక్క గట్టునుండి జాఱిన నల్లనిజలమును కొంచెముగా ప్రబ్బలికొమ్మకు తగులుచున్నదానిని నీవు తొలఁగించి (త్రాగివేసి), ఆనీటిబరువుచే నదిపై వ్రేలుచున్న నీవు పూర్వము రస మనుభవించిన వాఁడవు దానిని వదలి పోలేక అందు వర్షించి ఎట్టకేలకు అవతలికి పోదువు.

వ.-ఇందు గంభీరానది నాయికగాను, వానీరశాఖ చేయిగాను, అది గట్టునుండి జాఱుట వస్త్రము పిఱుఁదునుండి జాఱుటగాను, ఆనీటికి వానీరశాఖ తగులుచుండుట వస్త్రమును నాయిక కొంచెముగా చేతితో పట్టుకొనియుండుటగాను, నీటిని మేఘుఁడు త్రాగితగ్గించుట నాయకుఁడు నాయికాజఘనమునుండి వస్త్రమును తొలఁగించుటగాను, మేఘుఁడు నాయకుఁడుగాను, వర్షణము సంగమముగాను, నుపమింపఁబడినవి. 'కరధృత'—వస్త్రమును చేతఁబట్టుకొని యుండుట నాయకుఁడు దానిని హరించు ననులజ్జచేత; కొంత జాఱినది గాన సర్వమును జాఱిపోవు ననియు లజ్జ. 'కిఞ్చిత్' - అతఁడు హరించుట నాయికకు అప్రియముకాదు గాన కొంచెముగానే పట్టియుంట. 'వానీరశాఖమ్' - తొలకరులందు వానీరము పుష్పించి తచ్ఛాఖ పుష్పభరితమై రత్నకంకణాదిభూషిత మైన స్త్రీహస్తమువలె నుండును, కావున 'కరధృతమివ' అనుట. 'హృత్వా'-లజ్జావతిగాన నాయిక తానే తొలఁగింపదు. నాయకుఁడే తొలఁగించుట శృంగారము. మేఘుఁడు నదులజలమును త్రాగునా యని యాక్షేపమేని, 'త్వయ్యాదాతుం జలమవనతే'-'క్షీణః క్షీణః పరిలఘు పయః స్రోతసాం చోపయుజ్య' ఇత్యాదులం బరికింపవచ్చును; కొంచెమునీరు మేఘుఁడుత్రాగినమాత్రాన

వసన మెడలినట్లు వర్ణించుటకు తగినంతజలము తగ్గునా యని శంకయేని, ఏఱులు వెల్లువ పొడచునంత వర్షించు మేఘుఁడు ఎంతత్రాగునో యోజింపుఁడు; ఎగువనీరువచ్చి మరలనిండదా యనిన నిండువఱకు తగ్గియుండదా, ఆస్థితియే వసనముతొలఁగుటగా వర్ణింపఁబడినది. అనంతరము మరల వసనమునుసరుదుకొనదా? 'నీలమ్' - నల్లి వస్త్రము ధరించిన విరహతాపము శమించు నని ప్రసిద్ధి. మేఘవియోగతాపశాంతికై గంభీర నీలవస్త్రమును ధరించినదని భా. 'ముక్తరోధోనితమ్బమ్'—వేసవికి నీరు తగ్గి గట్టును వదలినది. సాత్త్వికభావముచే వస్త్రము పిఱుఁదుమీఁదనిలువక[1] జాఱిపోవును. 'జ్ఞాతాస్వాదః'—రస మెఱుఁగని జడుఁడు వదలినను వదలును, నీ వా అత్యంతరసజ్ఞుఁడవు - వేత్రవతీ నిర్వింధ్యా రేవాదులగు నెన్నినదులతో సంగడికాఁడవు - నీవు ఎంత మాత్రము వదలఁజాలవు. నీటిని వస్త్రమునకుఁ బోల్చుట మహాకవిప్రియము.

త్వన్నిష్యన్దోచ్ఛ్వసితవసుధాగన్ధసంపర్కరమ్యః
స్రోతోరన్ధ్రధ్వనితసుభగం దన్తిభిః పీయమానః
నీచైర్వాస్యత్యుపజిగమిషోర్దేవపూర్వం గిరిం తే
శీతో వాతః పరిణమయితా కాననోదుమ్బరాణామ్. 46.

త్వదితి.—త్వన్నిష్యన్దేన = తవ వృష్ట్యా - ఉచ్ఛ్వసితాయాః = ఉపబృంహితాయాః - వసుధాయాః = భూమేః - గన్ధస్య - సమ్పర్కేణ - రమ్యః = సురభిరిత్యర్థః. స్రోతఃశబ్దే నేన్ద్రియవాచినా తద్విశేషో ఘ్రాణంలక్ష్యతే + 'స్రోతోఽమ్బువేగేన్ద్రియయోః' ఇతివిశ్వః - స్రోతోరన్ధ్రేషు = నాసాగ్రకుహరేషు-యత్ - ధ్వనితం = శబ్దః - తేన సుభగం యథాతథా, దన్తిభిః = గజైః, పీయమానః = వసుధాగన్ధలోభా దాఘ్రాయమాణ ఇత్యర్థః, అనేన మాన్ద్య ముచ్యతే, కాననేషు = వనేషు, ఉదుమ్బరాణాం = జన్తుఫలానామ్ + 'ఉదుమ్బరో జన్తుఫలో యజ్ఞాఙ్గ

1 ఓష్ఠః ప్రస్ఫురతి క్షణే విచలతః కూపోదకే మత్స్యవత్
ధమ్మిల్లః కుసుమాఞ్చితో విగళతి ప్రాప్తోఽపి బన్ధం పునః
ప్రచ్ఛన్నౌ ప్రజతః స్తనౌ ప్రకటతాం శ్రోణీతటం దృశ్యతే
నీవీ చ స్ఖలతి స్థితాపి సుదృఢం కామేఙ్గితం యోషితామ్. రతిరహస్యము.
గాఢాలిఙ్గనవామనీకృతకుచప్రోద్భిన్నరోమోద్గమా
సాన్ద్రస్నేహరసాతిరేకవిగళత్కాఞ్చీనితమ్బామ్బరా
మా మా మానద మాతి మా మల మితి క్షామాక్షరోల్లాపినీ
సుప్తా కిన్ను మృతా ను కిం మనసి మే లీనా విలీనా ను కిమ్. అమరుకము.

హేమదుగ్ధకః' ఇత్యమరః, పరిణమయితా = పరిపాచయితా * 'మితాం హ్రస్వః' ఇతి హ్రస్వః, శీతోవాతః, దేవపూర్వం గిరిమ్ = దేవగిరి మిత్యర్థః, ఉపజిగమిషోః = ఉపగన్తుమిచ్ఛోః * గమేః సనన్తా దుప్రత్యయః, తే = తవ, నీచైః = శనైః, వాస్యతి, త్వాం వీజయిష్యతీత్యర్థః * సంబన్ధమాత్రవివక్షాయాం షష్ఠీ. 'దేవపూర్వం గిరిమ్' ఇత్యత్ర దేవశబ్దపూర్వత్వం గిరిశబ్దస్యైవ - నతు సంజ్ఞిన స్తదర్థస్యేతి - సంజ్ఞాయాః సంజ్ఞిత్వాభావా దవాచ్యవచనం దోష మాహు రాలంకారికాః, తదుక్త మేకావల్యామ్ † 'య దవాచ్యస్య వచన మవాచ్యవచనం హి తత్' ఇతి. సమాధానం తు దేవశబ్దవిశేషి తేన గిరిశబ్దేన శబ్దపరే ణార్థో మేఘోపగమన యోగ్యో దేవగిరి ర్లక్ష్యత ఇతి కథంచి త్సంపాద్యమ్.

త్వన్ని...మ్యః—త్వత్ = నీయొక్క - నిష్యన్ద = వృష్టిచేత-ఉచ్ఛ్వసిత = ఉబికిన (ఊఁఅడిల్లిన) - వసుధా = భూమియొక్క - గన్ధ = పరిమళముయొక్క - సంపర్క = సంబంధముచేత-రమ్యః = మనోహరమగునదియు, స్రోతో...గమ్ - స్రోతః = నాసికయొక్క - రన్ధ్ర = బొక్కలయందలి - ధ్వనిత = శబ్దముచేత - సుభగమ్ = మనోహరమగునట్లుగా, దన్తిభిః = ఏనుఁగులచేత, పీయమానః = ఆఘ్రాణింపఁబడునదియు (ఇందుచే, మాంద్యము చెప్పఁబడినది), కాన...ణామ్-కానన= అడవులలోని-ఉదుమ్బరాణామ్ = మేడులను, పరిణమయితా = పండించునదియు, దేవపూర్వం గిరిమ్ = దేవశబ్దము మొదటఁగలదైన గిరి నైన, శీతోవాతః = చల్లగాలి, దేవపూర్వం గిరిమ్ = దేవశబ్దము మొదటఁగలదైన గిరి శబ్దమునకు నర్థమైనదానికి (అనఁగా దేవగిరి యనుకొండకు), ఉపజిగమిషోః = పోఁ గోరునట్టి, తే=నీకు, నీచైః=మెల్లగా, వాస్యతి = వీచును.

తా.—నీకు గంభీరను దాఁటినపిమ్మట పోవలసిన గొప్పస్థానము దేవగిరి. అచటికి నీవు పోవునప్పుడు నీపయనము సులువుగాను సుఖముగాను ఉండును. ఎట్లనఁగా నీకు బడలిక కలుగనీయక పరిమళవంతమైన చల్లగాలి నిన్ను మెల్లగా వీచుచుండును. గాలికి ఆపరిమళ మెట్లు కలుగు ననఁగా-వర్షమునఁ దడిసిన భూమియందొకపరిమళము పుట్టును - నీవర్షముచే పరిమళించుచున్న భూమిపై వీచుటచేత గాలి కాపరిమళము కలుగును. ఆమనోహరపరిమళముకై యేనుఁగులు తొండము సాఁచి యాగాలిని పీల్చును. పీల్చునప్పుడు తదనుభవానందముచేత నవి తొండములలో గుఱకవంటియొక విధమైనశబ్దము చేయును. ఆచల్లగాలికి అడవి మేడులు పండును. అదియెల్లం గాంచుచు అట్లు సుఖప్రయాణముగా దేవగిరి చేరుము.

వ.—'త్వన్ని...రమ్యః'—నేల నాయికగాను, మేఘుఁడు నాయకుఁడుగాను, వర్ణణము సంగమముగాను, నీటికి తడిసి ఉబుకుట సంగమముచే వసుధానాయిక

తనియుటగాను వర్షణకార్యమయిన పరిమళము సంగమకార్యమైన 1 శోభాపరిమళములుగాను ధ్వనితమవుచున్నది. 'వసుధా'—'ధనము ఇందుంపఁబడినది' అని వ్యుత్పత్త్యర్థముగాన - శ్రీమంతురాలయిన నాయికను తనియించువాఁడవు నీభాగ్య మేమి చెప్పను - అని ధ్వని. 'స్రోతో...గమ్'—ధ్వనిచేయుట పరిమళస్వారస్యాతిశయము ననుభవించుటచే. 'దన్తిభిః'—కొండలమీఁదను అడవులలోను నుండు నేనుఁగులచేత - 'దిఙ్నాగానాం పథి పరిహరన్'-అని చెప్పినరీతిగా ఆకాశసంచారము లయిన దిశాగజములచేతఁగాని; 'పీయమానః'—త్రాగుటను చెప్పునట్టి పాధాతుప్రయోగము ఆ గాలి 2 దట్టముగా నీటివలె నుండుటను, డప్పిగొన్నవారు పరిమళించు చల్లని నీళ్లను త్రాగునట్లు ఏనుఁగు లాగాలినిఁ బీల్చు నతిలాలసను, దెలుపుచున్నది.ఆలాలస దాని చల్లనితావిపెంపును తెలుపుచున్నది. నందనోద్యానాదిపరిమళములను యథేచ్ఛముగా ననుభవించు దేవగజములకు సయితము అభిలషణీయమైన యాచలువయు పరిమళమును గాలికి 'త్వన్నిష్యన్ద' నీవృష్టిచేతనే గలిగినవి, కాన కృతజ్ఞతాబుద్ధిచే గాలి నీపయనము నత్యంతమనోహర మగునట్లు చేయును, విసరుగా వీచిన చీకాకగును_ 'ధ్వనిత'-శబ్దించుచు నేనుఁగులు పీల్చుననుటచే వడిగాలి యయిన నట్లు పీలువ సాధ్య పడదుగనుక మందమారుతమని తెలియుచున్నది. కావుననే నిన్ను 'శనైః'మెల్లగా వీచు ననుట. ఈ వాయువు ఈయొకసేవయే చేయునా? - ఇది యొకటియకాదు - 'శీతః'_ ఇది తనచలువచే,'పరిణ...రాణామ్'-అడవిమేడులను పండించును. పండించిన, మేఘునికేమి యుపకారమనఁగా - 'మేడిపండు చూడ మేలిమై యుండును' - ఒకపండే అట్లున్న చెట్లెల్ల తండోపతండములుగా పండియున్న నేత్రోత్సవముగాదా. మేఘునికి గాలి యీపండ్లచే కన్నులపండువు చేయును, అది యొకసేవ. దారిలోనే యింత భోగమయిన మఱిపోయినచోట నెంతవిశేషమో యనిన - అది చెప్పవలయునా -

---

1. అథ పరిమళజా మవాప్య లక్ష్మీ మవయవదీపితమణ్డనశ్రియ స్తాః ।
వసతి మభివిహాయ రమ్యహావాః సురపతి సూనువిలోభనాయ జగ్ముః. భారవి.
మణి శ్శాణోల్లీఢః, సమరవిజయీ హేతిదళితో,
మదక్షీణో నాగః, శరది సరితః శ్యానపులినాః,।
కళాశేష శ్చన్ద్రః, సురతమృదితా బాలవనితా,
తనిమ్నా శోభన్తే గళితవిభవా శ్చార్థిషు నృపాః.
ఈగ్రంథమందే 'పణ్యస్త్రీరతిపరిమళోద్గారిభిః' అని యున్నదిగదా.
2. శక్య మరవిన్దసురభిః కణవాహీ మాలినీతరఙ్గాణామ్ ।
అఙ్గై రనఙ్గతప్తై రవిరళ మాలిఙ్గితుం పవనః. శకుంతల.

ఆచోటు 'దేవపూర్వమ్'-గిరిసామాన్యము గాదు దేవతాసాన్నిధ్యము గలది, భుక్తిముక్తిప్రదము. 'దేవగిరి'యనక 'దేవపూర్వమ్' అని దేవశబ్దమును వేఱుచేయుట ఆ దేవునియొక్క మహిమాతిశయమును-ఆస్థలముయొక్క మహిమాతిశయమును-తద్ద్వారా మేఘునికి కలుగు భోగాద్యతిశయమును - సూచించుటకు. 'వాస్యతి'—మేఘుఁడు వర్షించినచోటఁ బుట్టిన పరిమళమును గాలి కొనిపోవును సరియే - ఆగాలి మేఘుని కన్న ముందేగదా పోవును-మేఘుఁడు దానికి వెనుకనే గదా యుండును - ఆపరిమళముతో గాలి మేఘుని సేవించుట యెట్లు? అనియాక్షేపము:—వర్షణానంతరము మేఘుఁడు ఆచోటినుండి చాలదూరము ప్రవచుకు భూమినుండి చాలసేపు పరిమళము ఉప్పతిల్లుచునే యుండును-కనుక వెనుకవచ్చు గాలియు దానిని మేఘునికడకు తెచ్చుచునే యుండును-అని సమాధానము. 'కానన'-నగరములో నయిన చెట్లు విశేషించియుండవు, నేత్రోత్సవము స్వల్పము. దేవగిర్యరణ్యములయందును మార్గారణ్యముల యందు నయిన నస్వల్పముగా నుండును. ఇచట వాయువునందు కవి సంప్రదాయానుగుణముగా శైత్యమాంద్య సౌరభ్యముల మూఁటిని చెప్పినాఁడు. — ఇందుచే మేఘునికి భుక్తిముక్తులు రెండును చెప్పఁబడినవి.

తత్ర స్కన్దం నియతవసతిం పుష్పమేఘీకృతాత్మా
పుష్పాసారైః స్నపయతు భవా న్వ్యోమగఙ్గాజలార్ద్రైః
రక్షాహేతో ర్నవశశిభృతా వాసవీనాం చమూనా
మత్యాదిత్యం హుతవహాముఖే సంభృతం త ద్ధి తేజః.　　　　47.

తత్రేతి.—తత్ర=దేవగిరౌ, నియతా వసతి ర్యస్య తం =నిత్యసన్నిహిత మిత్యర్థః - పురాకిల తారాకాఖ్యాసుర విజయసంతుష్ట సురప్రార్థనా వశా ద్భక్తార్తిభఞ్జనో భగవా న్భవానీనన్దనః స్కన్దో నిత్య మహం సహ శివాభ్యాం వసామీత్యుక్త్వా తత్ర వస తీతి ప్రసిద్ధిః, స్కన్దం = కుమారస్వామినమ్, పుష్పాణాం మేఘః పుష్పమేఘః - పుష్పమేఘీకృతాత్మా = కామరూపత్వా త్పుష్పవర్షుకమేఘీకృతవిగ్రహః స౯, వ్యోమగఙ్గాజలార్ద్రైః, పుష్పాసారైః = పుష్పసంపాతుకైః + 'ధారాసంపాత ఆసారః' ఇత్యమరః, భవా౯ = స్వయమేవ, స్నపయతు = అభిషిఞ్చతు, స్వయంపూజాయా ఉత్తమత్వా దితిభావః - తథాచ శమ్భురహస్యే † 'స్వయం యజతి చే ద్దేవ ముత్తమా, సోదరాత్మజైః। మధ్యమా, యాజయేద్భృత్యై రధమా యజనక్రియా' ఇతి. స్కన్దస్య పూజ్యత్వసమర్థక మర్థాన్తరం న్యస్యతి రక్షేతి. తత్ = భగవా౯ స్కన్ద ఇత్యర్థః॥విధేయప్రాధాన్యా న్నపుంసకత్వనిర్దేశః,

వాసవస్యేమా వాసవ్యః*'తస్యేదమ్' ఇత్యణ్, తాసాం-వాసవీనామ్= ఐన్ద్రీణాం, చమూనాం=సేనానాం, రక్షైవ హేతుః తస్య రక్షాహేతోః=రక్షయా కారణేన-రక్షార్థ మిత్యర్థః * 'షష్ఠీ హేతుప్రయోగే' ఇతిషష్ఠీ,నవశశిభృతా=భగవతా చన్ద్రశేఖరేణ*వహతీతివహః-పచాద్యచ్ - హుతస్య వహో -హుతవహః = వహ్నిః-తస్య - ముఖే, సంభృతం = సంచితమ్, ఆదిత్య మతిక్రాన్త మత్యాదిత్యమ్ * 'అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా' ఇతి సమాసః, తేజోహి - సాక్షాద్భగవతో హరస్యేదం మూర్త్యన్తర మిత్యర్థః , అతః పూజ్య మితి భావః; ముఖగ్రహణం తు శుచిత్వ సూచనార్థం, తదుక్తం శమ్భురహస్యే + 'గవాం పశ్చా ద్ద్విజ స్యాఙ్ఘ్రిం యోగినాం హృత్కవే ర్వచః। పరం శుచితమం విద్యా న్ముఖం స్త్రీవహ్నివాజినామ్' ఇతి.

తత్ర = దేవగిరియందు, నియతవసతిమ్ - నియత=నిశ్చితమైన - వసతిమ్ =ఉనికిఁగలవానిని (అనఁగా సదా అచట నుండువానిని), స్కన్దమ్ = కుమారస్వామిని, పుష్ప...త్మా — పుష్పమేఘ = పువ్వులమబ్బుగా - కృత = చేయఁబడిన - ఆత్మా = స్వరూపముగలవాఁడవై - (అనఁగా పువ్వులమేఘమవై), వ్యోమ...ద్రైః - వ్యోమగఙ్గా=ఆకాశగంగయొక్క - జల = నీళ్లచే - ఆర్ద్రైః = తడివైన, పుష్పాసారైః - పుష్ప = పువ్వులయొక్క-ఆసారైః = ధారాసంపాతములచేత, భవాన్ = నీవు, (స్వయమేవ = స్వయముగానే), స్నపయతు = అభిషేకింపుము, స్వయముగాఁ బూజచేయుట యుత్తమముగావున నని భావము. స్కందుని పూజ్యతను సమర్థించుచున్నాఁడు:—తత్ =ఆభగవంతుఁడు కుమారస్వామి, వాసవీనామ్ = ఇంద్రునివైన, చమూనామ్ = సేనలయొక్క, రక్షాహేతోః=రక్షణనిమిత్తమై, నవశశిభృతా=బాలచంద్రుని వహించువానిచే (అనఁగా శివునిచే), హుతవహముఖే = అగ్నిముఖమున, సంభృతమ్ = కూర్పఁబడినదియు, అత్యాదిత్యమ్ = సూర్యు నతిక్రమించినదియు, నగు, తేజో హి = తేజస్సు సుమా, సాక్షాచ్ఛివుని మూర్త్యంతరము - కావున పూజ్యము-అని భావము.

తా.—దేవగిరియందు కుమారస్వామి సదా ఉండును; ఆయనను నీవు స్వయముగా పూజించుకొమ్ము. పూజాప్రకార మెట్లన్న-నీవు పువుమబ్బవై ఆకాశగంగాజలముతో ఆపువ్వులను తడిపి అట్టి యా పువ్వులజడివానచే స్వామికి అభిషేక మొనరింపుము. ఆస్వామి మిక్కిలి పూజార్హుఁడు. ఎట్లన ఇంద్రుని సేనలను రక్షించుటకై శివుఁడు అగ్నిముఖమునఁ గూర్చినదియు సూర్యునతిక్రమించునదియు నగు తేజముగదా ఆకుమారస్వామి.

త.—‘నియత’ ఈక్షేత్రమునందు కుమారస్వామి యెప్పుడును సన్నిహితుఁడై యుండును - ఇతరక్షేత్రములందు అట్లుగాదు - కాన ఈక్షేత్రము మహామహిమాస్పదము - కావున ఇచట చేసిన సేవ కడమతావుల చేసినదానికన్న నత్యుత్కృష్ట మగునని భావము. ‘ఆసారైః’ - అనుటచే పుష్పవర్షసమృద్ధియు - దానంజేసి స్నానసంపదయు - చెప్పఁబడినవి. ‘వ్యోమగఙ్గాజల’—పవిత్రజలములతో నని భావము. మఱియు సామాన్యభక్తులకు స్వర్గంగాజలము లభింపదు గావునను, నీకు లభించును గావునను, నీచేయునభిషేకసేవ స్వామికి అత్యంతప్రియ మగును - నీకు మహాఫలము కలుగును-అనియు భావము. ‘నవశశిభృతా’-మఱియే దేవునికిని లేనిమహిమ కలవాఁడనిభావము; అందుచేఁ దత్పుత్త్రుఁడు కుమారస్వామి ఇతరదేవతలకన్న మహాప్రభావుఁడని ఫలితార్థము. ‘వాసవీనాం చమూనాం రక్షాహేతోః’ - ఇంద్రుఁడుకూడ రక్షింపలేనివానిని రక్షించినాఁడు ఇంద్రునికన్న నధికుఁడనియు, ‘చమూనామ్’ - స్త్రీలింగస్వారస్యముచే ఇంద్రునిసేనలు శత్రువులచేతిలోఁ బడిన స్త్రీలవలె పడరానిపాట్లు పడఁగా తనసేనలనెడినాయికలయాపాట్లను ఇంద్రుఁడు తీర్పలేక గ్రుక్కుమిక్కునక యుండెననియు - అతనిశత్రువులు అంత మహాబలపరాక్రమశాలు లనియు - అట్టివారిని జయించిన స్కందునిమహిమ చెప్పఁదరముగాదనియు - భావము. ‘హుతవహ’ అనుటచే అగ్నియొక్క పవిత్రతయు- స్కందునిహుతసామ్యమును- అందువలన నతని పవిత్రతయు-ధ్వనించుచున్నవి. మహాపవిత్రమైన దానిని పవిత్రమయినచోట నుంపవలయునుగాన ఈతేజస్సును అగ్నియం దుంచుట. ‘అత్యాదిత్యమ్’-ఈతేజస్సు త్రిమూర్త్యాత్మక మయినసూర్యు నతిక్రమించినది; ఎట్లన - అట్టి యాదిత్యతేజస్సును రాత్రులందు తనలో భరించునగ్ని ఈతేజస్సును భరింపలేక గంగలోను గంగ శరవణమందును వదలినారు-కాన నీతేజము అనఁగాకుమారస్వామి సర్వదేవాతిశాయిప్రభావము కలవాఁడనియు భావము. ‘తేజస్సుకలవాఁడు’ అనక ‘తేజః’ అనుటచే అనిర్వచనీయ ప్రభావముకలవాఁ డని స్ఫురణ. శివునితేజ స్సనుటచే సాక్షాచ్ఛివమూర్త్యంతరమే యని భావము.

జ్యోతిర్లేఖావలయి గళితం యస్య బర్హం భవానీ
పుత్త్రప్రేమ్ణా కువలయదళప్రాపి కర్ణే కరోతి
ధౌతాపాఙ్గం హరశశిరుచా పావకే స్తం మయూరం
పశ్చా దద్రిగ్రహణగురుభి ర్గర్జితై ర్నర్తయేథాః. 48.

జ్యోతిరితి.—జ్యోతిషః = తేజసః - లేఖాః = రాజయ-స్తాసాం వలయం - మణ్డలం - యస్యాస్తీతి తథోక్తమ్, గళితం=భ్రష్టం - నతు బలాత్స్వయం ఛిన్న

మితిభావః, యస్యమయూరస్య - బర్హం=పిచ్ఛం + 'పిచ్ఛబర్హే నపుంసకే' ఇత్యమరః, భవానీ = గౌరీ, పుత్రప్రేమ్ణా=పుత్రస్నేహేన, కువలయస్య - దళం=పత్రం - తత్ప్రాపి=తద్యోగి యథా తథా, కర్ణే కరోతి, దళేన ధారయ తీత్యర్థః [యద్వా - కువలయస్య - దళప్రాపి = దళభాజి - దళార్హే, కర్ణే కరోతి*క్వచిత్త్సప్తమీ-దళం పరిహృత్య తత్స్థానే బర్హం ధత్తే ఇత్యర్థః, నాథస్తు 'కువలయదళక్షేపి' ఇతి పాఠ మనుసృత్య 'క్షేపో నిన్దాపసారణం వా' ఇతి వ్యాఖ్యాతవాన్], హరశశిరుచా = హర శిరచ్చన్ద్రికయా, ధౌతాపాఙ్గం=స్వతోఽపిశౌక్ల్యా దతిధవళితనేత్రాన్తమ్ + 'అపాఙ్గౌ నేత్రయో రన్తౌ' ఇత్యమరః, పావకస్య=అగ్నేః-అపత్యం-పావకిః = స్కన్దః * 'అత ఇఞ్' ఇతి ఇఞ్ - తస్య, తం=పూర్వోక్తం, మయూరం, పశ్చాత్ = పుష్పాభిషేచనానన్తరమ్, అద్రేః=దేవగిరేః కర్తుః - గ్రహణేన=గుహాసంక్రమణేన - గురుభిః = ప్రతిధ్వానమహద్భి రిత్యర్థః, గర్జితైః - నర్తయేథాః=నృత్యం కారయ, మార్దఙ్గికభావేన భగవన్తం కుమార ముపాస్స్వేతి భావః. 'నర్తయేథాః' ఇ త్యత్ర * 'అణా వకర్మకా చ్చిత్తవత్కర్తృకాత్' ఇత్యాత్మనేపదాపవాదః * 'నిగరణ చలనార్థేభ్య శ్చ' ఇతి పరస్మైపదం వా న భవతి-తస్య* 'న పాదమ్యాఙ్యమాఙ్యస పరిముహ రుచి నృతి వద వసః' ఇతి ప్రతిషేధాత్.

జ్యోతి...యి—జ్యోతిః = తేజస్సులయొక్క - లేఖా = వరుసలయొక్క - వలయి=మండలముగలది - (అనఁగా వృత్తాకారమై ప్రకాశమానమైన తేజస్సుకలది), గళితః=తనంతటరాలినది (కోరికచే తాను లాగినది గాదని భావము), అయిన, యస్య బర్హమ్ = ఏనెమలియొక్క పురిని, భవానీ=గౌరి, పుత్రప్రేమ్ణా=పుత్రుఁడైన కుమారస్వామిమీఁది ప్రేమచేత, కువ ... పి - కువలయ = కలువయొక్క - దళ=రేకును - ప్రాపి = పొందినదగునట్లుగా (అనఁగా కలువ రేకులో పొదివి), కర్ణే = చెవియందు, కరోతి = ధరించుచున్నది, (కువలయదళప్రాపి = కలువ రేకున కర్హమయిన - అనియు అర్థము చెప్పవచ్చును, ఆపక్షమున కలువరేకును మాని యీ నెమలియీఁకెను చెవిలో ధరించుచున్న దని యర్థము. నాథుఁ డనువ్యాఖ్యాత 'కువలయదళక్షేపి' యని పఠించెను. ఆపక్షమున క్షేపమునకు నిందయేని అపసారణమేని అర్థము), హరశశిరుచా = శివుని యౌదలయందలి చంద్రుని కాంతిచేత, ధౌతా...ఙ్గమ్-ధౌత = (స్వాభావికముగానే తెల్లదయ్యును) తెలుపు చేయఁబడిన-అపాఙ్గమ్=నేత్రాంతముగలదైన, పావకేః-కుమారస్వామియొక్క, తం మయూరమ్ = ఆనెమలిని, పశ్చాత్ = స్వామిని పువ్వులవానచే నభిషేకించినపిమ్మట, అద్రి ... భిః - అద్రి = దేవగిరియొక్క (దేవగిరికర్త) - గ్రహణ = గ్ర

క్షించుటచేత-గురుభిః = గొప్పవైన (అనఁగా గొప్పప్రతిధ్వనులుగలవైన), గర్జితైః = ఉఱుములచేత, నర్తయేథాః = నృత్యము చేయింపుము.

తా.—కుమారస్వామికి పుష్పాభిషేకము చేసినపిమ్మట ఆయన వాహనమైన నెమలిని నీవు కొండలలో గొప్పగా ప్రతిధ్వను లగునట్లు ఉఱిమి నాట్యమాడింపుము. ఆనెమిలిపురిని స్వయముగా రాలినదానిని గౌరి తనకొమరునివాహనముది గదా యనుప్రేమచే కలువ ఱేకులలో పొదివి కర్ణావతంసముగా ధరించును, దానికనుఁగొనలు శివునిచూడామణి యగుచంద్రుని వెన్నెలచే మఱియు తెల్లగా ప్రకాశించుచుండును.

వ.—'జ్యోతిర్లేఖావలయి' - అంద మయినది - ఆశింపఁదగినయాభరణము. అయినను గౌరి దానిని స్వయముగా అవతంసార్థము ఊడఁదీయలేదు - 'గళితమ్'- అది తనంతట రాలఁగా గ్రహించినది. ఏలయూడఁదీయలేదనిన - 'ప్రేమ్ణా' - దానికి నొప్పియగుననియు దానికుంచెలో మొజ్జి గలిగి దానిసొంపు చెడు ననియు. మఱి యాభరణలౌల్యముచే దానిం దాల్చినదా యనిన-కాదు - 'పుత్రప్రేమ్ణా' - తన కుమారునివాహనముదిగదా యనుప్రేమచేత; అది ఇటు నటు దొరలుచు గాలికి కొట్టుకొని పోవుచునుండినఁ జూడలేక ఆభరణార్థంబును నగుటచే దాని నవతంసించినది. కువలయదళమున పొదువుట పరిమళముకొఱకును నెమలిపురిని ఒరయిక తగుల నీయక కాపాడుటకును. [కలువ ఱేకును మాని దానిని ధరించుట పుత్రప్రేమాతిశయముచేత, కలువ ఱేకును నెమలిపురి నిందించుట యనఁగా నల్లగలువ ఱేకుకన్న నిది శోభిల్లుట]. ఇందువలన నానెమలి గౌరికి అత్యంతప్రేమాస్పద మని ధ్వనితము. 'హర ... జ్గమ్' - శివలాలనపాత్ర మనిభావము. 'అద్రి ... గురుభిః' - పాత్రమును నాట్యమాడించుటకై మార్దంగికుఁడు మృదంగమున తాళము వాయించినపుడు రసజ్ఞులు సభ్యులు కొందఱు తొడతాళము వేసినట్లుగా అని భావము. 'పావకేః' - మహానుభావునివాహనము గావున మహాప్రభావము కలదనియు గౌరీశంకరకుమారుల కందఱకు నత్యంతప్రియమైన దనియు భావము. దానిని నర్తింపఁజేయుదేని వారెల్ల ఆవినోదముచేత నీపై అతితుష్టు లగుదు రనియు నీవు వారిప్రసాదమునకు పాత్రుడ వగుదు వనియు భావము.

ఆరాధ్యైనం శరవణభవం దేవ ముల్లఙ్ఘితాధ్వా
సిద్ధద్వన్ద్వై ర్జలకణభయా ద్వీణిభి ర్ముక్తమార్గః
వ్యాలమ్బేథాః సురభితనయాలమ్భజాం మానయిష్యన్
స్రోతోమూర్త్యా భువి పరిణతాం రన్తిదేవస్య కీర్తిమ్. 49.

ఆరాధ్యేతి.—ఏనం = పూర్వోక్తం, శరాః = బాణతృణాని + 'శరో బాణ తృణే బాణే' ఇతిశబ్దార్ణవే - తేషాం వనం శరవణం * 'ప్రనిరన్తఃశర' - ఇత్యాదినా ణత్వం - తత్ర భవో జన్మ యస్య తం - శరవణభవం దేవం = స్కన్దం + 'శర జన్మా షడాననః' ఇత్యమరః * అవర్జ్యో బహువ్రీహి ర్వ్యధికరణో జన్మాద్యుత్తర పదః' ఇతివామనః - అవర్జ్యోఽగతికత్వా దాశ్రయణీయ ఇత్యర్థః, ఆరాధ్య=ఉపా స్య, వీణిభిః = వీణావద్భిః * వ్రీహ్యాదిత్వా దినిః, సిద్ధద్వన్ద్వైః = సిద్ధమిథునైః. భగవన్తం స్కన్ద ముపవీణయితు మాగతై రితి భావః, జలకణభయాత్ - జలసేకస్య వీణాక్వణనప్రతిబన్ధకత్వా దితి భావః, ముక్త మార్గః = త్యక్త వర్త్మా సన్, ఉల్లఙ్ఘితాధ్వా = కియన్త మధ్వానం గతః ఇత్యర్థః, సురభితనయానాం = గవాం- ఆలమ్భేన = సంజ్ఞపనేన - జాతాం తథోక్తామ్, భువి = లోకే, స్రోతో మూర్త్యా = ప్రవాహ రూపేణ, పరిణతాం = రూపవిశేషమాపన్నాం, రన్తిదేవస్య = దశపురపతే ర్మహారాజస్య, కీర్తిం = చర్మణ్వత్యాఖ్యాం నదీ మిత్యర్థః, మానయి ష్యన్, వ్యాలమ్బేథాః = ఆలమ్బ్యావతరే రిత్యర్థః. పురాకిల రాజ్ఞో రన్తిదేవస్య గవాలమ్భే ష్వేకత్ర సంభృతా ద్రక్తనిష్యన్దా చ్చర్మరాశేః కాచిన్నదీ సస్యన్దే - సా చర్మణ్వతీ త్యాఖ్యాయత ఇత్యుపాఖ్యాయతే.

ఏనమ్ = పైఁజెప్పిన, శరవణభవమ్ = రెల్లువనములో పుట్టుపుగలవాఁ డయిన, దేవమ్ = కుమారస్వామిని, ఆరాధ్య = పూజించి, వీణిభిః = వీణలుగల వారయిన, సిద్ధద్వన్ద్వైః=సిద్ధమిథునములచేత, జలకణభయాత్ = నీటిబొట్టులభయము చేత, ముక్త...ర్గః — ముక్త = వదలఁబడిన - మార్గః = దారికలవాఁడవై (వారు మేఘునికి దారితొలఁగుదు రని భావము), ఉల్ల ... ధ్వా'— ఉల్లఙ్ఘిత = దాఁటఁబడిన - అధ్వా = మార్గముకలవాఁడవై, సుర...జామ్-సురభితనయా = గోవులయొక్క - ఆలమ్భ = యజ్ఞార్థముచంపుటచేత, జాతామ్ = పుట్టినదై, భువి = లోకములో, స్రోతోమూర్త్యా = నదీరూపముగా, పరిణతామ్ = మాఱిన, రన్తిదేవస్య = రన్తిదేవుఁ డనురాజుయొక్క, కీర్తిమ్ = కీర్తిని (అనఁగా చర్మ ణ్వతీనదిని), మానయిష్యన్ = గౌరవించువాఁడవై, వ్యాలమ్బేథాః = కొంచెము నిలువుము.

తా.—ఆ కుమారస్వామిని సేవించుకొని తరలుము. ఆస్వామియొద్ద వీణావాదనసేవ చేసికొనుటకై వీణాపాణులుగా వచ్చుసిద్ధమిథునములు నీబొట్టులు పడెనేని వీణలనాదము చెడిపోవునుగాన ఆభయముచేత నీదారికి తొలఁగిపోవుదురు. అంతట నీవు కొంతదూరము గడచి పోయి దశార్ణ దేశమందలి చర్మణ్వతీనదిని సమీ

షింపుము, ఆనది పూర్వము బహుగవాలంభములచే చేసిన దశార్ణరాజు రంతిదేవుని కీర్తిని తెలుపునది గావున అచట కొంచెము ఆఁగి దానిని దర్శనముచే సత్కరింపుము.

వ.—సిద్ధద్వన్ద్వైః 'వీణిభిః'—దంపతిదర్శనము వీణాదర్శనమును శుభశకునములు; శకునఫలము మహాపురుషకీర్తిఖ్యాపకమైన చర్మణ్వతీనదిని దర్శించుట, సిద్ధులు భార్య వేఱుగాను భర్త వేఱుగాను గాక కలసి ద్వంద్వముగానే పోయి స్వామిని సేవించుట విరహములేని దాంపత్యసౌఖ్యసౌభాగ్యముకొఱకు. మఱియు సంగీతము ఒంటరిగాఁ జేసిన రంజన తక్కువ కావున, పూర్ణరంజనకై యిరువురును జేరుట. పరిణతామ్'-అనుటచే ఆనది రంతిదేవునికీర్తిని తెలుపుచున్నది గాన సత్కార్యా- 'వ్యాలమ్బేథాః' - తప్పక సత్కరింపవలసినది, అందుకై ఆఁగవలసినది. అతని సుకృతవిశేషము లేవనఁగా-'సురభితనయాలమ్భజామ్' - లెక్కలేనిగవాలంభములు. వానిని ఆనది ప్రకటించుట ఎట్లు? ఆనది ఆయజ్ఞములనుండియే పుట్టినదిగావున ఆనదికథవలన దానికారణమయినయతనియజ్ఞములును అందులకీర్తియు ప్రకటితము లగుచున్నవి. 'గవాలమ్భ' - అనక కామధేన్వపత్యములు అనుప్రస్తావముతో 'సురభితనయాలమ్భ' అనుటచే ఆయజ్ఞములు అపరిమేయపుణ్యాధారకారణము లని భావము. 'కీర్తిమ్'—మహాజలప్రవాహము దూరమునుండి చూచువారికిఎండలో తళతళ మెఱయుచు తెల్లగా ప్రకాశించును గావున కీర్తిగా వర్ణించుట ఎంతయు హృదయంగమముగా నున్నది. అట్లేయీనది ఉత్తరావతిశ్లోకమున ముత్యాలహారము గా వర్ణింపఁబడియున్నది.

త్వ య్యాదాతుం జల మవనతే శార్ఙ్గిణో వర్ణచౌరే
తస్యాః సిన్ధోః పృథు మపి తనుం దూరభావా త్ప్రవాహమ్
ప్రేక్షిష్యన్తే గగనగతయో నూన మావర్జ్య దృష్టీ
రేకం ముక్తాగుణమివ భువః స్థూలమధ్యేన్ద్రనీలమ్. 50.

త్వయీతి.-శార్ఙ్గిణః=కృష్ణస్య, వర్ణస్య(కాన్తే)శ్చౌరే వర్ణచౌరే - తత్తుల్య వర్ణ ఇత్యర్థః, త్వయి జల మాదాతు మవనతే సతి పృథు మపి, దూరభావాత్ = దూరత్వాత్, తనుం=సూక్ష్మతయా ప్రతీయమానం తస్యాః సిన్ధోః = చర్మణ్వత్యా ఖ్యాయాః, ప్రవాహం, గగనే గతి ర్యేషాం తే - గగనగతయః = ఖేచరాః - సిద్ధ గన్ధర్వాదయః. * అయ మపి బహువ్రీహిః పూర్వవ జ్జన్మాద్యుత్తరపదేషు ద్రష్టవ్యః- నూనం = సత్యం, దృష్టీః, ఆవర్జ్య = ఆనమ్య, ఏకమ్ = ఏకయష్టికం, స్థూలః = మహాన్ - మధ్యః = మధ్యమణీభూతః-ఇన్ద్రనీలో యస్య తం, భువో=భూమేః,

ముక్తాగుణం = ముక్తాహారం - ఇవ, ప్రేక్షిష్యన్తే. అత్రాత్యన్త నీలమేఘ సంగతస్య ప్రవాహస్య భూకణ్ఠముక్తాగుణత్వే నోత్ప్రేక్షణా దుత్ప్రేక్షైవేయ మితీవశబ్దేన వ్యజ్యతే; నిరుక్తకారస్తు † 'తత్రతత్రోపమా యత్ర ఇవశబ్దస్య దర్శనమ్' ఇతీవశబ్దదర్శనా దత్రా ప్యుపమై వేతి బభ్రామ.

శార్ఙ్గిణః = కృష్ణునియొక్క, వర్ణ...రే — వర్ణ=కాంతియొక్క - చౌరే = దొంగవైన (కృష్ణునినలుపువంటి నలుపుగలవాఁడవైన), త్వయి = నీవు, జలమ్ = నీటిని, ఆదాతుమ్ = గ్రహించుటకు, అవనతే సతి = వంగినవాఁడవు అగుచుండఁగా (వంగఁగా), పృథుమపి = గొప్పదైనను, దూరభావాత్ = దూర మగుటచేత, తనుమ్ = సూక్ష్మముగా అగపడుచున్న (ప్రవాహమునకు విశేషణము), తస్యాః సిన్ధోః = అచర్మణ్వతీనదియొక్క, ప్రవాహమ్ = నీటిపూరమును, గగ...యః — గగన = ఆకాశమందు - గతయః = సంచారముగలవారు - (అనఁగా ఖేచరులగు సిద్ధగంధర్వాదులు), నూనమ్ = నిశ్చయముగా, దృష్టీః = చూపులను, ఆవర్జ్య = వంచి, ఏకమ్ = ఒకటియే పేటకలదియు, స్థూల = తిమ్ — స్థూల-గొప్పదై - మధ్య = నడిమిదైన- ఇన్ద్రనీలమ్ = ఇంద్రనీలమణికలదియునైన (ముక్తాగుణమునకు విశేషణములు), భువః = భూమియొక్క, ముక్తాగుణమివ = ముత్యాలహారమునుబోలె, ప్రేక్షిష్యన్తే = చూడఁగలరు.

తా.—నల్లనినీవు ఆనదిలోనికి జలము గ్రహించుటకు వంగినప్పుడు ఆకాశమున సంచారముచేయుచుండు సిద్ధగంధర్వాదులు తెల్లనియానదిని నడుమనున్న నల్లని నిన్నును ఆదూరమునుండి చూచినవారై భూదేవి నీలనాయకమణితోడి యొంటిపేటు ముత్యాలహారమును ధరించిన ట్లున్న దని తలంతురు.

వ.—'ఆదాతుం జలమ్'—అధరోష్ఠపానస్థానీయము. 'శార్ఙ్గిణః' - శార్ఙ్గధనుస్సుగలవాఁ డనుటచే మేఘునియింద్రధనుస్సు హరిసింగిణివలె నుండుననియు మేఘుఁడు నల్లగా హరివలె నుండుననియు భా. 'శార్ఙ్గిణోవర్ణ' —ఉత్కృష్టమైన నల్లవర్ణమును - గొప్పవానితోడిసామ్యమును - అందువలన గొప్పతనమును - చెప్పఁబడినవి. 'చౌరే'—అత్యంతసాదృశ్యము భావము. 'పృథుమపి తనుమ్'—దూరమునుండి చూచువారికి గొప్పదియు చిన్నదిగా నగపడును. 'ప్రేక్షిష్యన్తే'—కన్నులపండువుగా నుండునుగావున మఱిమఱి చూతురు. 'గగనగతయః—పైనుండి దూరమునుండి చూచువారికిఁ గదా నదియెల్ల నుత్పత్తిమొదలు సంగమువఱకు నగపడును. అట్లు నదియెల్ల నయినఁగదా 'గుణమివ'-పొడవుగా హారమువలె నగపడుట. 'ముక్తా' నడుమ మేఘుఁడున్నచోటు దప్ప కడమయెల్ల తెల్లగా ప్రకాశించుచుండును గావున ముత్యాలపేటతోడిసామ్యము. జలము రెండుగట్లనడుమ నొకటిగానే కలసియుండును

గాన 'ఏకమ్'—ఒంటిపేటతో సామ్యము. 'ముక్తాహారమున ముత్తెమునకును ముత్తెమునకును నడుమ యెడ ముండును, నీరు నదిపొడుగునను ఎక్కడను తెగకయే కలసి యుండును, ఈసాటి పుష్టికలదిగాదు' అని యాక్షేపింపకుఁడు; 1 ఆకాశమునుండి దూరగతులై చూచువారికి నది కొన్నికొన్ని తావుల చాటులచేత అగపడదు, చాటులేని తావుల అగపడును, కావున అయగపడనితావులు ముత్తెములనడిమియెడములుగా కవిహృదయము. 'ఆవర్జ్య'-చూపులను వంచుట అనఁగా క్రిందికి చూచుట యేలనఁగా మేఘుఁడు మేఘమండలమునుండి 'అవనతే' - దిగి నదిని చేరియున్నాఁడు గాన. 'స్థూల'-మేనుఁడు అయేటివెడల్పును మిగుల మించినయాకారముగలవాఁడు. సకలసంపదలుగలవారును నిన్ను తలచుగా చూచువారు నైనసిద్ధగంధర్వాదులు సయితము ఆశపడిచూచునట్టిసౌభాగ్యము నీకు తన్నదీజలగ్రహణార్థము వంగినప్పుడు కలుగునుగావున నీవు అవశ్యము అందు జలము గ్రహించి భూదేవికి నేంద్రనీలముక్తాహారధారణసౌభాగ్యమును గలిగించి ఆమెప్రసాదమును బడయు మనియు, అట్లు సర్వత్ర దేవతాప్రసాదరాశిని సంపాదించుమహిమచే నాసందేశము నెఱవేఱి నీమిత్రములకు నాకును నాభార్యకును మహాభ్యుదయము కలుగు ననియు ప్రక్రాంతవిషయముతో ఈవర్ణనకు సంబంధము; చర్మణ్వతిని దాఁటి పొమ్ము అని మార్గకథనము.

తా ముత్తీర్య వ్రజ పరిచితభ్రూలతా విభ్రమాణాం
పక్ష్మోత్క్షేపా దుపరివిలసత్కృష్ణ శారప్రభాణామ్
కున్దక్షేపానుగమధుకరశ్రీముషా మాత్మబిమ్బం
పాత్రీకుర్వ న్దశపురవధూనేత్రకౌతూహలానామ్.

తామితి.—తాం = చర్మణ్వతీమ్, ఉత్తీర్య, భ్రువో లతా ఇవ భ్రూలతాః * ఉపమితసమాసః - తాసాం - విభ్రమాః = విలాసాః - పరిచితాః = కష్టాః- యేషు తేషాం, పక్ష్మాణి = నేత్రలోమాని + 'పక్ష్మ సూత్రాది సూక్ష్మాంశే కిఞ్జల్కే నేత్రలోమని' ఇతి విశ్వః - తేషామ్ . ఉత్క్షేపాత్ = ఉన్నమనా ద్ధేతోః, కృష్ణాశ్చ తాః శారా శ్చ - కృష్ణశారాః=నీల శబలాః*'వర్ణో వర్ణేన' ఇతి సమాసః + 'కృష్ణ రక్తసితాః శారాః' ఇతి యాదవః తత శ్చ శారశబ్దాదేవ సిద్ధే కార్యే పునః కృష్ణ

1. శైలానా మవరోహతీవ శిఖరా దున్మజ్జతాం మేదినీ,
పర్ణాభ్యన్తరలీనతాం విజహతి స్కన్ధోదయాత్ పాదపాః,
సన్ధానం తనుభావనష్టసలిలవ్యక్త్యా వ్రజ న్త్యాపగాః,
కేనాప్యుత్క్షిపతేవ మర్త్యభువనం మత్పార్శ్వ మానీయతే. శకుం.

పదోపాదానం కార్ష్ణ్యప్రాధాన్యార్థమ్ - రక్తత్వం తు నవివక్షిత ముపమానానుసారాత్ - తస్య స్వాభావికస్య స్త్రీనేత్రేషు సాముద్రికవిరోధా దితర స్యాప్రసక్తాత్-క్వచిత్సద్భావకథనం తూపపత్తివిషయమ్ - ఉపరి విలసన్త్యః కృష్ణశారాః ప్రభా యేషాం తేషాం, కున్దాని = మాఘ్యకుసుమాని + 'మాఘ్యం కున్దమ్' ఇత్యమరః - తేషాం - క్షేపః - ఇత స్తత శ్చాలనం - తస్య - అనుగాః = అనుసారిణో - యే మధుకరా స్తేషాం - శ్రియం ముష్ణన్తీతి తథోక్తానాం - క్షిప్యమాణకున్దానుధావి మధుకర కల్పానా మిత్యర్థః - దశపురం రన్తిదేవస్య నగరం తత్ర - వధ్వః = స్త్రియః + 'వధూర్జాయా స్నుషా స్త్రీ చ' ఇత్యమరః-తాసామ్ - నేత్రకౌతూహలానాం = నేత్రాభిలాషాణాం - సాభిలాషదృష్టీనా మిత్యర్థః, ఆత్మబిమ్బం = స్వమూర్తిం, పాత్రీకుర్వన్ = విషయీకుర్వన్, వ్రజ = గచ్ఛ.

తామ్ = ఆచర్మణ్వతీనదిని, ఉత్తీర్య=దాఁటి, పరి...ణామ్ - పరిచిత = నేర్వఁబడిన - భ్రూలతా = తీఁగలవంటికనుబొమలయొక్క - విభ్రమాణామ్ = విలాసములుగలవియు-(బొమవిలాసము నేర్చినవియు), పక్ష్మో...త్—పక్ష్మ = ఱెప్పలయొక్క-ఉత్క్షేపాత్-ఎత్తుటచేత -(ఱెప్పలెత్తి చూచుటచేత), ఉప...ణామ్-ఉపరి = పయిని (ఆకాశములో) - విలసత్ = విలసించుచున్న - కృష్ణ = నలుపు ప్రధానముగాఁగల - శార = పసుపన్నెలుగల - ప్రభాణామ్ = కాంతులుగలవియు-కున్ద ... షామ్—కున్ద = మల్లెలయొక్క - క్షేప = ఇటునటు మీటుటయొక్క-అనుగ = అనుసారులైన - మధుకర = తుమ్మెదలయొక్క - శ్రీ = శోభను—ముషామ్ = దొంగిలించునవియు - (ఇటునటు మల్లెలను మీటఁగా వానివెంట తుమ్మెదలు పోయిన నెట్లుండునో అట్లున్నవియు), అయిన, ... దశ ... లానామ్-దశపుర = రంతిదేవుని రాజధానియందలి - వధూ = స్త్రీలయొక్క - నేత్ర = కన్నులయొక్క - కౌతూహలానామ్ = అభిలాషలకు, ఆత్మబిమ్బమ్ = నీమూర్తిని, పాత్రీకుర్వన్ = విషయముగాఁ జేయుచు, వ్రజ = పొమ్ము.

తా.—చర్మణ్వతిని దాఁటినతర్వాత నీకు దశపురనగరము తగులును. ఆనగరముమీఁదుగా పొమ్ము. అట్లుపోయిన నీకు నేత్రోత్సవముగా నచటియందగత్తెలు బొమవిలాసములతో నిన్ను కోరికోరి చూతురు. అట్లు నిన్ను చూచుటకై వారు ఱెప్పలనుపైకెత్తి ఇటునటు నీవైపు నిగిడించు చూపుల శబలకాంతులు నలుపుమీఱునట్టివి ఇటునటు మీటిన మల్లెలవెంటఁ బోవు తుమ్మెదలసిరిని వంచించియుండును.

వ.—పరి...మాణామ్'—నెఱజాణలు. 'పక్ష్మ'-పక్ష్మలతయు దానిచే ఉత్తమజాతియు సౌందర్యసౌభాగ్యములును సూచింపఁబడినవి. 'అనుగ'—తుమ్మెదలు

మల్లెలవెంటఁ బోవుట పరిమళముకొఱకును తేనెకొఱకును. 'ముషామ్'—అత్యంతసా దృశ్యము. 'వధూః'—యువతులు, 'పాత్రీకుర్వన్'—ఆరమణీయదర్శనమును పోఁ గొట్టుకొనక దానికై యాడారినే పొమ్ము.

బ్రహ్మావర్తం జనపద మథ చ్ఛాయయా గాహమానః
క్షేత్రం క్షత్త్రప్రధనపిశునం కౌరవం త ద్భజేథాః
రాజన్యానాం శితశరశతై ర్యత్ర గాణ్డీవధన్వా
ధారాపాతై స్త్వమివ కమలా న్యభ్యవర్ష న్ముఖాని. 52.

బ్రహ్మావర్త మితి.—అథ = అనన్తరం, బ్రహ్మావర్తం నామ, జనపదం = దేశ మ్-అత్రమనుః + 'సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యో ర్యదన్తరం తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే' ఇతి, ఛాయయా = అనాతపమణ్డలేన, గాహమానః = ప్రవిశన్-న తుస్వరూపేణ + 'దేవక్షేత్రాశ్రమాదీని పరిహృత్యాన్యతో వ్రజేత్' ఇతి, వచనాత్, క్షత్త్రప్రధనపిశునమ్ = అద్యాపి శిరః కపాలాదిమత్తయా కురుపా ణ్డవయుద్ధ సూచక మిత్యర్థః+'యుద్ధ మాయోధనం జన్యం ప్రధనం ప్రవిదార ణమ్' ఇత్యమరః తత్ = ప్రసిద్ధం, కురూణా మిదం కౌరవం క్షేత్రం భజేథాః = కురుక్షేత్రం వ్రజేత్యర్థః, యత్ర = కురుక్షేత్రే, గాణ్డి స్యా స్తీతి గాణ్డీవం ధనుర్వి శేషః * 'గాణ్డ్యజగా త్సంజ్ఞాయామ్' ఇతి మత్వర్థీయో వప్రత్యయః + 'కపిధ్వ జస్య గాణ్డీవ గాణ్డివౌ పున్న పుంసకౌ' ఇత్యమరః - త ద్ధను ర్య స్య సః - గాణ్డీవ ధన్వా = అర్జునః * 'వా సంజ్ఞాయామ్' ఇ త్యనఙాదేశః', శిత శర శతైః = నిశిత బాణ సహస్రైః, రాజన్యానాం=రాజ్ఞాం, ముఖాని, ధారాణామ్ = ఉదకధారా ణాం - పాతైః, కమలాని త్వమివ, అభ్యవర్షత్ = అభిముఖం వృష్టవాన్, శర వర్షేణ శిరాంసి చిచ్ఛే దేత్యర్థః.

అథ = అటుతర్వాత, బ్రహ్మావర్తం జనపదమ్ = బ్రహ్మావర్తమను దేశమును (సరస్వతీ దృషద్వతీ నదుల నడిమిదేశము బ్రహ్మావర్తమనఁబడును), ఛాయయా = నీడచేత, గాహమానః = ప్రవేశించువాఁడవై (నిజస్వరూపముచే ప్రవేశింపఁగూడదు - దేవక్షేత్రాశ్రమాదులను మాని అన్యత్ర పోవలసిన దని ధర్మశాస్త్రవచనము), క్షత్త్రి ...నమ్—క్షత్త్ర = రాజులముక్క—ప్రధన=యుద్ధముయొక్క — పిశునమ్=సూచక మైన (ఇప్పటిని కపాలములు మొదలగునవి యగపడుచుండుటచేత కురుపాండవ యుద్ధ సూచక మని యర్థము), తత్ = ఆప్రసిద్ధమయిన, కౌరవమ్...కురుసంబంధ మైన, క్షేత్రమ్=చోటిని, (కురుక్షేత్రమునకు), భజేథాః = సేవింపుము (పొమ్ము) యత్ర = ఏకురుక్షేత్రమందు, గాణ్డీవధన్వా — గాండీవ=గాండీవమనువిల్లు - ధన్వా

—తనవిల్లుగాఁగలవాఁడు-(అనఁగా అర్జునుఁడు), శితశరశతైః = శిత = తీక్ష్ణమైన-శర = బాణములయొక్క - శతైః = నూర్లచేత, రాజన్యానామ్ = మూర్ధాభిషిక్తలయినరాజులయొక్క, ముఖాని = ముఖములను, త్వమ్ = నీవు, ధారాపాతైః—ధారా = జలధారలయొక్క - పాతైః = పడఁజేయుటచేత - (జలధారలను కురియుటచేతను), కమలానీవ = తామరపువ్వులనుంబోలె, అభ్యవర్షత్ = అభిముఖముగా వర్షించెనో, (కురుక్షేత్రమున కని యన్వయము).

తా.—పిమ్మట కురుక్షేత్రమునకుఁ బొమ్ము, దేవక్షేత్రాశ్రమాదులయందుఁ బ్రవేశింపఁగూడదు గాన నీవు నిజస్వరూపముచే నాకురుక్షేత్రమునఁ బ్రవేశింపకనీ నీడచే మాత్రము ప్రవేశింపుము. అది మహాపుణ్యక్షేత్ర మగుటయేగాక అత్యుదారములయిన మహాపురుష సంరంభములను సూచించుచు కుతూహలము తీర్చును. ఎట్లనిన ఇప్పటికిని అందు కనఁబడుకపాలాదికము మున్నచట కురుపాండవయుద్ధమును అర్జునాదికృత సంఖ్యాతీత రాజన్యలోకసంహారమును సూచించును.

వి.—'క్షత్త్ర' - పందలపోరు గాదు మహాశూరులయుద్ధము. 'పిశునమ్' - ఇప్పటికిని కపాలాదులు అగపడుచున్నవి. 'రాజన్యానామ్' — లెక్కలేనిమూర్ధాభిషిక్తులనే యర్జునుఁడు సంహరించెనఁట సామాన్యరాజాదివిషయము చెప్పవలయునా? 'శతైః' — అక్షయతూణీరప్రభావముచేతను - సవ్యసాచియగుటచేతను. 'గాండీవధన్వా'—అతనిజయములు గాండీవప్రభావముచే కలిగినవి. 'ధారాపాతైః'—శర సంఖ్య అపరిమేయము - జడివానలోనిచినుకులవలె నంతదట్టముగా బాణములు ప్రయోగించినాఁడు. 'కమలాని' - వానచినుకులను కమలము లోర్వనియట్లు ఆరాజన్యులముఖములు అర్జునబాణముల నోర్వలేకపోయినవి-వారు పరాజితులైరి. వాననుండి కమలములను రక్షించుకొనుటకై తటాకాదులు ఏమియు చేయలేనట్లు ఆరాజన్యులును స్వముఖములను పార్థబాణపాతమునుండి రక్షించుకొనుట కేమియు ప్రతిక్రియ చేయలేకపోయి రనియు - వారి కేమి చేయను నెడమీయక సంతతధారగా పార్థుఁడు వారిముఖములపై బాణములు వేయుచునే యుండెననియు భావము. ముఖాకృతికి కమల సాదృశ్యము చెప్పుటచే వారు అందగాండ్రు సౌభాగ్యవంతులు శ్రీమంతులు అని భావము, అట్టివారిని గూర్చినపార్థునియందు మహాప్రభావము అభిప్రాయము. 'ప్రథన'—పార్థప్రస్తావము భీష్మద్రోణభీమాదిమహావీరులకు నుపలక్షణము- అందువలన ఆయుద్ధస్వరూపము అనిర్వచనీయమనియు భావము. అట్టియాయుద్ధమును సూచించుప్రదేశమును చూచుట మిగులకౌతుకప్రదము- దాని నవశ్యము చూడవలసిన దని భావము.

హిత్వా హాలా మభిమతరసాం రేవతీలోచనాఙ్కాం
బన్ధుప్రీత్యా సమరవిముఖో లాఙ్గలీ యాః సిషేవే
కృత్వా తాసా మభిగమ మపాం సౌమ్య సారస్వతీనా
మన్తఃశుద్ధ స్త్వ మసి భవితా వర్ణమాత్రేణ కృష్ణః. 53.

హిత్వేతి. — బన్ధుప్రీత్యా = కురుపాణ్డవస్నేహేన - న తు భయేన, సమరవిముఖో = యుద్ధ నిఃస్పృహః, లాఙ్గల మస్యా స్తీతి - లాఙ్గలీ = హలధరః, అభిమతరసామ్ = అభీష్టస్వాదాం, తథా, రేవత్యాః = స్వప్రియాయాః - లోచనే ఏవాఙ్కౌ (ప్రతిబిమ్బితతచ్చిహ్నం) యస్యాస్తాం, హాలాం = సురాం + 'సురా హలిప్రియా హాలా' ఇత్యమరః † 'అతిప్రయుక్తం దేశభాషాపద' మిత్యత్ర సూత్రే హాలేతి దేశభాషాపద మప్యతీవ కవిప్రయోగా త్సాధ్వి త్యుదాజహార వామనః, హిత్వా = త్యక్త్వా - దుస్త్యజా మపీతి భావః, యాః = సారస్వతీ రపః, సిషేవే, హే సౌమ్య = సుభగ, త్వం, తాసాం సరస్వత్యా నద్యా ఇమాః సారస్వత్య స్తాసామ్ - అభిగమం = సేవాం, కృత్వా, అన్తః = అన్తరాత్మని - శుద్ధో = నిర్మలో - నిర్దోషః, భవితా * 'ణ్వుల్తృచౌ' ఇతి తృచ్' అసి = సద్య ఏవ పూతో భవిష్యసీ త్యర్థః * 'వర్తమానసామీప్యే వర్తమానవ ద్వా' ఇతి వర్తమానప్రత్యయః, వర్ణమాత్రేణ * వర్ణేనైవ, కృష్ణః = శ్యామః - నతు పాపేనే త్యర్థః; అన్తఃశుద్ధి రేవ సంపాద్యా నతు బాహ్యా - బహిఃశుద్ధోఽపి సూతవధ ప్రాయశ్చిత్తార్థం సారస్వత సలిలసేవీ తత్రభవా న్బలభద్ర ఏవ నిదర్శనమ్ - అతో భవతాపి సరస్వతీ సర్వథా సేవిత వ్యేతి భావః.

బన్ధుప్రీత్యా = కురుపాండవస్నేహముచేత (భయముచేతఁగాదు), సమరవిముఖః - సమర = యుద్ధమునుండి - విముఖః = పెడమొగము పెట్టినవాఁడై - యుద్ధాభిలాష మాని, లాఙ్గలీ = నాఁగలిగలవాఁడు (బలరాముఁడు). అభిమతరసామ్ — అభిమత = ప్రియమయిన - రసామ్ = రుచిగలదైన (హాలకు విశేషణము), రేవ... జ్కామ్ - రేవతీ = రేవతియొక్క (బలరామునిభార్యపేరు రేవతి) - లోచన = నేత్రప్రతిబింబములే - అఙ్కామ్ = చిహ్నముగాఁగలదైన, హాలామ్ = సురను, హిత్వా = వదలి, యాః = ఏసరస్వతీజలమును, సిషేవే = ఆశ్రయించెనో, హే సౌమ్య = ఓయిసౌభాగ్యవంతుఁడా, తాసామ్ = ఆ, సారస్వతీనామ్ = సరస్వతీనదీసంబద్ధమైన, అపామ్ = జలముయొక్క, అభిగమమ్ = సేవను, కృత్వా = చేసి, అన్తః = అంతరాత్మయందు - శుద్ధః = నిర్మలుఁడవు (దోషరహితుఁడవు), త్వమపి =

నీవును, భవితా = కాఁగలవు; వర్ణమాత్రేణ = రంగుచేతమాత్రము (పాపముచేతఁగా దని యర్థము,) కృష్ణః = నల్లనివాఁడవు.

తా.—కురుక్షేత్రమందు మిక్కిలి పావనయయిన సరస్వతీనది ప్రవహించుచున్నది. దానిని సేవించిన నీవు అంతఃశుద్ధుఁడ వగుదువు. నీవు వర్ణముచేత నలుపే గాని పాపముచేత నలుపుండదు. అందులకు నిదర్శన మేమనిన - సురాప్రియుఁ డయ్యును రేవతీసమర్పితమైనసురను మాని, యుద్ధప్రియుఁ డయ్యును బంధుప్రీతిచే యుద్ధమునుమాని మహానుభావుఁడు బలభద్రుఁడు సూంపవక్రప్రాయశ్చిత్తముచే అంతశ్శుద్ధి కోరినవాఁడై తదర్థము ఆసరస్వతీజలమును సేవించుటయే.—కావున తప్పక నీవును ఆనదిని సేవించి పుణ్యాత్ముఁడ వగుము.

వ.—'హిత్వాహాలామ్'—సురకన్న సారస్వతజలమే ఆస్వాదవంతము. 'అభిమతరసామ్' - సారస్వతజలము హాలకన్న నభిమతతర మాయె నని భావము. 'లాఙ్గలీ' - మహాకర్షకుఁడు - అతఁడుకూడ సారస్వతజలమువలన అంతః శుద్ధుఁడు కాఁగా - 'సౌమ్య'-సౌమ్యుఁడవు నీవు అంతశ్శుద్ధుఁడ వగుదు వని చెప్పవలయునా? లాంగలము అనఁగా నాఁగలి, అదిగలవాఁడు దున్నుకొను గ్రామీణుఁడు, అట్టివాఁడు కూడ ఆపాటియీపాటిరసభేదమును కనిపట్టనేరనివాఁడు కూడ తనప్రియభార్య యిచ్చినసురకంటె ఈనీళ్లను ఇచ్ఛగించె ననుటచే నివి సురకన్న రసాధిక్యము కలవని భావము. 'రేవతీలోచనాఙ్కామ్' - లోచనములను చెప్పుటచే సురలో [1] కలువలకు బదులు కన్నులప్రతిబింబము లుండె నని ధ్వని. 'అభిగమమ్' - ఈపదమును 'అపామ్' అనుదాని స్త్రీలింగమును నాయికాభావమును సూచించుచున్నవి. బలరాముఁడు 'రేవతీ'-రేవతీసంగమును మాని 'సారస్వత'-సరస్వతీసంబంధినులైన 'అపామ్' నీటినాయికల'యభిగమము' చేసినాఁడు. అంతశ్శుద్ధిని నాయికాభిగమముచేత పొందుట యేలా కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులవలనఁ బొందుటయేలా? ఆనదిని సేవించుట అంతశ్శుద్ధికి మహోపాయ మని భా. 'సిషేవే' - సేవించె ననుట కామోపచారమును ధ్వనించుచున్నది. లేక 'అపామ్' అను స్త్రీలింగముచేతను, 'సిషేవే' అనుటచేతను, ఆనీళ్లయందు దేవతాభావము ధ్వనితము. ఆసరస్వతినీళ్లు పానమాత్రమున అంతశ్శుద్ధి నిచ్చుదేవత లని భావము. 'త్వమపి' - బలరాముఁడొకఁ డింతకుముందు ఆనీళ్లవలన శుద్ధుఁ డాయె నని అపిశబ్దస్వారస్యము. 'వర్ణమాత్రేణ' - పాపముచేత నయిననలుపు గా దని మాత్రశబ్దముయొక్కస్వారస్యము. 'కృష్ణ' - లాంగలికి నీకును గలభేదము దేహమందేగాని చిత్తశుద్ధియందుఁగా దనియు,

---

1 'నీలోత్పలవాసితాముఖే మదిరా.' నాగానందము.

ఆనీటిని సేవించిన అంతశ్శుద్ధిలో బలరామతుల్యుఁడ వగుదువు కావున తప్పక సేవింపు మనియు భావము.

తస్మాద్గచ్ఛే రనుకనఖలం శైలరాజావతీర్ణాం
జహ్నోః కన్యాం సగరతనయ స్వర్గసోపానపఙ్క్తిమ్
గౌరీవక్త్ర భ్రుకుటిరచనాం యా విహస్యేవ ఫేనైః
శమ్భోః కేశగ్రహణ మకరో దిన్దులగ్నోర్మిహస్తా. 54.

తస్మాదితి.—తస్మాత్ = కురుక్షేత్రాత్, కనఖల స్యాద్రేః సమీపేఽనుకనఖలమ్ * 'అనుర్యత్సమయా' ఇత్యవ్యయీభావః, శైలరాజాత్ = హిమవతః.అవతీర్ణాం, సగరతనయానాం - స్వర్గసోపానపఙ్క్తిం = స్వర్గప్రాప్తి సాధనభూతామిత్యర్థః, జహ్నో ర్నామ రాజ్ఞః కన్యాం జాహ్నవీం, గచ్ఛేః = గచ్ఛ * విధ్యర్థే లిఙ్, యా జాహ్నవీ, గౌర్యావక్త్రే) యా - భ్రుకుటిరచనా = సాపత్న్యరోషా ద్భ్రూభఙ్గకరణం-తాం, ఫేనైః - విహస్య=హసి - త్వేవ - ధావళ్యా త్ఫేనానాం హాసత్వే నోత్ప్రేక్షా, ఇన్దౌ శిరోమాణిక్యభూతే-లగ్నా ఊర్మయ ఏవ హస్తా యస్యాః సేన్దులగ్నోర్మిహస్తా సతీ, శమ్భోః కేశగ్రహణ మకరోత్; యథా కాచి త్ప్రౌఢా నాయికా సపత్నీ మసహమానా తా మనాదృత్య స్వవాల్లభ్యం ప్రకటయన్తీ స్వభర్తారం సహ శిరోరత్నేన కేశే ష్వాకర్షతి తద్వదితి భావః; ఇదంచ పురాకిల భగీరథప్రార్థనయా భగవతీం గగనపథా త్పతన్తీం గఙ్గాం గఙ్గాధరో జటాజూటేన జగ్రాహేతి కథా ముపజీవ్యోక్తమ్.

తస్మాత్ = కురుక్షేత్రమునుండి, అనుకనఖలమ్ = కనఖలము సమీపమునను, శైల ... తీర్ణామ్—శైలరాజ = హిమవంతునినుండి - అవతీర్ణామ్ = దిగినదియు, సగ... ఙ్క్తిమ్ - సగర = సగరచక్రవర్తియొక్క - తనయ = కుమారులయొక్క - స్వర్గ = స్వర్గముయొక్క - సోపాన = మెట్లయొక్క - పఙ్క్తిమ్ = వరుసయు, నయిన, జహ్నోః కన్యామ్ = జాహ్నవిని అనఁగా గంగను, గచ్ఛేః = పొందుము; యా = ఏగంగ, గౌరీ ... నామ్ — గౌరీ = అంబికయొక్క - వక్త్ర = ముఖముయొక్క - భ్రుకుటి=బొమముడియొక్క - రచనామ్ = చేయుటను-(గౌరి చేసికొను బొమముడిని), ఫేనైః = నురుగులచే, విహస్యేవ=పరిహసించునదియుఁబోలె,(తెల్లదనముచేత నురుగు నవ్వుగా నుత్ప్రేక్షింపఁబడినది), ఇన్దు...హస్తా - ఇన్దు=(శిరోమాణిక్యమయిన) చంద్రునియందు - లగ్న=తగిలిన - ఊర్మి = అలలనెడు - హస్తా= చేతులుగలదై, శమ్భోః = శివునియొక్క, కేశగ్రహణమ్ = జుట్టుపట్టుకొనుటను, అకరోత్ = చేసెను.

తా.—కురుక్షేత్రమును దాఁటి కనఖలపర్వతముచెంత గంగానదికిఁ బోయి ఆనదిని సేవింపుము. ఆనదిమహిమ చెప్పవలయునా? సగరపుత్త్రులను స్వర్గమునకుఁ బంపినది, గౌరికన్న శివునికి వల్లభయైనభార్య, గౌరి శివునిప్రక్క నుండఁగా తాను అతనినెత్తినే యెక్కి కూర్చుండి అతనిజుట్టు పట్టుకొనియున్నది; ఆమెయొక్క నురుగు గౌరినివెక్కిరించునవ్వువలెను అలలు శివునియొక్క చంద్రుఁడను చూడారత్నమును పట్టుకొనుచేతులవలెను ఉండును సుమా. అంతమహిమగలదిగాన అవశ్యము సేవింపుము.

ప.—'శైలరాజ...జహ్ను...సగరతనయ' - గంగ శివజటనుండి హిమాలయునిమీఁదఁ బడి అటనుండి ప్రవహించుచు దారిలో జహ్నుమునియొక్క ఒకచెవిలోఁ దూఱి మఱియొక్క చెవినుండి వెలువడి పిమ్మట చాలదూరము ప్రవహించి సగరపుత్త్రులబూడిదను తడిపి వారిని స్వర్గమునకు పంపినది, కనుక పై మూఁడుపదములును కథాసందర్భక్రమముననే గ్రహింపఁబడినవి. మూఁడును వరుసగా స్వర్గ వసుమతీ పాతాళములను అటఁ బ్రవహించుటచే గంగకుఁ గలిగినత్రిమార్గగా భావమును తెల్పుచున్నవి. 'అనుకనఖలమ్'—మార్గప్రదర్శనపరము. 'రాజ - జహ్నోః కన్యామ్'-ఆభిజాత్యకథనము. 'సగ...జ్క్తిమ్—మహిమానువర్ణనము-నీకును స్వర్గమిచ్చు నని భావము. 'సోపానపజ్క్తిమ్' - స్వర్గమునకు వారు మిగుల సులువుగా పోవుటను చెప్పుచున్నది, త్రిపథగ గాన మూఁడుసోపానముల (మెట్లు) వలె నున్నదని చెప్పఁబడినది; మూఁడుమెట్లు ఎక్కినంత సులువుగా సగరతనయులు ఈగంగచే స్వర్గమునకుఁ బోయి రని భావము. 'భ్రుకుటి'—ఒక రొకరిపై ద్వేషము సవతులకు సహజము. 'గౌరీ'—కేవల మర్ధాంగలక్ష్మియై అతివల్లభయై యున్న సవతినిగూడ భర్తృవాల్లభ్యమున నతిక్రమించిన దని తెలుపుటకు గౌరీకథనము. 'రచనామ్'—గౌరి యీమెకు ఓడిపోయి అసూయచే బొమలు ముడుచుటకన్న మఱియేమియు చేయనేరదాయె నని ధ్వని. 'ఫేనైః విహస్య'—నురుగే తెలుపు - మన్నుతగులని నీటి నురువు మఱియు తెలుపు-గంగ తెల్లనిది గాన గంగాజలమునురువు అత్యంతధవళము, కావున అట్టినురువుతో 'విహస్య' అనుటచే గౌరికిమిగుల నవమానమగునట్లు పకపక నవ్వి యని భావము. నవ్వును తెలుపుగా వర్ణించుట కవిసమయము. 'ఫేనైః'-బహువచనము సమృద్ధిని నవ్వుయొక్క యతిశయమును తెలుపును. అట్లే 'విహస్య'-అనుపదమునందు 'వి' యనునుపసర్గము నవ్వుయొక్క యతిశయమునే చెప్పుచున్నది. నురువు సర్వదా పుట్టుచుండునది గావున, సర్వదా హెహెహెహె యని గౌరి కవమానదుఃఖము అతిశయించునట్లుగాను అందువలని తన్ముఖవికారచేష్టాదులను చూచిచూచి గంగ తా నానందించుచునే యుండునట్లుగాను వెక్కిరింత

నవ్వు సదా నవ్వుచునే యుండు నని భావము. 'శమ్భోః' - శంభు వనఁగా సుఖముగా నుండువాఁడు. గంగ నెత్తిమెక్కి-జుట్టుపట్టుకొనినందులకు శివుఁడు మిగుల నానందించుచుండు ననిభావము. 'ఇన్దు' - చూడామణి యని ధ్వని. 'ఊర్మిహస్తా'— ఉర్మి యనఁగా నుంగరము, ఉంగరపుఁజేతితో భార్య జుట్టు పట్టుకొనఁగా శంభువు ఆయాభరణసంపదకు వశ్యుఁ డాయె నని భావము. అట్టియా త్రిభువనగురువు చేత శిరమున వహింపఁబడినగంగాదేవి నీ కవశ్యసేవ్యురాలని యుపదేశము.

తస్యాః పాతుం సురగజఇవ వ్యోమ్ని పశ్చార్ధలమ్బీ
త్వం చే దచ్ఛస్ఫటికవిశదం తర్కయే స్తిర్య గమ్భః
సంసర్పన్త్యా సపది భవతః స్రోతసి చ్ఛాయ యాసౌ
స్యా దస్థానోపగత యమునాసంగమే వాభిరామా. 55.

తస్యాఇతి.—సురగజఇవ = కశ్చి దిగ్గజఇవ, వ్యోమ్ని పశ్చాదర్ధం పశ్చార్ధం పశ్చిమార్ధ మిత్యర్థః * పృషోదరాదిత్వా ద్సాధుః-తేన లమ్బత ఇతి పశ్చార్ధలమ్బీసన్- పశ్చార్ధభాగేన వ్యోమ్ని స్థిత్వా పూర్వార్ధేన జలోన్ముఖ ఇత్యర్థః - కేచిత్తు పూర్వార్ధలమ్బీతి పఠన్తి, అచ్ఛస్ఫటికవిశదం = నిర్మలస్ఫటికావదాతం, తస్యాః = గఙ్గాయాః, అమ్భః=తోయం, తిర్యక్ = తిరశ్చీనం యథాతథా, పాతుం త్వం - తర్కయేః=విచారయే శ్చేత్, సపది, స్రోతసి=ప్రవాహే, సంసర్పన్త్యా = సంక్రామన్త్యా, భవతః-ఛాయయా = ప్రతిబిమ్బేన, అసౌ = గఙ్గా, అస్థానే = ప్రయాగాదన్యత్ర - ఉపగతః = ప్రాప్తః - యమునాసంగమో - యయా సా తథాభూతేవ, అభిరామా స్యాత్.

సురగజఇవ = దేవగజమువలె, వ్యోమ్ని = ఆకాశములో, పశ్చార్ధలమ్బీ = వెనుకసగముచే వ్రేలుచున్నవాఁడవై (వెనుకటిసగముదేహము ఆకాశమున నుండ ముందుసగము నీటిపై పుచాఁచి అనియర్థము, కొందఱు 'పూర్వార్ధలమ్బీ'యని పఠింతురు), అచ్ఛ...దమ్—అచ్ఛ = నిర్దోషమయిన - స్ఫటిక = స్ఫటికమణివలె - విశదమ్ = తెల్లనిదైన, తస్యాఃఅమ్భః = ఆగంగయొక్క-నీటిని, తిర్యక్ = అడ్డముగా, పాతుమ్ = త్రాగుటకు, త్వమ్ = నీవు, తర్కయేః = విచారింతువేని, సపది = తత్క్షణమే, స్రోతసి = ప్రవాహములో, సంసర్పన్త్యా = జరుగుచున్న, భవతః=నీయొక్క, ఛాయయా = ప్రతిబింబముచేత, అసౌ = ఈగంగ, అస్థా...మేవ - అస్థాన = ప్రయాగయందుఁగాక మఱియొకచోట - ఉపగత = కలిగిన - యమునా = యమునతోడి - సంగమేవ = కూడికగలదివోలె, అభిరామా = అందమైనది, స్యాత్ = అగును.

తా.—నీవు దేవగజమువలె సగముదేహము ఆకాశములో గంగయొక్క యొాడ్డున వెలిగాను సగముదేహము ఓరకులోనుగాను అనఁగా నీళ్లవైపును ఉండి జలము త్రాగునప్పుడు ఆస్వచ్ఛజలమున నల్లనినీప్రతిబింబముచే గంగ ప్రయాగకడఁగాకయే యమునతోఁ గూడుకొన్నట్లు శోభిల్లుచుండును.

వ.—'సురగజఇవ'—దేవగజమేని ఆకాశ సంచారముగలదిగానను నేలకు తగులదుగానను గంగాజలమును గ్రోలునప్పుడు నేలకు తగులక ఆకాశముననేయుండి క్రోలును; మేఘమును అట్లే క్రోలును; మఱియు సామాన్యగజములకు ఆకాశగంగా జలపానము, సంభవింపదు, లభింపదు, దేవగజములకు లభించును, మేఘునికి పరివహవాయుస్కంధమునఁగాకపోయినను గంగ శివజటాజూటమునుండి శైలరాజుమీఁదికి దిగునీడుమ లభించును, కాన మేఘుని గజమాత్రముతో నుపమింపక దేవగజముతో నుపమించుట. 'పశ్చార్ధలమ్బీ - గంగయొక్క యొాడ్డున మేఘుఁడు సగము వెలిగాను సగము లోనుగాను ఉండవలయును, అట్లుండిన అతని ప్రతిబింబము యమునాసంగమమువలె నుండును. ఎట్లనిన యమున గంగతో ఒకయొాడ్డుననే కలియును, గంగ యొక్క ప్రవాహమునెల్లను ఆక్రమింపదు, మేఘుఁడును తనప్రతిబింబముచేత గంగ యొక్క వెడల్పునెల్ల ఆక్రమించినను త్వరగా నడిమికి పోయి నడుమకామాత్రమే నిలుకడగా ప్రతిబింబించినను యమునాసంగమసాదృశ్యము లభింపదు. తదర్థమై ఒక యొాడ్డుననే సగము గంగమీఁదను సగము జయటను ఉండు మని చెప్పుట అట్లుండిన 'సంసర్పన్త్యా' - అతనినీడ గంగలోనికి జరుగుచున్నప్పుడు గంగాప్రవాహమున కొకప్రక్కను అందులోనికిం జొచ్చుచుండు యమునఁగా నగపడును. 'ఛాయయా' స్త్రీలింగముచే యమునాసామ్యవుష్టి. 'అచ్ఛస్ఫటిక విశదమ్'—విశదము - గంగవర్ణము. అచ్ఛతాదికవనము ప్రతిబింబసౌష్ఠముకొఱకు. 'తిర్యక్'—చతుష్పాత్తువలె నేలకు సరిగా వంగియుండెడిది. 'అభిరామా'—అట్టియభిరామతను గంగకు కలుగఁజేసి గంగాదేవియొక్క ప్రసాదమును పడయుము.

ఆసీనానాం సురభితశిలం నాభిగన్ధైర్మృగాణాం
తస్యా ఏవ ప్రభవ మచలం ప్రాప్య గౌరం తుషారైః
వక్ష్య స్యధ్వశ్రమవినయనే తస్య శృఙ్గే నిషణ్ణః
శోభాం శుభ్రత్రినయన వృషోత్ఖాతపఙ్కోపమేయామ్. 56.

ఆసీనానామితి.—ఆసీనానామ్ = ఉపవిష్టానాం, మృగాణాం = కస్తూరికామృగాణామ్ -అన్యథా నాభిగన్ధానుపపత్తేః, నాభిగన్ధైః = కస్తూరిగన్ధైః - తేషామ్

తదుద్భవత్వాత్ - అతఏవ మృగనాభిసంజ్ఞాచ + 'మృగనాభిర్మృగమదః కస్తూరీచ' ఇత్యమరః - అథవా - నాభయః = కస్తూర్యః + 'నాభిః ప్రధానే కస్తూర్యాం మదేచ క్వచి దీరితః' ఇతి విశ్వః - తాసాం గన్ధైః, సురభితాః - శిలా యస్య తం, తస్యా (గఙ్గాయా) ఏవ, ప్రభవత్యస్మాదితి - ప్రభవః=కారణమ్, తుషారైః, గౌరం =సితమ్ + 'అవదాతః సితో గౌరః' ఇత్యమరః, అచలం, ప్రాప్య, వినీయతేఽనేనేతి వినయనమ్ * కరణే ల్యుట్ - అధ్వశ్రమస్య - వినయనే = అపనోదకే, తస్య=హిమాద్రేః, శృఙ్గే నిషణ్ణః సన్, శుభ్ర స్త్రినయనస్య (త్ర్యమ్బకస్య) వృషో (వృషభః) + 'సుకృతే వృషభే వృషః' ఇత్యమరః - తేన - ఉత్ఖాతేన=విదారితేన - పఙ్కేన సహ - ఉపమేయామ్ = ఉపమాతు మర్హాం, శోభాం, వక్ష్యసి * వహతె ర్లృట్. 'త్రినయన'—ఇత్యత్ర * 'పూర్వపదా త్సంజ్ఞాయా మగః' ఇతి ణత్వం న భవతి * 'క్షుభ్నాదిషుచ' ఇతి నిషేధాత్. తస్యాః ప్రభవ మిత్యాదినా హిమాద్రౌ మేఘస్య వైవాహికగృహవిహారో ధ్వన్యతే.

ఆసీనానామ్ = పరున్నటువంటి, మృగాణామ్ = కస్తూరిమృగములయొక్క, నాభిగన్ధైః = కస్తూరిపరిమళముచేత, సుర ... లమ్ — సురభిత = పరిమళవంతముగాఁజేయఁబడిన - శిలమ్ = ఱాలుగలదియు, తస్యాః ఏవ = ఆగంగకే, ప్రభవమ్ = కారణభూతమును, తుషారైః = మంచుచేత, గౌరమ్ = తెల్లనిదియు, (అయిన), అచలమ్=పర్వతమును, (అనఁగా హిమాలయమును), ప్రాప్య=పొంది, అధ్వ ... నే - అధ్వ = మార్గముచేతనయిన - శ్రమ = బడలికయొక్క-వినయనే = తీర్చునదైన (మార్గాయాసమును తీర్చునదైన), తస్యశృఙ్గే = ఆహిమవంతునిశృంగమునందు, నిషణ్ణః = కూర్చున్నవాఁడవై, శుభ్ర ... యామ్ - శుభ్ర = తెల్లనిదైన-త్రినయన = శివునియొక్క-వృష = ఎద్దుచేత - ఉత్ఖాత = కోరాడఁబడిన-పఙ్క = బురదతో - ఉపమెయామ్=పోల్పఁదగిన, శోభామ్=కాంతిని, వక్ష్యసి = వహింతువు.

తా. —అటుతర్వాత నీవు హిమాలయమునకుఁ బొమ్ము. ఆపర్వతము తనచట్రాలయందు శయనించు కస్తూరిమృగముల నాభులనుండి కస్తూరి విస్తారముగా ఆరాలపై చేరుటచేత నెత్తావులు వెదచల్లుచు మంచుచేత తెల్లనై గంగోత్పత్తిచే పావనమునై, ఎల్లవిధములనుకోరఁదగినదిగా నుండును. అట్టిదానిశృంగములలో బడలిక తీర్చునదైన యొకశృంగముమీఁద నీవు నిలిచి మార్గాయాసమును తీర్చుకొనుము. తెల్లనిశృంగముపై నున్నప్పుడు నీవు తెల్లనిశివవృషభము కోరాడి తనకొమ్ముమీఁద వహించియున్న మట్టిబురదవలె శోభించుచుందువు.

వ.—'ఆసీనానామ్'—మిశ్రము లేక మేలయిన కస్తూరి, అదియు విస్తారము. 'శిలమ్' - సర్వత్ర అట్లు కస్తూరీపరిమళభరితములయిన రా లుండును. నీవు ఏశృంగమున విశ్రమింపఁబోయినను అచ్చట నట్టి సురభిశిలావేదిక లుండును. వానియందు విశ్రాంతము కలుగును అనిభావము. 'మృగాణామ్'-బహువచనము కస్తూరీబాహుళ్యమును సర్వత్ర సులభతను దెలుపును. 'తస్యా ఏవ ప్రభవమ్' - పావనతయు మహాజలపాతాదులచే దర్శనీయతయు ఆనదివెంబడింబోయిన హిమాలయము నకే పోవుదువు అని మార్గమును చెప్పఁబడినవి. 'గౌరమ్' - మంచు దట్టముగా పేరియున్నదని తెలుపుచున్నది. 'తుషారైః' - బహువచనముచే నిరంతర మపరిమితముగా కరియుచుండుట సూచితము. 'గౌరమ్' - తుషారగౌరతాకథనము హరవృషభసామ్యార్థము. 'అధ్వశ్రమవినయనే' - కస్తూరిచేఁ గదంబించుశిలాపట్టములు - మంచు చలువ - ఇత్యాదులచే మార్గశ్రమను పోఁగొట్టును. కస్తూర్యాది సమృద్ధమయిన కలయంపి చల్లి వెల్లవేసి సిద్ధపఱిచినట్లుండును అనియు, ఈవిశేషణములచేతను 'తస్యాః ప్రభవమ్'-ఆమె పుట్టినచోటు అనుటచేతను పెండ్లికై హిమాలయుని 'శృఙ్గ' మేడల నలంకరించి రనియు ధ్వనితమగుచున్నది; అందుచే పెండ్లియింట చుట్టము సర్వోపచారసత్కృతుఁడై సుఖించునట్లు మేఘుఁడా నీవు నచట సుఖింతువని భావము. 'శృఙ్గే' — ఎత్తుననుండి లోకాతీతవినోదములను ఆహిమాలయమందలివానిని జూడవచ్చును-అందుచేతఁగూడ బడలిక తీఱును - ఆనందము చెప్పనక్కఱలేదు-ఈ పూర్వోక్తగుణములచే హిమాలయము మిగుల స్పృహణీయ మని భావము. 'శుభ్ర... యామ్' - నీకును అచట కూర్చుండుటచే మహాసౌభాగ్యము కలుగును. ఎట్లన - కోరాడఁగా తనపైఁబడిన బురదతోడి హరవృషభముయొక్క సామ్యము మంచుకొండ శృంగముతోడ నీకుఁ గలుగుటచే ఆచోద్యమును హిమవత్సానుచరులగు ప్రమథామర గంధర్వ విద్యాధరాదులు సాభిలాషముగా చూచుచుందురు. కొందఱు హరవృషభ మేయని భ్రమించుచు కొందఱు సందేహించుచు కొందఱు సాదృశ్యమాత్రమని చెప్పుచు కొందఱు వాస్తవము నెఱింగి తెలుపుచు వినోదము నొందుదురు. 'శుభ్ర'-శృంగము తుషారగౌరవము - శివునియెద్దు తెల్లనిది - కావున రెంటికిని సామ్యము. అట్టిసౌభాగ్యమును అవశ్యము నీవు పొందవలయు నని భావము. 'త్రినయనవృష' - హరవృషభమునకు అవి యెల్ల సంచారప్రదేశములగుఁ గావునను, ఇతరవృషభముల కాప్రదేశములు అగమ్య మగుటచేతను తద్గ్రహణము, తత్సామ్యకథనమందు స్వారస్యంబును. 'పఙ్క' - ఇంక శరత్కాలమేఘము కాదు గావున నైల్యము సిద్ధము.

తం చే ద్వాయౌ సరతి సరళస్కన్ధసంఘట్టజన్మా
బాధే తోల్కాక్షపితచమరీవాలభారో దవాగ్నిః

అర్హ స్యేనం శమయితు మలం వారిధారాసహస్రై
రాపన్నార్తిప్రశమనఫలాః సంపదో హ్యుత్తమానామ్. 57.

తమితి.—వాయౌ = వనవాతే, సరతి = వాతి సతి, సరళానాం = దేవదారుద్రుమాణాం - స్కన్ధాః = ప్రదేశవిశేషాః + 'అస్త్రీ ప్రకాణ్డః స్కన్ధః స్యాన్మూలాచ్ఛాఖావధే స్తరోః' ఇత్యమరః— తేషాం - సంఘట్టనేన = సంఘర్షణేన - జన్మ యస్య స తథోక్తః* జన్మోత్తరపదత్వా ద్వ్యధికరణోఽపి బహువ్రీహిః సాధురిత్యుక్తమ్, ఉల్కాభిః = స్ఫులిఙ్గైః - క్షపితాః = నిర్దగ్ధాః - చమరీణాం - వాలభారాః = కేశసమూహాః - యేన సః, దవ ఇ త్యగ్ని ర్దవాగ్ని ర్వనవహ్నిః + 'వనే చ వనవహ్నౌ చ దవో దావ ఇతీష్యతే' ఇతి యాదవః, తం=హిమాద్రిం, బాధేత చేత్ = పీడయే ద్యది, ఏనం=దవాగ్నిం, వారిధారాసహస్రైః, అలమ్ = అత్యన్తం, శమయితు మర్హసి; యుక్తం చైత దిత్యాహ—ఉత్తమానాం = మహతాం, సంపదః = సమృద్ధయః, ఆపన్నానామ్ = ఆర్తానామ్ - ఆర్తిప్రశమనమ్ = ఆపన్నివారణమేవ ఫలం=ప్రయోజనం - యాసాం తా స్తథోక్తా హి, అతో హిమాచలస్య దావానల స్త్వయా శమయితవ్య ఇతి భావః.

వాయౌ = అడవిగాలి, సరతి (సతి) = వీచుచుండఁగా, సర...న్మా— సరళ = ఒకజాతి దేవదారువృక్షములయొక్క - స్కన్ధ=బోదెలయొక్క-సంఘట్ట= ఒరయికచేత - జన్మా-పుట్టువుగలదైన, ఉల్కా...రః - ఉల్కా = విస్ఫులింగముల చేత - క్షపిత = కాల్పఁబడిన - చమరీవాల = చమరీమృగములతోఁకలయొక్క - భారః = మొత్తముగలదైన, దవాగ్నిః = కార్చిచ్చు, తమ్ = ఆహిమాద్రిని, బాధేతచేత్ = పీడించునేని, ఏనమ్ = ఆయగ్నిని, వారి...స్రైః - వారి=నీళ్లయొక్క- ధారా = సంతతపాతములయొక్క - సహస్రైః = వేలచేత, అలమ్ = పూర్తిగా, శమయితుమ్ = అణఁచుటకు, అర్హసి = తగుదువు; అట్లు చేఁత యుక్తమని సమర్థించుచున్నాఁడు, (తథా)హి = అట్లేగదా, ఉత్తమానామ్ = గొప్పవారియొక్క, సమ్పదః = సమృద్ధులు, ఆప...లాః — ఆపన్న = ఆర్తులయొక్క ఆర్తి = పీడయొక్క-ప్రశమన=తీర్చుటయే-ఫలాః = ప్రయోజనముగాఁగలవి.

తా.—నీవు పోవు నాసమయమున ఒకవేళ దేవదారువు లొరసికొనఁగా పుట్టినదావాగ్ని యేమేని గాలికిరేఁగి చమరీమృగములతోఁకలను కాల్చుచునా హిమవంతునికి పీడగలిగించునెడల నీవు విశేషముగా వర్షించి యాదావాగ్నిని పూర్తిగా చల్లార్చి అతనికి ఉపకారివగుము. ఇట్లు చేయుట నీకేమి క్రొత్తయా? ఉత్తముల సంపదలు ఆర్తులపీడను నివారించుటకే గాని స్వార్థము గావుగదా.

వ.—'వాయౌసరతి' గాలి అగ్నికి సహాయము - గాలి లేకపోయిన అగ్ని వ్యాపింపఁజాలదు. 'సరళ' - సులువుగా రగులుకొనునది. 'స్కంధమును' జెప్పట బలిష్ఠమైన యొరయికకు. 'చమరీవాల'—అద్రిరాజుయొక్క రాజచిహ్నమనియు దానిని కాల్చుటచే హిమవంతునికి పీడ యనియు ధ్వని. మఱియు 'చమర' అనక 'చమరీ' అని స్త్రీలింగమును చెప్పుటచే అబలలును హిమవంతునకు పుత్త్రికాప్రాయలును అనియు వానిని పీడించుటచే నతనికి పీడయనియును భావము. 'బాధః' విస్తారము. 'అలమ్' - చేయునుపక్రియని పూర్ణముగా చేయవలసినది; కానిచో చేసిన ప్రయోజన ముండదు. అగ్ని శేష మున్న మరల వృద్ధినొంది అడవినెల్ల దహించును గావున శేషము ఉంపవల దని భావము. 'దవ' - ఆటవికము, అడవిది నాగరకము యినది గాదు - మోటుది - కాన నటు నాశముచేయును. 'సహస్రైః'-ఇందులకై ఎంతనీరైనను వెనుదివియక వ్యయముచేయవలయును. 'ఆప...నామ్' - నీవు పరోపకారనిరతుఁడవు, కావున జలవ్యయమును గణింపవు. ఇట్లు చేయుటచే సాక్షాద్గౌరీగురుఁడు మహేశ్వరశ్వశురుఁడు నీకు కృతజ్ఞతాబద్ధుఁ డగుమిత్ర మగును. ఇంత కన్న శ్రేయము కలదా! ఈశ్రేయమును నీవు పొందుదువుగాక యనియు, భావము.

> యే సంరమ్భోత్పతనరభసాః స్వాఙ్గభఙ్గాయ తస్మిన్
> ముక్తాధ్వానం సపది శరభా లఙ్ఘయేయు ర్భవన్తమ్
> తా న్కుర్వీథా స్తుములకరకావృష్టిపాతావకీర్ణాన్,
> కే వా న స్యుః పరిభవపదం నిష్ఫలారమ్భయత్నాః. 58.

యఇతి.—తస్మిన్ = హిమాద్రౌ, సంరమ్భః = సంభ్రమః = కోపోవా + 'సంరమ్భః సంభ్రమేకోపే' ఇతి శబ్దార్ణవే - తేన=గజ ఇతి భ్రాన్త్యా - ఉత్పతనే= ఉత్ప్లవనే - రభసో = వేగో - యేషాం తే తథోక్తాః + 'రభసో వేగ హర్ష యో' ఇతి విశ్వః - యే, శరభాః = అష్టాపద మృగవిశేషాః + 'శరభః శలభే చాష్టాపదే ప్రోక్తో మృగాన్తరే' ఇతి విశ్వః, ముక్తః = త్యక్తః - అధ్వా=శరభోత్ప్లవనమార్గో-యేన తం - భవన్తం సపది స్వాఙ్గభఙ్గాయ లఙ్ఘయేయుః * సంభావనాయాంలిఙ్ - భవతోఽతిదూరత్వాత్ స్వాఙ్గభఙ్గాతిరిక్తం ఫలం నాస్తి తేషాం లఙ్ఘన స్యేత్యర్థః, తాఞ్ఛరభాన్, తుములాః = సంకులాః-కరకాః = వర్షోపలాః -|- 'వర్షోపలస్తుకరకా', ఇత్యమరః - తాసాం వృష్టి స్తస్యాః పాతేన - అవకీర్ణాన్=వ్యస్తాన్, కుర్వీథాః = కురుష్వ * విధ్యర్థేలిఙ్, క్షుద్రోఽప్యధిక్షిపన్ ప్రతిపక్షః సద్యః ప్రతిక్షేప్తవ్య ఇతి భావః, తథాహి—ఆరభ్యన్త ఇతి - ఆరమ్భాః = కర్మాణి - తేషు - యత్నః

# ప్రథమః సర్గః

=ఉద్యోగః - స నిష్ఫలో యేషాం తే తథోక్తాః-నిష్ఫలకర్మోపక్రమా ఇత్యర్థః, అతః
కే వా, పరిభవపదం = తిరస్కారపదం, న స్యుః = న భవన్తి - సర్వ ఏవ భవన్తీ
త్యర్థః. యదత్ర + 'ఘనోపల స్తు కరక' ఇతి యాదవవచనాత్ కరకశబ్దస్య
నియతపుంలిఙ్గతాభిప్రాయేణ 'కరకాణా మావృష్టిః' ఇతి కేషాంచి ద్వ్యాఖ్యానం త
దస్యే నానుమన్యన్తే - 'వర్షోపలస్తు కరకా' ఇత్యమరవచనవ్యాఖ్యానే క్షీరస్వా
మినా 'కమణ్డలౌ చ కరకః సుగతే చ వినాయక' ఇతి నానార్థే పుం స్యపి వక్ష్య
తీతి వద తోభయలిఙ్గతాప్రకాశనాత్ - యాదవస్య తు పుల్లిఙ్గతావిధానే తా
త్పర్యం న తు స్త్రీలిఙ్గతానిషేధ ఇతి న తద్విరోధోఽపి + 'కరకస్తు కరజే స్యా
ద్దాడిమే చ కమణ్డలౌ। పక్షిభేదే కరే చాపి కరకా చ ఘనోపలే' ఇతి విశ్వప్రకాశ
వచనే తూభయలిఙ్గతా వ్యక్తైవేతి న కుత్రాపి విరోధవార్తా - అత ఏవ రుద్రః 'వ
ర్షోపలస్తు కరకా కరకోఽపి చ దృశ్యతే' ఇతి.

తస్మిన్ = అహిమాద్రియందు, సంర...భసాః — సంరమ్భ = తొట్రు
పాటుచేత (కోపముచేతఁగాని)-ఉత్పతన = (ఏనుఁగు అనుభ్రాన్తిచేత) పైకిదుముకు
టయందైన - రభసాః = వేగముగలవైన, యే శరభాః = ఏశరభములు (అనఁగా
ఎనిమిది కాళ్లమృగములు), ముక్తాధ్వానమ్ - ముక్త = వదలఁబడిన - అధ్వానమ్-
మార్గముకలవాండ్రవైన, భవన్తమ్ = నిన్ను, సపది = శీఘ్రముగా (తటాలున),
స్వాఙ్గభఙ్గాయ - స్వ = తమయొక్క - అఙ్గ = అవయవములయొక్క - భఙ్గా
య = విఱుగుటకొఱకు, లఙ్ఘయేయుః = దాఁటుదురో, తాన్ = ఆశరభములను,
తుము ... కీర్ణాన్ - తుముల = సంకులమైన - కరకా = వడగండ్లయొక్క - వృష్టి
= వానయొక్క - పాత = కురియుటచేత-అవకీర్ణాన్ = త్రోయఁబడినవానినిగా,
కుర్వాణాః = చేయుచు, నిష్ఫ ... యత్నాః - నిష్ఫల = నిష్ప్రయోజనమైన -
ఆరమ్భ = పనులయందు - యత్నాః = ప్రయత్నముఁగలవారు, కే = ఎవరు,
పరిభవపదమ్ = తిరస్కారాస్పదము, న స్యుః = కారు.

తా.—ఒకవేళ నీవు హిమాద్రిశృంగమును వదలి అవలికి పోవునప్పుడు నిన్నుఁ
గని ఏనుఁగ వని భ్రమసి శరభములు తొందరపడి నీపైకి దుముకునేని నీవు వానిదాఁ
టునకు గోచరమైనదారిని విడిచి అవలికి పొమ్ము. అంత నవి క్రింద పడి యవయవ
భంగమును పొందును. అంతట వానిని నీవు మొత్తమొత్తముగా వడగండ్లతోఁ గొట్టు
ము. క్షుద్రశత్రువు నయిన నధిక్షేపించువానిని తత్క్షణము అణఁగఁగొట్టవలయును.
నిష్ఫలమైనపనికి యత్నించువారికి తిరస్కారము తప్పదు.

వ.—'ముక్తాధ్వానమ్'—నీవున్నచోటన యుండువేని శరభములు నీపై దుము
కును. నీవు జరిగిన క్రిందఁబడును. కావున నీ వున్నచోటినుండి జరుగుము. 'సంరమ్భ'-

తొంటరపాటుచేత ఏనుఁగ యని భ్రమయుతు. మేఘము కొండంతయేనుఁగువలెఁగదా యుండును అనిన - దానిపై దుముకవచ్చునది శరభము ఎనిమిదికాళ్లది సింహమును గూడఁ గూల్చునది గదా. కావున బలాహంకారముచేత ఆకృతిని లక్ష్యపెట్టక దుముకు నని భావము. 'కరకావృష్టిపాత'-రాల రువ్వుటవలెనని ధ్వని. పాండిత్యాహంకారముగలవారు గొప్పవారైనే కొంచఱను జయించినవారైనను విక్రమార్క-మహారాజసభాలంకారమయిన కాళిదాసును సామాన్యకవి యని తలంచి దురాక్షేపములుచేసి అతనియుక్తులచే పరాహతులై చీవాట్లు తిని పోదురనియు ఇందు కవిభావము.

తత్ర వ్యక్తం దృషది చరణన్యాస మర్ధేన్దుమౌళేః
* శశ్వ త్సిద్ధై రుపచితబలిం భక్తినమ్రః పరీయాః ;
యస్మి న్దృష్టే కరణవిగమా దూర్ధ్వ ముద్ధూతపాపాః
కల్పిష్యన్తే స్థిరగణపదప్రాప్తయే శ్రద్దధానాః. 59.

తత్రేతి.—తత్ర = హిమాద్రౌ, దృషది = కస్యాంచిచ్ఛిలాయాం, వ్యక్తం = ప్రకటం, శశ్వత్ = సదా, సిద్ధైః=యోగిభిః + 'సిద్ధిర్నిష్పత్తి యోగయోః' ఇతి విశ్వః, ఉపచిత బలిం = రచిత పూజం + 'బలిః పూజోపహారయోః' ఇతి యాదవః, అర్ధ శ్చాసా విన్దు శ్చే త్యర్ధేన్దుః + 'అర్ధః ఖణ్డే సమాంశేఽర్ధమ్' ఇతి విశ్వః - స మౌళౌ యస్య త స్యేశ్వరస్య, చరణన్యాసం = పాదవిన్యాసం, భక్తిః =పూజ్యేష్వనురాగః - తయా నమ్రః స న్పరీయాః=ప్రదక్షిణం కురు. * పరి పూర్వా దిణో లిఙ్, యస్మి న్ = పాదన్యాసే, దృష్టే సతి, ఉద్ధూత పాపాః = నిర స్త కల్మషాః స న్తః, శ్రద్దధానాః=విశ్వస న్తః పురుషాః - శ్రద్ధా విశ్వాసః ఆస్తిక్యబుద్ధి రితి యావత్ * 'శ్రదన్తరో రుపసర్గవ ద్వృత్తి ర్వక్తవ్యా' ఇతి శ్రత్పూర్వా ద్ద ధాతేః శానచ్, కరణస్య = క్షేత్రస్య - విగమా దూర్ధ్వం = దేహత్యాగానన్తరం + 'కరణం సాధకతమ క్షేత్ర గాత్రేన్ద్రియేష్వపి' ఇత్యమరః, స్థిరం=శాశ్వతం - గణానాం = ప్రమథానాం - పదం = స్థానం + 'గణాః ప్రమథ సంఖ్యౌఘాః' ఇతి వైజయన్తీ - తస్య ప్రాప్తయే - కల్పిష్యన్తే = సమర్థా భవిష్యన్తి * క్లృపేః పర్యాప్తివచన స్యాలమర్థత్వా త్తద్యోగే * 'నమః స్వస్తి' ఇత్యాదినా చతుర్థీ * 'అల మితి పర్యాప్త్యర్థగ్రహణమ్' ఇతి భాష్యకారః. † 'అవ్యక్తో వ్యఞ్జయామాస శివః శ్రీచరణద్వయమ్। హిమాద్రౌ శామ్భవానాం సిద్ధయే సర్వకర్మణామ్। దృష్ట్వా శ్రీచరణన్యాసం సాధకః స్థిరయే త్తనుమ్ । ఇచ్ఛాధీనశరీరో హి విచరే చ్చ జగత్త్రియమ్' ఇతి శమ్భురహస్యే.

తత్ర = హిమాద్రియందు, దృషది = ఒకానొకశిలయందు, వ్యక్తమ్=ప్రకటింపఁబడినదియు, శశ్వత్=సర్వదా, సిద్ధైః_యోగులచేత, ఉపచితబలిమ్—ఉపచిత = చేయఁబడిన-బలిమ్ = పూజగలదియు, (అయిన), అర్ధేన్దుమౌళేః-అర్ధ=ఖండమైన-ఇన్దు=చంద్రుఁడు.(అనఁగా పూర్ణచంద్రుఁడుగాక చంద్రకళ)-మౌళేః=చూడయందుఁగలవానియొక్క - (అనఁగా శివునియొక్క), చరణన్యాసమ్-చరణ = పాదముల యొక్క - న్యాసమ్ = ఉంచుటను - (పాదచిహ్నమును), భక్తినమ్రః-భక్తి = పూజ్యులయందలి యనురాగముచే - నమ్రః_వంగినవాఁడవై, పరీయాః - ప్రదక్షిణము సేయుము, యస్మిన్-ఏపాదన్యాసము, దృష్టే (సతి)=చూడఁబడినదగుచుండఁగా, ఉద్ధూతపాపాః - ఉద్ధూత = పోఁగొట్టఁబడిన - పాపాః=పాపముగలవారై, శ్రద్దధానాః=విశ్వసించువారు (అనఁగా ఆస్తిక్యబుద్ధికలవారు), కరణవిగమాత్—కరణ = దేహముయొక్క - విగమాత్ ఊర్ధ్వమ్ = పోవుటకు పిమ్మట-(అనఁగా దేహము పోయినపిమ్మట), స్థిర...ప్తయే—స్థిర = శాశ్వతమైన - గణ = ప్రమథులయొక్క - పద = స్థానముయొక్క - ప్రాప్తయే = అనుభవమునకు, కల్పిష్యన్తే = ఏర్పడుదురు, ప్రమథులగుదురు.

తా.—ఆహిమాద్రియందు ఒకానొకచోట రాతిమీఁద శ్రీపరమేశ్వరుఁడు తన పాదచిహ్నమును ప్రకటించియున్నాఁడు; దానిని సిద్ధాదులు సదా పూజించుచుందురు. నీవును దానికి భక్తినమ్రుఁడవై ప్రదక్షిణముచేయుము. దానిం గనువిశ్వాసవంతులు సకలపాపములను తీఱి దేహాంతమందు శాశ్వతమయిన ప్రమథపదవిని పొందుదురు.

వ.—'అర్ధేన్దుమౌళేః' అని అనన్యసాధారణవిశేషణమును చెప్పుట మహిమాతిశయద్యోతనార్థము. 'వ్యక్తమ్' దర్శనప్రదక్షిణాదిసేవలకు సాధ్యమని భావము. 'సిద్ధైః' - పుణ్యాత్ములకే గాని ఎల్లవారికి సులభము గాదు. అలభ్యముగావున దానిను పేక్షించుకోవలదు. 'ఉపచితబలిమ్'-శిష్టాచారప్రదర్శనముచే ఆపాదన్యాసమహిమాతిశయమందు ప్రత్యయము పుట్టించుట. 'శశ్వత్' - పూజకవకాశమే దుర్లభమని భావము. 'భక్తి' - భక్తి లేని నమ్రత (నక్కవినయము) నిష్ఫలము తప్పిదముగూడ, భక్తి లేక పూజ ఫలింపదు. 'దృష్టే' ఇతరములు దీర్ఘకాలసేవాదులచే ఫలము నిచ్చునవి - ఇది దర్శనమాత్రముచే ప్రమథపదవి నొసంగునది, శ్రేయస్సునకు అతిసుఖోపాయ మని భావము. 'కరణవిగమాత్' - ఇహలోకసకలభోగము లనుభవించిన పిమ్మట - 'శ్రద్దధానాః' - శ్రద్ధ లేనియెడల నెట్టి యుత్కృష్టోపాసనమున నైనను గతి కలుగ దని భావము. 'స్థిర' - యజ్ఞాదులచే సాధింపఁబడు స్వర్గాదిభోగములు పునరావృత్తి( పుణ్యక్షయమైనపిమ్మట మరల మనుష్యలోకమునకువచ్చుట అనఁగా

మరల నరజన్మమెత్తుట) కలవి, ఈచరణన్యాసదర్శనపుణ్యము క్షయము లేనిది; కావున దీనిఫలమైన ప్రమథత్వము 'స్థిర' శాశ్వతము. నీవు ఆసులభోపాయముచే ఆ మహాఫలమును పొందుదువుగాక యని హితోపదేశము.

శబ్దాయన్తే మధుర మనిలైః కీచకాః పూర్యమాణాః,
సంసక్తాభి స్త్రిపురవిజయో గీయతే కిన్నరీభిః,
నిర్హ్రాదస్తే మురజఇవ చేత్కన్దరేషు ధ్వనిః స్యాత్
సంగీతార్థో నను పశుపతే స్తత్ర భావీ సమగ్రః. 60.

శబ్దాయన్తఇతి.—హే మేఘ, అనిలైః పూర్యమాణాః, కీచకాః=వేణువిశేషాః + 'వేణవః కీచకా స్తే స్యు ర్యే స్వన న్త్యనిలోద్ధతాః' ఇత్యమరః + 'కీచకో దైత్య భేదే స్యా చ్ఛుష్కవంశే ద్రుమాన్తరే' ఇతి విశ్వః, మధురం = శ్రుతిసుఖం యథా తథా, శబ్దాయన్తే = శబ్దంకుర్వన్తి - స్వనన్తీత్యర్థః * 'శబ్ద వైర కల హాభ్ర కణ్వ మేఘేభ్యః కరణే' ఇతి క్యజ్ - అనేన వంశవాద్యసంపత్తి రుక్తా, సంసక్తాభిః = సంయుక్తాభిః - వంశవాద్యానుషక్తాభి ర్వా - 'సంరక్తాభిః' ఇతిపాఠే సంరక్తకణ్ఠీభి రి త్యర్థః, కిన్నరీభిః=కిన్నర స్త్రీభిః, త్రయాణాం పురాణాం సమాహార స్త్రిపురమ్ * తద్ధితార్థోత్తరపదసమాహారే చ' ఇతి సమాహారసమాసః * పాత్రాదిత్వా న్నపుంసకత్వమ్ - తస్య విజయో గీయతే, కన్దరేషు=దరీషు + 'దరీ తు కన్దరో వా స్త్రీ' ఇత్యమరః, తే=తవ, నిర్హ్రాదః, మురజే=వాద్యభేదే - ధ్వనిరివ - ధ్వనిరివ-మురజధ్వని రవే త్యర్థ, స్యాచ్చేత్ తర్హి, తత్ర = చరణసమీపే, పశుపతేః= నిత్యం సన్నిహితస్య శివస్య - నృత్యత ఇతి శేషః, సంగీతం = సమ్యగ్గీతం + 'సమ్యగ్గీతం తుసంగీతం న్యాయూరమ్భ ప్రసిద్ధకే । తౌర్యాణాం త్రితయే చాపి' ఇతిశబ్దార్ణవే - తదేవార్థః - సంగీతార్థః = సంగీతవస్తు + 'అర్థోఽభిధేయరై వస్తు ప్రయోజన నివృత్తిషు, ఇత్యమరః, సమగ్రః = సంపూర్ణో, భావీనను = భవిష్యతిఖలు * 'భవిష్యతి గమ్యాదయ' ఇతి భవిష్యదర్థే ణినిః.

హేమేఘ=ఓయి మేఘుఁడా, అనిలైః = వాయువులచేత, పూర్యమాణాః = ఊఁదఁబడుచున్నవై, కీచకాః = బొంగు వెదుళ్లు, మధురమ్=ఇంపుగా, శబ్దాయన్తే =నాదముచేయుచున్నవి (ఇందుచేత వేణుపూఁదుటచెప్పఁబడినది); సంసక్తాభిః = భక్తురాండ్రయిన (లేక ఆవేణువాద్యము ననుసరించినవారైన) [సంరక్తాభిః' — అనుపాఠమున మధురకంఠముగలవారయిన యని యర్థము], కిన్నరీభిః=కిన్నరాంగనలచేత (కిన్నరులు దేవయోని విశేషములు-వారితల గుఱ్ఱముతలగాను శరీరము నరశరీరముగాను ఉండును), త్రిపురవిజయః - త్రిపుర = మూఁడుపురముల మొత్త

నుయొక్క - విజయః = గెలుపు (అనఁగా శివుఁడు అసురులయొక్క మూఁడు పురములను గెలిచినకథ), గీయతే = పాడఁబడుచున్నది, కన్దరేషు = గుహాలయందు, తే = నీయొక్క, నిర్హ్రాదః = గంభీరధ్వని, మురజేష్వివ = మద్దెలయందలి (ధ్వని) వలె, స్యాత్ చేత్ = అగునేని, తత్ర = అచట (శివచరణన్యాససమీపమందు), పశుపతేః = శివునికి (అచట నిత్యసన్నిహితుఁడై నృత్యముచేయుచుండువానికి), సంగీతార్థః — సంగీత = నృత్య గీత వాద్యములయొక్క - అర్థః = వస్తువు, సమగ్రః = సంపూర్ణము, భావీ ననుఁ = అగును గదా.

తా. — ఆచరణన్యాససమీపమునందు నిత్య సన్నిహితుఁడైన పరమేశ్వరుఁడు నృత్యముచేయుసమయమందు, సంగీతముయొక్క మూఁడంగములైన నృత్యగీత వాద్యములలో నృత్య మొకటి సిద్ధమై యుండుటయు-త్రిపురసంహారకథను పాడెడు కిన్నరాంగనలపాటలు రెండవయంగమైన గీతమగుటయు - మూఁడవయంగమైన వాద్యము విషయమున గాలికి శబ్దించు బొంగువెదుళ్ల నాదములు గీతమునకు ప్రధానాంగమైన వేణువాద్యముగా ఉండఁగా - ఆమూఁడవయంగమందే చేరినదియు నృత్యమున కత్యంతావశ్యకము నైన మృదంగవాద్యముగా నీయుఱుములు గుహలనుండి మృదంగములనుండియుంబోలె శబ్దించిన, శివునికి సంగీతవస్తువు సంపూర్ణమగును. అట్లు శివసేవ చేసికొని ధన్యుఁడ వగుము.

వ. — 'అనిలైః కీచకాః' — అనుబహువచనములచే పలువురుబజంత్రీలు పిల్లనగ్రోవులు ముఖవీణలు ఊఁదుచున్నట్లు అని ధ్వని. కీచకగ్రహణముచే వంశవాద్యము సూచింపఁబడినదని మల్లినాథపాదులవారు టీకలో వ్రాసియున్నారు. 'అనిలాః కీచకాన్ ధమన్తి' 'వాయువులు బొంగువెదుళ్లను ఊఁదుచున్నవి' అనక-'అనిలైః పూర్యమాణాః కీచకాః శబ్దాయన్తే' — 'వాయువులచే పూరింపఁబడుచున్నవై బొంగువెదుళ్లు శబ్దించుచున్నవి' అనుటచేత కిన్నరీగానమునకై శ్రుత్యర్థమై తిత్తియూఁదుట సూచింపఁబడుచున్న దని నేను దలంచుచున్నాను. అనఁగా - అట్లు శివుఁడు ఆట-కిన్నరులు పాట-వాయువులు తిత్తి-మేఘము మద్దెలయనుగా, శివతాండవరంగము సాంగమగును. 'వేణవః' అనక, 'కీచకాః' అనుట బొంగులేనివెదుళ్లలో శబ్దముపుట్టదు గనుకను, బొంగువెదుళ్లలోపుట్టునుగనుకను. 'సంసక్తాభిః కిన్నరీభిః' అనుచో 'సంసక్తాభిః' అను పదమునకు 'కిన్నరాంగనలు పలువురు కలసి ఏకనాదముగా ఏకకాలమందు త్రిపురదాహ మనుపాటను పాడుచున్నా' రనునది యభిప్రాయముగా నీతెలుఁగు వివరణము వ్రాయ నేను గ్రహించుచున్నాను. 'త్రిపురవిజయః' - చేయునది శివసేవగావున త్రిపురవిజయముం బాడుట శివప్రసాదార్థమును పావనమును. 'కిన్నరీభిః' - స్త్రీలను చెప్పుట కంఠస్వరస్యాతిశయముకొఱకు; మేఘుఁడును చెవులకిందువుగా వినవచ్చు నని యా

భావము. 'కిన్నరాః త్రిపురవిజయం గాయన్తి'-అనక, 'త్రిపురవిజయో గీయతే' అనుటచే త్రిపురవిజయమునకు ప్రాధాన్యమును తచ్ఛ్రవణముచే మేఘునికిఁ గలుగు పుణ్యాతిశయమును స్ఫురించుచున్నవి. 'గీయతే' - పాట యగుటచే శ్రుతిప్రియము; 'కన్దరేషు'-అనుట గుహలలో ప్రతిధ్వను లైనయెడల కాలక్రియామానము తప్పకుండ మురలమురల మద్దెళ వాయించినట్లుండు నని. మేఘధ్వనిమాత్రమైన మద్దెలమీఁది మొదటి వాదనగా నుండును. 'నిర్హ్రాదః' - ఈశబ్దము సొంపయిననాదవుష్టిని చెప్పునట్టిది. 'సమగ్ర'-ఎవఁడు లేక సమగ్రము గావో ఎవఁడు వచ్చి సమగ్రము చేసినాఁడో వాని యందు (స్వయంపాక మిచ్చినమహారాజుతో విస్తరి యిచ్చినమహారాజుపుణ్యాన భోజనముచేసితి నన్నసామెతగా) ఎక్కువ ప్రీతియు ప్రసాదమును కలుగును-కావున నీవును శివునిం గడపట నుపచరించి ఆవాయుకిన్నరాదులకన్న ఎక్కువగా శివప్రసాదమును పొందుదువు గాక యని భావము.

ప్రాలేయాద్రే రుపతట మతిక్రమ్య తాం స్తాన్ విశేషాన్
హంసద్వారం భృగుపతియశోవర్త్మ యత్ క్రౌఞ్చరన్ధ్రమ్
తే నోదీచీం దిశ మనుసరే స్తిర్యగాయామశోభీ
శ్యామః పాదో జలినియమనాభ్యుద్యతస్యేవ విష్ణోః. 61

ప్రాలేయేతి - ప్రాలేయాద్రేః = హిమాద్రేః, ఉపతటం = తటసమీపే * 'అవ్యయం విభక్తి' ఇత్యాదినా సమీపార్థేఽవ్యయీభావః, తాం స్తాన్ * వీప్సాయాం ద్విరుక్తిః, విశేషాన్ = ద్రష్టవ్యార్థాన్ + 'విశేషోఽవయవే ద్రవ్యే ద్రష్టవ్యోత్తమవస్తుని' ఇతిశబ్దార్ణవే, అతిక్రమ్య=ఆదరేణ దర్శందర్శ మతీత్యే త్యర్థః. అనుసరే రిత్యనాగతేన సంబన్ధః, హంసానాం ద్వారం=హంసద్వారం - మానసప్రస్థాయినో హంసాః క్రౌఞ్చరన్ధ్రేణ చరన్తీత్యాగమః, భృగుపతేః = జామదగ్న్యస్య-యశోవర్త్మ = యశఃప్రవృత్తికారణ మిత్యర్థః, యత్ క్రౌఞ్చ స్యాద్రే రన్ధ్ర మస్తి తేనక్రౌఞ్చబిలేన,బలేః = దైత్యస్య - నియమనే = బన్ధనే - అభ్యుద్యతస్య = ప్రవృత్తస్య, విష్ణోః = వ్యాపకస్య త్రివిక్రమస్య, శ్యామః = కృష్ణవర్ణః, పాదఇవ, తిర్యగాయామేన = శీఘ్రప్రవేశనార్థం తిరశ్చీనదైర్ఘ్యేణ - శోభత ఇతి తథావిధః సన్, ఉదీచీమ్ = ఉత్తరాం, దిశమ్, అనుసరేః = అనుగచ్ఛ. పురాకిల భగవతో దేవాద్ధూర్జటే ర్ధనురుపనిషద మధీయానేన భృగునన్దనేన స్కన్దస్య స్పర్థయా క్రౌఞ్చశిఖరిణి మతినిశితశిలీముఖేన హేలయా మృత్పిణ్డభేదం భిత్త్వా తత ఏవ క్రౌఞ్చక్రోడాదేవ సద్యఃసముజ్జృమ్భితే కస్మిన్నపి యశఃక్షీరనిధా నిఖిల మపి జగజ్జాల మాప్లావిత మితి కథా శ్రూయతే.

# ప్రథమః సర్గః

ప్రాలేయాద్రేః=మంచుకొండయొక్క, ఉపతటమ్=తటిసమీపమున, తాంస్తాన్ విశేషాన్ = చూడఁదగినయాయాయుత్తమవస్తువులను, అతిక్రమ్య=ఆదరముతో చూచుచు దాఁటి, హంసద్వారమ్ = హంసలయొక్క దారియు (హంసలు మానసమునకు క్రౌంచరంధ్రముగుండ పోవు నని ప్రసిద్ధి), భృగు...వర్త్మ—భృగుపతి = పరశురామునియొక్క - యశః = కీర్తియొక్క - వర్త్మ = మార్గమును - (యశః ప్రవృత్తికారణ మని యర్థము) అయిన, యత్ క్రౌఞ్చరన్ధ్రమ్=క్రౌంచాద్రియొక్క రంధ్ర మేది కలదో, తేన = దానిగుండ, బలి...తస్య—బలి=బలిచక్రవర్తియొక్క నియమన = బంధించుటయందు - అభ్యుద్యతస్య = ప్రవర్తించినవాఁడైన - విష్ణోః= వ్యాపకుఁడయినత్రివిక్రమమూర్తియొక్క, శ్యామః = నల్లనిదైన, పాద ఇవ=అడుగువలె, తిర్య...శోభీ—తిర్యక్ = కడువునేలపైవు ఉండునట్టి - ఆయామ=పొడవుచేత - శోభీ=శోభించువాఁడవై - (నేలకు సమదూరముగా దీర్ఘముగా సాఁగి), ఉదీచీం దిశమ్=ఉత్తరదిక్కునుగూర్చి, అనుసరేః=పొమ్ము.

తా.—ఆమంచుకొండదరిదగ్గఱ నానావిశేషములను చక్కఁగా చూచుచుఁ గడచి, జామదగ్న్యకీర్తికారణమును హంసమార్గమును అయిన క్రౌంచరంధ్రముగుండ ఉత్తరదిక్కునకుఁ బొమ్ము. ఆద్వారగమనమున దీర్ఘముగా తిరశ్చీనముగా సాఁగిన నీవు బలిబంధనార్థము ప్రవృత్తుఁడైన కపటవామనునినల్లనిపాదము స్వర్గముపై నుంచుటకై యెత్తఁబడినట్టిది ఎట్లుండెనో అట్లు శోభిల్లుచుందువు.

వి.—'తాంస్తాన్ విశేషాన్' - చూడఁదగినవినోదములు అందు పెక్కులు కలవు అని భావము; (అవి ఈగ్రంథమున విస్తరింపఁబడలేదు. కుమారసంభవ ప్రథమసర్గలో కొంతవఱకు వర్ణింపఁబడినవి). 'హంసద్వారమ్'—ఆరంధ్రముగుండ హంసలు సంచరించుట తత్కర్తయయినపరశురామునికీర్తి వ్యాపించుటవలె నుండు నని భావము. మఱియు హంసలు అందులోనికి పోవుటయే ఆరంధ్రము ఎక్కడనున్నదో కనిపట్టుటకు గుఱుతని మార్గకథనము. 'ఆకైలాసాత్ సంపత్స్యన్తే రాజహంసాః సహాయాః'—అని పూర్వమే చెప్పియుండలేదా? హంసలతోఁగూడనే పోవుచున్నచో ఆరంధ్రము నీకును తెలియును, నీవును దానిగుండ పోవచ్చును. 'యశః' - మఱియెవరును చేయలేనియాపని భృగుపతి చేసినాఁడుగాన ఆయనకు యశస్సు. 'పాదః' - ఆసమీపమందే మేరుశిఖరమందున్న స్వర్గముపై నుంచుటకు చాఁచినపాద మని యభిప్రాయము - ఆపాదమవే యనునట్లుందువు - నీకు వందనీయసాదృశ్యము లభించును. 'విష్ణోః' - వ్యాపకుఁ డనుటచే పెఱిఁగి తన యంగలచే లోకము నాక్రమించినవాఁ డని యభిప్రాయము.

గత్వా చోర్ధ్వం దశముఖభుజోచ్ఛ్వాసితప్రస్థసంధేః
కైలాసస్య త్రిదశవనితాదర్పణస్యాతిథిః స్యాః ;
శృఙ్గోచ్ఛ్రాయైః కుముదవిశదైర్యో వితత్య స్థితః ఖం
రాశీభూతః ప్రతిదినమివ త్ర్యమ్బకస్యాట్టహాసః. 62

గత్వేతి.—క్రౌఞ్చబిలనిర్గమానన్తర మూర్ధ్వంచ గత్వా, దశముఖస్య = రావణస్య - భుజైః = బాహుభిః - ఉచ్ఛ్వాసితాః = విశ్లేషితాః-ప్రస్థానాం = సానూనాం-సంధయో యస్యతస్య - ఏతేన నయనకౌతుకసద్భావ ఉక్తః, త్రిర్దశ పరిమాణ మేషా మస్తీతి త్రిదశాః *'సంఖ్యయాఽవ్యయ' ఇత్యాదినా బహువ్రీహిః *'బహువ్రీహౌ సంఖ్యేయే డచ్' ఇత్యాదినా సమాసాన్తో డ జితి క్షీరస్వామీ త్రిదశానాం (దేవానాం)-వనితాః-తాసాం దర్పణస్య, కైలాసస్య స్ఫటికత్వా ద్రాజతత్వా ద్వా బిమ్బగ్రాహిత్వే నైవ ముక్తమ్, కైలాసస్యాతిథిః స్యాః, యః = కైలాసః, కుముదవత్ విశదైః = నిర్మలైః, శృఙ్గాణామ్-ఉచ్ఛ్రాయైః = ఔన్నత్యైః, ఖమ్ = ఆకాశం, వితత్య = వ్యాప్య, ప్రతిదినం = దినేదినే, రాశీభూతః, త్ర్యమ్బకస్య = త్రిలోచనస్య, అట్టహాసః = అతిహాస ఇవ - స్థితః + 'అట్టా వతిశయ క్షౌమౌ' ఇతి యాదవః. ధావళ్యా ద్ధాసత్వే నోత్ప్రేక్షా-హాసాదీనాం ధావళ్యం కవిసమయ సిద్ధమ్.

(క్రౌంచరంధ్రమునుండి వెలువడినపిమ్మట), ఊర్ధ్వం చ గత్వా=ఊర్ధ్వముగా కూడను పోయి, దశ...సన్ధేః—దశముఖ = రావణునియొక్క - భుజ = బాహువుల చేత-ఉచ్ఛ్వాసిత = సడలింపఁబడిన - ప్రస్థ=సానువులయొక్క - సన్ధేః = అదుకులు కలదైన - (చూచుటకు వేడుకగా నుండు ననుట), త్రిద...ణస్య—త్రిదశవనితా = దేవస్త్రీలయొక్క - దర్పణస్య = అద్దమయిన (స్ఫటికమయ మనుపక్షమందును-రజతమయ మనుపక్షమందును-రెండుపక్షములందును ప్రతిబింబము కలుగుటచే దర్పణమని వర్ణన), కైలాసస్య = కైలాసమునకు, అతిథిః = విందవు, స్యాః = అగుము, యః = ఏకైలాసము, కుముదవిశదైః - కుముద = తెల్లగలువలవలె - విశదైః = తెల్లనివైన, శృఙ్గోచ్ఛ్రాయైః - శృఙ్గ = శిఖరములయొక్క - ఉచ్ఛ్రాయైః = పొడవులచేత, ఖమ్ = ఆకాశమును, వితత్య = వ్యాపించి, ప్రతిదినమ్ = దినదినమును, రాశీభూతః = పోఁగయినట్టి, త్ర్యమ్బకస్య = త్రిలోచనునియొక్క, అట్టహాస ఇవ బొబ్బనవ్వోయనునట్లుగా, స్థితః = ఉన్నదో (ధావళ్యముచేత నవ్వుగా నుత్ప్రేక్షించుట - హాసాదులకు ధావళ్యము కవిసమయసిద్ధము).

తా.—క్రౌంచరంధ్రమునుండి వెలువడి నీవు ఊర్ధ్వముగా కైలాసమునకు పొమ్ము. దానిని పూర్వము దశవదనుఁడు చేతులతో నెత్తి దానికీళ్లు సడలించిన గుర్తులు ఇప్పటికిని దానియందు కౌతుకపూరణ మొసంగుచుండును. మఱియు నచటికి శివసేవార్థము వచ్చు దేవాంగనలముఖముల నాశైలము (స్ఫాటిక మగుటచేఁగాని రాజత మగుటచేఁగాని) ప్రతిఫలించుచు వారి కొకయద్దమువలె నుండును. మఱియు నాకొండయొక్క ఉన్నతశిఖరములు దినదినము పేరినశివుని యట్టహాసరాసులో యన తెల్లగా ఆకాశమున వ్యాపించియుండును.

వ.—'భుజ' - రావణునిభుజబలాతిశయము తోఁచి ఆశ్చర్యము కలిగించును; 'ఉచ్ఛ్వాసిత'-అప్పుడు దశవదనుఁడు సడలించినసంధులు ఇప్పటికిని అట్లే సడలియే యున్నవి. 'త్రిదశ' - ఇతరుల కగమ్యము. 'త్రిదశవనితా'—వారు గౌరీశంకరసన్నిధిని ప్రవేశించునపుడు తమవస్త్రాలంకారాదులు ఉండవలసిన ట్లున్నవో లేదో—'దర్పణస్య'—కైలాసనగముయొక్క రాలయందు చూచుకొని సవరించుకొని మఱి సన్నిధిం బ్రవేశింతు రని భావము. అది యొక మహావినోదము. అట్టివారి నెల్ల నట్టివ్యాపారములం దుండఁగాఁ జూడవచ్చును. 'అతిథిః' - మేఘము కొండలలో [1]మేయు ననుట ప్రసిద్ధము, నిన్ను కైలాసుఁడు సత్కరించును, క్రొత్త యని నీవు శంకింపవలదు. 'త్ర్యమ్బకస్య'—శివుఁడు స్వయము తెల్లనివాఁడు-అటుపైని విభూతి మఱియు తెలుపు-అట్టివానిహాసము పూర్వోక్త భావశ్యసాన్నిధ్యముచేత సామాన్యహాసము కన్న తెల్లగానుండును-అట్టహాసమయిన మఱి చెప్పవలసినదేమి? అట్టి యట్టహాసములరాశి యనుటచే నత్యంతమైన యౌపమ్యసంపద చెప్పఁబడ్డది. 'ప్రతిదినమ్'—ఆదిపురుషునికి దినములలెక్క యెక్కడిది! కావున లెక్కలేనిదినములరాశి కనుకనే 'ఉచ్ఛ్రాయైః ఖం వితత్య'-పాడవులచే ఆకాశము నాక్రమించినది. 'ఉచ్ఛ్రాయైః'-బహువచనముచేత ఆరాశికిని పెక్కుశిఖరములని తద్బాహుళ్యము చెప్పఁబడినది. ఇన్నివినోదములచే ఆకైలాసము అవశ్యసేవ్యమును పావనమును అని భావము; మార్గప్రదర్శనమును చేయఁబడినది.

ఉత్పశ్యామి త్వయి తటగతే స్నిగ్ధభిన్నాఞ్జనాభే
సద్యఃకృత్తద్విరదదరదనచ్ఛేదగౌరస్య తస్య
శోభా మద్రేః స్తిమితనయనప్రేక్షణీయాం భవిత్రీ
మంసన్యస్తే సతి హలభృతో మేచకే వాససీవ. 63.

---

[1] నటనపర కేకిపాత్ర । స్ఫుటయవనిక లన మొగిల్లు పొలిచెన్ భూభృత్తటుల నవి యూకు దినుచిటు । పొట్టరవము చెలంగెఁ దాళములచప్పుడునై. ఆము.

ఉత్పశ్యామీతి.—స్నిగ్ధం = మసృణం-భిన్నం = మర్దితంచ - యదఞ్జనం = కజ్జలం-తస్యాభే వాభా యస్య తస్మిం స్త్వయి, తటగతే=సానుగతే సతి, సద్యః కృత్తస్య = భిన్నస్య - ద్విరదరదనస్య = గజదన్తస్య - ఛేదవత్-గౌరస్య = ధవళస్య, తస్యాద్రేః = కైలాసస్య, మేచకే = శ్యామలే+'కృష్ణే నీ లాసిత శ్యామకాల శ్యామల మేచకా' ఇత్యమరః, వాసని = వస్త్రే, అంసన్యస్తే సతి, హలభృతో = బలభద్ర-స్యేవ, స్తిమితాభ్యాం నయనాభ్యాం ప్రేక్షణీయాం శోభాం, భవిత్రీం=భావినీమ్, ఉత్పశ్యామి, శోభా భవిష్య తీతి తర్కయామీ త్యర్థః. ప్రాతీ పూర్ణోపమాలంకారః.

స్నిగ్ధ…నాభే - స్నిగ్ధ = నున్నని - భిన్న = నూఱcబడిన - అఞ్జన = కాటుకయొక్క - ఆభే = కాంతివంటి కాంతిగలవాcడవైన, త్వయి = నీవు, తటగతే = సానువును పొందియుండcగా, సద్యః…రస్య - సద్యః = అప్పుడే - కృత్త = కోయcబడిన - ద్విరద = ఏనుcగుయొక్క - రదన = దంతముయొక్క - ఛేద = కోcతవలె - గౌరస్య = తెల్లనిదైన, తస్య = ఆకైలాసమునకు, మేచకే=నల్లని, వాససి=వస్త్రము, అంస న్యస్తే సతి = బుజమున నుంపcబడినది అగుచుండcగా (బుజమున నుంపcబడcగా - అనcగా - బుజమున నుంపcబడిన నల్లవస్త్రముగల), హలభృత ఇవ = బలభద్రునిసొంపునుబోలిన, స్తిమి…యామ్— స్తిమిత = నిశ్చలమైన (ఱెప్పపాటులేని) - నయన = కన్నులతో - ప్రేక్షణీయామ్ = చూడcదగినదైన, శోభామ్ = సొంపును, భవిత్రీమ్ = కాcగలదానిని, (అట్టిసొంపు గలుగునని), ఉత్పశ్యామి = తలంచెదను.

తా.—మిగులనల్లనినీవు సానువునc జేరcగా అతిధవళమైన యాకైలాసమునకు నల్లనియుత్తరీయమును బుజమునcదాల్చిన బలరామునిశోభ కలుగు నని తలంచెదను.

వి.—'తటగతే'—తటమును చెప్పుట అంసమువంటిదని ఉపమాపుష్ట్యర్థము. 'స్నిగ్ధ'-నైల్యాతిశయముకై. 'భిన్న'-కాటుకలో అప్పుడే చీలినచోట దుమ్ము మొదలై నవి లేమిచే నైల్యాతిశయము. 'సద్యఃకృత్త'-అప్పుడే కోసినకోcతలోమాపు ము నొార్వమియు అత్యంతదర్శనీయతయు భావము. 'స్తిమితనయన'-ఱెప్పపాటువలని విఘ్నలేక అప్పుడే కొండసానువునc జేరినట్లే, అప్పుడే తెచ్చి బుజముపై నుంపcబడిన నల్లవస్త్ర మని భావము, ఔపమ్యసౌభాగ్యమునకై యిట్లు చెప్పుట.

హిత్వా తస్మిన్ భుజగవలయం శంభునా దత్తహస్తా
క్రీడాశైలే యదిచ విహరే త్పాదచారేణ గౌరీ

భఙ్గీభక్త్యా విరచితవపుః స్తమ్భితాన్తర్జలౌఘః
సోపానత్వం కురు మణితటారోహణాయాగ్రయాయీ. 64.

హిత్వేతి.—తస్మిన్ క్రీడాశైలే = కైలాసే + 'కైలాసః కనకాద్రిశ్చ మన్దరో గన్ధమాదనః । క్రీడార్థం నిర్మితాః శంభో ర్దేవైః క్రీడాద్రయోఽభవన్' ఇతి శంభురహస్యే, శంభునా = శివేన, భుజగ ఏవ - వలయః = కఙ్కణం - తం, హిత్వా = గౌర్యా భీరుత్వాత్ త్యక్త్వా, దత్తహస్తా = దత్తహస్తావలమ్బనా సతీ, గౌరీ, పాదచారేణ, విహరేత్ = విచరేత్, యది = తర్హి, అగ్రయాయీ = పురోగతః, తథా స్తమ్భితః = ఘనీభావం ప్రాపితః - అన్తర్జలస్య - ఓఘః = ప్రవాహో - యస్య స తథాభూత స్సన్, భఙ్గీనాం = పర్వణాం - భక్త్యా = రచనయా, విరచితవపుః = కల్పితశరీరః సన్, మణీనాం తటం మణితటం తస్యారోహణాయ, సోపానత్వం కురు = సోపానభావం భజేత్యర్థః.

తస్మిన్ క్రీడాశైలే = ఆక్రీడాశైలమందు, శమ్భునా = శివునిచేత, భుజగ వలయమ్ - భుజగ = పామనెడు - వలయమ్ = కంకణమును, హిత్వా = (గౌరి భయపడునని) తీసివేసి, దత్తహస్తా - దత్త = ఈఁబడిన - హస్తా = కైదండకలదై, గౌరి = ఉమ, పాదచారేణ = కాలినడకను, విహరేద్యది = సంచరించునెడల, (నీవు), అగ్రయాయీ = ముందుఁబోవువాఁడవును, స్తమ్భి...ఔఘః— స్తమ్భిత = ఘనీభావము పొందింపఁబడిన (గడ్డకట్టునట్లుచేయంబడిన) - అన్తః = లోపలి - జల = నీళ్లయొక్క - ఓఘః = ప్రవాహముగలవాఁడవును, భఙ్గీభక్త్యా - భఙ్గీ = పర్వములయొక్క - భక్త్యా = రచనగా, విరచితవపుః—విరచిత = కల్పింపఁబడిన - వపుః = దేహముగలవాఁడవును, (అయి), మణి...ణాయ, మణి = రత్నములయొక్క - తట = సానువుయొక్క - ఆరోహణాయ = ఎక్కుటకొఱకు, సోపానత్వం - మెట్లభావమును, కురు = చేయుము (పొందుము).

తా.—కైలాస మను నాక్రీడాశైలమందు నీవు పోయియున్నప్పుడు ఒకవేళ గౌరి శివునితోఁగూడ పాదచారమున విహరించుచున్నయెడల నీవు వారికి ముందు మిగిలి నీనీళ్లను గట్టిచేసికొని మెట్టుమెట్టుగా మడఁగినవాఁడవై ఆమెకు రత్నసానువు లెక్కుటకు మెట్లవరుసవై సేవింపుము.

వి.—'దత్తహస్తా'—గౌరియొక్క స్వాధీనపతికాత్వము సూచింపఁబడినది. 'భుజగవలయం హిత్వా'-ఆమెకు భయము కాకుండుటకైన శివునియుపచారనైపుణి సూచితమైనది. 'భఙ్గీ' - మెట్లగుటకు. 'స్తమ్భిత' - కాలు దిగఁబడకుండుటకు. అట్టి తత్పాదసేవావసరము నీకు దొరకును - దానిచే కృతార్థుఁడ వగుము.

త త్రావశ్యం వలయకులిశో ద్ఘట్టనోద్గీర్ణతోయం
నేష్యన్తి త్వాం సురయువతయో యన్త్రధారాగృహత్వమ్,
తాభ్యో మోక్ష స్తవ యది సఖే ఘర్మలబ్ధస్య న స్యాత్,
క్రీడాలోలాః శ్రవణపరుషై ర్గర్జితై ర్భాయయే స్తాః. 65.

తత్రేతి.—తత్ర = కైలాసే, అవశ్యం = సర్వథా, సురయువతయః = దేవ ప్రమదాః, వలయకులిశాని = కఙ్కణకోటయః- శతకోటివాచినా కులిశశబ్దేన కోటి మాత్రం లక్ష్యతే-తైః-ఉద్ఘట్టనాని=ప్రహారాః- తైఃఉద్గీర్ణమ్ = ఉత్సృష్టం - తోయం యేన తం-త్వాం, యన్త్రేషు ధారా యన్త్రధారా స్తాసాం గృహత్వం = కృత్రిమ ధారాగృహత్వం, నేష్యన్తి = ప్రాపయిష్యన్తి, హేసఖే = మిత్ర, ఘర్మే = నిదాఘే - లబ్ధస్య - ఘర్మలబ్ధత్వం చాస్య దేవభూమిషు సర్వదా సర్వర్తుసమాహారాత్ ప్రాథమికమేఘత్వా ద్వా- యత ఉక్తమ్ 'ఆషాఢస్య ప్రథమ' ఇతి, తవ తాభ్యః= సురయువతిభ్యో, మోక్షో న స్యా ద్యది తదా, క్రీడాలోలాః = క్రీడా సక్తాః - ప్రమత్తా ఇ త్యర్థః, తాః = సురయువతీః, శ్రవణపరుషైః = కర్ణకటుభిః, గర్జితైః కరజైః, భాయయేః = త్రాసయేః * అత్ర హేతుభయాభావా దాత్మనేపదం వుగాగమశ్చ న.

తత్ర = కైలాసమందు, అవశ్యమ్ = సర్వథా, సురయువతయః = దేవాంగనలు, వల ... తోయమ్-వలయ=మురుగులయొక్క-కులిశ = కొనలచేత (నూఱుంచులవాలుపే రయినకులిశశబ్దము లక్షణచే అంచునుమాత్రము తెలుపుచున్నది)-ఉద్ఘట్టన=కొట్టుటచేత - ఉద్గీర్ణ=వెలువడిన - తోయమ్ = నీళ్లుగలవాఁడవైన, త్వామ్ = నిన్ను, యన్త్ర...హత్వమ్ - యన్త్ర = యంత్రములయందైన - ధారా = ధారలయొక్క - గృహత్వమ్=ఇంటిభావమును, నేష్యన్తి = పొందింతురు - [కృత్రిమ ధారాగృహముగాఁ జేయుదురు], హేసఖే = ఓయిచెలికాఁడా, ఘర్మలబ్ధస్య - ఘర్మ = వేసవియందు - లబ్ధస్య = పొందఁబడిన (దొరకిన), తవ=నీకు, తాభ్యః = ఆయమరాంగనలవలననుండి, మోక్షః = విడుదల, న స్యా ద్యది = కలుగదేని, క్రీడాలోలాః=ఆటపరాకుననున్న, తాః = ఆ స్త్రీలను, శ్రవణపరుషైః - శ్రవణ = చెవులకు - పరుషైః=కటువులయిన, గర్జితైః = ఉఱుములతో, భాయయేః=భయ పెట్టుము.

తా.—అచట వేసవియందు దొరకిననిన్ను సురాంగనలు పోనీయక పట్టుకొని ముకంకణ[illegible]లయందలి వజ్రములయంచులతో గీచి నీలోపలినీరు ధారలుధారలు

గా వెలువడునట్లు చేసి నిన్ను కృత్రిమధారాగృహముగాఁ జేయుదురు. వేసవి యందు అత్యంతసుఖప్రదుని నిన్ను వారు ఒకపట్టున వదలరేని వారిని ఆటపరాకున నున్నప్పుడు ఆకస్మికముగా చెవికి కటువుగా బడబడ ఉఱిమి భయపెట్టి ఆభయములో వారు ఇతికర్తవ్యతామూఢలై యుండఁగా తప్పించుకొని పొమ్ము.

వ.—'కులిశ'—కులిశము మేఘమును భేదించి వర్షించునట్లు చేయునది. అట్టి సాధనము స్వల్పముగా వీరికిని కలదు, ఎట్లనిన - కంకణములందుఁ దాపినవజ్రమే తత్స్థానీయము. పెద్దకులిశమయిన నో మేఘమును చీల్చి వాన నెల్ల పోఁజేయును, వీరి సాధనములు వలయకులిశములు చిన్నవిగావున చిన్నచిన్నరంధ్రములు మాత్రమే చేసి మేఘునికి ధారాగృహప్రయోజనమును తత్సౌందర్యమును కలిగించును. 'ఉద్గీర్ణ'—పైవైపు బెజ్జముపడిన జలపూర్ణమయినతోలుసంచినుండి పైకే చిమ్ముమని సన్ననిజలధార లేచినట్లు - అని యభిప్రాయము. 'యువతయః'-బహువచనముచే పలువురు చుట్టుకొని పలుతావుల బెజ్జములు చేసి పెక్కుధారలు పైకి దుముకునట్లు చేసి ఆదర్శనీయతకును చలువకును ఆనందింతురు అని భావము. 'వజ్రం న కించి దపి ధారయితవ్య మేకే పుత్రార్థినీభి రబలాభి రుశన్తి తజ్జ్ఞాః'-అని వరాహమిహిరాచార్యుఁడు చెప్పియున్నాఁడు; కావున స్త్రీలకు కంకణములయందు వజ్రముం డుండవే - పుత్త్రులం బడయఁగోరు స్త్రీలు వజ్రము ధరింపఁగూడదుగదా - యనిన, 'సుర' - వారు దేవాంగనలు-వారికిభర్తలం బడయుకోరికయే గాని పుత్త్రులం బడయు కోరిక లేదు, మఱియు నట్టివిలాసములును క్రీడలును అదిత్యాదులగు పెద్దల కుండవు గాన 'యువతయః' అని జవరాండ్రను చెప్పినాఁడు. 'అవశ్యమ్' - అనుట ఘర్మాతిశయమును క్రీడాపరాయణత్వమును తెలుపుచున్నది. మేఘుఁడు అట్టితంట్రాలలోఁ బడనేల దారి తొలఁగి పోరాదా యనిన-అట్లు వారిచేతిలోఁ బడుట మేఘునికి మిగుల ఆహ్లాదకరమయినబంధనముగా నుండును గావున ఆయానందమును అనుభవింపు మని యక్షునియుపదేశము. అటయిన మఱి అనుభవించుచు నచటనే యుండ రాదా యనిన - సందేశ మేమి కాను? కావున 'మోక్షః' - స్వార్థమైన పిమ్మట మిత్రార్థమై వారినుండి తప్పించుకొని పోవలసినది అని భావము. 'ఘర్మ' -వేసవి యగుటచే ఎంతసేపటికిని వదల రని యభిప్రాయము. 'క్రీడాలోలాః' - పరాకుగా నున్నప్పుడు బడబడమనిన వదలివేయుదురు. సంగతి యెఱిఁగి మరల పట్టుకొనునంత లోపల తప్పించుకొని పోవచ్చు నని యభిప్రాయము.

హేమాంభోజప్రసవి సలిలం మానస స్యాదదానః,
కుర్వ న్కామం క్షణముఖపటప్రీతి మైరావణస్య,

ధున్వన్కల్పద్రుమకిసలయా న్యంశుకాని స్వవాతై,
ర్నానాచేష్టైర్జలద లలితై ర్నిర్విశే స్తం నగేన్ద్రమ్. 66.

హేమేతి—హేజలద, హేమామ్భోజానాం - ప్రసవి = జనకం * 'జిదృక్షి'- ఇత్యాదినేనిప్రత్యయః, మానసస్య సరసః, సలిలమ్ = ఉదకమ్, ఆదదానః = పిబన్నిత్యర్థః, తథా, ఐరావణస్య = ఇన్ద్రగజస్య - కామచారిత్వా ద్వా శివసేవార్థమిన్ద్రాగమనాద్వా సమాగత స్యేతి భావః, క్షణే=జలాదానకాలే - ముఖే పటేన యా ప్రీతి స్తాం, కుర్వన్, తథా, కల్పద్రుమాణాం - కిసలయాని = పల్లవభూతాని, అంశుకాని = సూక్ష్మవస్త్రాణి + 'అంశుకం వస్త్రమాత్రే స్యా త్పరిధానోత్తరీయయోః। సూక్ష్మవస్త్రే నాతు దీప్తా' ఇతి శబ్దార్ణవే, స్వవాతైః=మేఘవాతైః, ధున్వన్, నానా = బహువిధాః-చేష్టాః = తోయపానాదయో-యేషు తైః, లలితైః =క్రీడితైః+ 'నాభావభేదే స్త్రీనృత్యే లలితం త్రిషు సున్దరే। అస్త్రియాం ప్రమదాగారే క్రీడితే జాతపల్లవే' ఇతి శబ్దార్ణవే, తం నగేన్ద్రం=కైలాసం, కామం = యథేష్టం, నిర్విశేః = సముపభుఙ్క్ష్వ ÷ 'నిర్వేశో భృతి భోగయోః' ఇత్యమరః; యథేచ్ఛవిహారో మిత్రగృహేషు మైత్ర్యాః ఫలమ్, సహజమిత్రం చ తే కైలాసః †'మేఘపర్వతయో రబ్జసూర్యయో రబ్ధిచన్ద్రయోః।శిఖిజీమూతయో ర్దృష్టిరమ్యయో ర్మిత్రతా స్వయ' మితి దర్శనా దితి భావః.

హేజలద = ఓమేఘుఁడా, హేమా...సవి—హేమ = బంగారపు - అమ్భోజ = తామరలయొక్క - ప్రసవి=జనకమయిన (సలిలమునకు విశేషణము), మానసస్య = మానససరస్సుయొక్క, సలిలమ్ = నీటిని, ఆదదానః = గ్రహించుచు (త్రాగుచు), ఐరావణ్య = ఇంద్రగజమునకు (కామచారి యగుటచేఁ గాని శివసేవార్థము ఇంద్రునిరాకచేఁ గాని వచ్చినట్టిది యని యభిప్రాయము), క్షణ... ప్రీతిమ్-క్షణ = మేఘుఁడు మానసజలమును గ్రోలునిముసమున - ముఖపట = ముఖవస్త్రముచే నయిన - ప్రీతిమ్ = సంతుష్టిని, కుర్వన్ = చేయుచు, కల్ప...యాని—కల్పద్రుమ = కల్పవృక్షముయొక్క-కిసలయాని = చిగుళ్లయిన, అంశుకాని = వలిపవస్త్రములను, స్వవాతైః = నీగాలిచేత, ధున్వన్ = కదలించుచు, నానాచేష్టైః—నానా = అనేకములయిన-చేష్టైః = తోయపానాదిచేష్టలుగల, లలితైః = క్రీడితములచేత, తం నగేన్ద్రమ్=ఆ కొండను, కామమ్ = యథేచ్ఛముగా, నిర్విశేః =భోగింపుము.

తా.—ఆకొండయందు నీవు నానాక్రీడల ననుభవింపవచ్చును ; పసిఁడితామరలను ఈనునట్టిమానససరోజలమును త్రాగవచ్చును ; ఐరావణగజమునకు క్షణము

ముఖపటముగా నుండి దానిని మెప్పింపవచ్చును ; కల్పవృక్షదుకూలములను నీగాలిచే కదలింపవచ్చును ; ఇట్టిక్రీడలను అందు యథేచ్ఛముగా ననుభవింపుము.

వ.—'హేమాంభోజ'—అద్భుతగుణాతిశయములు గలజలము; దానిని త్రాగిన నీవును స్వర్ణదేహుండ వగుదువు. 'ఐరావణస్య ముఖపటప్రీతిమ్'—ముఖపట మగుటచే ఎండ నివారితమై ఐరావణమునకు నీపై ప్రీతి కలుగును. 'క్షణ'-మానసజలపానకాలమందు - హేమాంభోజవనీమధ్యను మానసమున ఐరావణము విహరించుచుండు ననియు, ఆసమయమున నీవు జలము త్రాగుచు రవంతసేపు ఆగజమునకు ముఖపటము వగుదువనియు భావము. 'ముఖపట' - ముఖమునకుఁగదా కడను దేహముకంటె ఎండ దుస్సహము. జలపానసమయమందు మొగమునకు చలువ మఱియు ప్రియముగా నుండును. 'కల్పద్రుమ' - చెట్టున నున్నదుకూలరూపపర్ణాదికము లని భావము; సురాంగనాభృతములను గాలిచే నెగురఁగొట్టుట దుర్వర్తనముగాన చెట్లయందలివే ఉద్దేశింపఁబడినవి. మానసజలపానాదిక్రీడితవిశేషమును ప్రత్యేకముగాఁ జెప్పియు మరల 'లలితైః' అనుటచే ఇట్టిదిగా నీయిష్టమయినయేక్రీడితమును గాని అనుభవింపుమని భావము. 'నగేన్ద్రమ్'—నగమేఘములకు సహజమైత్రి గావున నీక్రీడలకు నిర్నిరోధ మని భావము.

తస్యోత్సఙ్గే ప్రణయినఇవ స్రస్తగఙ్గాదుకూలాం
న త్వం దృష్ట్వా న పున రలకాం జ్ఞాస్యసే కామచారిన్,
యా వః కాలే వహతి సలిలోద్గార ముచ్చై ర్విమానా
ముక్తాజాలగ్రథిత మలకం కామినీ వాభ్రబృన్దమ్. 67.

తస్యేతి.—ప్రణయినః = ప్రియతమ-స్యేవ, తస్య = కైలాసస్య, ఉత్సఙ్గే = ఊర్ధ్వభాగే ఊరౌచ + 'ఉత్సఙ్గో ముక్తసంయోగే సక్థ న్యూర్ధ్వతలేఽపి చ' ఇతి మాలతీమాలాయాం॥గఙ్గా దుకూలం (శుభ్రవస్త్రి) మివే త్యుపమితసమాసః - స్రస్తం గఙ్గాదుకూలం యస్యాస్తామ్ + 'దుకూలం సూక్ష్మవస్త్రే స్యా దుత్తరీయే సితాంశుకే' ఇతి శబ్దార్ణవే - కామిన్యాంతు స్రస్తం గఙ్గేవ దుకూలం యస్యాస్తాం తథోక్తామ్, అలకాం = కుబేరనగరీం, దృష్ట్వా, కామినీమివేతి శేషః, హే కామచారిన్, త్వం పునః = త్వం తు, న జ్ఞాస్యస ఇతి న - కింతు జ్ఞాస్యస ఏవే త్యర్థః, కామచారిణ స్తే పూర్వమపి బహుకృత్వో దర్శనసంభవా దజ్ఞాన మసంభావిత మేవేతి నిశ్చయార్థం నఞ్ద్వయప్రయోగః - తదుక్తం † 'స్మృతి నిశ్చయ సిద్ధార్థేషు నఞ్ద్వయప్రయోగః' ఇతి, ఉచ్చై (రున్నతాని) విమానాని (సప్తభూమికభవనాని) యస్యాం సా ఉచ్చైర్విమానా + 'విమానోఽస్త్రీ దేవయానే సప్త

భూమౌ చ సద్మని’ ఇతి యాదవః - మేఘసంబోధనస్థానసూచనార్థ మిదం విశేషణమ్ - అన్యత్ర - విమానా = నిష్క్రాన్తా, యాలకా, వః, = యుష్మాకం, కాలే, మేఘకాల ఇత్యర్థః, * కాలస్య సర్వమేఘసాధారణ్యా ద్వ ఇతి బహువచనం, సలిల ముద్గిర తీతి సలిలోద్గారం = స్రవత్సలిలధార మిత్యర్థః, అభ్రబృన్దం=మేఘ కదమ్బకం, కామినీ=స్త్రీ, ముక్తాజాలైః = మౌక్తికసరైః - గ్రథితం = ప్రత్యుప్తం + ‘పుంశ్చల్యాం మౌక్తికే ముక్తా’ ఇతి యాదవః, అలకమివ = చూర్ణకున్తలానీవ * జాతా వేకవచనమ్ + ‘అలకా శ్చూర్ణకున్తలాః’ ఇత్యమరః, వహతి = బిభర్తి. అత్ర కైలాస స్యానుకూలనాయకత్వ మలకాయాశ్చ స్వాధీనపతికాఖ్య నాయికాత్వం చ ధ్వన్యతే † ‘ఏకాయత్తోఽనుకూలః స్యాత్’ ఇతి, ‘ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా’ ఇతి చ లక్షయన్తి-ఉదాహరన్తి చ—‘లోలయ న్నలకప్రాన్తా న్రచయ న్పత్త్రమఞ్జరీః । ఏకాం వినోదయ న్కాన్తాం ఛాయావ దనువర్తతే’ ఇతి.

ఇతి శ్రీ మహామహోపాధ్యాయ కోలచల మల్లినాథసూరి విరచిత
యా సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతే మహాకవి
శ్రీ కాళిదాసవిరచితే మేఘదూతే మహాకావ్యే పూర్వమేఘః.

ప్రణయినః = ప్రియతముఁడయిన, తస్య = కైలాసునియొక్క, ఉత్సఙ్గే = పైభాగమందు (తొడయందును), స్రస్త...కూలామ్ - స్రస్త = జారిపోయిన - గఙ్గాదుకూలామ్ = వలిపవస్త్రమువంటిగంగగలదైన - [కామినీపక్షమున - స్రస్త= జారినట్టి - గఙ్గాదుకూలామ్ = గంగవంటివలిపవస్త్రముగలదైన], అలకామ్=కుబేర నగరిని, దృష్ట్వా = చూచి, (కామినినిబోలె నని శేషము), హేకామచారిన్ = ఓయికామచారీ, త్వం పునః = నీవయినను, నజ్ఞాస్యసే ఇతి న = తెలిసికొనక పోవు - తప్పకతెలిసికొందువు - చూడఁగానే ఇది యలక యని నీకుఁ దెలియును. ఉచ్చైర్విమానా - ఉచ్చైః=ఉన్నతములయిన (ఇండ్లకు విశేషణము) - విమానా= ఏడంతస్తులయిండ్లుగలదైన [రెండవపక్షమున - గంభీరురాలును కోపముతేనిదియు నైన], యా = ఏయలకానగరి, వః కాలే = మీయొక్కకాలమందు - అనఁగా మేఘకాలమందు (కాలము సర్వమేఘములకు సాధారణము గావున ‘వః’ అని బహువచనము), సలిలోద్గారమ్ - సలిల=నీళ్లను - ఉద్గారమ్=స్రవించుచున్న, అభ్రబృన్దమ్ = మేఘసమూహమును, కామినీ = కాముకురాలయినస్త్రీ, ముక్తాజాలైః ముత్యాలసరములతో-గ్రథితమ్ = క్రుచ్చఁబడిన, అలకమివ = ముంగురులంబోలె, వహతి=ధరించును.

తా.—కైలాసముయొక్క యుపరిభాగమందు అలకానగరము ప్రియతముని తొడయందు కామినియుంబోలె సొంపొందుచుండును. కామచారి వగుటచే ఇంతకు ముందే దానిని పలుమాఱు చూచిన నీకు ఇపుడు మరలఁ జూడఁగానే అది యలక యని తెలియకపోదు. మేఘములకు మీకును ఆయలకకును విశేషమైన సంబంధము కూడఁ గలదు. ఎట్లన - ఆయలకాపురి మేఘకాలమందు నీరు స్రవించుచున్న మేఘ పంక్తివలన ముత్యాలసరములచే నలంకృతములయిన ముంగురులుగల కామినివలె శోభిల్లుచుండును.

వ.—కైలాసునికి ప్రియతముఁడు, ఉపరిభాగమునకు తొడ, గంగానది జాఱుటకు వలిపపైఁట యెడలుట, అలకకు కామిని, నీటిబిందువులు కురియుచున్న మేఘములకు ముత్యాలసరములతోడి ముంగురులును ఉపమానములు. ప్రియతమునితొడపై కూర్చుండి వలిపంపుఁబయ్యెద జాఱి ముత్యాలసరములతోడిముంగురులు గలిగి శోభిల్లు కామినివలె - అలకాపురి కైలాసునిపైభాగమున తాను నెలకొన్నదై, తన వెంబడి గంగ జాఱుచుండఁగా సజలోద్గార మేఘములతో శోభిల్లుచుండు ననియభిప్రాయము; అత్యంతదర్శనీయ యని భావము. నీవలనఁగదా ఇవు డలకాపురికి అట్టిశోభ గల్గును అని భావము. 'గఙ్గాదుకూలామ్' - తెలుపుగావున దుకూలసామ్యము. 'కామచారిణ్'—అంతకుముందే పలుమాఱు చూచినాఁ డనిభావము. 'విమానా' 'ఉత్సఙ్గే' 'స్రస్త దుకూలా' ఇత్యాదులచే కైలాసునియం దనుకూలనాయకత్వమును అలక యందు స్వాధీనపతికాత్వమును సూచితములు. తెల్లవలిపముచే పద్మినీ జాతి - 'ధవళకుసుమవాసోవల్లభా పద్మినీ స్యాత్'. 'వి(గత)మానా'-మానము తీఱిన దనుటచే తత్పూర్వ ముండిన దని తెలియుచున్నది; అందులవిశేష మే మనఁగా—అలుక తీఱినస్థితిలో ప్రేమావేశము బలీయము - అలిగినకాలమందు నిబద్ధమైయున్న ప్రేమ రసమెల్ల అలుక తీఱినప్పుడు మిక్కిలిగాఢముగా ప్రకటమై వెల్లివిరియును, కావున 'అమానా' అనక 'విమానా' అని మహాకవి ప్రయోగించినాఁడు. అలుక తీఱి నాయకునితొడపై నెక్కిననాయికవలె అలక శోభిల్లుచుండు ననిభావము. ఇట్లు అనుకూలదాంపత్యభోగవర్ణనము తనకును అట్టిమంచికాలము వచ్చునా యని యక్షుని యాశంసను సూచించుటకును, సర్గమును ఇట్టివర్ణనతో ముగించుట కవి పఠితృ వ్యాఖ్యాత్రుపాధ్యాయాదులకు సమస్తమంగళ సంపాదనార్థంబును.

ఆంధ్రవివరణముతోడి పూర్వమేఘము

సమాప్తము.

శ్రీ

# మే ఘ స ం దే శః

## ద్వితీయః సర్గః.

విద్యుత్వన్తం లలితవనితాః, సేన్ద్రచాపం సచిత్రాః,
సంగీతాయ ప్రహతమురజాః, స్నిగ్ధగమ్భీరఘోషమ్,
అన్తస్తోయం మణిమయభువ, స్తుఙ్గ మభ్రంలిహాగ్రాః,
ప్రాసాదా స్త్వాం తులయితు మలం యత్ర తై స్తై ర్విశేషైః. 1.

విద్యుత్వన్తమితి.—యత్ర = అలకాయాం, లలితాః = రమ్యాః - వనితాః = స్త్రియో - యేషు తే, సహ చిత్రై ర్వర్తన్త ఇతి సచిత్రాః + 'ఆలేఖ్యాశ్చర్యయో శ్చిత్రమ్' ఇత్యమరః * 'తేన స హేతితుల్యయోగే' ఇతిబహు వ్రీహిః * 'వోపసర్జనస్య' ఇతి సహశబ్దస్య సభావః, సంగీతాయ = తౌర్యత్రికాయ, ప్రహత మురజాః = తాడిత మృదఙ్గాః + 'మురజస్తు మృదఙ్గే స్యాద్ఢక్కా-మురజయో రపి' ఇతిశబ్దార్ణవే, మణిమయ్యః = మణివికారాః - భువః = క్రీడాపానభూమయః - యేషు తే తథోక్తాః, అభ్రం లిహన్తీతి - అభ్రంలిహాని = అభ్రఙ్కషాణి * 'వహాభ్రేలిహః' ఇతి ఖచ్ ప్రత్యయః * 'అరుద్విషద' దిత్యాదినా ముమాగమః - అగ్రాణి = శిఖరాణి - యేషాం తే తథోక్తాః - అతితుఙ్గా ఇత్యర్థః, ప్రాసాదాః = దేవగృహాణి + 'ప్రాసాదో దేవభూభుజామ్' ఇత్యమరః - విద్యుతోఽస్య సన్తీతి విద్యుత్వాన్ - తం, సేన్ద్రచాపమ్ = ఇన్ద్రచాపయుక్తం, స్నిగ్ధః = శ్రావ్యః - గమ్భీరః = ప్రగల్భః - ఘోషో = గర్జితం - యస్య తమ్, అన్తః = అన్తర్గతం - తోయం యస్య తమ్, అన్తస్తోయమ్ = అన్తస్సలిలం, తుఙ్గమ్ = ఉన్నతం, త్వాం, తై స్తై ర్విశేషైః లలితవనితత్వాదిధర్మైః కరణైః, తులయితుం = సమీకర్తుమ్ * తులాశబ్దా త్తత్కరోతీతి ణ్యన్తా త్తుమున్ ప్రత్యయః, అలం = పర్యాప్తాః + 'అలం భూషణ పర్యాప్తి శక్తి వారణ వాచకమ్' ఇత్యమరః. * అత్రోపమానోపమేయభూత మేఘ ప్రాసాదధర్మాణాం విద్యుద్వనితాదీనాం యథాసంఖ్య మన్యోన్యసాదృశ్యా న్మేఘ ప్రాసాదయోః సామ్యసిద్ధి రితి బిమ్బప్రతిబిమ్బభావే నేయం పూర్ణోపమా - వస్తుతో

న్నయోః పరస్పరసాదృశ్యా దధీన్నయో రుపమానోపమేయధర్మయోః పృథ క్సాధానా ద్బిమ్బప్రతిబిమ్బభావః.

ప్రాసాదవర్ణనము.— యత్ర = ఎచట (అలకాపురమందు), లలితవనితాః = రమణీయలైన స్త్రీలుఁగలవియు, సచిత్రాః = చిత్తరువులతో (ఆలేఖ్యములతో) కూడుకొన్నవియు, సంగీతాయ = సంగీతముకొఱకు, ప్రహత మురజాః = వాయింపఁబడిన మద్దెళలుగలవియు, మణిమయభువః = మణివికారమైనభూములు (క్రీడాపానభూములు) గలవియు, అభ్రం...గ్రాః - అభ్రంలిహ = ఆకాశము నొరయుచున్న - అగ్రాః = కొనలు గలవియు (అనఁగా అత్యున్నతములును), అగు, ప్రాసాదాః = దేవాలయములు, విద్యుత్వన్తమ్ = మెఱుపుఁదీఁగలుగలవాఁడవును, సేన్ద్రచాపమ్ = ఇంద్రధనుస్సులోఁగూడుకొన్నవాఁడవును, స్నిగ్ధ...షమ్ - స్నిగ్ధ = శ్రావ్యమయిన - గమ్భీర = ప్రగల్భమయిన - ఘోషమ్ = ఉఱుముగలవాఁడవును, అన్తస్తోయమ్ = లోపల జలముగలవాఁడవును, (అగు), త్వామ్ = నిన్ను, తైస్తై ర్విశేషైః = పైచెప్పఁబడిన లలితవనితత్వాదిధర్మములచేత, తులయితుమ్ = సరిపోలుటకు, అలమ్ = చాలియున్నవి. ఇచట ఉపమానోపమేయములయిన మేఘప్రాసాదములయొక్క ధర్మములయిన విద్యుద్వనితాదులకు యథాసంఖ్యముగా (వరుసగా) గలిగిన యన్యోన్యసాదృశ్యమునుబట్టి మేఘప్రాసాదములకు సాదృశ్యము సిద్ధించినది గావున బింబప్రతిబింబభావముచే ఇది పూర్ణోపమ.

ప.— అలకాపురమందలిప్రాసాదములు అత్యుత్కృష్టము లని భావము.

హస్తే లీలాకమల, మలకే బాలకున్దానువిద్ధం,
నీతా లోధ్రప్రసవరజసా పాణ్డుతా మాననే శ్రీః,
చూడాపాశే నవకురవకం, చారు కర్ణే శిరీషం,
సీమన్తే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనామ్. 2.

సంప్రతి సర్వదా తస్యాం సర్వర్తుసంపత్తి మాహ.—

హస్తఇతి.— యత్ర = అలకాయాం, వధూనాం = హస్తే, లీలార్థం కమలం లీలాకమలం - శరల్లిఙ్గ మేతమ్ - తదుక్తం † 'శర త్పఙ్క-జలక్షణా' ఇతి, అలకే - జాతా వేకవచనమ్ - అలకేష్వి త్యర్థః, బాలకున్దైః = ప్రత్యగ్రమాఘ్యకున్దుమైః - అనువిద్ధమ్ - అనువేధో - గ్రథన మిత్యాపత్ * నపుంసకే భావేక్తః - యద్యపి కున్దానాం శైశిరత్వ మప్యస్తి + 'మాఘ్యం కున్దమ్' ఇ త్యభిధానాత్ - తథాపి హేమన్తే ప్రాదుర్భావః శిశిరే ప్రౌఢత్వ మితి వ్యవస్థాభేదేన హేమన్తకార్యత్వ మి

త్వాశయేన బాలేతి విశేషణమ్ - 'అలకమ్' ఇతి ప్రథమాన్తపాఠే సప్తమీప్రక్రమ భఙ్గః స్యాత్ - నాథస్తు నియతపుల్లిఙ్గతాహానిః శ్చేతి దోషాన్తర మాహ-త దసత్ + 'స్వభావవక్రా ణ్యలకాని తాసా' మితి † 'నిర్లూనాన్యలకాని పాటిత ముర: కృతోఽన్యోఽధర: ఖణ్డితః' ఇత్యాదిషు ప్రయోగేషు నపుంసకలిఙ్గతాదర్శనాదితి, ఆననే = ముఖే, లోధ్రప్రసవానాం=లోధ్రపుష్పాణాం - శైశిరాణాం-రజసా = పరాగేణ + 'ప్రసవస్తు ఫలే పుష్పే వృక్షాణాం గర్భమోచనే' ఇతి విశ్వః, పాణ్డుతాం = పిశఙ్గత్వం, నీతా = ప్రాపితా, శ్రీః = శోభా, చూడాపాశే = కేశపాశే, నవకురవకం = వాసన్తః పుష్పవిశేషః + 'తత్ర శోణే కురవక స్తత్ర పీతే కురణ్టకః' ఇత్యమరః, కర్ణే, చారు = పేశలం, శిరీషం = గ్రైష్మః పుష్పవిశేషః, సీమన్తే = మస్తకకేశవీథ్యామ్ + 'సీమన్త మస్త్రియాం మస్తకేశవీథ్యా ముదాహృతమ్' ఇతి శబ్దార్ణవే, త వోపగమః త్వదుపగమః - ఘనాగమకాల ఇత్యర్థః - తత్ర జాతం త్వదుపగమజం - వార్షికలిఙ్గమిత్యర్థః - నీపం = కదమ్బకుసుమంచ, సర్వత్రా స్తీతి శేషః - అస్తి ర్భవతిపరః ప్రథమపురుషోఽప్రయుజ్యమానోఽప్యస్తీతి న్యాయాత్; ఇత్థం కమలకున్దాది తత్తత్కార్యసమాహారాభిధా నాదర్థా త్సర్వసమాహారసిద్ధిః - కారణం వినా కార్య స్యాసిద్ధే రితి భావః.

అలకాపురమందు సర్వదా సకలర్తుసంపత్తి కల దని చెప్పుచున్నాఁడు:—

యత్ర = అలకయందు, వధూనామ్ = స్త్రీలయొక్క, హస్తే = చేతియందు, లీలా కమలమ్ = విలాసార్థమయిన తామరయు - (ఇది శరదృతుచిహ్నము), అలకే = తలవెండ్రుకలయందు (జాత్యేకవచనము), బాల...ద్ధమ్ - బాల = అభినవములయిన - కున్ద = మొల్లలయొక్క - అనువిద్ధమ్ = ముడియు - (ఇది హేమంతర్తులక్షణము-'మాఘ్యం కున్దమ్' అనటచే మొల్లలు శిశిరర్తువునంగూడఁ గలుగును - అయినను వానికి హేమంతమందు ప్రాదుర్భావము శిశిరర్తువున ప్రౌఢియు అని అవస్థాభేదముచే హేమంతకార్య మనునభిప్రాయముతో బాలపదవిశేషణము ప్రయోగింపఁబడినది), ఆననే = ముఖమందు, లోధ్ర...జసా—లోధ్ర ప్రసవ = లొద్దుగుఁబువ్వులయొక్క - రజసా = పరాగముచేత, పాణ్డుతామ్ = పిశంగిమను, నీతా= పొందింపఁబడిన, శ్రీః = శోభయు - (శిశిరర్తులక్షణ మిది), చూడాపాశే = కేశకలాపమందు, నవ కురవకమ్ = క్రొత్త గోరంటపువ్వును (గోరంట వసంతర్తువులో పూచును), కర్ణే = చెవిలో, చారు=కోమలమయిన, శిరీషమ్ = దిరిసెనపువ్వును - (ఇవి గ్రీష్మర్తువులో పూచును), సీమన్తే = పాపటయందు, త్వదుపగమజమ్-త్వత్ = నీయొక్క-ఉపగమ = రాకవలన - జమ్ = పుట్టినదైన, నీపమ్ = కదంబపుష్పమును - (ఇది వర్షర్తులింగము), సర్వత్ర 'అస్తి = కలదు' అని శేషము.

యత్రోన్మత్తభ్రమరముఖరాః పాదపా నిత్యపుష్పాః,
హంసశ్రేణీ రచితరశనా నిత్యపద్మా నలిన్యః,
కేకోత్కణ్ఠా భవనశిఖినో నిత్యభాస్వత్కలాపా,
నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమోవృత్తిరమ్యాః ప్రదోషాః. 3.

యత్రేతి - యత్ర = అలకాయాం, పాదపాః = వృక్షాః, నిత్యం పుష్పాణి యేషాం తే నిత్యపుష్పాః-నతు ఋతునియమా దితి భావః, అతఏవోన్మత్తై ర్భ్రమరైః-ముఖరాః = శబ్దాయమానాః, నలిన్యః = పద్మిన్యః, నిత్యం పద్మాని యాసాం తాః నిత్యపద్మాః - న తు హేమన్తాదివర్జ మిత్యర్థః, అత ఏవ హంసశ్రేణీభిః- రచిత రశనాః = కల్పిత మేఖలాః - నిత్యం హంసపరివేష్టితా ఇత్యర్థః, భవన శిఖినః = క్రీడా మయూరాః, నిత్యం భాస్వన్తః కలాపా (బర్హాణి) యేషాం తే తథోక్తాః - న తు వర్షాస్వే వేతి భావః, అత ఏవ కేకాభిః - ఉత్కణ్ఠాః = ఉద్గ్రీవాః, ప్రదోషాః= రాత్రయః, నిత్యం - జ్యోత్స్నా = చన్ద్రికా - యేషాం తే నిత్యజ్యోత్స్నాః - న తు శుక్లపక్ష ఏవ, అతఏవ ప్రతిహతా తమసాం వృత్తిః (వ్యాప్తిః) యేషాం తే, తే చతే రమ్యా శ్చేతి తథోక్తాః - నయనసుభగా ఇత్యర్థః.

యత్ర = అలకయందు, పాదపాః = వృక్షములు, నిత్యపుష్పాః - నిత్య = ఎల్లప్పుడు (ఋతునియమము నపేక్షింపక) - పుష్పాః = పువ్వులుగలవి, (అందుచే తనే); ఉన్మ...ఖరాః - ఉన్మత్త = మదించిన-భ్రమర = తుమ్మెదలచేత-ముఖరాః = శబ్దించుచుండునవి, నళిన్యః = తామరకొలంకులు, నిత్యపద్మాః - నిత్య=ఎల్లప్పుడును (హేమంతామలయం దైనను మానక) - పద్మాః = తామరలుగలవి, (అందు చేతనే), హంస...శనాః-హంస = హంసలయొక్క - శ్రేణీ = వరుసలచే-రచిత= కల్పింపఁబడిన - రశనాః = మొలనూళ్లుగలవి - (సదా హంసలచే పరివేష్టింపఁబడి యుండునని భావము), భవన శిఖినః = క్రీడా మయూరములు, నిత్య...లాపాః- నిత్య = (వర్షాకాలమందుమాత్రమే గాక) సదా - భాస్వత్ = ప్రకాశించుచుండు- కలాపాః = పురులుగలవి, (అందుచేతనే), కేకోత్కణ్ఠాః - కేకా = కేకలచేత - ఉత్కణ్ఠాః = మెడ యెత్తునవి, ప్రదోషాః = రాత్రులు, నిత్యజ్యోత్స్నాః - నిత్య= (శుక్లపక్షమందుమాత్రమే గాక) ఎల్లకాలములయందు - జ్యోత్స్నాః = వెన్నెల గలవి, (అందుచేతనే), ప్రతి...రమ్యాః- ప్రతిహత = పోఁగొట్టఁబడిన - తమః=చీకటులయొక్క - వృత్తి = వ్యాప్తిచే- (చీకటని తలచూపనీయమిచే) - రమ్యాః=రమణీయములును (చూచుటకు సొంపయినవి యని యర్థము).

ప.—'యత్రో...పుష్పాః' — అలకాపురియందు ఎప్పుడును వసంతమే, 'హంస...లిన్యః - ఎప్పుడును శరదృతువే, 'కేకో...లాపాః'-ఎప్పుడును 'వర్షర్తువే, 'నిత్య...దోషాః' - రాత్రులన్నియు వెన్నెలరాత్రులే, ఉద్యాన పద్మాకరమయూర యామినులు కాలనియమము లేక ఎల్లప్పుడు అన్నివిధముల శోభిల్లుచుండును.

ఆనన్దోత్థం నయనసలిలం యత్ర నాన్యై ర్నిమిత్తై,
ర్నాన్య స్తాపః కుసుమశరజా దిష్టసంయోగసాధ్యాత్,
నా ప్యన్యస్మాత్ ప్రణయకలహా ద్విప్రయోగోపపత్తిః,
విత్తేశానాం న చ ఖలు వయో యౌవనా దన్య దస్తి. 4.

ఆనన్దేతి.—యత్రాలకాయాం, విత్తేశానాం = యక్షాణాం + 'విత్తాధిపః కుబేరః స్యాత్ప్రభౌ ధనిక యక్షయోః,' ఇతి జబ్దార్ణవే, ఆనన్దోత్థమ్=ఆనన్దజన్య మేవ - నయనసలిలమ్, అన్యై ర్నిమిత్తైః శోకాదిభి ర్నాస్తి, ఇష్ట సంయోగేన = ప్రియజన సమాగమేన - సాధ్యాత్ = నివర్తనీయాత్ - న త్వప్రతీకార్యా దిత్యర్థః, కుసుమ శర జాత్ =మదన శర జన్య తాపాత్, అన్య స్తాపో నాస్తి, ప్రణయ కలహా దన్యస్మా న్మరణాదికారణాత్, విప్రయోగోపపత్తిః = విరహప్రాప్తి రపి నాస్తి; కించ, యౌవనా దన్య ద్వయో వార్ధకం నాస్తి ఖలు. ఏతచ్ఛ్లోక ద్వయం ప్రక్షిప్త మపి వ్యాఖ్యాతమ్.

యత్ర = అలకాపురమందు, విత్తేశానామ్ = యక్షులకు, ఆనన్దోత్థమ్-ఆనన్ద = ఆనందముచేత - ఉత్థమ్=పుట్టునదే - నయనసలిలమ్=కన్నీరు, అన్యైః = ఇతరమైన, నిమిత్తైః = (శోకాది) కారణములచేత, న=లేదు, (అచట కన్నీరు ఎవరికైనఁ గలిగిన ఆనందముచేతఁ గలుగునేగాని ఇతరమైన శోకాదికారణముల చేతఁ గలుగదు అని యర్థము), ఇష్ట...ధ్యాత్-ఇష్ట = ప్రియజనులతోడి - సంయోగ = కూడికచేత - సాధ్యాత్=పోఁగొట్టఁదగినదైన (ప్రతిక్రియారహితము కాదని యర్థము), కుసుమశర జాత్ = మదనునివలన పుట్టునట్టితాపముకంటె, అన్య స్తాపః = వేఱుతాపము, న = లేదు, ప్రణయకలహాత్ = పొలయలుకకంటె, అన్య స్మాత్ = వేఱుకారణమువలన, విప్ర...పత్తిరపి-విప్రయోగ = విరహముయొక్క - ఉపపత్తిరపి = సంభవమయినను, న = లేదు, (కించ = మఱియు), యౌవనాత్ = జవ్వనముకంటె, అన్య ద్వయశ్చ = వేఱు వయస్సు (ముసలితనము) కూడ, న = లేదు. ఈ రెండుశ్లోకములు కాళిదాసప్రణీతములు కావు - మరియెవరో చేసి ఇందు వేసినారు.

తా.—అలకాపురమందు యౌవనభోగములు తప్ప వేఱొండుదశ లేదు,

యస్యాం యక్షాః సితమణిమయా న్యేత్య హర్మ్యస్థలాని
జ్యోతిశ్ఛాయాకుసుమరచితా న్యుత్తమస్త్రీసహాయాః
ఆసేవన్తే మధు రతిఫలం కల్పవృక్షప్రసూతం
త్వద్గమ్భీరధ్వనిషు శనకైః పుష్కరే ష్వాహతేషు. 5.

యస్యామితి.—యస్యామ్ = అలకాయాం, యక్షాః = దేవయోని విశేషాః, ఉత్తమస్త్రీసహాయాః = లలితాఙ్గనాసహచరాః సన్తః, సితమణిమయాని = స్ఫటికమణిమయాని - చన్ద్రకాన్తమయాని వా, అతఏవ, జ్యోతిషాం = తారకాణాం - ఛాయాః = ప్రతిబిమ్బాన్యేవ - కుసుమాని-తైః - రచితాని = పరిష్కృతాని + 'జ్యోతి స్తారాగ్ని భా జ్వాలా దృక్పుత్రా, ర్థాధ్వ రాత్మసు' ఇతి వైజయన్తీ-ఏతేన పానభూమే రమ్లానశోభత్వ ముక్తమ్, హర్మ్యస్థలాని, ఏత్య = ప్రాప్య, తవ గమ్భీరధ్వనిరివ ధ్వని ర్యేషాం తేషు త్వద్గమ్భీరధ్వనిషు, పుష్కరేషు=వాద్యభాణ్డముఖేషు + 'పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాణ్డముఖే జలే। వ్యోమ్ని పద్మే ఫలే ఖడ్గే తీర్థౌషధివిశేషయోః,' ఇత్యమరః, శనకైః = మన్దమ్, ఆహతేషు సత్సు, ఏతచ్చ వాద్యం నృత్యగీతయో రప్యుపలక్షణం, కల్పవృక్షప్రసూతం = మన్దారవృక్షోద్భవం - కల్పవృక్షస్య కాఙ్క్షితార్థప్రదత్వా న్మధ్వపి తత్ప్రసూత మితి భావః, రతిః ఫలం యస్య త ద్రతిఫలాఖ్యం - మధు = మద్యమ్, ఆసేవన్తే = ఆదృత్య పిబన్తీత్యర్థః;

† 'తాల క్షీర సితామృతామల గుడో న్మత్తాస్థి కాలాహ్వయా
దా ర్వీన్ద్రద్రుమమోచ పీలు కదళీ గుల్మప్రసూనై ర్యుతమ్
ఇత్థం చే న్మధు పుష్పభ ఙ్గ్యుపచితం పుష్పద్రుమూలావృతం
క్వాథేన స్మరదీపనం రతిఫలాఖ్యం స్వాదు శీతం మధు." ఇతి మదిరార్ణవే.

యస్యామ్=అలకయందు, యక్షాః = యక్షులు, ఉత్త...హాయాః-ఉత్తమ = లలితలైన-స్త్రీ = అంగనలు - సహాయాః = సహచారిణులుగా (అనఁగా వరాంగనలం గూడుకొని), సితమణిమయాని = తెల్లమణులతోఁ జేయఁబడిన (స్ఫటికమణివికారములైన, లేక, చంద్రకాంతమణివికారములైన), (అందుచేతనే), జ్యోతి...తాని-జ్యోతిస్ = నక్షత్రములయొక్క- ఛాయా = ప్రతిబింబములనెడు-కుసుమ = పుష్పములచేత- రచితాని = అలంకరింపఁబడిన (అందుచేత పానభూమియొక్క- శోభ ఒకప్పటికి మాసిపోవునది గాదని తెలుపఁబడుచున్నది), హర్మ్య స్థలాని = మేడల ప్రదేశములను, ఏత్య = పొంది (అట్టి మేడలడాబాలపైఁ జేరి), త్వద్గ...షు-త్వత్ = నీయొక్క-గమ్భీర = ధీరమైన-ధ్వనిషు=నాదమువంటి (ఉఱుమువంటి) నాదముగలవైన, పుష్కరేషు = వాద్యభాండముఖములు, ఆహతేషు (సత్సు) =

వాయింపఁబడునవి (అగుచుండఁగా) (వాద్యములు నృత్యగీతములకు ఉపలక్షణము. అనఁగా నృత్యగీతములుకూడ కలవని యర్థము), కల్పవృక్షప్రసూతమ్=మందార వృక్షోద్భవమయిన (కల్పవృక్షము కోరినదానిని ఇచ్చునదిగాన మద్యముకూడ అందు ఉద్భవించు నని భావము), రతిఫలమ్=పుష్పకృతముగాన సురతమే ఫలముగాఁ గలదైన (రతిఫలమనుపేరుగలదైన), మధు=మద్యమును, (మధువు పుష్పమయము గావున దానికి పండు ఏది యనిన - రతియే పండు అని భావము), ఆ సేవన్తే= ఆదరముతో త్రాగుదురు.

తా.—ఆయలకాపురమందు యక్షుల మేడలపై తలములు చంద్రకాంత మణులతోఁగాని స్ఫటికమణులతోఁగాని నిర్మింపఁబడియుండును. అందు రాత్రులలో నక్షత్రప్రతిబింబములే పువ్వులుచల్లినట్లు అలంకారముగా నుండును. ఆప్రదేశముల యందు యక్షులు వరాంగనలతోఁగూడినవారై నృత్యగీతవాద్యములు చిత్తమును ఆనందపెట్టుచుండఁగా, ఆదరముతో రతిఫలమనుపేరిపుష్పాసవమును తమకు సర్వాభీష్టము లిచ్చునదైనకల్పవృక్షమునుండి పుట్టినదానిని సేవించి, దానికి ఫలమయిన సురతము ననుభవించుచుందురు.

ఇచట కొందఱు 'సితమణి' యనుటకు 'మరకత' యని పఠించి - తెల్లనిమణి భూమియందు తెల్లని నక్షత్రములు ప్రతిబింబించుట సంభవించ దనియు దానంజేసి 'సితమణి' యనుపాఠము సరిగా దనియు వివరించిరి. మల్లినాథసూరి ఇంతమాత్రము ఊహింపకపోలేదు; రాత్రివేళ నల్లనిమణులయందలి ప్రతిబింబము స్ఫుటముగా నగపడదు, అగపడినను నలుపుతిరిగి వివర్ణమై యుండును, హీనగుణమయినయుపమానము చెప్పుట మందము. స్ఫటికాదిమణిమయమైన తెల్లని హర్మ్యోపరితలమందు నల్లనియాకాశమును ప్రతిబింబిత మగునుగాన దానితో తద్గత మయిననక్షత్రములు స్ఫుటముగా ప్రతిబింబించుట మిగులసంగతమై యున్నది - అట్టిది ప్రకటగుణ మైన యుపమానము శ్రేయము. మల్లినాథపాఠమే సరి యనుటకు కుమారసంభవము లోని యీక్రిందిశ్లోకము గనవచ్చును:—

"యత్ర స్ఫటికహర్మ్యేషు నక్తమాపానభూమిషు
జ్యోతిషాం ప్రతిబిమ్బాని ప్రాప్నువ న్త్యుపహారతామ్."

మన్దాకిన్యాః సలిలశిశిరైః సేవ్యమానా మరుద్భి,
ర్మన్దారాణా మనుతటరుహాం ఛాయయా వారితోష్ణాః,
అన్వేష్టవ్యైః కనకసికతాముష్టినిక్షేపగూఢైః
సంక్రీడన్తే మణిభి రమరప్రార్థితా యత్ర కన్యాః. 6.

మన్దాకిన్యా ఇతి.—యత్ర = అలకాయామ్, అమరైః ప్రార్థితాః- సున్దర్య ఇత్యర్థః, కన్యాః = యక్షకుమార్యః + కన్యా 'కుమారికా నార్యోః,' ఇతి విశ్వః, మన్దాకిన్యాః = గఙ్గాయాః, సలిలేన - శిశిరైః = శీతలైః, మరుద్భిః = మారుతైః, సేవ్యమానాః = వీజ్యమానాః సత్యః, తథా, అనుతటం = తటేషు - రోహన్తీత్యనుతటరుహాః - క్విప్ * 'ఉపపద మతిఙ్' ఇతి సమాసః-తేషాం మన్దారాణాం, ఛాయయా = అనాతపేన, వారితోష్ణాః = శమితాతపాః సత్యః, కనకస్య సికతాసు - ముష్టిభిః - నిక్షేపేణ = న్యాసేన - అథవా-కనకసికతానాం ముష్టిషు నిక్షేపేణ - గూఢైః = సంవృతైః, అతఏవ - అన్వేష్టవ్యైః = మృగ్యైః, మణిభిః = రత్నైః, సంక్రీడన్తే = గూఢమణిసంజ్ఞయా దైశికక్రీడయా సమ్యక్క్రీడన్తీత్యర్థః * 'క్రీడోఽనుసంపరిభ్యశ్చ' ఇత్యాత్మనేపదమ్ † 'రత్నాదిభి ర్వాలుకాదౌ గుప్తైర్ద్రష్టవ్యకర్మభిః। కుమారీభిః కృతా క్రీడా నామ్నా గూఢమణిః స్మృతా। రాసక్రీడా గూఢమణి ర్గుప్తకేళి స్తులాయనం। పిచ్ఛ కన్దుక దణ్డాద్యైః స్మృతా దైశికకేలయః;' ఇతి శబ్దార్ణవే.

యక్షకన్యాసౌభాగ్యవర్ణనము:—యత్ర = అలకయందు, అమరప్రార్థితాః - అమర = దేవతలచే - ప్రార్థితాః = కోరఁబడిన - కామింపఁబడిన (మిక్కిలి అందగత్తియ లని యర్థము)-కన్యాః = యక్షకుమారికలు, మన్దాకిన్యాః = ఆకాశగంగయొక్క, సలి...రైః-సలిల=నీటిచే - శిశిరైః = చల్లనివైన, మరుద్భిః=వాయువు)చేత, సేవ్యమానాః (సత్యః) = వీవఁబడుచున్న(వారై),అనుతటరుహామ్-అనుతట=గట్టులయందు - రుహామ్ = మొలచిన, మన్దారాణాం = కల్పవృక్షములయొక్క, ఛాయయా = నీడచేత,వార...ష్ణాః - వారిత=తొలఁగింపఁబడిన - ఉష్ణాః (సత్యః) =ఎండగల (వారై), కన...గూఢైః - కనక సికతా = బంగారపుటిసుకయొక్క - ముష్టి = పిడికిళ్లయందు-నిక్షేప=ఉంచుటచేత , గూఢైః = దాఁపఁబడిన, (అందుచేతనే), అన్వేష్టవ్యైః = వెదకవలసినవైన, మణిభిః = రత్నములతో, సంక్రీడన్తే = (గూఢమణి యనుపేరియాటను) ఆడుకొనుచుందురు.

తా.—ఆయలకాపురమందు పెండ్లికానియక్షకన్యలు దేవతలచేతనైతము కామింపఁబడినయందగత్తియలు ఆకాశగంగయొడ్డున కల్పవృక్షములనీడలో ఆకాశగంగాతుషారములం దడిసినపిల్లతెమ్మరలు తమకు వీచుచుండఁగా గూఢమణి యను క్రీడ నాడుచుందురు. ఆక్రీడ యెట్లనఁగా:—ఒకతెకు కన్నులుమూసి, దానిచే దోసిటి ఇసుకయెత్తించి, రెండుమూఁడుతావుల ఇసుకదోసిళ్లు పోయించి అందులో నొక యిసుకరాశియందు ఒకరాతిని దాఁచి, పిమ్మట ఆపిల్లకు కన్నుమూఁత వదలివేసి దానిని రాయి యెక్కడ నున్నదో కనుంగొను మందురు-తప్పిపోయిన మరల కన్నులు

ము్సి, అట్లే చేయుదురు; అది కనుంగొనిన మఱియొకదానిని ఆప్రకారమే చేయు చుందురు. ఇందులకు ఆ యక్షకుమారికలకు వట్టి యిసుకకు బదులు బంగారపు టిసుకయు రాతికి బదులు మణులును సిద్ధముగా నుండును.

వ —'అమరప్రార్థితాః'—అనుటచే ఈకన్యలు దేవతలకు స్వాధీనలైన యూర్వశీ రంభా మేనకా తిలోత్తమాదులకంటె అందగత్తె అనియు, 'సేవ్యమానాః' అనుటచే వీరికి వాయువు వంకావా (డనియు,అట్లు వీరింగొలుచుటచే వాయుదేవుఁడు తన్ను కృతార్థునిఁగా నెంచుకొని యానందించు ననియు, 'ఛాయయా' - అను స్త్రీ లింగస్వారస్యముచే కల్పతరువులనీడ వీరికి ఆతపత్రగ్రాహిణియగుదాని యనియు, 'కన కమణుల'చే వీరియైశ్వర్యము మహోన్నతమనియు, ఈవర్ణనచే 'ఓమేఘమా, నీవు లోకోత్తర సౌందర్యైశ్వర్యములుగల కన్యామణులను అలకాపురమునం గాంతువు. అట్టివారు మఱియెచటను లేరుగాన ఆట్టికన్యలదర్శనమే అలకాపురమునకు ఆన వాలు' అనియు, భావము.

నీవీబన్ధోచ్ఛ్వసితశిథిలం యత్ర బిమ్బాధరాణాం
క్షౌమం రాగా దనిభృతకరే ష్వాక్షిపత్సు ప్రియేషు,
అర్చిస్తుఙ్గా నభిముఖ మపి ప్రాప్య రత్నప్రదీపాన్
హ్రీమూఢానాం భవతి విఫలప్రేరణా చూర్ణముష్టిః. 7.

నీవీతి.—యత్ర = అలకాయామ్, అనిభృతకరేషు = చపల హస్తేషు, ప్రి యేషు, నీవీ=వసనగ్రన్థిః+ 'నీవీ పరిగణే గ్రన్థౌ స్త్రీణాం జఘనవాససః,'ఇతి విశ్వః- నీవీతి బన్ధో నీవీబన్ధః + చూతవృక్షవ దశాంనయుక్త్యమ్-తస్య-ఉచ్ఛ్వసితేన = త్రుటి తేన - శిథిలం, క్షౌమం = దుకూలం, రాగాత్ = అనురాగాత్, ఆక్షిపత్సు = ఆ హరత్సు సత్సు, హ్రీ మూఢానాం = లజ్జా విధురాణాం, బిమ్బం = బిమ్బికాఫలం + 'బిమ్బం ఫలే బిమ్బికాయాః ప్రతిబిమ్బే చ మణ్డలే,' ఇతి విశ్వః - బిమ్బమి వాధరో యాసాం తాసాం బిమ్బాధరాణాం స్త్రీవిశేషాణాం + 'విశేషాః కామినీ కాన్తా భీరు ర్బిమ్బాధ రాఙ్గనా' ఇతిశబ్దార్ణవే, చూర్ణస్య = కుఙ్కుమాదేః- ముష్టిః,అర్చిర్భిః = మయూఖైః - తుఙ్గాన్+'అర్చి ర్మయూఖ శిఖయోః' ఇతివిశ్వః, రత్నా న్యేవ ప్రదీపా నభిముఖం యథాతథా ప్రాప్యాపి, విఫలప్రేరణా = దీపనిర్వాపణాక్షమత్వా న్నిష్ఫలక్షేపా, భవతి; అత్రాఙ్గనానాం రత్నప్రదీపనిర్వాణప్రవృత్త్యా మౌగ్ధ్యం వ్య జ్యతే.

యక్షజాతి స్త్రీపురుషుల విస్రంభవిహారణము:— యత్ర = అలకయందు, అనిభృతకరేషు = చపలహస్తులయిన (చీరను లాగివేయ యత్నించుచున్నారు గావున చేతులు వణఁకుచున్న వని యర్థము), ప్రియేషు = ప్రియులు, నీవీ...లమ్—నీవీ=పోకముడియనెడు- బన్ధ = ముడియొక్క - ఉచ్ఛ్వసిత=సడలుటచేత - శిథిలమ్ = జాఱినదైన, క్షౌమమ్ = దుకూలమును, రాగాత్ = అనురాగముచేత, ఆక్షిపత్సు (సత్సు)=లాగివేయువారు (అగుచుండఁగా), (అనఁగా స్త్రీల పోకముడి వీడఁగా దుకూలము జాఱసాగె ననియు దానిని లాగివేయుటకు ప్రియులు చేతులు చాఁపి రనియు ఆరసాతిరేకముచేనయిన సాత్త్వికభావముచేత ఆప్రియుల చేతు లాపనిచేయునప్పుడు వణఁకుచుండె ననియు అర్థము), హ్రీ మూఢానామ్ = సిగ్గుచేత మూఢలయిన (అనఁగా ప్రతిక్రియ నూహింపఁజాలనివారయిన), బిమ్బాధరాణామ్ = దొండపండువంటిమోవిగల స్త్రీలయొక్క, చూర్ణముష్టిః = కుంకుమమొదలయినపొడుముయొక్క పిడికిలి, అర్చిస్తుఙ్గాన్ - అర్చిః=కిరణములచేత-తుఙ్గాన్ = ఉన్నతములయిన (అనఁగా విస్తారము కిరణములు గలిగి ప్రజ్వరిల్లుచున్న), రత్నప్రదీపాన్ = దీపములుగానున్న రత్నములను, అభిముఖమ్ = ఎదురుగా, ప్రాప్యాపి = పొందియు (అనఁగా రత్నదీపములమీఁద పోయి పడియు), విఫలప్రేరణా- విఫల = ప్రయోజనములేని - ప్రేరణా = చల్లుటగలది - (అనఁగా దేదీప్యమానములయిన యారత్నదీపములను ఆర్పలేనిదిగా), భవతి = అగుచున్నది.

తా.—అలకాపురమందు ఇట్టివినోదములను చూడఁగలవు, ఎట్టివనఁగా:— బింబాధరలనీవి సడలి చీర జాఱుచున్నప్పుడు ప్రియులు చీరను లాగివేయుటకు అదియే మంచిసమయమని [అనఁగా - చీర తానే జాఱిపోవుచున్నదిగావున ఆ స్త్రీలు ఎఱిఁగి సవరించుకొనునంతలోపల లాగివేసిన సులువుగా తప్పక ఊడివచ్చు నని] దానిని చేయిచాఁపి లాగివేయుదురు. అట్లు చేయునపుడు ఆచేయి రసాతిరేకమువలనిసాత్త్వికోదయముచే వణఁకుచుండును. ఆవణఁకుచే ఆచెఁవలు ప్రియులకుత్నిత పుఁదలంపు నెఱుంగునంతలో చీర పోవుటయు లజ్జచేత తమనగ్నత పురుషులకు కానరాకుండుటకై మంచిప్రతిక్రియ నూహింపఁజాలక చీకటిచేయఁ గోరినవారై తమయొద్ద సిద్ధముగా చేతి కలవడునట్టి కుంకుమాదిచూర్ణములను పిడికెటనెత్తి రత్నదీపములను ఆర్పివేయుటకై ఆదీపముల మీఁదికి చల్లుదురు. అవి రత్నదీపము లగుటచే వీరుచల్లినచూర్ణంపుఁబిడికిలి తమపై పడినను ఆఱవు. అట్లు విఫలప్రయత్నలై తుదకు వల్లభులయంకపాళియందే దాఁగుదురు.

వ.—'నీవీబన్ధోచ్ఛ్వసిత'-1 నీవిక సడలుట ప్రియునిమీఁది కామాతిరేకముచేత. 'ప్రియేషు' - ప్రియులు గావున 'అనిభృతకరేషు' - రసాతిరేకముచే వేపథు వను సాత్త్వికభావము కలిగినది. 'హ్రీమూఢానామ్'-సిగ్గు కలంచినది గాన తగినప్రతిక్రియ నూహింపఁజాలక, 'రత్నప్రదీపాన్'-రత్నప్రభలు ఆఱవని ఎఱింగియు ఆర్పుటకై కుంకుమ చల్లుదురు; 'రత్న'ములు గావున చూర్ణముష్టి 'విఫల'-వ్యర్థమైనది. మఱియు 'ప్రియేషు' - అనుటచే ఇట్టి శృంగారచేష్టలు భర్తృకళత్రమాత్రముల కైనఁ గలుగవు, ప్రియలకును ప్రియులకునైనఁ గలుగు ననిభావము.

యత్ర స్త్రీణాం ప్రియతమభుజోచ్ఛ్వాసితాలిఙ్గితానా
మఙ్గగ్లానిం సురతజనితాం తన్తుజాలావలమ్బాః
త్వత్సంరోధాపగమవిశదై శ్చన్ద్రపాదై ర్నిశీథే
వ్యాలుమ్పన్తి స్ఫుటజలలవస్యన్దిన శ్చన్ద్రకాన్తాః.

యత్రేతి.—యత్ర = అలకాయాం, నిశీథే = అర్ధరాత్రే + 'అర్ధరాత్ర నిశీథౌ ద్వౌ' ఇత్యమరః, త్వత్సంరోధస్య = మేఘావరణస్య - అపగమేన - విశదైః = నిర్మలైః, చన్ద్రపాదైః = చన్ద్రరశ్మిభిః + 'పాదా రశ్మ్యఙ్ఘ్రి తుర్యాంశాః' ఇత్యమరః, స్ఫుట జల లవ స్యన్దినః=ఉల్బణామ్బు కణ స్రావిణః, తన్తుజాలావలమ్బాః = వితానలమ్బి సూత్రపుఞ్జాధారాః-తద్గుణగుమ్ఫితా ఇత్యర్థః, చన్ద్రకాన్తాః=చన్ద్రకాన్తమణయః, ప్రియతమానాం భుజైః - ఉచ్ఛ్వాసితాని = శ్రాన్త్యా జలసేకాయ వా ప్రశిథిలితాని - ఆలిఙ్గితాని యాసాం తాసాం స్త్రీణాం, సురతజనితామ్, అఙ్గగ్లానిం = శరీరఖేదమ్ - అవయవానాం గ్లానతామితి యావత్, వ్యాలుమ్పన్తి = అపనుదన్తి.

అట్లు ప్రియాంకపాళీనిలీన లయిన యామునుదల తరువాతిసింగారము:—

---

1 స్రస్తా నీవీ న ఖలు సహసా, సా స్వయం ముక్తబన్ధా;
మోక్తుం నైవేచ్ఛతి కుచపటీ, మాత్మనా నైవ భిన్నా;
ద్రష్టుం నైవోన్నమయతి ముఖం, స్వైర ముల్లోకనం తత్;
వ్రీడాం తస్యాః విఫలయతి యః కోఽపి భావానుబన్ధః. బిల్హణీయము

కాన్తే దృష్టిపథం గతే నయనయో రాసీ ద్వికాసో మహాన్,
ప్రాప్తే నిర్జన మాలయం పులకితా జాతా తను స్సుభ్రువః,
వక్షోజగ్రహణోత్సుకే సముభవ త్సర్వాఙ్గకమ్పోదయః,
కణ్ఠాలిఙ్గనతత్పరే విగళితా నీవీ దృఢాపి స్వయమ్. పుష్పబాణ

యత్ర = ఆయలకాపురమునందు, నిశీథే = అర్ధరాత్రమందు, త్వత్సం... దైః - త్వత్ = నీయొక్క - సంరోధ = అడ్డగింపుయొక్క - అపగమ = తొలఁ ...టచేత - విశదైః = నిర్మలమయిన, చన్ద్రపాదైః = చంద్రకిరణములచేత, జల... ...నః - జలలవ = నీటికణములను - స్యన్దినః = తొరంగునవియు, తన్తు... ...వ్యాః = (మేలుకట్టునుండి వ్రేలాడుచున్న) దారపుగుంపే ఆధారముగాఁగలవియు ...అనఁగా ఆదారములకుఁ గ్రువ్వఁబడినవియు), నయిన, చన్ద్రకాన్తాః = చన్ద్ర కాంతమణులు, ప్రియ...నామ్ - ప్రియతమ = అతిప్రియులైన కాంతులయొక్క - భుజ = బాహువులచేత - ఉచ్ఛ్వసిత = సడలింపఁబడిన - ఆలిఙ్గితానామ్ = కౌఁగిలింతలుగలవారైన, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, సురత జనితామ్ = క్రీడచే కలిగిన, అఙ్గగ్లానిమ్ = అవయముల బడలికను, వ్యాలుమ్పన్తి = పోఁగొట్టును.

తా.—ఆ స్త్రీలు కామక్రీడలం దేలినపిమ్మట ప్రియతములు కౌఁగిలింతలను సడలింపఁగా ఆక్రీడలచేనయిన యాచెమటలయవయవములయలయికను మేఘా వరణము తొలఁగుటచే పట్టపగటివలె ప్రకాశించువెన్నెలకు కరంగుచున్నచంద్ర కాంతమణులు మేలుకట్టులోనిదారముల వ్రేలుచుండునవి చిలికెడుతుంపురులు హరించును.

వ.—'ప్రియ' అనుటచే పురుషులకు వేశ్యాంగనలతోడ కూలికిఁ గలుగు నీ రసక్రీడవలెఁగాక, భర్తృమాత్రులకు కళత్రమాత్రములతోఁ గలుగుఋతుకర్మవిశే షమువలెనుం గాక, ఆయక్షస్త్రీలకు తమదయితులతోడ కామరసావేశముతోడిక్రీడ కలుగుననియు, 'తమ' అనుటచే అత్యంతమోహావేశముతో క్రీడించునావల్లభులు నిర్ద యాలింగన చుంబన రదనక్షతాది కామకృత్యవిశేషములచే, 1 'అఙ్గ' ఒకొక్క యవయవమును నలిపివేసి గాసిపెట్టుదు రనియు, రతమాత్రమున నైన నింతయలఁత వొడమదు, 'సు' రత మనుటచే మనోరథపూరకమైన రతముగాన ఇంతయు పొడము ననియు 'త్వత్ సంరోధ అపగమ'—'ఓ మేఘమా, క్రీడాకాలమందు నీసంరోధము మునుఁగుఁ జీఁకటినొసంగి 2సమీరణప్రచారమును మందపఱిచి యుపకారకమైన ట్లే, తదనంతరమును నీయపగమము ఉపకారకముగాన, నీవు తదనంతరము అవలికి జరు

1 తవ న జానే హృదయం । మమ పున ర్మదనో దివాపి రాత్రిమపి
నిర్ఘృణ తపతి బలవత్ । త్వయి యుక్తమనోరథా న్యఙ్గాని. శకుంత.
ఇందు 'అఙ్గాని' అనుబహువచనప్రయోగముం బరికింపుఁడు.

2 'శీతలాదివ సంత్రస్తం ప్రావృషేణ్యా న్నభస్వతః
నభో బభార నీరన్ధ్రం జీమూతకులకమ్బళమ్.'

గుము' అనియు, 'అపగమవిశదైః' మేఘము జరిగినవెంటనే ప్రకాశింపఁదొడఁగుటచే అంతవఱకు క్రీడాసమయమందు దూరమందుండి తదనంతరము తమపని చేయవచ్చిన (ఘాజ్ఞా) సేవకులవడువున చంద్రపాదములు అగపడి వారిని సేదదేర్చుట యనుతమ పనికి సంవిధాన మారంభించు ననియు, 'తన్తుజాలావలమ్బాః' అనుటచే మేఘావరణాపగమమువలన పిల్లతెమ్మెరలు వీవందొడంగుడు దారముల వ్రేలుచంద్రకాంతములు వెనుకకు ముందునకు ఊఁగులాడఁదొడంగును గావున, అంతవఱకు నిశ్చలముగానున్న యాచంద్రకాంతముల యిప్పటియూయాఁగులాట, అవి క్రీడాసమయమందు ఎడనీయుండి తదనంతరము అప్పుడే సేదదేర్చుట యను తమపనికై వచ్చినట్లు అగపడు ననియు, 'లవ' అనుటచే స్థూలబిందువులయిన దుస్సహములగునుగాన వన్నీరుచిలికి నట్లుసన్నముగా తుపారము వ్యాపించుచుండు ననియు, 'చన్ద్రికాన్తాః' చంద్రుని ప్రియమిత్రులు గావున, చన్ద్ర 'పాదైః' చంద్రునికాలిచప్పుడు విన్నమాత్రన తదాశయ మెఱిఁగి పనిచేయఁగదలు ననియు, 'వ్యా'లుమ్పన్తి యనుటచే ఈచంద్రకాంతతుషారము రతిగ్లానిని చక్కఁగా నివారించు ననియు, 'నిశీథే' అనుటచే నిత్యోత్కటయావనులైన యక్షులరతము 'యామమాత్రం సహస్వ' యని ముందు చెప్పఁబడురీతిగా యామకాలపరిమితముగావునను రాత్రి త్రియామగావునను రతాంతకాలము నిశీథ మగు ననియు, భావము.

నేత్రా నీతాః సతతగతినా యద్విమానాగ్రభూమీ
రాలేఖ్యానాం స్వజలకణికాదోష ముత్పాద్య సద్యః,
శఙ్కాస్పృష్టాఇవ జలముచ స్త్వాదృశో జాలమార్గై
ర్ధూమోద్గారానుకృతినిపుణా జర్జరా నిష్పతన్తి. 9.

నేత్రేతి.—హేమేఘ, నేత్రా = ప్రేరకేణ, సతతగతినా = సదాగతినా - వాయునా + 'మాతరిశ్వా సదాగతిః' ఇత్యమరః, యద్విమానాగ్రభూమీః - యస్యాః = అలకాయాః - విమానానాం = సప్తభూమికభవనానామ్ = అగ్రభూమీః = ఉపరిభూమికాః, నీతాః = ప్రాపితాః, త్వామివ పశ్యన్తి యాః తే త్వాదృశః - త్వత్సదృశా ఇత్యర్థః * 'త్యదాదిషు దృశోఽనాలోచనే కఞ్చ' ఇతి కఞ్ప్రత్యయః, జలముచః = మేఘాః, ఆలేఖ్యానాం = సచ్చిత్రాణాం + 'చిత్రం లిఖితరూపం స్యాదాలేఖ్యం తు ప్రయత్నతః । నిర్మితోత్తమ చిత్రమ్' ఇతిశబ్దార్ణవే, స్వేషాం - జలకణికాభిః = జలకణైః - దోషం = స్ఫుటనమ్, ఉత్పాద్య, సద్యః, శఙ్కాస్పృష్టా ఇవ = సాపరాధత్వా ద్భయావిష్టా ఇవ + 'శఙ్కా వితర్క భయయోః' ఇతి శబ్దార్ణవే, ధూమోద్గారస్య = ధూమనిర్గమస్య - అనుకృతౌ = అనుకరణే - నిపు

ణాః = కుశలాః, జర్జరాః = విశీర్ణాః సన్తో, జాలమార్గైః = గవాక్షరన్ధ్రైః, నిష్పతన్తి=నిష్క్రామన్తి; యథా కేనచిదన్తఃపురసంచారవతా దూతేన గూఢవృత్త్యా రహస్యభూమిం ప్రాపితాస్తత్ర స్త్రీణాం వ్యభిచారదోష ముత్పాద్య సద్యః సాశఙ్కాః కృతవేషాన్తరా జారాః క్షుద్రమార్గైర్నిష్క్రామన్తి తద్వదితి ధ్వనిః. ప్రకృతార్థే శఙ్కాస్పృష్టా ఇవేత్యుత్ప్రేక్షా.

(హే మేఘ = ఓ మేఘుఁడా), నేత్రా = ప్రేరకుఁడైన, సతతగతినా = వాయువుచేత, యద్వి - భూమీః —యత్ = ఆయలకాపట్టణముయొక్క - విమాన = ఏడంతస్తుల మేడల - అగ్రభూమీః = పైయంతస్తులను, నీతాః = పొందింపఁబడినవై, త్వాదృశః = నీవంటి, జలముచః = మేఘములు, ఆలేఖ్యానామ్=శ్రేష్ఠమయిన చిత్తరువులకు, స్వజ...దోషమ్ - స్వ = తమయొక్క - జలకణికా = నీటిబిందువులచేతనైన - దోషమ్ = (పొక్కుటయను) చెఱుపును, ఉత్పాద్య=కలిగించి, సద్యః = తత్క్షణమే, శఙ్కాస్పృష్టాఇవ = (సాపరాధము లగుటచే) భయపడినవో యనునట్లు, ధూమో...పుణాః - ధూమ = పొగయొక్క - ఉద్గార = వెలువడుటయొక్క - అనుకృతి = అనుకరణమందు - (అనఁగా వెలువడుచున్నపొగయొక్క రూపమును ధరించుటయందు), నిపుణాః = నేర్పరులై, జర్జరాః = సడలినవై, జాలమార్గైః = కిటికీదారులగుండ, నిష్పతన్తి = వెలువడును.

తా.—సర్వదా గమనశీలమైన వాయువుచే ఆయలకాపురిమందలి యేడంతస్తుల మేడలయొక్క పైయంతస్తున ప్రవేశపెట్టఁబడినవై నీవంటిమేఘములు ప్రశస్తములయినయచటిచిత్తరువులను తమచినుకులచే తడిపి పొక్కునట్లు చేసి ఆతప్పునకై తమకు దండన కలుగునని భయపడినవియుంబోలె ఆభయముచే మాఱురూపము దాల్చి మాటిపోవుచున్నవియుం బోలెను సడలి పొగవంటిరూపమును దాల్చి కిటికీలగుండ వెలువడుచుండును. మేఘములయొక్క యీచర్య ఎట్లున్న దన—జారులు అంతఃపురసంచారముగల యొడకాఁడయిన దూత అంతిపురి నేకాంతస్థలమునకు రహస్యముగా తమ్ము ప్రవేశపెట్టఁగా అచటి స్త్రీలకు శీలభ్రంశము కలిగించి భయము చెంది మాఱువేషము వేసికొని క్షుద్రమార్గముల వెలువడుదురుగదా—అట్లున్నది.

వ.—మేడ లత్యున్నతము లని భావము.

అక్షయ్యాన్తర్భవననిధయః ప్రత్యహం రక్తకణ్ఠై
రుద్గాయద్భిర్ధనపతియశః కిన్నరైర్యత్ర సార్ధమ్
వైభ్రాజాఖ్యం విబుధవనితావారముఖ్యాసహాయా
బద్ధాలాపా బహిరుపవనం కామినో నిర్విశన్తి. 10.

అక్షయ్యేతి.—యత్ర = అలకాయాం, క్షేతుం శక్యాః క్షయ్యాః * 'క్షయ్య జయ్యౌ శక్యార్థే' ఇతి నిపాతః - తతో నఞ్సమాసః - భవనానా మన్తర న్తర్భవనమ్ * అవ్యయీభావసమాసః - అక్షయ్యా అన్తర్భవనం నిధయో యేషాం తే తథోక్తాః - యథేచ్ఛభోగసంభావనార్థ మిదం విశేషణం, విబుధవనితాః = అప్సరసః. తా ఏవ - వారముఖ్యాః = వేశ్యాః - తా ఏవ సహాయా యేషాం తే తథోక్తాః + 'వారస్త్రీ గణికా వేశ్యా రూపాజీ వాథ సాజనైః। సత్కృతా వారముఖ్యా స్యాత్' ఇత్యమరః, బద్ధాలాపాః=సందానిత సల్లాపాః, కామినః-కాముకాః, ప్రత్యహమ్= అహన్యహని * 'అవ్యయం విభక్తి—' ఇత్యాదినావ్యయీభావః + 'అనశ్చ'— ఇతి సమాసాన్త ష్టచ్ * 'అహ్నష్టఖో రేవ—' ఇతి టిలోపః, రక్తః = మధురః. కణ్ఠాః=కణ్ఠధ్వనిః - యేషాం తే తైః - రక్తకణ్ఠైః = సున్దరకణ్ఠధ్వనిభిః, ధనపతియశః = కుబేరకీర్తిమ్, ఉద్గాయద్భిః = ఉచ్చైర్గాయద్భిః - దేవగానస్య గాన్ధారగ్రామప్రాయత్వా త్తారతరం గాయద్భి రిత్యర్థః, కిన్నరైః, సార్ధం=సహ, విభ్రాజ స్యేదం వైభ్రాజమ్, వైభ్రాజ మిత్యాఖ్యా యస్య త ద్వైభ్రాజాఖ్యమ్ † 'విభ్రాజేన గణేన్ద్రేణ త్రాతం వైభ్రాజ మాఖ్యయా' ఇతి శబ్దరహస్యే - చైత్రరథస్య నామాన్తర మేతత్, బహిరుపవనం = బాహ్యోద్యానం, నిర్విశన్తి = అనుభవన్తి.

యత్ర=ఆయలకాపురమందు, అక్ష...ధయః.—అక్షయ్యా=తఱుఁగశక్యముగాని-అన్తర్భవన=ఇంటిలోపలి-నిధయః=నిధులుగలవారు-(ఈవిశేషణము యక్షులకు యథేచ్ఛభోగములు కలవని తెలుపుటకు), విబు...హాయాః-విబుధవనితా=అప్సరసలనెడు-వారముఖ్యా = జనసత్కృతలయినవేశ్యలు-సహాయాః=సహచారిణులుగాఁగలవారై, బద్ధాలాపాః=మాటలు మాని-లేక-సల్లాపములాడుచు, కామినః=కాముకులు,ప్రత్యహమ్=ప్రతిదినము, రక్తకణ్ఠైః-రక్త=మధురమైన-కణ్ఠైః=గొంతుకలవారైన, (అందుచేతనే); ధనపతియశః = కుబేరునికీర్తిని, ఉద్గాయద్భిః-(దేవగానము గాంధారగ్రామప్రాయముగా నుండుగావున) పైస్థాయిలో పాడుచున్న, కిన్నరైః సార్ధమ్ = కిన్నరులతోఁ గూడ, వైభ్రాజాఖ్యమ్ - వైభ్రాజ = వైభ్రాజమను - ఆఖ్యమ్ = పేరిటిదైన, బహిరుపవనమ్ = బాహ్యోద్యానమును, నిర్విశన్తి = అనుభవింతురు.

తా.—ఆయలకాపురమందు ఇండ్లలో, తఱుఁగనినిధానములుకలవారు అందుచేతనే సకలభోగములను సంపాదింప సమర్థులయినకాముకులు అప్సరసలనెడు వారాంగనామతల్లికలను తోడ్కొని చైత్రరథ మనుబాహ్యోద్యానమునకుఁబోయి అచట మధురమైనకంఠముతో కిన్నరులచే కుబేరునికీర్తిని పైస్థాయియందు పాడిం

ఘచు (క్షణమాత్రాంతరాయమైనను ఓర్వమిచే మాటలాడక-లేక-సల్లాపములాడుచు) ఆలించుచు ఆనందింతురు; ఉద్యానవిహారాది వినోదములంగూడఁ దేలుదురు.

గత్యుత్కమ్పా దలకపతితై ర్యత్ర మన్దారపుష్పైః
పత్త్రచ్ఛేదైః కనకకమలైః కర్ణవిభ్రంశిభి శ్చ
ముక్తాజాలైః స్తనపరిసరచ్ఛిన్నసూత్రైశ్చ హారై
ర్నైశో మార్గః సవితు రుదయే సూచ్యతే కామినీనామ్. 11.

గతీతి —యత్ర-అలకాయాం, కామినీనామ్ = అభిసారికాణామ్ + 'కాన్తార్థినీ తు యా యాతి సంకేతం సాభిసారికా' ఇత్యమరః, నిశి భవో నైశో మార్గః-సవితుః = సూర్యస్య-ఉదయే సతి, గత్యా = గమనేన - ఉత్కమ్పః=చలనం-తస్మాద్ధేతోః అలకేభ్యః పతితైః,మన్దారపుష్పైః=సురతరుకుసుమైః, తథా, పత్త్రాణాం=పత్త్రలతానాం - ఛేదైః-ఖణ్డైః-పతితై రితి శేషః, తథా, కర్ణేభ్యో విభ్రశ్యన్తీతి కర్ణవిభ్రంశీని తైః కనకస్య కమలైః కనకకమలై శ్చ * షష్ఠ్యా వివక్షితార్థలాభే సతి మయటా విగ్రహేఽధ్యాహారదోషః - ఏవ మన్యత్రా ప్యనుసంధేయం, తథా, ముక్తాజాలైః = మౌక్తికసరైః - శిరోనిహితై రిత్యర్థః, తథా, స్తనయోః - పరిసరః = ప్రదేశః - తత్ర ఛిన్నాని సూత్రాణి యేషాం తైర్హారై శ్చ, సూచ్యతే జ్ఞాప్యతే. మార్గపతితమన్దారకుసుమాదిలిఙ్గై రయ మభిసారికాణాం పన్థా ఇతి ద్రష్టృభి రనుమీయత ఇత్యర్థః.

యత్ర = ఆయలకాపురమందు, కామినీనామ్ = అభిసారికలయొక్క (అభిసారిక యనఁగా కాంతునిం గవయుటకై సంకేతస్థానమునకుఁ బోవు స్త్రీ)), నైశః = రాత్రిదైన (అనఁగా వారు రాత్రి నడచిపోయిన)-మార్గః-దారి, సవితుః = సూర్యునియొక్క, ఉదయే = ఉదయము కాఁగానే, గత్యుత్కమ్పాత్ — గతి = గమనముచేత నయిన - ఉత్కమ్పాత్=చలనముపలన, అలకపతితైః — అలక = కురులనుండి - పతితైః = పడినవైన, మన్దారపుష్పైః = కల్పవృక్షపుఁబువ్వులచేతను, (అట్లే), పత్త్రచ్ఛేదైః —పత్త్ర = మకరికాపత్త్రములయొక్క - ఛేదైః = (క్రిందఁబడిన) ఖండములచేతను, కర్ణ = చెవినుండి - విభ్రంశిభిః=జాఱిపడినవైన, కనక కమలైశ్చ = పసిఁడి తామరలచేతను, ముక్తాజాలైః = (తలనుఁ దాల్పఁబడిన) ముత్తెపుసరులచేతను, (అట్లే), స్తన = కుచములయొక్క - పరిసర = చెంతను - ఛిన్న = పెరిగిపోయిన - సూత్రైః = దారములుగలవైన, హారైః = ముత్యాలపేరులచేతను, సూచ్యతే= తెలుపఁబడుచున్నది. దారిలో రాలియుండు

మందారకుసుమాది లింగములచే ఈదారిని అభిసారికలు పోయిరని చూపఱు ఊహింతు రని యర్థము

తా.—ఆయలకాపురమందు అభిసారికలు కాంతార్థినులై అలంకరించుకొని సంకేత స్థానములకుఁ బోవునప్పుడు నడుకతొట్రుపాటువలని కంపముచేత తలనుండి మందారపుష్పములును, చెక్కులనుండి మకరికాపత్త్రిఖండములును, వీనులనుండి పసిఁడి తామరలును, కొప్పునుండి ముత్తెపుసరులును, స్తనతటమునుండి తెగిగి హారములును, నేల రాలఁగా, వానిని తెల్లవాఱఁగానే కని ఆగుర్తులచేత లోకులు రాత్రి ఆకామినులు పోయినమార్గములను తెలిసికొందురు.

వ.—మందారపుష్పాదులు కంకణాదులవలె దృఢనిబద్ధములు గావు గాన రాలుననియు,(సవిత యనఁగా (పేరకుఁడును గావున) సూర్యుఁడు తాను వచ్చియు రాకమునుపే వేడుకకాఁడై ఆయభిసారికలగుట్టు బయటవేసి లోకులకు కుతూహలము కలిగించుననియు భావము. 'హారైః' అనుటచేతనే స్తనములు గమ్యమగుచుండఁగా మరల 'స్తనపరిసర' అనుటచే హారముల మకరికాపత్త్రిచ్ఛేదములు మొదలయినవి రాలుట గత్యుత్కంపముమాత్రమే గాక సిద్ధింపఁబోవు వల్లభునిపొందును తలంచుకొనుటచేఁ గలిగినట్టివి- 1 చనుఁగవ యుబుకుకొందుట చెక్కిళ్లు గగుర్కొనుట చెమర్చుట లోనగు కామేంగితములు కూడ తోడ్పడె ననియు భావము. అభిసారికలు భూషణములను చప్పుడుకాకుండుటకై గాని వానిని ధరియింపకుండ ప్రియులను గూర్చి పోరు. 'కామినీనామ్' అనుట కామాతిశయముచే కాంతధ్యానపరవశలై యభిసరించునప్పుడు పుష్పపతనాదికమును కేవు తమగుట్టు బయటపెట్టుదానిని తెలియఁజాల రని-భావ్యనర్థము లాలోచింపక సంకేతములకు ప్రి[illegible]సంగమార్థ మేఁగుదు రని - భావము.

మత్వా దేవం ధనపతిసఖం యత్ర సాక్షా ద్వస న్తం
ప్రాయ శ్చాపం న వహతి భయా న్మన్మథః షట్పదజ్యమ్,
సభ్రూభఙ్గప్రహితనయనైః కామిలక్ష్యే ష్వమోఘై
స్తస్యారమ్భ శ్చతురవనితావిభ్రమై రేవ సిద్ధః. 12.

---

1 తద్వక్త్రాభిముఖం ముఖం వినమితం, దృష్టిః కృతా పాదయోః,
తత్సల్లాపకుతూహలాకులతరే శ్రోత్రే నిరుద్ధే మయా,
పాణిభ్యాం చ తిరస్కృతః సపులకః స్వేదోద్గమో గణ్డయోః,
సఖ్యః కిం కరవాణి యాన్తి శతధా మత్కఞ్చుకే సంధయః. అమరు.

పూర్వమేఘము 36-వ పుటలోనిజ్ఞాపికం గనుఁడు.

మత్వేతి.—యత్ర = అలకాయాం, మన్మథః = కామః, ధనపతేః (కుబేరస్య) సఖేతి ధనపతిసఖః * 'రాజాహః సఖిభ్యష్టచ్' - తం దేవం = మహాదేవం, సాక్షాద్వసన్తం = సఖిస్నేహాన్నిజరూపేణ వర్తమానం, మత్వా = జ్ఞాత్వా, భయాత్ = ఫాలేక్షణభయాత్, షట్పదా ఏవ జ్యా (మౌర్వీ) యస్య తం చాపం, ప్రాయః = ప్రాచుర్యేణ, న వహతి = న బిభర్తి; కథం తర్హి తస్య కార్యసిద్ధిరిత్యత ఆహ 'సభ్రూభఙ్గే'తి—తస్య = మన్మథస్య, ఆరమ్భః = కామిజనవిషయో విజయవ్యాపారః, సభ్రూభఙ్గం యథాతథా-ప్రహితాని = ప్రయుక్తాని-నయనాని = దృష్టయో-యేషు తై స్తథోక్తైః, కామిన ఏవ లక్ష్యాణి తేషు - అమోఘైః = సఫలప్రయోగై రిత్యర్థః - మన్మథచాపోఽపి క్వచిదపి మోఘః స్యా దితి భావః, చతురా శ్చ తా వనితా శ్చ తాసాం - విభ్రమైః = విలాసై, రేవ, సిద్ధో=నిష్పన్నః, య దనర్థకరం పాక్షికఫలంచ తత్ప్రయోగా ద్వరం నిశ్చితసాధనప్రయోగ ఇతి భావః.

యత్ర = ఆయలకాపురమందు, మన్మథః = మదనుఁడు, ధనపతి సఖమ్ = కుబేరుని చెలికాఁడయిన, దేవమ్ = దేవుని (అనఁగా హరుని), సాక్షాత్ వసన్తమ్=(సఖునిమీఁది స్నేహముచే) నిజరూపముతో నున్నవానిని, మత్వా = తలంచి, భయాత్ = ఫాలేక్షణభయమువలన, షట్పద జ్యమ్ = తుమ్మెదలు నారిగాఁగలదైన, చాపమ్ = వింటిని, ప్రాయః = ప్రచురముగా, నవహతి = (చేతఁ) బూనఁడు; (అట్లయిన నతనికి కార్యసిద్ధి యెట్లనినఁ జెప్పుచున్నాఁడు), తస్య = ఆమన్మథుని యొక్క, ఆరమ్భః = కామిజనవిషయజయవ్యాపారము, సభ్రూభఙ్గమ్ = బొమముడితోఁగూడ, ప్రహితనయనైః—ప్రహిత = ప్రయోగింపఁబడిన - నయనైః = నేత్రములుగలవియు, కామి లక్ష్యేషు = కాముకులనెడు గుఱులయందు, అమోఘైః = వ్యర్థముగానివియు, నయిన, (మదనుని చాపము ఒకవేళ తప్పినను తప్పనని భావము), చతు...భ్రమైః - చతుర = చదురుగత్తెలయిన - వనితా= స్త్రీలయొక్క- విభ్రమై రేవ = విలాసములచేతనే, సిద్ధః = నెఱవేఱుచున్నది; వ్యర్థమును పాక్షిక ఫలము నగుసాధనమును ప్రయోగించుటకంటె నిశ్చితఫలమగు సాధనమును ప్రయోగించుట మే లనుట.

వ.—'ధనపతిసఖమ్' - ధనముగలవానిచెలికానికి భయపడుట లోకములో కలిగినదే యనియు, చెలిమిచేతనే మహేశ్వరుఁడు అచట నిజరూపముతో కైలాసమున నివసించియున్నాఁ డనియు, 'షట్పదజ్యమ్'-తనవింటినారి (తుమ్మెదలు) ఝుంకారముచే తనరాక హరునికి తెలిపి తనకు ముప్పతెచ్చునని మదనునికి భయమనియు

తుష్మైదనారివిల్లుగాక వేఱువిండ్లచే అనఁగా చదురుగత్తెల కనుబొమవిండ్లచే మదనుని కార్యము నెఱవేఱుచున్నదనియు, 'లక్ష్య' అనుటచే బొమలు విండ్లుగాను చూపులు బాణములుగాను నున్నవనియు, 'కామిలక్ష్యేషు' - అనుటచే వీతరాగలక్ష్యములనే లోఁబఱుచునట్టియాబొమవిండ్లకును చూపుఁదూపులకును కామిలక్ష్యములు ఏపాటి! అనియు, 'అమోఘైః'—మదనునిచాపబాణములు ఒకవేళ తప్పినను దప్పవనియు, సందిగ్ధఫలమగు స్వచాపవ్యాపారమునకు ఆటంకము గలిగినను అంతకన్న నుత్తమ సాధనములచేత మదనునిపని మేలే ఆయెననియు భావము.

వాస శ్చిత్రం మధు నయనయో ర్విభ్రమాదేశదక్షం
పుష్పోద్భేదం సహ కిసలయై ర్భూషణానాం వికల్పాన్
లాక్షారాగం చరణకమలన్యాసయోగ్యం చ యస్యా
మేకః సూతే సకల మబలామణ్డనం కల్పవృక్షః. 13.

†'కచధార్యం దేహధార్యం పరిధేయం విలేపనం। చతుర్ధా భూషణం ప్రాహుః స్త్రీణా మన్యచ్చ దైశికమ్'ఇతి రసాకరే, తదే వైతదాహ వాస ఇతి.—యస్యామ్ = అలకాయాం, చిత్రం = నానావర్ణం, వాసః = వసనం - పరిధేయమణ్డన మేతత్, నయనయో ర్విభ్రమాణామ్ - ఆదేశే = ఉపదేశే - దక్షమ్, అనేన విభ్రమద్వారా మధునో మణ్డనత్వ మిత్యవధేయం - తచ్చ కుణ్డలాదివ ద్దేహధార్యేఽన్తర్భావ్యం, మధు=మద్యం, కిసలయైః = పల్లవైః, సహ, పుష్పోద్భేదం = కుసుమోదయమ్, ఉభయంచేత్యర్థః, ఇదం తు కచధార్యం, భూషణానాం, వికల్పాన్ = విశేషాన్, దేహధార్య మేతత్, తథా చరణకమలయోః-న్యాసస్య=సమర్పణస్య-యోగ్యం, రజ్యతేఽనేనేతి రాగో రఞ్జకద్రవ్యం-లాక్షైవ రాగః లాక్షారాగః తమ్, ఇదం చాఙ్గరాగాదివిలేపనమణ్డనోపలక్షణం, సకలం = సర్వం - చతుర్విధ మపీత్యర్థః, అబలామణ్డనం = యోషిత్ప్రసాధనజాతమ్, ఏకః కల్పవృక్ష ఏవ, సూతే = జనయతి, నతునానాసాధన సంపాదనప్రయాస ఇత్యర్థః.

కచధార్యము దేహధార్యము పరిధేయము విలేపనము నని స్త్రీభూషణములు నాలుగువిధములు, ఇతరము దైశిక మనఁబడును, అదే చెప్పుచున్నాఁడు:—

యస్యామ్ = ఆయలకాపురమందు, చిత్రమ్ = నానావర్ణములుగల, వాసః = వస్త్రమును (ఇది పరిధేయమండనము), నయనయోః = నేత్రములకు, వి...క్షమ్ —విభ్రమ = విలాసముయొక్క - ఆదేశ=ఉపదేశమందు (అనఁగా, - చూపులకు విలాసములు కలిగించుటయందు) - దక్షమ్ = సమర్థమైన, మధు = మద్యమును (విభ్రమము ద్వారముగా మద్యమునకు మండనత్వ మని యెఱుంగవలయును.-అది

ఖండలాదులవలె దేహధార్యమందు అంతర్భూత మయినది), కిసలయైః సహ = చివుళ్లతోఁ గూడ, పుష్పోద్భేదమ్—పుష్ప = పువ్వులయొక్క - ఉద్భేదమ్ = ఉదయమును (పూతను) (అనఁగా - చివుళ్లను పువ్వులను రెండింటిని-ఇది కచధార్యము), భూషణానామ్ = ఆభరణములయొక్క, వికల్పాన్ = విశేషములను (వేఱువేఱు భూషణములను - ఇది దేహధార్యము), (కిం) చ = మఱియు, చర...యోగ్యమ్—చరణకమల = తామరవంటియడుగులయందు - న్యాస = ఉంచుటకు - యోగ్యమ్ = తగినదైన, లాక్షారాగమ్ = లత్తుకరంగును (ఇది అంగరాగము మొదలయిన విలేపనమండనమునకు ఉపలక్షణము), సకలమ్=(ఈ) సమస్తమయిన (అనఁగా నాలుగు విధములయిన), అబలా మణ్డనమ్ = స్త్రీ భూషణమును, ఏకః కల్పవృక్షః = కల్పవృక్షము, సూతే = కనుచున్నది; వారికి నానాలంకార సంపాదనప్రయాసము లేదని యర్థము.

తా.—అలకాపురమందు అంగనలకు పరిధేయమండనమయిన పలువన్నెల వస్త్రమును, చూపులకు విలాసములు కలుగఁజేయుటచే దేహధార్యమండనములో చేరునదైన మద్యమును, కచధార్యమండనములయిన చివుళ్లను పుష్పములను, పాదకమలములకు పారాణియై విలేపనమండనములో అంతర్భూతమయిన లత్తుకరంగును, నాలుగువిధములయిన స్త్రీమండనములను, కల్పవృక్షమే ఇచ్చుచున్నది. వారికి అలంకారసంపాదనప్రయాసము లేదు.

తత్రాగారం ధనపతిగృహా నుత్తరే ణాస్మదీయం,
దూరా ల్లక్ష్యం సురపతిధనుశ్చారుణా తోరణేన
యస్యోపాన్తే కృతకతనయః కాన్తయా వర్ధితో మే
హస్తప్రాప్యస్తబకనమితో బాలమన్దారవృక్షః. 14.

ఇత్థ మలకాం వర్ణయిత్వా తత్ర స్వభవన స్యాభిజ్ఞాన మాహ - తత్రేతి—తత్ర = అలకాయాం, ధనపతిగృహాన్ = కుబేరగృహేభ్యః, ఉత్తరేణ = ఉత్తరస్మి న్నదూరదేశే * 'ఏన బన్యతరస్యా మదూరేఽపఞ్చమ్యాః' ఇ త్యేనప్ప్రత్యయః- అవ్యయ మేతత్ * 'ఏనపా ద్వితీయా' ఇతి ద్వితీయా + 'గృహాః పుంసి చ భూమ్న్యేవ' ఇత్యమరః - 'ధనపతిగృహా 'దితి పాఠే 'ఉత్తరేణ' ఇతి నైనప్ప్రత్యయాన్తం, కింతు 'తోరణేన' ఇత్యస్య విశేషణం తృతీయాన్తం - ధనపతిగృహా దుత్తరస్యాం దిశి యత్తోరణం బహిర్ద్వారం తేన లక్షిత మిత్యర్థః, అస్మాక మిద మస్మదీయం * 'వృద్ధాచ్ఛః' ఇతి ఛప్రత్యయః, అగారం = గృహం, సురపతిధనుశ్చారుణా

= మణిమయత్వా దభ్రభఙ్గురత్వా చ్చేన్ద్రచాపసున్దరేణ, తోరణేన=బహిర్ద్వారేణ + 'తోరణోఽస్త్రీ బహిర్ద్వారమ్' ఇత్యమరః, దూరాత్, లక్ష్యం=దృశ్యమ్, అనేనాభిజ్ఞానేన దూరత ఏవ జ్ఞాతుంశక్య మిత్యర్థః; అభిజ్ఞానాన్తరమాహ - యస్యాగారస్య, ఉపాన్తే=ప్రాకారాన్తఃపార్శ్వదేశే, కాన్తయా, వర్ధితః = పోషితః, కృతకతనయః=కృత్రిమ సుతః - పుత్త్రత్వే నాభిమన్యమాన ఇత్యర్థః, హస్తేన ప్రాప్యైః = హస్తావచేయైః - స్తబకైః = గుచ్ఛైః-నమితః - స్తబకభారా ల్లమ్బమాన ఇత్యర్థః + 'స్యాద్గుచ్ఛకస్తు స్తబకః' ఇత్యమరః, బాలః = కోమలః, మన్దార వృక్షః=కల్పవృక్షః, అస్తీతి శేషః.

ఇట్లు అలకాపురమును వర్ణించి అందు తనయింటిని గుర్తులతో వర్ణించుచున్నాఁడు:—

తత్ర = ఆయలకాపురమునందు, ధనపతి గృహాత్ = కుబేరుని యింటికి, ఉత్తరేణ = ఉత్తరమునదగ్గఱఁగా, అస్మదీయమ్ = మాదైన, అగారమ్ = ఇల్లు, సుర...రుణా—సురపతిధనుః = (మణిమయమయినందుచేతను అభ్రంకషమయినందుచేతను) ఇంద్రాయుధమువలె - చారుణా = అందమయిన, తోరణేన=బహిర్ద్వారముచేత, దూరాత్ = దూరమునుండి, లక్ష్యమ్ = చూడశక్యమయినది (అగపడునది), ఈగుర్తుచేత దూరమునుండియే కనిపట్టుటకు శక్య మని యర్థము; ఇంకొక గుర్తును చెప్పుచున్నాఁడు:—యస్య = ఆలోఁగిటియొక్క, ఉపాన్తే=సమీపమందు (ప్రాకారములోపలిప్రక్కను), మే = నాయొక్క, కాన్తయా=ప్రియచేత, వర్ధితః =పెంపఁబడినదియు, (అందుచేతనే), కృతకతనయః=కృత్రిమపుత్త్రుఁడయినదియు - అనఁగా పుత్త్రుఁడుగా అభిమానింపఁబడినదియు, హస్త...మితః—హస్త=చేతితో - ప్రాప్య = అందుకొనశక్యమయిన - స్తబక = పూగుత్తులచేత - నమితః=వంపఁబడినదియు, (అయిన), బాలమన్దారవృక్షః = లేఁతమందారవృక్షము, (అస్తి = కలదు).

తా.—ఆయలకాపురమందు మాయిల్లు కుబేరునిమందిరమునకు ఉత్తరమున దగ్గఱఁగా నున్నది - మాయింటిని దూరమునుండియే కనుంగొనుటకు ఒకగుర్తుగలదు - ఏదనఁగా - నానామణిమయమై మబ్బుల నొరయుచు ఇంద్రధనుస్సువలె అందముగా ప్రకాశించుచుండు బహిర్ద్వారము; మాయింటికి మఱియొకగుర్తు కలదు - ఏదనఁగా - మాయింటిప్రక్కను ప్రాకారమునకు లోపలివైపున నాభార్యచే పెంపఁబడి చేతికందెడుపూగుత్తులతో వంగియుండు బాలమందారవృక్షము.

ప.—కుబేరునియింటికి యక్షునియిల్లు దక్షిణమందున్న దనక ఉత్తరమందున్న దనుట యేల యనఁగా - నేత్రోత్సవమయిన యీ ధనపతిమందిరమును దర్శించుటకు

మేఘుఁడు ప్రయత్నాంతరముతో వెదకికొని పోనక్కఱ లేదు - ఆనుషంగికముగా త్రోవలోనే తద్దర్శనముకూడసిద్ధించును - అని సూచించుటకు. ధనపతిమందిరమును యక్షుఁడు విస్తరించివర్ణింపమికి కారణమేమన-యక్షునితప్పు త్రిమూర్తులును దాఁటఁ జాలని మదనప్రతాపముచేత నేగాని వేఱొంటు సంభవించినది కాకయున్నను, అందు చేతనే క్షమింపఁదగినదై యున్నను, కనికరింపక ధనపతి శపించినాఁడను నసూయయే కారణము; 'దూరాల్లక్ష్యమ్' ఇతనియిల్లు ఉన్నతముగాన దూరమునకగపడు ననియు, అట్టియిల్లు గలవాఁడని చెప్పుటచే ఇతఁడును యక్షులలో గొప్పవాఁడే గాని సామాన్యుఁడు గాఁ డనియు, కనుకనే ఇతనియిల్లు 'ఉత్తరేణ' కుబేరునియింటి చెంత నున్నదనియు, భావము. 'సురపతిధనుశ్చారుణా' అనునుపమచే తోరణము మణిమయ మనియు, మేఘముల నెరయుచున్న దనియు, అందుచేతనే, ఇంద్రధనుస్సువలె నున్నదనియు తెలియవలయును. 'ఉపాన్తే'—బాలమందారవృక్షము కృతకపుత్త్రుఁ డగుటచే దగ్గఱనే పెంపఁబడుచున్నది. 'కాంతయా వర్ధితః'- 1 ప్రమదలకు ఇట్లు చిన్నవృక్షములయందు ప్రీతి ప్రసిద్ధమేగదా. 'హస్తప్రాప్యస్తబక'-చేతఁ బుణుకఁదగినవి పిల్లవాని నునుబుగ్గలు మొదలయినవి సూచింపఁబడు చున్నవి. 'నమితః' - వంగుట పూగుత్తుల విస్తారమును, ఆవిస్తారము పెంచిన ప్రేమను, సూచించుచున్నవి. 'హస్త...మితః' చేతులుచాఁచి యెత్తుకొమ్మని తల్లి మీఁదికి వాలుచున్న పుత్త్రునివలె అని, భావము.

వాపీ చాస్మి న్మరకతశిలాబద్ధసోపానమార్గా
హైమై శ్ఛన్నా వికచకమలైః స్నిగ్ధవైదూర్యనాళైః
యస్యా స్తోయే కృతవసతయో మానసం సన్నికృష్టం
నాధ్యాస్యన్తి వ్యపగతశుచ స్త్వామపి ప్రేక్ష్య హంసాః. 15.

ఇతః పరం పఞ్చభిః శ్లోకై రభిజ్ఞానా న్తర మాహ :—వాపీతి.—అస్మిన్ = మదీయాగారే, మరకతశిలాభిః = గారుత్మతమణిభిః - బద్ధః సోపానమార్గో యస్యాః సా తథోక్తా, విదూరేభవా వైదూర్యాః *'విదూరాఞ్ఞ్యః'ఇతి ఞ్యప్రత్యయః-వైదూర్యాణాం వికారా వైదూర్యాణి * వికారార్థేఽణ్ప్రత్యయః - స్నిగ్ధాని వైదూర్యాణి నాళాని యేషాం తైః, హైమైః=సౌవర్ణైః, వికచకమలై శ్ఛన్నా, వాపీ చ=

---

1 పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా,
నాదత్తే ప్రియమణ్డనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్,
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా మహా నుత్సవః,
సేయం యాతి శకున్తలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్, శాకుం.

దీర్ఘికా చ + 'వాపీ తు దీర్ఘికా' ఇత్యమరః, అస్తీతి శేషః, యస్యాః = వాప్యాః, తోయే = సలిలే, కృతవసతయః = కృతనివాసాః, హంసాః, త్వాం = మేఘం, ప్రేక్ష్యాపి = వీక్ష్యాపి, వ్యపగతశుచః = వర్షాకాలేఽప్యకలుషజలత్వా ద్వీతదుఃఖాః సన్తః, సంనికృష్టం = సంనిహితం - సుగమ మపీత్యర్థః, మానసం = మానససరః, నాధ్యాస్యన్తి = నోత్కణ్ఠిష్యన్తే * 'ఆధ్యాన ముత్కణ్ఠాపూర్వకం స్మరణమ్' ఇతి కాశికాయామ్.

ఇది మొదలు అయిదు శ్లోకములచే ఇంకను ఆనవాళ్లను చెప్పుచున్నాఁడు:—

అస్మిన్ = మాలోఁగిట, మర...మార్గా—మరకతశిలా = గరుడమణులతో - బద్ధ = కట్టఁబడిన - సోపానమార్గా = మెట్లదారికలదియు, స్నిగ్ధ...నాళైః—స్నిగ్ధ = మసృణమైన - వైదూర్య = వైదూర్యమణివికారమయిన - నాళైః = తూండ్లు గలవైన, హైమైః = సువర్ణవికారములయిన, వికచ కమలైః = వికసించిన కమలములచే, ఛన్నా = కప్పఁబడినదియు, నయిన, వాపీ చ = దిగుడుబావి యు, (అస్తి = కలదు), యస్యాః = ఆబావియొక్క, తోయే = జలమందు, కృత వసతయః = చేయఁబడిన నివాసముగలవైన - అనఁగా నివసించుచున్నవైన, హంసాః = మరాళములు, త్వామ్ = మేఘుని, ప్రేక్ష్యాపి = చూచియు, వ్యపగత శుచః = పోయిన - దుఃఖముగలవై - అనఁగా వర్షాకాలమందును ఆబావిజలము అకలుషముగా నుండుటచే దుఃఖము లేనివై, సన్నికృష్టమ్ = సమీపమందున్న (సులువుగా పోవుటకు శక్యమయినదైనను), మానసమ్ = మానససరోవరమును, నాధ్యాస్యన్తి = కోరవు.

తా.—మాలోఁగిటిలో దిగుడుబావి యొకటి గలదు. దానిమెట్లు గరుడమణిమయములు. అందు మెఱయుచుండు వైదూర్యనాళములుగల వికసించినబంగారపుఁదామరలు నీటిని అంతట కప్పియుండును. ఆజలము వర్షాకాలమునఁగూడ నిర్మలముగానే యుండుటచేత అందు స్థిరనివాసముగానే కుదిరినవై హంసలు మేఘమును గాంచియు సామీప్యముచే సులువుగానే పోఁదగినదానినైనను మానససరోవరమును తలపెట్టవు. మానసమునకన్న ఆదిగ్గియ రమణీయము.

వ.—'వికచ' - ఆబంగారుఁదామరలు వికసించియుండుటచే మఱియు చోటు ఆవరించును, వికసితములయిన కడు నేత్రోత్సవముగా నుండును - 'ఛన్నా' - కప్పఁబడినది - అనఁగా తామరలే అగపడునుగాని నీరు అగపడదు-తామరలు అంతవిస్తారముగా నున్నవి. 'కృత వసతయః—స్థిరముగా కాపురములు కుదుర్చుకొన్న వనియు-మానసమునకన్న నిదియే వానికి రమ్య మనియు-కృతశబ్దస్వారస్యము. 'సన్నికృష్టమ్'—దగ్గఱనున్నను పోవనుట ఈబావియొక్క రమణీయతాతిశయమును తెలుపుచున్నది.

తస్యాస్తీరే రచితశిఖరః పేశలై రిన్ద్రనీలైః
క్రీడాశైలః కనకకదలీవేష్టనప్రేక్షణీయః;
మద్గేహిన్యాః ప్రియ ఇతి సఖే చేతసా కాతరేణ
ప్రేక్ష్యోపాన్తస్ఫురితతడితం త్వాం తమేవ స్మరామి. 16.

తస్యా ఇతి.—తస్యాః = వాప్యాః, తీరే, పేశలైః = చారుభిః + 'చారౌ దక్షేచ పేశలః' ఇత్యమరః, ఇన్ద్రనీలైః, రచితశిఖరః = ఇన్ద్రనీలమణిమయశిఖర ఇత్యర్థః, కనకకదళీనాం - వేష్టనేన = పరిధినా - ప్రేక్షణీయః = దర్శనీయః, క్రీడార్థః శైలః క్రీడాశైలః, అస్తీతి శేషః, హే సఖే, ఉపాన్తేషు = ప్రాన్తేషు - స్ఫురితాః తడితః - యస్య తం తథోక్తమ్ - ఇదం విశేషణం కనకకదళీవేష్టనసామ్యార్థముక్తమ్ - ఇన్ద్రనీలసామ్యం తు మేఘస్య స్వాభావిక మితి త్వా మిత్యనేన సూచ్యతే, త్వాం, ప్రేక్ష్య = వీక్ష్య, మద్గేహిన్యాః ప్రియ ఇతి హేతోః - తస్య శైలస్య మద్గృహిణీప్రియత్వా ద్ధేతో రిత్యర్థః, కాతరేణ = భీతేన, చేతసా, భయం చాత్ర సానన్దమేవ † 'వస్తూనా మనుభూతానాం తుల్యశ్రవణదర్శనాత్ । స్మరణా త్రీత్రసానన్దా భీ ర్యథా భవేత్' ఇతి రసాకరే దర్శనాత్, తమేవ = క్రీడాశైలమేవ, స్మరామి, ఏవకారో విషయాన్తరవ్యవచ్ఛేదార్థః - సదృశవస్త్వనుభవాదిష్టార్థస్మృతి ర్జాయత ఇత్యర్థః; అత ఏ వాత్ర స్మరణాఖ్యోఽలంకారః - తదుక్తం † 'సదృశానుభవా దన్యస్మృతిః స్మరణ ముచ్యతే' ఇతి. నిరుక్తకారస్తు 'త్వాం తమేవ స్మరామి' ఇతి యోజయిత్వా మేఘే శైలత్వారోప మాచష్టే - త దసంగతమ్ - అనార్జవాత్ - అద్ర్యాకారారోపస్య పురోవర్తి న్యనుభవాత్మకత్వేన స్మరతిశబ్దప్రయోగాయోగాత్ - శైలత్వభావనాస్మృతి రిత్యపి నోపపద్యతే భావనాయాః స్మృతిత్వే ప్రమాణాభావా దారోప స్యానుపయోగా త్సాదృశ్యోపన్యాసవైయర్థ్యా చ్చ - విసదృశేఽపి సాలగ్రామే హరిభావనాదర్శనా దితి.

తస్యాః = ఆబావియొక్క, తీరే = ఒడ్డున, పేశలైః = అందములైన, ఇన్ద్రనీలైః = ఇంద్రనీలములతో, రచితశిఖరః - రచిత = చేయఁబడిన - శిఖరః = శృంగముకలదియు, కన...ణీయః - కనకకదళీ = బంగారు పుటరఁటులయొక్క - వేష్టన = చుట్టుకొనుటచేత - అనఁగా చుట్టును బంగారపుటరఁటు లుండుటచేత - ప్రేక్షణీయః = దర్శనీయమును, అయిన, క్రీడాశైలః = ఆటకొండ - ఆటకొఱకు కట్టింపఁబడిన కొండ, (అస్తి = కలదు), సఖే = ఓమిత్రుఁడా, ఉపా...తమ్ - ఉపాన్త = ప్రాంతములయందు - స్ఫురిత = విలసిల్లినట్టి - తటితమ్ = మెఱపుఁదీఁగలుగల - (కనకకదళీ

వేష్టనసామ్యార్థము ఈవిశేషణము చెప్పఁబడినది - ఇంద్రనీలసామ్యము మేఘమునకు స్వయముగానే కలదు - అది 'త్వామ్' అనుటచే సూచింపఁబడుచున్నది), త్వామ్ = నిన్ను, ప్రేక్ష్యాపి = చూచియు, మద్గేహిన్యాః ప్రియః ఇతి = (ఆక్రీడాశైలము) నా భార్యకు ప్రియ మనెడుహేతువునుబట్టి, కాతరేణ = భయపడుచున్న, చేతసా = మనస్సుతో, (ఇచట భయము ఆనందముతోఁగూడినదే), తమేవ = ఆక్రీడాశైలమునే, స్మరామి = తలంచుచున్నాను.

తా.—ఆబావియొద్దున క్రీడాశైల మొకటి యున్నది, దానిశిఖరము ఇంద్రనీలమణిమయము, దానిచుట్టును బంగారపుఅరఁటు లున్నవి. అట్లు ఆశైలము దర్శనీయమై యున్నది. అది నాప్రియతమకు ప్రియ మనుహేతువునుబట్టి నిన్ను ప్రాంతముల స్ఫురించుచున్నమెఱపులుగలవానిని కని (నీమెఱపులు ఆకనకకదళికలవలెను నీవు ఆశైలమువలెను ఉండుటచేత) ఆక్రీడాశైలమునే తలంచుచున్నాను.

రక్తాశోక శ్చలకిసలయః కేసర శ్చాత్ర కాన్తః
ప్రత్యాసన్నౌ కురవకవృతే ర్మాధవీమణ్డపస్య,
ఏకః సఖ్యా స్తవ సహ మయా వామపాదాభిలాషీ
కాఙ్క్ష త్యన్యో వదనమదిరాం దోహదచ్ఛద్మ నాస్యాః. 17.

రక్తేతి.—అత్ర = క్రీడాశైలే, కురవకా ఏవ - వృతిః = ఆవరణం-యస్య తస్య కురవకవృతేః, మధౌ (వసన్తే) భవా మాధవ్య స్తాసాం మణ్డప స్తస్య = అతిముక్తలతాగృహస్య + 'అతిముక్తః పుణ్డ్రకః స్యా ద్వాసన్తీ మాధవీలతా' ఇత్యమరః, ప్రత్యాసన్నౌ = సంనికృష్టౌ, చలకిసలయః = చఞ్చలపల్లవః, అనేన వృక్షస్య పాదతాడనేషు ప్రాఞ్జలిత్వం వ్యజ్యతే, రక్తాశోకః - రక్తవిశేషణం తస్య స్మరోద్దీపకత్వా దుక్తం † 'ప్రసూనకై రశోకస్తు శ్వేతో రక్త ఇతి ద్విధా। బహుసిద్ధికరః శ్వేతో రక్తోఽత్ర స్మరవర్ధనః' ఇ త్యశోకకల్పే దర్శనాత్, కాన్తః = కమనీయః, కేసరః=వకుళ శ్చ + 'అథ కేసరే। వకుళో వఞ్జుళః' ఇత్యమరః, స్త ఇతి శేషః, ఏకః = తయో రన్యతరః. ప్రాథమికత్వా దశోక ఇత్యర్థః, మయా సహ, తవ సఖ్యాః = స్వప్రియాయా ఇత్యర్థః, వామపాదాభిలాషీ-దోహదచ్ఛద్మనే త్యత్రాపిసంబన్ధనీయమ్ - స చాహం చ అభిలాషిణా విత్యర్థః, అన్యః = కేసరః, దోహదః = వృక్షాదీనాం ప్రసవకారణం సంస్కారద్రవ్యమ్ + 'తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతం। పుష్పా ద్యుత్పాదకం ద్రవ్యం దోహదః స్యాత్తు తత్క్రియా' ఇతి శబ్దార్ణవే - తస్య-ఛద్మనా = వ్యాజేన + 'కపటోఽస్త్రీ) వ్యాజ దమ్భోపధయ

ఛద్మ కైతవే' ఇత్యమరః, అస్యాః = తవ సఖ్యాః, వదనమదిరాం = గణ్డూషమద్యం, కాఙ్క్షతి - మయా స హే త్యత్రాపి సంబన్ధనీయమ్; అశోకవకుళయోః స్త్రీపాదతాడనం గణ్డూషమదిరా చ దోహద ఇతి ప్రసిద్ధిః.

† 'స్త్రీణాం స్పర్శా త్ప్రియఙ్గు ర్వికసతి, వకుళః సీధుగణ్డూషసేకా,
త్పాదాఘాతా దశోక, స్తిలకకురవకౌ వీక్షణాలిఙ్గనాభ్యామ్,
మన్దారో నర్మవాక్యా, త్పటుమృదుహసనా చ్చమ్పకో, వక్త్రవాతా,
చ్చూతో, గీతా న్నమేరు ర్వికసతి చ, పురో నర్తనా త్కర్ణికారః.'

అత్ర = ఆక్రీడాశైలమందు, కుర...వృతేః = కురవక = గోరంటలే-వృతేః = ఆవరణము (వెలుగు) గాఁగల, ప్రత్యాసన్నౌ = చెంగటివైన (దగ్గఱనున్నవైన), చల కిసలయః = చంచలములయినచిగుళ్లుగల (దీనిచే ఈవృక్షము పాదతాడనాను గ్రహమునకై చేదోయిమొగిడ్చి వేఁడుచున్న దని వ్యంగ్యము), రక్తాశోకః = ఎఱ్ఱయశోకము (ఎఱ్ఱయశోకము స్మరోద్దీపకము), కాన్తః = కమనీయమయిన, కేసరశ్చ = పొగడ యు, (స్తః = కలవు); ఏకః = వీనిలో ఒకటి (మొదట చెప్పఁబడినదగుటచే) అశోకము, మయా సహ = నాతోఁగూడ, అస్యాః తవ సఖ్యాః = ఈనీ చెలియొక్క - అనఁగా నాభార్యయొక్క, వామపాదాభిలాషీ = ఎడమయడుగు (తన్ను)ను కోరునది (దోహదచ్ఛద్మనా అని యిచటను సంబంధించియున్నది), అన్యః = ఇతరము అనఁగా పొగడ, దోహదచ్ఛద్మనా - దోహద = ప్రసవకారణ ద్రవ్యముయొక్క - ఛద్మనా = వ్యాజముచేత, (అస్యాః తవ సఖ్యాః = ఈనీ చెలి యొక్క,) వదనమదిరామ్ = గండూషమద్యమును (పుక్కిలించినసారాయిని), కాఙ్క్షతి = కోరుచున్నది ('మయా సహ' అని యిచటను సంబంధించియున్నదీ).

తా.—ఆక్రీడాశైలములో నొకమాధవీలతామంటపము కలదు. దానిచుట్టును గోరంటచెట్లు వెలుగుగా నున్నవి. ఆమంటపముచెంత చంచలదళమయినయొకరక్తాశోకమును అందమయినయొకపొగడయు కలవు; నేనును ఆరక్తాశోకమును నాసఖియొక్క వామపాదతాడనమును కోరుదుము - అశోకము దోహదవ్యాజముననను నేను ప్రణయాపరాధదండనగాను కోరుదుము. ఆపొగడయు నేనును నాసఖియొక్క గండూషమద్యమును కోరుదుము - పొగడ దోహదవ్యాజముననను నేను నిశీథోత్సవమందును కోరుదుము.

భా.—'ఛద్మనా'—జడములయినయశోకవకుళములుగూడ నాసఖియొక్క వామపాదగండూషమద్యములను రసముచేఁ గోరును, అందులకు దోహదము వ్యాజము, ఇట్లు జడములకుఁగూడ నాసఖియందు రసము పొడముచుండఁగా అజడను

నయిననాతగులము ఎట్టిదో చెప్పవలయునా? అని భావము. 'వామ'—వామపాదతాడనము ఎక్కువతిరస్కారమును తెలుపును; అట్లు అపరాధము చేసి నాసఖిచేత ఎడమయడుగుచే తన్నుతినుయోగము నాకెన్నఁటికి కలుగునో యని భావము. 'వదనమదిరామ్'—అట్లు నేను దండన పొందినతరువాత, అనఁగా తన్ను తిన్నతర్వాత, నన్నుఁగూర్చి పశ్చాత్తప్తురాలయి నన్ను క్షమించునాప్రియ సానుగ్రహముగా నొసంగు గండూషమద్యము నాకెన్నఁటికి కలుగునో యని భావము. 'సహ మయా'—వానికిని వామపాదవదనమదిరలు నే నుండిననే గలుగును నేను లేనప్పుడు వానిపనియు నున్నదే యని స్వారస్యము.

తన్మధ్యే చ స్ఫటికఫలకా కాఞ్చనీ వాసయష్టి
ర్మూలే బద్ధా మణిభి రనతిప్రౌఢవంశప్రకాశైః
తాళైః శిఞ్జావలయసుభగై ర్నర్తితః కాన్తయా మే
యామధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః. 18.

తన్మధ్య ఇతి.—కించేతి చార్థః, తన్మధ్యే = తయో ర్వృక్షయో ర్మధ్యే, అనతిప్రౌఢానామ్ (అనతికఠోరాణాం) వంశానాం ప్రకాశ ఇవ ప్రకాశో యేషాం తైః = తరుణవేణుసచ్ఛాయై రిత్యర్థః, మణిభిః = మరకతశిలాభిః, మూలే, బద్ధా = రచితా-కృతవేదికే త్యర్థః, స్ఫటికం (స్ఫటికమయం) ఫలకం (పీఠం) యస్యాః సా స్ఫటికఫలకా, కాఞ్చనస్య వికారః - కాఞ్చనీ = సౌవర్ణీ, వాసయష్టిః = నివాసదణ్డః, అస్తీతి శేషః, శిఞ్జా = భూషణధ్వనిః + 'భూషణానాం తు శిఞ్జితమ్' ఇత్యమరః-* భిదాదిత్వాదఙ్-శిజిధాతు రయం తాలవ్యాది ర్నతు దన్త్యాదిః † 'యోషేవ శిఙ్క్తే' ఇతిశ్రుతిదర్శనాత్ - శిఞ్జాప్రధానాని చ వలయాని (కఙ్కణాని)చ- సుభగాః (రమ్యాః) తైః, తాళైః = కరతలవాదనైః, మే = మమ, కాన్తయా, నర్తితః = నృత్తం కారితః, వః = యుష్మాకం, సుహృత్ = సఖా, నీలకణ్ఠః = మయూరః + 'మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజఙ్గభుక్' ఇత్యమరః, దివసవిగమే = సాయంకాలే, యాం యష్టి మధ్యాస్తే-యస్యాం యష్ట్యా మాస్త ఇత్యర్థః* 'అధిశీఙ్స్థాసాం కర్మ' ఇతి కర్మత్వా ద్ద్వితీయా; 'తత్రాగారమ్' ఇత్యారభ్య పఞ్చసు శ్లోకేషు సమృద్ధవస్తువర్ణనా దుదాత్తాలంకారః - తదుక్తం + 'తదుదాత్తం భవే ద్యత్ర సమృద్ధం వస్తు వర్ణ్యతే' ఇతి. 'న చైషా స్వభావోక్తి ర్భావికం వా-తత్ర యథాస్థితవస్తువర్ణనాత్ - అత్రతు కవిప్రతిభోత్థాపితసంభావ్యమానైశ్వర్యశాలివస్తువర్ణనా చారోపితవిషయత్వ మితి తాభ్యా మస్య భేదః' ఇత్యలంకారసర్వస్వకారః.

(కిం)చ=మఱియు, తన్మధ్యే - తత్ = ఆవృక్షముల - మధ్యే = నడుమను అన...కాశైః - అనతిప్రౌఢ = మిగులముదురని-వంశ = వెదురుయొక్క-ప్రకాశైః =చాయవంటిచాయగల (లేతవెదురువర్ణముగల అని యర్థము), మణిభిః = మణులతో (మరకతమణులతో) = పచ్చలతో, మూలే = అడుగున, బద్ధా = కట్టఁబడినదియు (మరకతమణివేదికగలది యని యర్థము), స్ఫటికఫలకా - స్ఫటిక = స్ఫటికశిలామయమయిన - ఫలకా = పలక (పీఠము) కలదియు, కాఞ్చనీ = బంగారవుదియు, నైన, వాసయష్టిః = నివాసమయినగడ, (అస్తి=కలదు), శిఞ్జా...భగైః - శిఞ్జా = గల్లుగల్లురనుధ్వని ప్రధానముగాఁగల - వలయ = కడియములచేత-సుభగైః = రమ్యములైన, తాళైః = కరతలతాడనములచేత (చేతులతో తాళము వేయుటచేత), మే = నాయొక్క, కాన్తయా = ప్రియచే, నర్తితః = నృత్యమాడింపఁబడినదైన, వః =మీయొక్క, సుహృత్ =చెలి (అనఁగా మేఘములకు మిత్రమయిన), నీలకణ్ఠః = నెమలి, దివసవిగమే = సాయంకాలమందు, యామ్ = ఆవాసయష్టిని, అధ్యాస్తే = ఎక్కి-కూర్చుండును.

తా.—ఆ రెండుచెట్లనడుమ మాపెంపుడునెమలికొఱకు ఒకబంగారవువాసదండము నాటఁబడియున్నది, దానిచుట్టును క్రింద పచ్చలయరుఁగు వేయఁబడియున్నది. ఆవాసదండముతుదను ఆనెమలి కూర్చుండుటకై స్ఫటికంపుఁబలక యొకటి యున్నది. ఆనెమలిని నాప్రాణేశ్వరి కంకణములమధురఝుళంఝుళనాదముతో చేతుల తాళము వాయించుచు నృత్యమాడించును. ఆఫలకముపైని ఆనెమలి రాత్రివేళ విశ్రమించును.

ఏభిః సాధో హృదయనిహితై ర్లక్షణై ర్లక్షయేథా
ద్వారోపాన్తే లిఖితవపుషౌ శఙ్ఖపద్మౌచ దృష్ట్వా
క్షామచ్ఛాయం భవన మధునా మద్వియోగేన నూనం
సూర్యాపాయే న ఖలు కమలం పుష్యతి స్వా మభిఖ్యామ్.19.

ఏభి రితి.—హే సాధో = నిపుణ * 'సాధుః సమర్థో నిపుణో వా, ఇతి కాశికాయాం, హృదయే నిహితైః = అవిస్మృతై రిత్యర్థః, ఏభిః = పూర్వోక్తైః-లక్షణైః = తోరణాదిభి రభిజ్ఞానైః, ద్వారోపాన్తే - ఏకవచన మవివక్షితం - ద్వారపార్శ్వయో రిత్యర్థః, లిఖితే - వపుషీ = ఆకృతీ - యయో స్తౌ తథోక్తౌ, శఙ్ఖపద్మౌ నామ నిధివిశేషౌ + 'నిధి ర్నా శేవధి ర్భేదాః పద్మశఙ్ఖాదయో నిధేః' ఇత్యమరః, దృష్ట్వా చ, నూనం = సత్యమ్, అధునా = ఇదానీమ్ * 'అధునా' ఇతి నిపాతః, మద్వియోగేన=మమ ప్రవాసేన, క్షామచ్ఛాయమ్=ఉత్సవోపరమాత్ క్షీణ

కాన్తి, భవనం = మద్గృహం, లక్షయేథాః = నిశ్చినుయాః, తథాపి, సూర్యాపాయే = సూర్యాపగమే సతి; కమలం = పద్మం, స్వామ్ = ఆత్మీయామ్, అభిఖ్యాం = శోభామ్ + 'అభిఖ్యా నామశోభయోః' ఇత్యమరః * 'ఆతశ్చోపసర్గే' ఇతి కప్రత్యయః, న పుష్యతి = నోపచినోతి - ఖలు, సూర్యవిరహితం పద్మమివ గృహపతివిరహితం గృహం న శోభత ఇత్యర్థః.

సాధో = ఓసమర్థుఁడా, హృదయ నిహితైః = మనస్సులో ఉంపఁబడిన, ఏభిః = పూర్వోక్తములయిన, లక్షణైః = గుర్తులచేతను (ఈగుర్తులను మఱవక జ్ఞప్తియుంచుకొనియు), ద్వారోపాన్తే = ద్వారపార్శ్వములయందు, లిఖితవపుషౌ - లిఖిత = వ్రాయఁబడిన - వపుషా = ఆకారములుగలవైన, శఙ్ఖపద్మౌ = శంఖము పద్మము అనునిధులను, దృష్ట్వాచ = చూచియు, నూనమ్ = సత్యముగా, అధునా = ఇప్పుడు, మద్ వియోగేన = నాయొక్క దేశాంతరగమనముచేత, క్షామచ్ఛాయమ్ - క్షామ = (ఉత్సవములు మానుటచే) క్షీణించిన - ఛాయమ్ = కాంతిగలదైన, భవనమ్ = ఇంటిని, లక్షయేథాః = ఆనవాలుపట్టుము; (తథాపి = అట్లేఁగదా), సూర్యాపాయే - సూర్య = సూర్యునియొక్క - అపాయే = పోవుటయందు (అనఁగా సూర్యుఁడు అస్తమించినప్పుడు), కమలమ్ = తామర, స్వామ్ = తనదైన, అభిఖ్యామ్ = శోభను, న పుష్యతి ఖలు = తాల్పదుకదా; సూర్యుఁడు లేని తామర వలె గృహపతి లేని యిల్లు శోభిల్ల దని యర్థము.

తా.—ఓయి సమర్థుఁడా నేను చెప్పినయీగుర్తులను మఱవక జ్ఞప్తియుంచుకొని పోయి వీనివలన నాయింటిని ఆనవాలుపట్టుము. ఇవియే గాక మాయింటిద్వారమునకు ఇరుప్రక్కలను గోడలపై శంఖచక్రములు చిత్రింపఁబడియున్నవి. ఆగుర్తువలనఁ గూడ మాయింటిని కనిపట్టుము. అయినను, నేను లేమిచే మాయిల్లు ఇప్పుడు శోభాహీనముగా నుండును: సూర్యుఁడు లేని తామరవలెనే గృహపతి లేనిగృహము శోభిల్లదు గదా.

వ.—'సాధో'—'సమర్థుఁడా' అనుట ఈగుర్తులను మఱవక జ్ఞప్తియుంచుకొనిపోయి ఈగృహమును మేఘుఁడు కనిపట్ట సమర్థుఁడని సూచించుటకు; శంఖపద్మములను మఱియొకగుర్తు; ఈసమయమున శోభాహీనమయి యుండుటయు నొకగుర్తు; యక్షి ఇతనియందే తత్పరురాలుగావున ఇతఁడు లేని సమయమున సోత్సవముగా నుండ దనియు, సూర్యసామ్యము చెప్పినందున మరల ఇతఁడుచేరఁగానే గృహము సోత్సవ మగు ననియు, సూర్యపద్మ సంబంధమును చెప్పుటచే తనకును పద్మిని యైనయక్షికిని గలయన్యోన్యానురక్తి ఎట్టికారణముచేతను తప్పిపోవునది కాదనియు, భావము.

గత్వా సద్యః కలభతనుతాం శీఘ్రసంపాతహేతోః
క్రీడాశైలే ప్రథమకథితే రమ్యసానౌ నిషణ్ణః
అర్హ స్యన్తర్భవనపతితాం కర్తుమల్పాల్ప భాసం
ఖద్యోతాలీవిలసితనిభాం విద్యుదున్మేషదృష్టిమ్. 20,

నిజగృహానిశ్చ యానన్తరం కృత్య మాహ గత్వేతి.—హే మేఘ, శీఘ్రసం
పాత ఏవ హేతు స్తస్య - శీఘ్రసంపాతహేతోః-శీఘ్రప్రవేశార్థ మిత్యర్థః * 'షష్ఠీ
హేతుప్రయోగే' ఇతి షష్ఠీ + 'సంపాతః పతనే వేగే ప్రవేశే భేద సంవిదోః' ఇతి
శబ్దార్ణవే, సద్యః = సపది, కలభస్య = కరిపోతస్య - తను రివ తను ర్యస్య తస్య
భావ స్తాం - కలభతనుతామ్ = అల్పశరీరతాం, గత్వా = ప్రాప్య, ప్రథమకథితే =
'తస్యా స్తీరే' ఇత్యాదినా పూర్వోద్దిష్టే, రమ్యసానౌ - నిషదనయోగ్య ఇత్యర్థః,
క్రీడాశైలే, నిషణ్ణః = ఉపవిష్టః సన్, అల్పాల్పా = అల్పప్రకారా - భాః =
ప్రకాశో - యస్యాస్తాం * 'ప్రకారే గుణవచనస్య' ఇతి ద్విరుక్తిః, ఖద్యోతానా
మాలీ తస్యాః - విలసితేన = స్ఫురితేన - నిభాం = సమానాం, విద్యుదున్మేషః =
విద్యుత్ప్రకాశః - స ఏవ దృష్టి స్తాం, భవన స్యాన్త రన్తర్భవనం తత్ర - పతితాం
= ప్రవిష్టాం, కర్తు మర్హసి; యథా కశ్చి త్కించి దన్విష్యన్ క్వచి దున్నతే స్థిత్వా
శనైఃశనై రతితరాం ద్రాఘీయసీం దృష్టి మిష్టదేశే పాతయతి తద్వదితి ధ్వనిః.

తనయింటిని ఆనవాలుపట్టినతర్వాత చేయవలసినపని చెప్పుచున్నాఁడు:—

శీ...తోః - శీఘ్ర - త్వరితమైన - సంపాత = ప్రవేశము నెడు - హేతోః =
హేతువుచేత (శీఘ్రప్రవేశము కలుగుటకై యని యర్థము), సద్యః = తత్క్షణమే,
కల...తామ్ - కలభ = గజశిశువుయొక్క - తనుతామ్ = దేహమువంటి దేహము
కలిగియుండుటను (అల్పదేహత్వమును), గత్వా = పొంది, అనఁగా చిన్నయాకార
మును దాల్చి, ప్రథమకథితే - ప్రథమ = మొదట ('తస్యా స్తీరే' ఇత్యాదికముచే) -
కథితే = చెప్పఁబడిన, రమ్యసానౌ - రమ్య = రమణీయమైన - సానౌ = చఱులు
గలదైన - (కూర్చుండ నింపయిన యని యర్థము), క్రీడాశైలే = ఆటకొండ
యందు, నిషణ్ణః—కూర్చున్నవాఁడవై, అల్పాల్పభాసమ్ - అల్పాల్పా = అల్పప్రకార
మయిన - భాసమ్ = ప్రకాశముకలదియు, ఖద్యో...నిభామ్ - ఖద్యోత = మిడుఁ
గుఱులయొక్క - ఆళీ = సమూహమ్ముయొక్క - విలసిత నిభామ్ = స్ఫురణముతో
సమానమును, (అయిన), విద్యు...ష్టిమ్ - విద్యుత్ = మెఱుపుయొక్క - ఉన్మేష =
ప్రకాశము నెడు-దృష్టిమ్ = చూపును, అన్త...తామ్ - అన్తర్భవన = ఇంటిలోపల

పతితామ్ = ప్రవేశించినదానినిగా, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగుదువు. ఎవఁడేని ఏమయిన వెదకువాఁడు ఎక్కడనేని ఒకయెత్తయినచోట ఉండి మెల్ల మెల్లఁగా నిడుదచూపులను ఇష్టమయినచోటికి ఏప్రకారము నిగిడించునో ఆప్రకారము అని ధ్వని.

తా.—ఎవ్వఁడేని దేనినయిన వెదకువాఁడు ఒక యున్నతప్రదేశమున ముడిఁగి యుండి మెల్లమెల్లఁగా నిడుదచూపును ఇష్టమయినచోటికి నిగిడించునుగదా, ఆప్రకారమే నీవును అక్కడికిఁబోయి నీకు త్వరగా ప్రవేశముకలుగుటకుఁగాను వెంటనే ఏనుఁగుఁబిల్లయంతచిన్నయాకారమును దాల్చి పిమ్మట కూర్చుండుటకు రమణీయముగానుండు సానువులుగలదైన యాక్రీడాశైలములో కూర్చున్నవాఁడవై మిడుంగుఱులగుంపుయొక్క ప్రకాశమువలెనుండు నీమెఱపుఁజూపును ఆయింటిలోనికి నిగిడింపుము.

తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబిమ్బాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్రా స్తే యువతివిషయే సృష్టి రాద్యేవ ధాతుః. 21.

తన్వీతి.—తన్వీ = కృశాఙ్గీ - నతు పీవరీ + 'శ్లక్ష్ణం దభ్రం కృశం తను' ఇత్యమరః * 'వోతో గుణవచనాత్' ఇతి జీష్, శ్యామా = యువతిః + 'శ్యామా యౌవనమధ్యస్థా' ఇత్యుత్పలమాలాయాం, శిఖరాణ్యేషాం స న్తీతి శిఖరిణః - కోటిమ న్తః + 'శిఖరం శైలవృక్షాగ్ర కక్షా పులక కోటిషు' ఇతి విశ్వః - శిఖరిణః - దశనాః = దన్తా-యస్యాః సా శిఖరిదశనా-ఏతే నాస్యా భాగ్యవ త్త్వం పత్యాయుష్కరత్వంచ సూచ్యతే - తదు క్తం సాముద్రికే † 'స్నిగ్ధాః సమాః సరూపాః సుపఙ్క్తయః శిఖరిణోఽశ్లిష్టాః । దన్తా భవ న్తి యాసాం తాసాం పాదే జగ త్సర్వం ' తామ్బూలరసర క్తేఽపి స్ఫుటభాసః సమోదయాః।దన్తాః శిఖరిణో యస్యా శ్చిరం జీవతి తత్పతిః' ఇతి, పక్వం (పరిణతం) బిమ్బం (బిమ్బికాఫల) మివాధరోష్ఠో యస్యాః సా పక్వబిమ్బాధరోష్ఠీ * 'శాకపార్థివాదిత్వా న్మధ్యమపదలోపీ సమాసః' ఇతి వామనః * 'నాసికోదరోష్ఠ'—ఇత్యాదినా జీష్, మధ్యే క్షామా = కృశోదరీ త్యర్థః, చకితహరిణ్యాః ప్రేక్షణానీవ ప్రేక్షణాని (దృష్టయో) యస్యాః సా తథోక్తా - ఏతేనాస్యాః పద్మినీత్వం వ్యజ్యతే - తదు క్తం రతిరహస్యే పద్మినీలక్షణప్రస్తావే + 'చకితమృగదృగాభే ప్రాన్తర క్తే చ నేత్రే' ఇతి, నిమ్ననాభిః = గమ్భీరనాభిః - అనేన నారీణాం నాభిగామ్భీర్యా న్మదనరసాతిరేక ఇతి కామసూత్రార్థః సూచ్యతే,

శ్రోణీభారాత్ - అలసగమనా = మన్దగామినీ - నతు జఙ్ఘాదోషాత్' స్తనాభ్యాం - స్తోకనమ్రా = ఈషదవనతా - నతు వపుర్దోషాత్, యువతయ ఏవ విషయ స్తస్మి న్యువతివిషయే-యువతీ రధికృ త్యే త్యర్థః, ధాతుః=బ్రహ్మణః,, ఆద్యా సృష్టిః= ప్రథమశిల్ప - మివ స్థితే త్యుత్ప్రేక్షా - ప్రథమనిర్మితా యువతి రియమే వే త్యర్థః - ప్రాయేణ శిల్పినాం ప్రథమనిర్మాణే ప్రయత్నాతిశయవశా చ్ఛిల్పనిర్మాణ సౌష్ఠవం దృశ్యత ఇ త్యాద్యవిశేషణం-తథా చాస్మి న్ప్రపఞ్చేన కుత్రా ప్యేవంవిధ రామణీయకం రమణీరత్న మస్తీతి భావః, త దేవంభూతా యా స్త్రీ-తత్ర=అన్తర్భవనమ్, ఆస్తే =నివసతి, తా మి త్యుత్తరశ్లోకేన సంబన్ధః.

చూచినఁ గలుగుఫలమును గుర్తులతో రెండుశ్లోకముల చెప్పుచున్నాఁడు:—

తన్వీ = కృశాంగి (చిక్కినది - బలిసినది గాదు), శ్యామా = నడియౌవనము గలది, శిఖరిదశనా—శిఖరి = మొనలుగల - దశనా - దంతములుగలది - (మొనగల దశనములు ఒకశుభలక్షణము- అది గలయంగన భాగ్యవంతురాలుగాను తద్భర్త చిరాయువుగాను ఉందురు), పక్వ...రోష్ఠీ—పక్వ = పండిన-బిమ్బ = దొండపండునుబో లిన-అధరోష్ఠీ = క్రిందిపెదవిగలది, మధ్యే = నడుమున, క్షామా = కృశించినది - (సన్నమైననడుముగలది), చకి...క్షణా—చకిత = బెదరిన - హరిణీ = ఆఁడులేడి యొక్క - ప్రేక్షణా = చూపులవంటిచూపులుగలది (ఈవిశేషణముచే నీమె పద్మినీజాతి స్త్రీయని తెలియ నగుచున్నది-) నిమ్ననాభిః—నిమ్న = లోఁతయిన నాభిః = పొక్కిలిగలది - (పొక్కిలి లోఁతయిన స్త్రీలకు మదనరసము అధికము), శ్రోణీ భారాత్ = శ్రోణీ = పిఱుఁదులయొక్క - భారాత్ = బరువుచేత, అలసగమనా - అలస = మందమయిన - గమనా = నడకగలది, స్తనాభ్యామ్ = చనుదోయిచేత, స్తోక...మ్రా—స్తోక = కొంచెము - నమ్రా = వంగినది(యు), యువతివిషయే— యువతి = జవరాండ్రనెడు - విషయే = విషయమందు, ధాతుః = బ్రహ్మయొక్క, ఆద్యాసృష్టిరివ = తొలిశిల్పమోయనునట్లు (శిల్పులుప్రాయికముగా మొదటినిర్మా ణమును అధికప్రయత్నముతో చేయుటచే దానియందు శిల్పసౌష్ఠవము ఉండును - ఈయభిప్రాయముచే 'ఆద్య' విశేషణము వేయఁబడినది - అందుచేత ఈప్రపంచము లో నెచటను ఇంతయందకత్తె యయిన రమణీరత్నము మఱిలేదని భావము), యా =(ఇట్టిదైన) ఏ స్త్రీ, తత్ర = ఆయింటిలోపల, ఆస్తే = కలదో, (తామ్ = ఆ స్త్రీని - అని ముందఱిశ్లోకముతో నన్వయము).

తా.—ఆప్రకారము నీవు చూడఁగా అందు నీ కొకానొకయంగన యగపడు ను. ఆయంగన యెట్టి దనఁగా - సన్ననిది, దంతములు మొనగలవి - ఆలక్షణముచేత భాగ్యవంతురా లనియును తద్భర్త చిరాయు వనియు తెలియునుగదా; అధరోష్ఠము

దొండపండుంబోలియుండును, నడుము సన్నము; చూపులు బెదరిన లేడిచూపులవలె నుండును-ఈగుర్తుచే ఆలతాంగి పద్మినీజాతి స్త్రీయని విశదము; పాక్కిలి లోఁతు-ఈలక్షణము మదనరసాతిరేకమును సూచించును; పిఱుందులబరువుచే నడక మందముగా నుండును; చనుదోయిబరువుచే అయఃబలామణి కొంచెము వంగినదై యుండును; స్త్రీవిషయమున బ్రహ్మదేవునియొక్క మహాప్రయత్న సాధితమయిన మొదటిని ర్మాణమో యనునట్లు ఆసుందరి విరాజిల్లుచుండును. అట్టియంగనారత్నము ఈప్రపంచములో మఱి యుండదు.

తాం జానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే చక్రవాకీమివైకామ్
గాఢోత్కణ్ఠాం గురుషు దివసేష్వేషు గచ్ఛత్సు బాలాం
జాతాం మన్యే శిశిరమథితాం పద్మినీం వాన్యరూపామ్. 22.

తామితి.—సహచరే = సహచారిణి-అనేన వియోగాసహిష్ణుత్వం వ్యజ్యతే, మయి, దూరీభూతే = దూరస్థితే సతి, సహచరే = చక్రవాకే - దూరీభూతే సతి, చక్రవాకీం = చక్రవాకవధూ - మివ * 'జాతే ర స్త్రీవిషయా దయోపధాత్' ఇతి జీష్, పరిమితకథాం పరిమితవాచమ్, ఏకామ్=ఏకాకినీం స్థితాం, తామ్ = అన్తర్భవనగతాం, మే ద్వితీయం జీవితం జానీథాః = జీవితతుల్యాం మత్ప్రేయసీ మవగచ్ఛే రిత్యర్థః - 'తన్వీ' ఇత్యాది పూర్వలక్షణై రితి శేషః; లక్షణానా మన్యథాభావ మాశఙ్క్యాహ గాఢేతి.—గాఢోత్కణ్ఠాం = ప్రబల విరహవేదనాం + 'రాగే త్వలబ్ధవిషయే వేదనా మహతీతు యా। సంశోషణీ తు గాత్రాణాం తాముత్కణ్ఠాం విదు ర్బుధాః' ఇత్యభిధానాత్, బాలాం - గురుషు = విరహమహత్సు, ఏషు దివసేషు గచ్ఛత్సు (వర్తమానేషు) సత్సు, శిశిరేణ = శిశిరకాలేన, మథితాం పద్మినీంవా పద్మినీమివ * ఇవవ ద్వాయథాశబ్దా' ఇతి దణ్డీ, అన్యరూపాం = పూర్వవిపరీతాకారాం, జాతాం మన్యే, హిమహతా పద్మినీవ విరహేణాస్యాదృశీ జాతేతి తర్కయామీత్యర్థః, ఏతావతా నేయ మన్యేతి భ్రమితవ్య మితి భావః.

సహచరే = సహచారి నైన, మయి = నేను, దూరీభూతే (సతి) = దూరగతుఁడనుగా (ఉండఁగా), సహచరుఁ డనుటచేత ఎడఁబాపు నోర్వనివాఁడని భావము, సహచరే చక్రవాకే దూరీభూతే (సతి) = సహచారి యయినజక్కవ దూరగతముగా (ఉండఁగా), చక్రవాకీమ్ ఇవ = జక్కవయిల్లాలి వలె, ఏకామ్ = ఏకాకినిగా నున్న దానిని, పరి...థామ్—పరిమిత = మితమయిన - కథామ్ =

సంభాషణగలదానిని (మితభాషిణిని), తామ్=అంతర్భవనగత యయిన యా స్త్రీని, మే ద్వితీయం జీవితమ్ = నాయొక్క రెండవ ప్రాణముగా (ప్రాణసమ యయిన ప్రియనుగా), జానీథాః=(తస్వీ శ్యా మేత్యాది పూర్వోక్త లక్షణములచే) ఎఱుం గుము; పూర్వోక్తలక్షణములు మాఱి యుండునో యని సందేహించినవాఁడై యక్షుఁడు పలుకుచున్నాఁడు:—గాఢోత్కణ్ఠామ్—గాఢ = ప్రబలమయిన - ఉత్కణ్ఠామ్ = విరహవేదనగలదైన, బాలామ్ = ఆబాలను, గురుషు ఏషు దివసేషు = విరహముచే దీర్ఘములయిన యీ దినములు, గచ్ఛత్సు (సత్సు) = జరుగుచుండఁగా, శిశిర మథితామ్—శిశిర = శిశిరకాలముచేత - మథితామ్ = పీడింపఁబడిన, పద్మినీమ్ ఇవ = తామరతీఁగనుం బోలె, అన్యరూపామ్ = వేఱు రూపముగలదిగా, జాతామ్ = అయినదానినిగా (మాఱినదానినిగా), మన్యే - తలంచుచున్నాను, (మంచు దెబ్బకు పద్మిని రూపుమాఱినట్లు విరాళితాఁకునకు నాప్రేయసి రూపుమాఱియుండు నని తలంచెదను - కనుక ఆచెలువను చూచినప్పుడు నాప్రేయసి కాదని భ్రమయకుము అని భావము.)

తా.—సహచర మయినచక్రవాకము నెడఁబాని వేతలఁబడుచున్నచక్రవాకి వోలె సహచరుఁడ నయిననన్నుఁ బాసి ఒంటిగా పరితపించుచు ఆయింటిలోపల అగపడుదానిని మితభాషిణిని నేను జెప్పినగుర్తులచేత నాప్రాణప్రియనుగా నెఱుంగుము. ఒకవేళ నేను జెప్పినలక్షణములు కొన్ని మాఱి యుండును; శిశిరకాలమున మంచుదెబ్బ తాఁకినతామరతీఁగవోలె ఆ బాల విరహదీర్ఘము లయినయీదినములలో విరహవేదనచే రూపు మాఱి యుండు నని తలంచెదను; అంతమాత్రాన ఆసుందరి నాభార్య గా దని నీవు భ్రమపడకుము.

వ.—'పరిమితకథామ్'—1 మితభాషణము ఉత్తమాంగనాస్వభావము. 'ద్వితీ

---

1. 'వాతెఱ తోంటికై వడి మాటలాడుదు.' ఆము.

'గతాగతకుతూహలం నయనయో రపాఙ్గావధి,
స్మితం కులనతభ్రువా మధర ఏవ విశ్రామ్యతి,
వచః ప్రియతమశ్రుతే రతిథిరేవ, కోపక్రమః
కదాచిదపిచే, త్తదా మనసి కేవలం మజ్జతి రసమం.
'పదన్యాసో గేహా ద్బహి రహిథ తారోహణసమో,
నిజావాసా దన్య ద్భవన మపరక్వేకతులితమ్,
వచో ఙ్ఙ్కాలభ్యం కృపణధనతుల్యం మృగదృశః,
పుమా నన్యః కాన్తా ద్విధురవ చతుర్థీ సముదితః' సుభా.

యం జీవితమ్' అనుట 1. ప్రేమాతిశయమును సూచించును. ఏకామ్'-చెలికత్తెలు లోనగువారు ఎంద ఉన్నను మదేకాయత్తచిత్త యగుటచే ఏకాకినిగా తపించుచున్నది. 'గురుషు' - 2. విరహులకు విరహవేదనచే దినములు యథాస్థితికన్న దీర్ఘములుగా నుండును.

ఇచటఁ గొందఱువ్యాఖ్యాతలు శిశిరమథితామ్' అనుచోట శిశిర మనఁగా మంచని వివరించినారు. 'ఏషు దివసేషు' అని యావిరహదివసములు శిశిర కాలమువలెను - విరహవేదన మంచువలెను - ఆమె పద్మినివలెను - ఉండె ననుభావముచే శిశిర మనఁగా శిశిరకాల మని మల్లినాథసూరిగారు వివరించినారు. మంచు ఇతరకాలములందుఁగూడ పడినను ఆశిశిరకాలపుమంచువలె పద్మినిని రూపుమాపదు గావున - శిశిరకాలమును చెప్పుటచే తదీయమైనమంచే రూపుమాపుసాధన మని విశదమగుటచేతను - శిశిర మనఁగా 'శిశిరకాల' మనువ్యాఖ్యయే 'హిమము' అనువ్యాఖ్యకన్న సొంపుగా నున్నది,

'సహచరే' అనుట యక్షుఁడు యక్షిని ఎప్పుడును ఇంతవఱకు ఎడఁబాసినవాఁడు కాఁ డనియు-దాన 3 ఈప్రథమవిరహము ఆమెకు మిగుల దుస్సహమనియు - సూచించుచున్నది. 'చక్రవాకీమివ'—చక్రవాక్యుపమానము వారిప్రేమాతిశయమును

1. 'త్వం జీవితం త్వ మసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయో రమృతం త్వ మఙ్గే
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం
తా మేవ శాన్త మథవా కి మి హోత్తరేణ.' ఉ. రా. చ.

2. 'అహో అహోభి ర్మహిమా హిమాగమే
ష్వతిప్రపేదే ప్రతి తాం స్మరార్దితామ్,
తపర్తు పూర్తా వపి మేదసాం భరా
విభావరీభి ర్బిభరామ్బభూవిరే.' నైష.
'మహిమ హిమవేళలందు నమ్మానవతికి
మాసరము లయ్యెఁ దలఁపంగ వాసరములు,
పొడవు గలిగి తపర్తు సంపూర్తియందు
నంచితాయామవతు లయ్యె యామవతులు. శృం. నై.
'వర్ష త్యమ్బుదమా లేయం వర్ష త్యేషా చ శర్వరీ.' చంద్రాలో
3. 'ఆశ్వాస్యైవం ప్రథమవిరహోదగ్రశోకాం సఖీం తే.' ఉ. మే.
'ఇత్థంభూతాం ప్రథమవిరహే తామహం తర్కయామి.' ఉ. మే.

[1]విరహాసహిష్ణుతను తెలుపుచున్నది; మఱియు చక్రవాకములవిరహము రాత్రిమాత్రమే గావున వీరివిరహమును పరిమితకాలమే యనియు పిమ్మట తీఱఁగల దనియు నభిప్రాయము. 'బాలామ్' అనుట కనికరమును తెలుపుచున్నవి.

నూనం తస్యాః ప్రబలరుదితోచ్ఛూననేత్రం ప్రియాయా
నిశ్వాసానా మశిశిరతయా భిన్నవర్ణాధరోష్ఠమ్
హస్తన్యస్తం ముఖ మసకలవ్యక్తి లమ్బాలకత్వా
దిన్దో ర్దైన్యం త్వదనుసరణ క్లిష్టకాన్తే ర్బిభర్తి. 23.

నూనమితి.—ప్రబలరుదితేన - ఉచ్ఛూనే = స్ఫుటితపుటే - నేత్రే యస్య తత్ * ఉచ్ఛూనేతి శ్వయతేః కర్తరి క్తః * 'ఓదితశ్చ'ఇతి నిష్ఠానత్వం * 'వచిస్వపి' - ఇత్యాదినా సంప్రసారణమ్ * 'సంప్రసారణాచ్చ'ఇతి పూర్వరూపత్వం *'హలః'ఇతి దీర్ఘః-తత్ర*'చ్ఛ్వోః శూడనునాసికే చ'ఇతి ఊడాదేశేకృతే రూపసిద్ధి రితి నాథోక్తా వర్తమానసామీప్యప్రక్రియా ప్రామాదికీ త్యుపేక్షణీయా-తథా సతి ధాతో రికారస్య గత్యభావా దూడాదేశే చ్ఛ్వో రన్త్యత్వేన విశేషణా చ్చేతి - ఏతేన విషాదో వ్యజ్యతే, నిశ్వాసానాం = సీత్కారాణామ్ - అశిశిరతయా = అన్తస్సన్తాపోష్ణత్వేన, భిన్నవర్ణో(విచ్ఛాయో)ఽధరోష్ఠో యస్య తత్, హస్తే న్యస్తం హస్తన్యస్తమ్, ఏతేన చిన్తా వ్యజ్యతే, లమ్బాలకత్వాత్ = సంస్కారాభావా ల్లమ్బమానకున్తలత్వాత్, అసకలవ్యక్తి = అసంపూర్ణాభివ్యక్తి, తస్యాః = ప్రియాయాః, ముఖం, త్వదనుసరణేన = త్వదుపరోధేన - మేఘానుసరణేనేతి యావత్, క్లిష్టకాన్తేః=క్షీణకాన్తేః, ఇన్దోః, దైన్యం=శోచ్యతాం, బిభర్తి, నూన మితి వితర్కే-+'నూనం తర్కేఽర్థనిశ్చయే' ఇత్యమరః. పూర్వవత్ తథాపి న భ్రమితవ్య మితి భావః.

ప్రబ...త్రమ్ - ప్రబల = అధికమయిన - రుదిత = ఏడ్పుచేత - ఉచ్ఛూన = ఉబ్బిన - నేత్రమ్ = కన్నులుగలదియు - (ఇందుచే విషాదము సూచింపఁబడుచున్నది), నిశ్వాసానామ్ = నిట్టూర్పులయొక్క, అశిశిరతయా = (లోపలితాపమువలని) వేఁడిమిచేత, భిన్న...ష్ఠమ్ - భిన్న = చెడిన - వర్ణ = ఛాయగలదైన - అధరోష్ఠమ్ = క్రిందిపెదవిగలదియు, హస్తన్యస్తమ్ - హస్త = చేతిలో-న్యస్తమ్ = ఉంపఁబడినదియు - (ఇందుచే చింత తెలియుచున్నది), లమ్బాలకత్వాత్ - లమ్బ=

---

1 'ఏషా నళినీపత్త్రాన్తరగత మపి సహచర మపశ్యన్తీ ఆతురా చక్రవాక్యారసతి'- శాకుం.

(దువ్వమిచే) వ్రేలుచున్న - అలకత్వాత్ = ముంగురులు గలదగుటచేత, అసకలవ్యక్తి = అసంపూర్ణాభివ్యక్తి (సంపూర్ణముగా అగపడనిది)యు, (అయిన), తస్యాః ప్రియాయాః ముఖమ్=ఆప్రేయసిముఖము, త్వదు... కాన్తేః - త్వత్ = నీయొక్క- ఉపసరణ = అడ్డపడుటచేత - క్లిష్ట = చెడిన - కాన్తేః = ప్రభగలవాఁడైన, ఇన్దోః = చంద్రునియొక్క-, దైన్యమ్ = శోచ్యతను, బిభర్తి నూనమ్ = పొంది యుండు నని తలఁచెదను.

తా.—నీవు పోయి చూచునప్పుడు - మిక్కిలి యేడ్చియుండుటచేత కన్నులు ఉబ్బి, లోపలిదుఃఖమువలన వేఁడినిట్టూర్పులు నిగిడించుచు, ఆనిట్టూర్పులచే అధరోష్ఠకాంతి చెడి, చింతాక్రాంతిచే చెక్కిలి చేతనుండ, దువ్వకొనమివలన ముంగురులు పైవ్రేలుచుండుటచే చక్కఁగా అగపడక కొంచెకొంచె మగపడునదై ఆ నాప్రియతమముఖము నీయడ్డపాటునకుఁ గాంతిదప్పిన చంద్రుఁడుబోలె దీనమై యుండు నని తలఁచెదను.

వ.—ఉపమానమయినచంద్రునియందు- (క) మబ్బుఅడ్డపడుట, (చ) పూర్ణముగా అగపడమి, (ట) కాంతి లేమి, (త) దైన్యము, చెప్పఁబడినవి. ఉపమేయమయిన ముఖమందును- (క) సంస్కారము లేక వ్రేలాడుముంగురులును, (చ) పూర్ణముగా అగపడమి, (ట) కెమ్మోవి జిగిమాలి ఏడ్చియేడ్చి కన్నులు ప్రభమాసి ఉబ్బియుంటుటయు, (త) దైన్యమును-చెప్పఁబడినవి, 1 'రుదితము' 'ప్రబలము' గావున కన్నులు 'ఉచ్ఛూన'-ఉబ్బినవి; 'ప్రబల' మనుటచే ఎనిమిది నెలలు నిరంతరము ఏడ్చుచుండె నని తెలియుచున్నది. 'అశిశిర'-దుఃఖాతిశయముచే నిట్టూర్పులు మిగులవేఁడియెక్కినవి. 'భిన్నవర్ణ'—నీడలో నుండుటచేత మంచివన్నె గలిగియుండుటయు ఎండలో పాటుపడుటచేత వన్నెచెడియుండుటయు వేఁడిచే దేహకాంతిచెడుటకు ప్రసిద్ధనిదర్శనములుగదా. 'హస్తన్యస్తమ్'-స్త్రీలు చింతచే చెక్కిలి ఎడమచేతనుంచుకొనిన ఆచింత తీఱి మేలు కలుగు ననియు కుడిచేత నుంచుకొనిన అనిష్టపర్యవసాయి యగు ననియు పురుషుల కివి విపరీతమనియు శకునశాస్త్రము; కనుక ఇట

1 'ప్రవాసో భిన్నదేశత్వం కార్యాచ్ఛాపా చ్చ సంభ్రమాత్.
తత్రాఙ్గచేష్టా మాలిన్య మేకవేణీధరం శిరః,
నిశ్వాసోచ్ఛ్వాసరుదితభూమిపాతాది జాయతే.
అఙ్గే ష్వసౌష్ఠవం తాపః పాణ్డుతా కృశతా రుచిః
అధృతిః స్యా దనాలమ్బ స్తన్మయోన్మాదమూర్ఛనాః
మృతి శ్చేతి క్రమాత్ జ్ఞేయా దశ స్మరదశా ఇహ.' దర్పణము.

యక్షి 1ఎడమచేత చెక్కిలి యుంచుకొని చింతాక్రాంతురాలై యుండు నని ఱెఱుంగునది. 'త్వదుపసరణ'—చంద్రునికి మేఘాపరోధదైన్యమును చెప్పుటచే యక్షీముఖదైన్యముకూడ మేఘకృతమైన యాచంద్రదైన్యమువోలె త్వరలోనే తీఱి పోవునది యనియు సూచిత మగుచున్నది. 2'అభ్యాలకత్వాత్'—ప్రోషితభర్తృక లయిన పతివ్రతలు 'ప్రోషితే మలినాకృశా' యనుస్మృతిప్రకారము దేహసంస్కార ములను ఒల్లరు, 3 ఇన్దో ర్దైన్యమ్'-ఎట్టిదీనావస్థలోనున్నను చంద్రునితో సామ్యము తప్పదాయెను.

ఆలోకే తే నిపతతి పురా సా బలివ్యాకులా వా
మత్సాదృశ్యం విరహతను వా భావగమ్యం లిఖన్తీ
పృచ్ఛన్తీ వా మధురవచనాం శారికాం పఞ్జరస్థాం
కచ్చిద్భర్తుః స్మరసి రసికే త్వం హి తస్య ప్రియేతి. 24.

సర్వవిరహిణీసాధారణాని లక్షణాని సంభావన యోత్ప్రేక్ష్యాహ 'ఆలోక' ఇత్యాదిభి స్త్రిభిః :—

ఆలోక ఇతి.—హే మేఘ, సా = మత్ప్రియా, బలిషు=నిత్యేషు ప్రోషి తాగ మనార్థేషు చ దేవతారాధనేషు - వ్యాకులా = వ్యాపృతా - వా, విరహేణ - తను =కృశం, భావగమ్యమ్ = తత్కార్శ్య స్యాదృష్టచరత్వా త్సంప్రతి సంభావన యోత్ప్రేక్ష్య మిత్యర్థః, మత్సాదృశ్యం = మదాకారసామ్యం - మత్ప్రతికృతి

1'శశిమణిశిలా నేయం యస్యాం విపాణ్డుర మాననం
కరకిసలయే కృత్వా వామే ఘనశ్వసితోద్గమా
చిరయతి మయి వ్యక్తాకూతా మనాక్ స్ఫురితాధరా
విరమితమనోమన్యు ర్దృష్టా మయా రుదతీ ప్రియా.' నాగా.

2'మ్లానం పాణ్డు కృశం విలాసవిధురం లమ్బాలకం చాలసం
భూయ స్తత్క్షణజాతకాన్తిసుభగం ప్రాప్తే మయి ప్రోషితే
సాటోపం రతికేళిదత్తరభసం రమ్యం కిమ ప్యాదరాత్
పీతం యత్సుతనో ర్మయా ముఖ మిదం తత్కేన విస్మర్యతే.' అమరు.

3'పాటన నేయమిం గురులు పైఁబడి శీర్ణపటీరపంకలా
లాటికమై దరస్మితవిలాసవుఁజంద్రిక డొంకి వాడుటం
దేటు దొఱంగి విన్ననగునీమొగమో యన మాసి చంద్రుఁడో
పాటలగంధి వ్రాతె నదె భానురుచిం దనకంధు మిఱుఁగన్.' కుస్మ.

మిత్యర్థః, యద్యపి సాదృశ్యంనామ ప్రసిద్ధవస్త్వన్తరగత మాకారసామ్యం తథాపి ప్రతికృతిత్వేన వివక్షిత మితర థాలేఖ్యత్వాసంభవాత్ - అజయ్యకోశే 'ఆలేఖ్యేఽపి చ సాదృశ్యమ్' ఇత్యభిధానాచ్చ, లిఖన్తీ = క్వచి త్ఫలకాదౌ విన్యస్యన్తీవా, చిత్రదర్శనస్య విరహిణాం వినోదోపాయత్వా దితి భావః,—ఏతచ్చ కామశాస్త్రసంవాదేన సమ్య గ్వివేచిత మస్మాభి రఘువంశ సంజీవన్యాం 'సాదృశ్యప్రతికృతి దర్శనైః ప్రియాయాః' ఇత్యత్ర, మధురవచనాం = మఞ్జుభాషిణీమ్, అతఏవ, పఞ్జరస్థామ్ = హింస్రేభ్యః కృతసంరక్షణా మిత్యర్థః; శారికాం = స్త్రీపక్షివిశేషమ్, హే రసికే, భర్తుః = స్వామినః, స్మరసి కచ్చిత్ + 'కచ్చి త్కామప్రవేదనే' ఇత్యమరః, భర్తారం స్మరసి కి మిత్యర్థః * 'అధీగర్థదయేశాం కర్మణి' ఇతి కర్మణి షష్ఠీ-సాచ శేషాధికారా చ్ఛేషత్వవివక్షాయా మేవ - కర్మత్వవివక్షాయాం తు ద్వితీయా భవతీతి వేదితవ్యమ్, స్మరణే కారణమాహ - హి=యస్మాత్కారణాత్-త్వం తస్య భర్తుః, ప్రీణాతీతి ప్రియా * 'ఇగుపధజ్ఞాప్రీకిరః కః' ఇతి కప్రత్యయః - అతః ప్రేమాస్పదత్వాత్ స్మర్తు మర్హసీతి భావః, ఇత్యేవం పృచ్ఛన్తీ వా-వా శబ్దో వికల్పే + 'ఉపమాయాం వికల్పే వా' ఇత్యమరః, తే=తవ, ఆలోకే=దృష్టిపథే, పురా నిపతతి=సద్యో నిపతిష్య తీ త్యర్థః+'స్యా త్ప్రబన్ధే చిరాతీతే నికటాగామికే పురా' ఇత్యమరః * 'యావత్పురా నిపాతయో ర్లట్' ఇతి భవిష్యదర్థే లట్.

సర్వవిరహిణీసాధారణలక్షణములు ఈమెయందును ఉండు నని తలంచి వానిని మూఁడుశ్లోకములఁ జెప్పుచున్నాఁడు.

(హే మేఘ = ఓమేఘుఁడా), సా = నాప్రియతమ, బలివ్యాకులావా - బలి =(ప్రోషితుఁడ నయిన నేను మరల తనకడకు వచ్చుటకై) ఇష్టదేవతారాధనములయందు - వ్యాకులా వా = వ్యాపృతగాఁ గాని, విరహతను - విరహ = వియోగముచేత - తను = కృశమయిన, (అందుచేతనే), భావగమ్యమ్ - భావ = భావనచే - గమ్యమ్ = ఎఱుఁగదగినదైన - (అట్టికార్శ్యము లోకములో మఱియెచటను లేనిది గావున ఇప్పుడు నావిషయమున ఊహచేత ఉత్ప్రేక్షింపఁదగినది అని యర్థము), మత్సాదృశ్యమ్ - మత్ = నాయొక్క - సాదృశ్యమ్ = ఆకారసామ్యమును - (నాప్రతిమను అని యర్థము), లిఖన్తీ వా = (చిత్రఫలకము మొదలగువానియందు) వ్రాయుచున్నదిగాఁ గాని(చిత్రదర్శనము విరహులకు వినోదోపాయ మనిభావము), మధురవచనామ్ = మధురభాషిణి యైన, పఞ్జరస్థామ్ = పంజరములోనున్న (పిల్లి మొదలయినఘాతుకజంతువులనుండి రక్షింపఁబడినదానిని అని యర్థము), శారికామ్ = గోరవంకను, (హే) రసికే = (ఓ) రసజ్ఞురాలా, భర్తుః = (మన) దొరను, స్మరసి కచ్చిత్ = తలంతు వా, హి = ఎందుచేతననఁగా, త్వమ్ = నీవు, తస్య =

ఆయనకు, ప్రియా = ప్రియవు - (ఆయనకు నీవు ప్రేమాస్పదమవు గావున ఆయనను స్మరింపఁదగుదువు అని యర్థము), ఇతి = ఇట్లని, పృచ్ఛన్తీవా = అడుగుచున్నదిగాఁ గాని, తే ఆలోకే = నీ దృష్టిలో, పురా నిపతతి = పడఁగలదు.

తా.—నీవు పోయి చూచిన నాప్రియతమ నావచించు నీవిధములలో నేదే నొకవిధమున ఉండును.—నేను మరల త్వరగా క్షేమముగా వచ్చుటకై ఇష్ట దేవతాపూజ చేయుచు నైన ఉండును; విరహముచేత అతికృశమైన నాస్వరూపమును చిత్తరువున వ్రాయుచునైన ఉండును; పంజరములో నున్న మంజుభాషిణియైన పెంపుడుగోరవంకను 'ఓరసజ్ఞురాలా, నీవు మనసామిని తలంతువుగదా? ఏల తలంపవలయు నన్న ఆయనకు నీపై ప్రేమగదా?' అని అడుగుచు నైన ఉండును.

ప.—'వ్యాకులా'—పూజను ఇతరవిషయములు మనస్సున చొరనీయక ఏకాగ్రచిత్తముతో చేయుచుండు నని భావము. 'ప్రతిమామ్' అనక [1] 'సాదృశ్యమ్' అనుటచే ఆరూపము, ప్రతిమ యనిపించుకొనఁదగినంతపాటిది గాదు - అదృష్టచరమయిన విరహకార్శ్యముచేత భావనాగోచరమే గాని దృష్టిగ్రాహ్యము గా దని భావము. 'మధురవచనామ్' అనుటచే ఇంతకు పూర్వము తఱచుగా ఈ వియోగినిని [2] ఈ శారిక భర్తృసంబద్ధములయిన మంజుభాషణములతో ఓదార్చియున్న దని సూచిత మగుచున్నది. 'పఞ్జరస్థామ్'—పెంపుడుగోరవంకగావున మధురవచనయై ఆమెతో సమదుఃఖసుఖయై ఆమెను ఓదార్పఁగలిగియున్నది - అడవిగోరవంక యైన ఇది ఘటింపదు. 'రసికే' అనుటచే, యక్షునిగుణసంపదను గ్రహింపఁగలది - అతని ప్రేమను అనుభవించినది-అందునకు తగినట్లు బదులు ప్రేమించునది - కనుక అతనిని స్మరించును - అని భావము.

ఉత్సఙ్గే వా మలినవసనే సౌమ్య నిక్షిప్య వీణాం
మద్గోత్రాఙ్కం విరచితపదం గేయ ముద్గాతుకామా
తన్త్రీమార్ద్రాం నయనసలిలైః సారయిత్వా కథంచిద్
భూయోభూయః స్వయమపికృతాం మూర్ఛనాం విస్మరన్తీ.25.

ఉత్సఙ్గేతి.—హే సౌమ్య=సాధో, మలినవసనే 'ప్రోషితే మలినా కృశా' ఇతి స్మరణా దిత్యర్థః, ఉత్సఙ్గే = ఊరౌ, వీణాం నిక్షిప్య, మమ గోత్రం (నామ) అఙ్కం (చిహ్నం) యస్య త త్తథోక్తం మన్నామాఙ్కితం యథాతథా + గోత్రం నామ్ని

1 ఉ. మే. 43-వ శ్లో. వ్యాఖ్యలో 'వియోగే' ఇత్యాది చూచునది.
2 ఉ. మే. 27-వ శ్లో. వ్యాఖ్యలో 'సఖ్యో భ్రాత్రీ' ఇత్యాది చూచునది.

కులేఽపి చ' ఇత్యమరః, విరచితాని పదాని(సుప్తిఙన్తాని)యస్యత త్తథోక్తం, గేయం = గానార్హం ప్రబన్ధం-'గీతమ్' ఇతి పాఠే స ఏవార్థః,ఉద్గాతుమ్ = ఉచ్చైర్గాతుం కామా యస్యాః సా * 'తుం కామ మనసో రపి' ఇతి మకారలోపః - దేవయోనిత్వా ద్గాన్ధారగ్రామేణ గాతుకామే త్యర్థః-తదుక్తం ♦ 'షడ్జ మధ్యమ నామానౌ గ్రామౌ గాయన్తి మానవాః। నతు గాన్ధారనామానం స లభ్యో దేవయోనిభిః'ఇతి, తథా, నయనసలిలైః = ప్రియతమస్మృతిజనితై రశ్రుభిః, ఆర్ద్రాం తన్త్రీం, కథంచిత్ =కృచ్ఛ్రేణ, సారయిత్వా=ఆర్ద్రత్వాపహరణాయ కరేణ ప్రమృజ్య-అన్యథా క్వణనాసంభావా దితి భావః, భూయోభూయః = పునః పునః, స్వయమ్ = ఆత్మనా, కృతామపి - విస్మరణానర్హామ పీత్యర్థః, మూర్ఛనాం = స్వరారోహావరోహక్రమం ♦ 'సమగ్రేషు విలోమేన సాదయ స్తు స్వపూర్వగాః। స్వరాణాం స్థాపనాః సాన్తా మూర్ఛనాః సప్త సప్త హి' ఇతి సంగీతరత్నాకరే, విస్మరన్తీవా,ఆలోకే తే నిపతతి' ఇతి పూర్వే ణాన్వయః, విస్మరణం చాత్ర దయితగుణస్మృతిజనితమూర్ఛావశా దేవ, తథాచ రసరత్నాకరే + 'వియోగాయోగయో రిష్టగుణానాం కీర్తనాత్ స్మృతేః। సాఽతిత్వాఽరోఽథవా మూర్ఛా దశధా జాయతే తదా' ఇతి, మత్సాదృశ్య మిత్యాదినా మనఃసఙ్గానువృతిః సూచితా.

(హే) సౌమ్య=(ఓ) సాధూ, మలిన వసనే=మలినమైన వస్త్రముగలదైన, ఉత్సఙ్గే = తొడమీఁద, వీణామ్ = వీణను, నిక్షిప్య= ఉంచుకొని, మద్గోత్రాఙ్కామ్ - మత్ = నాయొక్క - గోత్ర = నామమను - అఙ్కామ్ = గుఱుతు గలది యగునట్లుగా, విర...దమ్-విరచిత = రచింపఁబడిన- పదమ్=పదములుగలదైన, గేయమ్=పాటను, ఉద్గాతుకామా - ఉద్గాతుమ్ = ఉచ్చైఃస్వరముతో (అనఁగా దేవయోనులకుమాత్రమే సాధ్యమైనగాంధారగ్రామములో) పాడుటకు - కామా = కోరికగలదై, నయన సలిలైః = (ఇంతలో ప్రియతమునిస్మరణముచేతఁ గలిగిన) బాష్పములచే, ఆర్ద్రామ్ =తడిసిన, తన్త్రీమ్=(వీణ) తీఁగను, కథంచిత్ = ఎట్టకేలకు, సారయిత్వా=(తడిగా ఉన్నయెడల నాదము పుట్టదుగావున) తుడిచి, భూయోభూయః = మరలమరల, స్వయమ్=తనచేతనే, కృతామపి = చేయఁబడినదానినైనను, మూర్ఛనామ్ = స్వరస్థాపనావిశేషమును, విస్మరన్తీ = (ప్రియతముని గుణముల స్మరణచేఁగలినమూర్ఛవలన) మఱచుచున్నదిగా నయిన (తే ఆలోకే నిపతతి = నీ దృష్టిలో పడును).

తా.—నాప్రియతమ యీవిధముగా నైన ఉండును:—వియోగదుఃఖముచే సంస్కారములుమానినందున మలినవస్త్రయై, మలినవస్త్రమయినతొడమీఁద వీణను

ఉంచుకొని - నామీఁద నాపేరు ఉదాహరించి చేసినపాటను గాంధారగ్రామమున పాడఁగోరినదై - నాస్మరణవలనఁ గలిగినకన్నీళ్లచే తంతువులు తడియఁగా-తడితంతువులయందు నాదము పుట్టదుగావున - ఆతడిని విరహాయాసముచే ఎట్టకేలకు తుడిచి వేసినదై - తాను పాడఁదలఁచినమూర్ఛనను తానే కల్పించినదానినైనను ఇంతలో నాస్మరణవలనఁ గలిగినమూర్ఛవలన మాటిమాటికి మఱచుచు - మాటిమాటికి జ్ఞప్తిచేసికొనుచు - నైన - ఉండును.

వి.—కొందఱు 'తన్త్రీరార్ద్రాః' అని బహువచనముగా పఠించి అనేకతంతువులను ఒకమాటే తుడిచిన దనుటచే యక్షాంగనయొక్క నేర్పు సూచిత మగుచున్న దనియు అరిదుచేత ఆపాఠమే మేలనియు చెప్పుదురు. బాష్పములు గురియుట-తానే కల్పించుకొన్న మూర్ఛనను మాటిమాటికి తానే మఱచిపోవుట-ఇట్టిదురవస్థలోనున్న యక్షాంగన వైదగ్ధ్యము చూపె ననుట హృదయంగమము గాదు. ఆమె సంకల్పింపకఁ బోయినను అభ్యాసవశముచేత అనేకతంతువులను ఒకమాటే తుడువఁగా నేర్పు వినియుక్తమాయె నని చెప్పుదురేని - 'కథంచిత్' అనుటచేత విరహాయాసమువలన ఒక తీఁగను తుడుచుటయే కష్టముగా నుండె ననియు పెక్కుతంతువుల నయిన తుడువఁ దలంపనే తలంప దనియు గ్రహించుట సొంపుగా నున్నది; కావున 'తన్త్రీమార్ద్రామ్' అని ఏకవచనపాఠమే శ్రేయము.

శేషా న్మాసా న్విరహదివసస్థాపిత స్యావధే ర్వా
విన్యస్యన్తీ భువి గణనయా దేహళీదత్తపుష్పైః
సంభోగం వా హృదయనిహితారమ్భ మాస్వాదయన్తీ
ప్రాయే ణైతే రమణవిరహే ష్వఙ్గనానాం వినోదాః. 26.

శేషానితి.—అథవా, విరహస్య దివసః (ప్రథమదివసః) - తస్మాత్ స్థాపితస్య = తత ఆరభ్య నిశ్చితస్య, అవధేః=అన్తస్య, శేషాన్ = గతావశిష్టాన్, మాసాన్, దేహళీదత్తపుష్పైః - దేహళీ = ద్వారస్యాధారదారు + 'గృహావగ్రహణీ దేహళీ' ఇత్యమరః - తత్ర - దత్తాని-రాశిత్వేన నిహితాని -యాని పుష్పాణి తైః గణనయా = ఏకో ద్వౌ విత్యాదిసంఖ్యానేన, భువి = భూతలే, విన్యస్యన్తీ వా, పుష్పవిన్యాసైర్మాసా న్గణయన్తీ త్యర్థః, యద్వా, హృదయే నిహితః = మనసి సంకల్పితః - ఆరమ్భః = ఉపక్రమో - యస్య తమ్ (అథవా-హృదయనిహితాః-ఆరమ్భాః=చుమ్బనాదయో వ్యాపారాః - యస్మిం స్తం) సంభోగం = రతిమ్ - ఆస్వాదయన్తీవా=

అనుభవన్తీవా, 'ఆలోకే తే నిపతతి' ఇతిపూర్వేణ సంబన్ధః; నను కథ మయం నిశ్చయ ఇత్యాశఙ్క్య అర్థాన్తరన్యాసేన పరిహరతి:— ప్రాయేణ = బాహుళ్యేన, అఙ్గనానాం, రమణ విరహేషు=ప్రియ వియోగేషు, ఏతే=పూర్వోక్తాః వినోదాః = కాలయాపనోపాయాః, ఏతేన సంకల్పావ స్థోక్తా - తదుక్తం † 'సంకల్పో నాథవిషయమనోరథ ఉదాహృతః' ఇతి.

విర...తస్య—విరహ = వియోగముయొక్క - దివస = ప్రథమదినము మొదలుకొని - స్థాపితస్య = నిశ్చయింపఁబడిన - అవధేః=అంతముయొక్క, శేషాన్= అవశిష్టములయిన, మాసాన్ = నెలలను, దేహ...పుష్పైః—దేహళీ=గడపమీఁద - దత్త=(రాశిగా) పెట్టఁబడిన - పుష్పైః = పువ్వులతో, గణనయా = ఒకటి రెండు మూఁడు అని లెక్కపెట్టుటతో (లెక్కపెట్టుచు), భువి = నేలమీఁద, విన్యస్యన్తీవా = ఉంచుచుఁగాని (పువ్వులను ఉంచుటయను నుపాయముచేత మాసములను లెక్కపెట్టుచుఁ గాని), హృద...రమ్భమ్—హృదయ = మనస్సున - నిహిత= సంకల్పింపఁబడిన - ఆరమ్భమ్ = ఉపక్రమముగలదైన (లేక - హృదయనిహిత = మనస్సున సంకల్పింపఁబడిన - ఆరమ్భమ్ = చుంబనాలింగనాదివ్యాపారములు గలదైన), సంభోగమ్ = రతిని, ఆస్వాదయన్తీ వా = అనుభవించుచుఁగాని; (తే ఆలోకే నిపతతి = నీదృష్టిలో పడును)- ఇట్లుండు నని ఏమి నిశ్చయము అని యాశంకించుకొని సమాధానము చెప్పుచున్నాఁడు:—ప్రాయేణ = తఱచుగా, అంగనానామ్ = స్త్రీలకు, రమణ విరహేషు = ప్రియులతోడి వియోగములయందు, ఏతే = ఈ చెప్పఁబడినవి, వినోదాః=కాలము గడపుటకు ఉపాయములు.

తా.—నాప్రియతమ యీవిధముగానైన ఉండును: - గడపదగ్గఱ కూర్చుండి దానిమీఁద రాశిగా పుష్పములు పెట్టుకొని ఇంక నెన్నిమాసములకు నేను వత్తునో ఆమాసములను ఒకటి రెండు మూఁడు అని లెక్కపెట్టుటగా ఆపుష్పములను ఒక మాసమున కొకపుష్పము సూచకముగా గడపమీఁదినుండి తీసి నేలఁబెట్టుచుఁగాని, మనస్సులో మత్సంభోగభావనను అనుభవించుచుఁ గాని, ఉండును. ఇట్లుండు నని ఎట్లు చెప్పెద వనఁగా - సాధారణముగా ఇవే గదా ప్రియవియుక్తలైన తరుణులకు కాలయాపనోపాయములు.

వ.—'దేహళీ'—ఆమె గడపయొద్దకూర్చుండుట ఏల యనఁగా-నాయకుఁడు ఏక్షణములో వచ్చునో యని యెదురు చూచుటకు. ఇంక కొన్నినెలలకే గాని రాఁడని యెఱుఁగును గదా యనిన - దైవానుగ్రహబలమున ముందే వచ్చునుగాక యని

యాశంస. 1 ఇందులకు గీంతక్రింది యమరుశ్లోకమును చూడవచ్చును. ఇచ్చట కాల వ్యవధాన మనియు అమరుశ్లోకమందు దేశవ్యవధాన మనియు ఇంతియ భేదము. 'దత్త'-ఇచట గడపను పూజించిన పుష్పములని కొందఱు వివరించినారు. గృహ స్వామి శాపప్రోషితుండై తద్భార్య విరహభరాలసయై ఉండంగా 2 ఉత్సవహీన మైన యీ కాలములలో దేహళీపూజ పుష్పాదికముతో విరివిగా చేయంబడె ననుట సమంజసము గాదు - 'ఊమచ్ఛాయం భవన మధునా.' 'విరహే హ్యఙ్గనానామ్'— అని కొందఱు పఠించి ఆపాఠమే మేలనిరి. హిశబ్దము లేనిమాత్రమున అర్థస్ఫూర్తి యేమియు చెడదు. 3 అర్థాంతరన్యాసనమందు హిశబ్దము లేనిప్రయోగము లెన్నియేని కలవు. ఇచట హిశబ్ద మున్న దోషమా యనిన, 'హేహ్య' అనుట శ్రుతికటువు గదా?

సవ్యాపారా మహని న తథా పీడయే ద్విప్రయోగః
శఙ్కే రాత్రౌ గురుతరశుచం నిర్వినోదాం సఖీం తే
మత్సందేశైః సుఖయితు మలం పశ్య సాధ్వీం నిశీథే
తా మున్నిద్రా మవనిశయనాం సద్మవాతాయనస్థః. 27.

---

1 'దేశై రన్తరితా శతైశ్చ సరితా ముర్వీభృతాం కాననై
ర్యత్నేనాపి న యాతి లోచనపథం కాన్తేతి జానన్నపి
ఉద్గ్రీవ శ్చరణాగ్రరుద్ధవసుధః ప్రోన్మృజ్య సాస్రే దృశౌ
తా మాశాం పథిక స్తథైవ కిమపి ధ్యాయన్ ముహు ర్వీక్షతే.' అమరు.

2 'శాకుంతలనాటకమందు దుష్యంతమహారాజు శకుంతలావియోగ కాలమందు వసంతోత్సవమును నిషేధించినాండు:—

ద్వితీయా.—(ఛా.) సఖి, అవలమ్బస్వ మాం యావ దగ్రపాదస్థితా
కామదేవార్చనాయ చూతాఙ్కురాపచయం కరోమి.
ప్రథమా.—(ఛా) యది మ మా ప్యర్ధ మర్చనఫలస్య.
(ప్రవిశ్య పటాక్షేపేణ) కఞ్చుకీ.—మాతావ దనాత్మజ్ఞే దేవేన ప్రతిషిద్ధే
వసన్తోత్సవే త్వ మామ్రకలికాభఙ్గ మారభసే.
ఉభే భీతే.—(ఛా.) ప్రసీద త్వార్యః అగృహీతార్థే ఆవామ్.

3 'ఘటో జన్మస్థానం మృగపరిజనో భూర్జవసనః
వనే వాసః కన్దాదిక మశన మేవంవిధగుణః
అగస్త్యః పాథోధిం యదకృత కరామ్భోజకుహరే
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే.'

సవ్యాపారా మితి.—హేసఖే అహని = దివసే, సవ్యాపారాం = పూర్వోక్తబలిచిత్రలేఖనాదివ్యాపారవతీం, తేసఖీం = స్వప్రియాం, విప్రయోగః = మద్విరహః, తథా = తేనప్రకారేణ *'ప్రకారవచనే థాల్' ఇతి థాల్ప్రత్యయః. న పీడయేత్ - యథా రాత్రా వితిశేషః, కింతు రాత్రౌ, నిర్వినోదాం = నిర్వ్యాపారాం, తేసఖీం, గురుతరా శు గ్వస్యా స్తాం - గురుతరశుచమ్=అతిదుర్భరదుఃఖాం, శఙ్కే = తర్కయామి + 'శఙ్కా-వితర్క-భయయోః, ఇతి శబ్దార్ణవే, అతో-నిశీథే = అర్ధరాత్రే, ఉన్నిద్రామ్ = ఉత్సృష్టనిద్రామ్; అవని రేవ శయనం (శయ్యా) యస్యా స్తాం = నియమార్థం స్థణ్డిలశాయినీం, సాధ్వీం = పతివ్రతాం + 'సతీ సాధ్వీ పతివ్రతా' ఇత్యమరః-అతో నాన్యథా శఙ్కితవ్యమితిభావః,తాం= త్వత్సఖీం, మత్సందేశైః = మద్వార్తాభిః, అలం = పర్యాప్తం, సుఖయితుమ్= ఆనన్దయితుం, సద్మవాతాయనస్థః=సౌధగవాక్షగత స్సన్, పశ్య † 'సఖ్యో ధాత్రీ చ పితరౌ మిత్రదూతశు కాదయః। సుఖయ న్తీష్టకథనముఖోపాయై ర్వియోగినీమ్' ఇతి రసరత్నాకరే, దూత శ్చాయం మేఘ ఇతిభావః. అనేన జాగరావ స్థోక్తా.

(హేసఖే = ఓమిత్రమా), అహని = పగలు, సవ్యాపారామ్ = పూర్వోక్తములయిన బలి చిత్రలేఖనాది వ్యాపారములుగలదైన, తే = నీయొక్క, సఖీమ్ చెలిని - అనఁగా నాప్రియతమను, విప్రయోగః = విరహము, తథా = ఆప్రకారముగా (అనఁగా రాత్రియందుంబోలె), న పీడయేత్ = బాధింపదు, (కింతు = మఱియేమనిన), రాత్రౌ = రాత్రియందు, నిర్వినోదామ్ = నిర్వ్యాపారమైన, తేసఖీమ్ = నీచెలిని - అనఁగా నాప్రియతమను, గురు...చమ్—గురుతర = అతిదుర్భరములయిన - శుచమ్ = దుఃఖముగలదానినిగా, శఙ్కే = తలంచుచున్నాను; (తతః= అందువలన), నిశీథే=అర్ధరాత్రమందు, ఉన్నిద్రామ్ = వదలిననిద్రగలదైన (నిద్రను వదలినదైన-మేలుకొన్నదైన), అవని శయనామ్=నేలయే పడుకగాఁగలదైన (నియమార్థము నేలఁబరున్న), తాం సాధ్వీమ్ = ఆపతివ్రతను, మత్ సందేశైః = నా వార్తలతో, అలం = పూర్తిగా, సుఖయితుమ్ = ఆనందపెట్టుటకు, సద్మవాతాయన స్థః (సన్)=సౌధముయొక్క గవాక్షమందు ఉన్నవాఁడవై,పశ్య=చూడుము.

తా.—1 పగలు నాప్రేయసిని ఆబలిచిత్రలేఖనాది వ్యాపారములయం దుండు

1 'పయస్య రజన్యా సహ విజృమ్భతే మదనబాధా;
కార్యాన్తరితోత్కణ్ఠం। దినం మయా నీత మనతికృతిచ్ఛేణ
అవినోదదీర్ఘయామా। కథం ను రాత్రి ర్గమయితవ్యా.' విక్రమోర్వశి.

టచే వియోగభారము అంతగా బాధింపదు. రాత్రి అట్టివ్యాపార మేమియు నుండదు గావున నాప్రియతమకు వియోగశోకము భరింపరానిదిగా నుండును. కనుక నీవు ఆతరుణిని అర్ధరాత్ర సమయమున దర్శించి అత్యంతానందమును కలిగింపుము. అర్ధరాత్రముయొక్క విశేష మే మనఁగా-ఆయబల నిద్రపట్టక అత్యంతశోకమును అనుభవించుచుండు సమయ మది. అప్పుడు ఆరమణి వ్రతార్థమై నేలఁబరుండియుండును. రాత్రి పరకాంతను పోయి దర్శించుట యుచితము గాదని శంకింపకుము. పతివ్రత గావున ఆచెలిని అట్టిసమయములో సందర్శించుటకు తగినచోటు ఏదనఁగా మేడకిటికీ. అందుఁ గూర్చుండి ఆప్రతివ్రతను హెచ్చరించి నాసందేశ మందించి ఆనందపఱిచి రక్షింపుము.

వి.—ఇచట కొందఱు 'అలమ్' అను పాఠముకన్న 'అతః' అనుపాఠము మే లని వివరించినారు. 'అతః' అని ప్రయోగింపక పోయినను తదర్థము గమ్య మగును. 'అలమ్' అనుటచే-పగలయిన సామాన్యసుఖము గలుగును రాత్రియయిన సంపూర్ణసుఖము గలుగును గాన- 'సంపూర్ణసుఖమునే కలిగించుటకై రాత్రియందేచూడుము' అని యర్థము మిగుల రసపుష్టముగా నుండును. కనుక మల్లినాథులవారు గ్రహించినపాఠమే సరి. 'అవనిశయనాసన్నవాతా యనస్థః' అని కొందఱు వ్యాఖ్యాతలు పఠింతురు. దానియర్థము 'నాచెలియొక్క నేలపడుకకు దగ్గఱనుండుకిటికీలో కూర్చున్నవాఁడవై' అని. లోపలికి పోయి చూడకముందు ఏవాతాయనము ఆమెకు సమీపమో ఎట్లు తెలియును? ఒకకిటికీగుండ ప్రవేశించి మఱియొకకిటికీలోనికి ఇంటిలోపల కలభతనుఁడైనను మహాభూతమువలె మేఘుఁడు సంచరించుచున్నను, ఒకకిటికీలో తల పెట్టి ఇల్లు చుట్టి మఱియొకకిటికీలోనికి వచ్చినను, ఆమె చూచెనేని భయసంశయములు గలిగి కార్యము చెడి రసాభాసముకాదా! కనుక మల్లినాథసూరిపాఠమే శ్రేయము.

ఆధిక్షామాం విరహశయనే సంనిషణ్ణైకపార్శ్వాం
ప్రాచీమూలే తనుమివ కళామాత్రశేషాం హిమాంశోః
నీతా రాత్రిః క్షణఇవ మయా సార్ధ మిచ్ఛారతైర్యా
తా మే వోష్ణై ర్విరహమహతీ మశ్రుభి ర్యాపయన్తీమ్. 28.

పున స్తా మేవ విశినష్టి 'ఆధిక్షామామ్' ఇత్యాదిభి శ్చతుర్భిః—ఆధిక్షామా మితి.—ఆధినా = మనోవ్యథయా - క్షామాం = కృశాం + 'పుం స్యాధి ర్మానసీ వ్యథా' ఇత్యమరః - క్షాయతేః కర్తరి క్తః * 'క్షాయో మః' ఇతి నిష్ఠాతకారస్య ఘ

కారః, విరహే శయనం తస్మి న్విరహశయనే-పల్లవాదిరచిత ఇత్యర్థః, సన్నిషణ్ణ మేకం పార్శ్వం యస్యా స్తామ్, అతఏవ, ప్రాచ్యాః = పూర్వస్యా దిశః-మూలే-ఉదయాద్రిప్రాన్తఇత్యర్థః - ప్రాచీగ్రహణం క్షీణావస్థాద్యోతనార్థం- మూలగ్రహణం దృశ్యత్వార్థం, కళామాత్రం = కలైవ - శేషో యస్యా స్తాం, హిమాంశోః, తనుం = మూర్తి - మివ స్థితాం, తథా, యా రాత్రి ర్మయా సార్థమ్ - ఇచ్ఛయా కృతాని రతాని తైః * శాకపార్థి వాదిత్వా న్మధ్యమపదలోపీ సమాసః, క్షణఇవ, నీతా = యాపితా, తాం = తజ్జాతీయామేవ రాత్రిం, విరహేణ - మహతీం = మహత్త్వేన ప్రతీయమానామ్, ఉష్ణై రశ్రుభిః యాపయన్తీమ్ * యాతేర్ణ్యన్తాచ్ఛతృప్రత్యయః * 'అర్తిహ్రీ' ఇత్యాదినా పుగాగమః, స ఏవ కాలః సుఖినా మల్పః ప్రతీయతే దుఃఖినాం తు విపరీత ఇతి భావః. ఏతేన కార్శ్యావస్థోక్తా.

ఆ సమయమున ఆమె యుండుస్థితినే మరల నాలుగు శ్లోకముల వర్ణించుచున్నాఁడు.

ఆధిక్షామామ్—ఆధి = మనోవ్యాధిచేత - క్షామామ్ = కృశించినదై, విర... యనే—విరహ = వియోగముయొక్క - శయనే=పడుకయందు (అనఁగా పువ్వులు చిగుళ్లు మొదలయినవానితో చేసిన పాన్పునందు), సన్ని...శ్వామ్—సన్నిషణ్ణ = పరుండిన - ఏకపార్శ్వామ్ = ఒకప్రక్కగలదై, ప్రాచీ మూలే = తూర్పుయొక్క తొలిభాగమందు (తూర్పును చెప్పుట చంద్రునియొక్క క్షీణావస్థను సూచించుటకు, మూలమును చెప్పుట చంద్రకళ కంటికి అగపడుటకు), కళా...శేషామ్—కళామాత్ర = ఒకకళమాత్రమే - శేషామ్ = మిగులుగాఁగలదైన (అనఁగా కడమకళ లెల్ల పోయి ఒకకళమాత్రము మిగిలియున్న), హిమాంశోః= చంద్రునియొక్క, తనుమ్ ఇవ స్థితామ్ = దేహమువలె ఉన్నదానిని, (ఇంక నెట్టిదాని ననఁగా), యా రాత్రిః = ఏ రాత్రి, మయా సార్థమ్ = నాతోఁ గూడ, ఇచ్ఛారతైః = ఇచ్ఛచే చేయఁబడినరతములచే, క్షణఇవ = క్షణకాలమువలె, నీతా = గడపఁబడినదో, తామ్ ఏవ రాత్రిమ్ = ఆరాత్రినే (అనఁగా అరాత్రివంటిరాత్రినే), విర...తీమ్—విరహ = వియోగముచేత - మహతీమ్ = దీర్ఘముగా అగపడుచున్నదానిని (రాత్రిని), ఉష్ణైః అశ్రుభిః = వేఁడి కన్నీళ్లతో, యాపయన్తీమ్ = గడపుచున్నదానిని.

తా.—నాకోమలి మనోవ్యాధిచేత కృశించి విరహతాపశాంతికై చివురుఁబాన్పుమీఁద ఒత్తిగిలి పరుండియుండును. ఆస్థితిలో ఆచిగురుఁబాన్పు సంధ్యారాగయుక్తమైనతూర్పుదిక్కుయొక్క తొలిభాగమువలె నుండును. అట్టియాపాన్పున నాప్రియ ఆప్రాచీమూలముననుండెడి యేకకళావశిష్టమైన చంద్రరేఖవలెనుండును. ఈ విరహమ్ము

రానియప్పుడు రాత్రులు నాచెలికి నాతోఁగూడ పూర్వసంకల్పితములయిన సురతము లనుభవించుచుండుటచేత క్షణములవలెఁ గడచినవి, అట్టిరాత్రులే ఇప్పుడు నాచెలికి ఎంతసేపటికిని వేగక అత్యంతదుఃఖకారణములై సదా బాష్పోదయము కలిగించుచుండును; (అట్టిస్థితిలో నుండు నాప్రాణప్రియను నీవు దర్శింపుము).

వ. - 'ఆధి'—వ్యాధివలనిక్షామత యేని వైద్యముచే తీఱిపోవును, మనోవ్యాధివలనిక్షామత యైననో మనోవ్యాధికి మందులేనందున తీఱక యట్లే యుండును. యక్షుఁడు తనతోడివిరహమువలనియాధి యామెకు నిశ్చయముగావున ఆయాధివలనిక్షామతయు ఆమెను వదలకయుండు నని 'ఆధి' యనుటచే సూచించుచున్నాఁడు. ఆయాధి తాపముపెట్టి శోషిలఁజేయుచున్నదిగావున ఆతాపము శమించుటకై, 'విరహశయనే-(సామాన్యశయనమునకు తాపము నడంప శక్తిలేనందునను - విరహావస్థయందు యథాపూర్వముగా హంసతూలికాదితల్పములయందు శయనించుట పతివ్రతావ్రతవిరుద్ధంబు గావునను) చిగుళ్లతోను పువ్వులతోను రచియింపఁబడిన పాన్పున శయనించియుండును. 'సన్నిషణ్ణైకపార్శ్వామ్'—అలవాటుప్రకారము ఒత్తిగిలి పరుండి పార్శ్వమున నన్నుఁ గానమిచేఁ గలిగిన దుఃఖాతిరేకమువలనిజడత్వముచేతను సొమ్మసిలుటచేతను తాపశాంతియేని మరణమేని త్వరగా కలుగఁగోరియు అట్లే ఒత్తిగిలియే యుండును. 'ప్రాచీ'—ఆకాశముయొక్క మధ్యప్రదేశాదికము చంద్రునితోఁగూడియున్నను ఎఱ్ఱగా నుండదు-చంద్రునితోఁగూడినతూర్పు ఎఱ్ఱగా నుండును-విరహశయనము చిగుళ్లవలన ఎఱ్ఱగానే యుండును - ఆసామ్యమునకై తూర్పు చెప్పఁబడినది. పడమటిచంద్రకళ కెంజాయ పుట్టింపక చలువలు వెదచల్లుచు దేదీప్యమానమై క్షణక్షణప్రవర్ధమానముగా నుండును - కాన పడమటిని చెప్పలేదు. తూర్పుచంద్రకళ యేని ఆతపగోచరమై కాంతిహీనమై క్షణక్షణక్షీయమాణమై యుండును; యక్షాంగనయు తాపయుక్తయై క్షణక్షణము కృశించుచుండును. ఆచంద్రకళ కృశించుచుండుట కన్నుల కగపడనియట్లే యక్షాంగన కృశించుచుండుటయు మేఘుఁడు చూచుచుండఁగా 'ఇదిగో ఈక్షణము ఇంత కృశించినది, ఈగడియ ఇంత కృశించినది' అని చెప్పుటకు శక్యము కాదు. ఆమెదేహము సహజముగా బంగారపువన్నె గలదై ఆపై విరహపాండిమ గలిగినందున కేవలము ధవళముగాక కందువాటియుండును, ప్రాచీచంద్రకళయు (ఆకాశమధ్యచంద్రకళవలెఁగాక) కేవలము ధవళముగాక యీషదారుణ్యవిశిష్టమై యుండును. ఆమెకు విరహ మెట్టిదో చంద్రకళకు సూర్యుఁ డట్టివాఁడు. తూర్పున చంద్రకళ కృష్ణచతుర్దశీప్రాతఃకాలమున నుండనోపు. దానిని సూర్యుఁడు క్షణక్షణమునకు మఱియుమఱియు సమీపించి దానికి

(కవిప్రౌఢోక్తిసిద్ధముగా) తాపమును గ్లానిని హెచ్చుచేయుచుండును. ఆమెకును ఇప్పుడు విరహము క్షణక్షణమునకును అతిశయించి తాపగ్లానులను హెచ్చు సేయుచున్నది. ప్రతీచీచంద్రకళయైన సూర్యునికి మఱియు దూర మగుచుండును, విలాసవికాసములు హెచ్చుచుండును, రేఖయు ఎదుగుచుండును, కావున అది విరహము తీఱుదశలో యక్షాంగన కుపమానము గాఁ దగునుగాని విరహదశలోఁ దగదు. ఈ హేతువులఁ బట్టియు, పూర్వోక్తమయిన సంపూర్ణసాదృశ్యలాభముం గోరియు కవి తూర్పును చెప్పినాఁడు. మఱియు సూర్యుఁడుదయించి చంద్రకళకు ఇంకను సమీపగతుఁ డగునేని అప్పటికి ఆకళ కంటికే కనఁబడదు, మఱియుఁ గొంతసేపటికి సూర్యునితో కలసినప్పుడు ఆకళయు క్షీణమై పోనేపోవును, అట్లే యక్షాంగనకు నభోమాసవిరహము ఇంకను సమీపగత మైనప్పుడును సాక్షాన్నభోమాసమందును పైఁజెప్పిన చంద్రకళకుఁ గలిగినగతియే కలుగును, అనియు, ప్రాచీశబ్దస్వారస్యము. ‘మూలే’— పైఁజెప్పిన రెం డనిష్టములును చంద్రకళకు మూలమును వదలినపిమ్మట గలుగునుగాని తత్పూర్వమే కలుగవు. యక్షాంగనకు అట్టియనిష్టములు రాకముందే మేఘునిచేత సందేశమందిన అవి తప్పును గావున నిందుసామ్యమునకై అనిష్టములలో పడకయున్నచంద్రకళను చెప్పుటకై ప్రాచీ ‘మూలమును’ చెప్పినాఁడు. కార్శ్యసామ్యమునకై ‘కళామాత్రశేషామ్’ కళామాత్రమును చెప్పినాఁడు. ఉపరాగవిశేషమందు రేఖాంశమాత్రావశిష్టమయిన సూర్యమూర్తిని ఉపమానముగా చెప్పక ఇచట ‘హిమాంశోః’ చంద్రమూర్తిని జెప్పుట కోమలతాపాండిమల కొఱకు; మఱియు నిట్టియవస్థ కలిగినందున చూచువారికి దుఃఖము కలుగఁజేయుచున్నదిగాని యిట్టియవస్థలేనియెడ నేత్రములకు అమృతవర్తిగా నుండుననియు హిమాంశుశబ్దస్వారస్యము. ‘కళా’—యక్షవనిత ఒత్తిగిలి శయనించియున్న నడుము సన్న మగుటచే మధ్యను పల్లముగాను అటనుండి ఒకవైపు వక్షోజములు శిరంబును క్రమోన్నతములుగాను రెండవవైపున నితంబమును పాదములును శయనరీతిచే క్రమోన్నతములుగాను ఉండుటచే ఆమె వంకరగా నుండునుగాన అవంపుకొఱకు చంద్రకళకు పోల్పఁబడినది. ‘మూలేతనుమ్’ సామాన్య చంద్రకళ నడుము వెడల్పుగాను అగ్రములవైపు క్రమముగా సన్నగిల్లియు ఉండును. అదియే తూర్పుమూలమున నుండఁగా దానిమధ్యభాగము సంపూర్ణముగా పైకి రానప్పుడు ఆమధ్యభాగము కడమ రెండుభాగములకంటె మిగుల సన్నమయిన రేఖగాఁ గాని లేక కంటికి కగపడకయే గాని యుండును. అతిసూక్ష్మమయినయక్షవనితనడుము పల్లవశయనములో మునిఁగిపోయి ఈషద్దృశ్యముగాఁ గాని కేవలాదృశ్యముగాఁ గాని యుండును. వక్షోజ నితంబములును పల్లవములలో దిగఁబడి యున్నను అవి నడుముకంటె ఎక్కువగానే కంటికగపడును, నడుము అగపడినను

వానికన్న తక్కువగానే అగపడును, గావున అట్టిపూర్ణసామ్యముకై ప్రాచీ 'మూల మం' దలిచంద్ర 'తనువు'ను చెప్పినాఁడు. 'రాత్రిర్గతా' అనక 'రాత్రిః నీతా'అనుట చే యక్షవనిత రాత్రియెల్లను నిద్ర కెడమీయక భోగములం గడపిన దనియు, 'క్షణ ఇవ' అనుటచే రాత్రి ముగిసెనే గాని వినోదములు ముగియలే దనియు, 'ఇచ్ఛారతైః' అనుటచే 'ఈరాత్రి ఈరతవిశేషములం దేలుదునుగాక' యని పగలెల్లసంకల్పించుకొనుచుండి ఏదినము ఎట్టిరతబంధాదికమును కోరుచున్నదో, లేక, యక్షుఁడును ఏయేదినము ఎట్టిరతబంధాదికమును కోరుకొనియుండునో, అట్టిరతాదులలో ఆయా రాత్రినెల్ల గడపి రనియు, 'తామేవ' అనుటచే విరహము తప్ప ఆరాత్రులకును ఈ రాత్రులకును మఱియేభేదము లేదనియు, కావున ఈరాత్రులం గలిగిన యాయాస మునకెల్ల విరహమే ఏకకారణమనియు, 'విరహమహతీ' మనుటచే విరహులకు రాత్రి ఎంతసేపటికిని వేగ దనియు-అనఁగా అతిదీర్ఘముగా నగపడు ననియు, 'ఉష్ణైః' అను టచే బాష్పములు శోకజనితము లనియు, 'సా యాతి' అని చెప్పక 'తాం యాపయ న్తీ' అనుటచేత రాత్రి గడవక అతిదీర్ఘముగా తోఁచుటచే మహాప్రయాసపడి దానిని ప్రయత్న పూర్వకముగాఁ గడపుచున్న దనియు, 'అశ్రుభిః అనుటచేత అట్లురాత్రిని గడపుటకు శోకబాష్పములే సాధనము లాయె ననియు - అనఁగా అశ్రుపునకును అశ్రుపునకును నడుమ విరామ ముండెనేని అనడిమికాలము అశ్రువులచేఁ గడపఁబడిన కాలము గాదుగావున అట్లు విరామములేక ఎడతెగనిబాష్పధారలు గురియుచు రాత్రియెల్ల నుండు ననియు, 'అశ్రుభిః' అను బహువచన స్వారస్యముచే ఒకనిమేష మునకు ఒకయశ్రువుగా నిమేషాదిసూక్ష్మకాల భాగములను లెక్కపెట్టుటకు నా యశ్రువులు పూసలుమొద లయినవానివంటి సాధనములుగా నుండెడు ననియు, భావము. అప్పుడు ఇచ్ఛారతములును ఇప్పుడు బాష్పములు నని వ్యతిరేకము.

పాదా నిన్దో రమృతశిశిరా ఞ్జాలమార్గప్రవిష్టా
పూర్వప్రీత్యా గత మభిముఖం సంనివృత్తం తథైవ
ఖేదా చ్చక్షుః సలిలగురుభిః పక్ష్మభి శ్ఛాదయన్తీం
సాభ్రేఽహ్నీవ స్థలకమలినీం న ప్రబుద్ధాం న సుప్తామ్. 29.

పాదా నితి.—జాలమార్గప్రవిష్టాన్ = గవాక్షవివరాగతాన్, అమృతశిశిరాన్, ఇన్దోః, పాదాన్ = రశ్మీన్ప్రతి, పూర్వప్రీత్యా = పూర్వస్నేహేన - పూర్వవ దానన్దకరా భవిష్య న్తీతి బుద్ధ్యేతిభావః, అభిముఖం యథాతథా గతం, తథైవ సంనివృత్తం = యథాగతంతథైవ ప్రతినివృత్తం-తదా తేషా మతీవ దుస్స

హూత్వా దితి భావః, చక్షుః = దృష్టిం, ఖేదాత్ = దుఃఖాత్, సలిలగురుభిః = అశ్రు దుర్భరైః, పక్ష్మభిః ఛాదయన్తీమ్, అతఏవ, సాభ్రే = దుర్దినే, అహ్ని = దివసే, నప్రబుద్ధాం = మేఘావరణా దవికసితాం, ననుప్తామ్ = అహరి త్యముకుళితామ్ *ఉభయత్రాపి నఞర్థస్య నశబ్దస్య సుప్సుపేతి సమాసః, స్థలకమలినీ మివ స్థితామ్, ఏతేన విషయద్వేషాఖ్యా షష్ఠీ దశా సూచితా.

జాలమార్గప్రవిష్టాన్—జాల = కిటికీయొక్క - మార్గ = త్రోవగుండ-ప్రవిష్టాన్ = (ఇంటఁ) జొచ్చినవైన, అమృతశిశిరాన్ - అమృత = అమృతముచే - శిశిరాన్ = చల్లనివైన, ఇన్దోః = చంద్రునియొక్క, పాదాన్ (ప్రతి) = కిరణములను (గూర్చి), పూర్వప్రీత్యా - పూర్వ = మునుపటి - ప్రీత్యా = స్నేహముచేత(మును పటివలె ఆనందకరము లగు ననుభావముచేత), అభిముఖం (యథాతథా) = ఎదురుగా, గతమ్ - పోయినదియు, (యథాగతం) తథైవ = (ఎట్లు పోయినదో)అట్లే, సన్నివృత్తమ్ = వెనుకకు మరలినదియు (ఆసమయమందు ఆచంద్రకిరణములు అతి దుస్సహము లగుటచేత నని భావము), అయిన, చక్షుః=దృష్టిని, ఖేదాత్ = దుఃఖమువలన, సలిలగురుభిః - సలిల = అశ్రువులచేత-గురుభిః =దుర్భరములైన, పక్ష్మభిః = ఱెప్పలతో, ఛాదయన్తీమ్ = కప్పుచున్న దానిని, (అందుచేతనే), సాభ్రే=మేఘచ్ఛన్నమయిన, అహ్ని=దినమందు, నప్రబుద్ధామ్ = (మేఘావరణముచే)వికసింపనిదియు, ననుప్తామ్ = (పగలగుటచేత) ముకుళింపనిదియు, అయిన, స్థలకమలినీ (మివ) స్థితామ్= నేలతామరతీఁగవలె (నుండుదానిని) (చూడుము అని 27-తో నన్వయము), ఈవర్ణనచేత విషయ ద్వేష మనెడు నాఱవమదనావస్థ సూచింపఁబడినది.

తా.—కిటికీగుండ చంద్రకిరణములు ఇంటిలోనికి ప్రసరించును. చంద్రకిరణములు అమృతముచేత చల్లనివిగదా. అవి పూర్వము చల్లగా ఆనందకరముగా నుండినందున ఆప్రీతిచేత నాప్రేయసిదృష్టి యిప్పుడు వాని కెదురుపోవును. అయినను, ఇతరులకు చల్లని వైనను చంద్రకిరణములు విరహులను దహించును గావున ఇప్పుడవి ఆవిరహిణిదృష్టిని దహింపసాగును. అంత నాయబల వానిని చూచుట మానును. అవి కలిగించినపీడచే కన్నులనిండ బాష్పములు గ్రమ్ముకొనును. అట్టిబాష్పపూరితములయిన ఱెప్పలతో కన్నులు సగము మూఁతపడి నారమణి మబ్బుగ్రమ్మిన పగటియందు—వర్షబిందువులు గ్రమ్మి - పగలగుటచేత చక్కఁగా ముకుళింపక-మబ్బుగ్రమ్మియుండుటచే పూర్ణముగా వికసిల్లక - యుండుపుష్పములతోఁడి నేలతామరతీఁగవలె నుండును.

వ.—'రశ్మీన్'-ఇత్యాదిపదములు ప్రయోగింపక, 'పాదాన్' అనుట వచ్చుచున్న చంద్రునియడుగులు అగపడఁగానే ఆమెదృష్టి ప్రీతిపూర్వకముగా ఎదురువో

వును-చంద్రుఁడే వచ్చిన ఎంతప్రీతితోఁ జూచునో యని చంద్రునియాగమనమును సూచించుటకు. 'అమృతశిశిరాన్' అవి అమృతముచే చల్లని వగుట దృష్టి వానికెదురువోవుటకు హేతువు. తన్ను చల్లఁబఱుచునుగదా యనునాసచేత ఎదురువోవునని భావము. 'జాలమార్గ' - యక్షకాంత యక్షునితోఁగూడ పూర్వము మేడమీఁదను ఇతరస్థలములయందును వెన్నెలసికారులు చేసినట్లు ఇప్పుడు అతని నెడఁబాసిన సమయములలో విహరింపదు. విరహిణులు చంద్రికాచంక్రమణాదులు సలుపనొల్లుటకు కవిసమ్మతి:—

'సప్రాణా చేజ్జనకతనయా' కిన్నతిష్ఠేత మహ్యాం ?
హింస్రైస్సత్త్వైర్నఖలు నిహతా, రక్తసిక్తా న పృథ్వీ,
గోదావర్యాః పులినవిహృతిం రామశూన్యాం న కుర్యాత్,
యుక్తం నక్తంచరకబళనైః సర్వథా సంస్థితా సా.' భోజచంపువు.

ఆమెకు కాంతునితో పూర్వ మనుభూతము లయినరమణీయప్రదేశములను విరహమందుఁ జూచిన శోకము కలుగును. అందులకు - సీతాదేవిని త్యజించి శ్రీరాములు శంబూకవధార్థము దండకావనమునకుఁ బోయి పంచవటీదర్శనముచే ననుభవించినదుఃఖము నిదర్శనము:—

రామః.—అనేన పఞ్చవటీదర్శనేన—
అన్తర్లీనస్య దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః
ఉత్పీడ ఇవ ధూమస్య మోహః ప్రాగావృణోతి మామ్. ఉ. రా. చ.

చంద్రకిరణాదులు విరహులకు తాపకరము లగుట యత్యంతప్రసిద్ధము. వెన్నెల సికారి యేఁగిన హేతువుచే ఇపుడు యక్షాంగన ఇంటిలోపలనే ఉండును గావునను, కిటికీలు మొదలయిన ద్వారములనే చంద్ర తత్కిరణ దర్శనము గలుగవలయును గావునను, గవాక్షమార్గము చెప్పఁబడినది. 'పాదాన్ సన్నివృత్తమ్' - అనుటచే కిరణములకే అడుగులకే బదలినది, సాక్షాచ్చంద్రుని కేని ఎంత యలయునో యనియు, చంద్రు నైన చూడనే చాలదనియు, భావము. 'గతమ్ సన్నివృత్తమ్' - అని చక్షుస్సునకే విశేషణములు చేయుటయందు స్వారస్య మేమనఁగా ఆమెయొక్క ప్రేరణ లేకయే అలవాటుప్రకారము దృష్టి ఎదురువోయినది, కిరణములు వేఁపఁగా మరలినది అని. 'ఛాదయన్తీమ్'-అని యక్షసుందరికి విశేషణము చేయుటయందు లోకములో తల్లికడనుండి శిశువు తల్లికి తెలియక ప్రోయిలోనినిప్పుకడకు వడివడి పోయి చేత పట్టి కాలి ఏడ్చుచు మరలఁగా దానిని ఆతల్లి బాష్పపూరితపక్ష్మయై బాదిని యెత్తి తనయక్కునం జేర్చి బాహువులతోఁగప్పి యోదార్చుకొనురీతి నని భావము. 'బాష్ప' అనక 'సలిల' (గురుభిః పక్ష్మభిః)అనుటచే చంద్రకిరణము తాఁకినచక్షుస్సు

నకు నిష్పత్తాంకిన శిశువునకుం బోలె మంటను చల్లార్చు కప్పడములతో నుపచారము చేసినట్లుగా ననియు, నభిప్రాయము. ఆమె నీటను గాక నేలను ఉన్నదిగాన స్థలకమలినితోఁ బోల్పఁబడినది.

నిశ్వాసే నాధరకిసలయక్లేశినా విక్షిపన్తీం
శుద్ధస్నానా త్పరుష మలకం నూన మాగణ్డలమ్బమ్
మత్సంభోగః కథ ముపనమే త్స్వప్నజోఽపీతి నిద్రా
మాకాఙ్క్షన్తీం నయనసలిలోత్పీడరుద్ధావకాశామ్. 30.

నిశ్వాసేతి.—శుద్ధస్నానాత్ = తైలాదిరహితస్నానాత్, పరుషం = కఠినస్పర్శం, నూనం = నిశ్చయేన, ఆగణ్డలమ్బమ్ * సుప్సుపేతి సమాసః, అలకం = చూర్ణకున్తలాః-జాతా వేకవచనమ్, అధరకిసలయం క్లేశయతి క్లిశ్నాతీతి వా తేన తథోక్తేన-ఉష్ణే నేత్యర్థః * క్లిశ్యతే ర్ణ్యన్తాత్ క్లిశ్నాతే రణ్యన్తా ద్వా తాచ్ఛీలికో ణినిః, నిశ్వాసేన, విక్షిపన్తీం = చాలయన్తీం, తథా, స్వప్నజోఽపి = స్వాప్నవస్థాజన్యోఽపి - సాక్షాత్సంభోగాసంభవా దితి భావః, మత్సంభోగః, కథం = కేన ప్రకారేణ, ఉపనమేత్ = ఆగచ్ఛేత్ - ఇత్యాశయే నేతి శేషః † ఇతి నైవోక్తార్థత్వా దప్రయోగః ప్రయోగేవా నపౌనరుక్త్య మిత్యాలంకారికాః * ప్రార్థనాయాం లిఙ్, నయనసలిలోత్పీడేన = అశ్రుప్రవృత్త్యా - రుద్ధావకాశామ్=ఆక్రాన్తస్థానామ్ - దుర్లభా మిత్యర్థః, నిద్రా మాకాఙ్క్షన్తీమ్, స్వప్న హేతుత్వా దితి భావః. అత్రాశ్రువిసర్జనేన లజ్జాత్యాగో వ్యజ్యతే.

నూనమ్ = నిశ్చయముగా, శుద్ధస్నానాత్ - శుద్ధ = గంధతైలాదిరహితమైన-స్నానాత్ = స్నానముచేత, పరుషమ్ = గఱుకయిన, ఆగణ్డ = చెక్కిలిపొడుగునను లమ్బమ్ = వ్రేలుచున్న, అలకమ్ = ముంగురులను (జాత్యేకవచనము), అధరకిసలయక్లేశినా - అధరకిసలయ = చిగురువంటిదైనయధరోష్ఠమును-క్లేశినా = పీడించునదైన-వేఁడిదైన అనియర్థము, నిశ్వాసేన = నిట్టూర్పుచే, విక్షిపన్తీమ్ = దోఁచుచున్న దానిని, (ఇంకనెట్లున్న దానిని?) స్వప్నజః అపి=కలయందుఁ గలుగునది అయినను-సాక్షాత్సంభోగము కలుగకపోయినను అని భావము, మత్ సంభోగః= నాసంగమము, కథమ్ = ఎట్లైనను, ఉపనమేత్ = కలుగునా, ఇతి = అనెడియాశచేత, నయ...కాశామ్ - నయన = కన్నులయొక్క - సలిల = నీటియొక్క - ఉత్పీడ = ప్రసరణముచేత, రుద్ధ = ఆక్రమింపఁబడిన - అవకాశామ్ = చోటుగలదైన (కొప్పును ముప్పతిల్లుచుండుటచేత దుర్లభమయిన అని యర్థము), నిద్రాకాఙ్క్ష =

ద్రను, ఆకాఙ్క్షన్తీమ్ = కోరుచున్నదానిని, నిద్ర స్వప్నమునకు హేతువు గావున స్వప్నమునకై నిద్రను కోరుచున్నదని భావము. ఇచట బాష్పములు విడుచుటచేత లజ్జాత్యాగ మను మదనావస్థ సూచింపఁబడినది.

తా.—ఆమె గంధతైలాదికము లుపయోగింపక స్నానముచేయుటచేత ముంగురులు గఱుకులై చెక్కిళ్లపొడుగునను చెదరి యుండును. ఆమెయొక్క నిట్టూర్పులు ఉష్ణములై చిగురువంటి మెత్తనియధరోష్ఠమును క్లేశపెట్టుచుండును. అట్టి యానిట్టూర్పులు చెక్కిళ్లమీఁది యాముంగురులను అవలికి నెట్టుచుండును. మఱి యు నామె యక్షునితోడిసంభోగము సాక్షాత్తుగాఁ గాకపోయినను కలలోనైన ను ఎట్లయినఁ గలుగునా యని కలకొఱకు నిద్రను కోరు చుండియుండును, గాని శోకాతిరేకముచే కనులనుండి మిక్కుటముగా నిరంతరము బాష్పములు ప్రసరించు చుండునే గాని నిద్రమాత్రము పట్టదు. అట్టిస్థితిలో నుండునామెను మేఘుఁడు పోయి చూడవలయు నని తా.

వ.—'నిశ్వాసేన' అని నిపూర్వకముగా చెప్పుటచే శ్వాసము దీర్ఘమనియు, 'కిసలయ' అనుటచే అధరము చిగురువలె నెఱ్ఱగాను మృదువుగాను ఉండు ననియు, క్లేశ మోర్వదని, 'క్లేశినా'- అనుటచే నిట్టూర్పు వేఁడిది యనియు, అధరమును బీటలువాఱ శోషిలఁజేసి వన్నెమాయించు ననియు, 'శుద్ధ'- విరహావస్థగావున ఉత్తమసంస్కారములమీఁద నరుచిచేత గంధతైలాభ్యంగము మాని కేవలజల స్నానమే చేయు ననియు, తైలాభ్యంగములేనిస్నానమయినందుననే, 'పరుషమ్' ముంగురులు బిఱుసుగా నుండు ననియు, బిఱుసులు గావుననే ఒకటితో నొకటి అణఁగి యుండక, 'ఆగణ్డలమ్బమ్'- చెక్కిలిపై చెదరి యుండు ననియు, 'రుద్ధ' అనుటచే కన్నులనుండి పుట్టుచున్న బాష్పములు నిద్రను కన్నులలోనికి చొరనీయక వెనుకకు గెంటివేయుచున్నవనియు, భావము.

ఆద్యే బద్ధా విరహదివసే యా శిఖా దామ హిత్వా
శాపస్యాన్తే విగళితశుచా తాం మ యోద్వేష్టనీయాం
స్పర్శక్లిష్టా మయమితనఖే నాసకృ త్సారయన్తీం
గణ్డాభోగా త్కఠినవిషమా మేకవేణీం కరేణ. 31.

ఆద్య ఇతి.—ఆద్యే = విరహదివసే, దామ = మాలాం, హిత్వా = త్యక్త్వా, యా శిఖా, బద్ధా = గ్రథితా, శాపస్యాన్తే, విగళితశుచా = వీతశోకేన, మయా, ఉద్వేష్టనీయాం = మోచనీయాం, స్పర్శక్లిష్టాం-స్పర్శేసతి మూలకేశేషు

సర్వథా మిత్యర్థః, కఠినా చ సా విషమా నిమ్నోన్నతా చ తాం * ఖఞ్జకుబ్జాదివద న్యతరస్య ప్రాధాన్యవివక్షయా * 'విశేషణం విశేష్యేణ బహుళమ్' ఇతిసమాసః, ఏకవేణీమ్ = ఏకీభూతవేణీం * 'పూర్వకాల' ఇత్యాదినా తత్పురుషః, తథాభూతాం తాం శిఖామ్, అయమితాః = అకర్తితోపాన్తాః - నఖా యస్య తేన కరేణ, గణ్డాభోగాత్ = కపోలవిస్తారాత్, అసకృత్ = ముహుర్ముహుః, సారయన్తీమ్=అపసారయన్తీం 'తాం పశ్య' ఇతి పూర్వేణ సంబన్ధః. అసకృత్సారణా చ్చిత్తవిభ్రమదశా సూచితా.

ఆద్యే = మొదటిదైన, విరహదివసే = వియోగదినమందు, దామ = పుష్పమాలికను, హిత్వా = మాని, యాశిఖా = ఏతలకట్టు, బద్ధా = కట్టcబడినదో, శాపస్య = శాపముయొక్క, అన్తే = చివరయందు - అనఁగా శాపము ముగిసినప్పుడు, విగళితశుచా - విగళిత = తీఱిన - శుచా=దుఃఖముగలవాఁడనగు, మయా = నాచేత, ఉద్వేష్టనీయామ్ = విప్పcబడవలసినదియు, స్పర్శక్లిష్టామ్ - స్పర్శ = స్పర్శము కలిగినప్పుడు, క్లిష్టామ్ = (కేశమూలములయందు) నొప్పితోc గూడుకొన్నదియు, కఠినవిషమామ్ - కఠిన = పరుషమును - విషమామ్ = ఎగుడుదిగుడును, అయిన, ఏకవేణీమ్ - ఏక = ఒకటే అంటుగా అయిన-వేణీమ్=జడగానున్న, తామ్=ఆశిఖను, అయమితనఖేన - అయమిత = త్రుంపcబడనికొనలుగల - నఖేన = గోళ్లుగలదైన, కరేణ = చేతితో, గణ్డాభోగాత్ - గణ్డ = చెక్కిలియొక్క - ఆభోగాత్ = విరివినుండి, అసకృత్ = మాటిమాటికి, సారయన్తీమ్ = త్రోసివేయుచున్నదైన, (నాకాంతను చూడుము అని 27-వశ్లోకముతో నన్వయము). పలుమాఱు త్రోయుటచే చిత్తవిభ్రమము సూచింపcబడుచున్నది.

తా.—నాతో వియోగము ఏదినమందు కలిగినదో ఆదినమే ఆతరుణి పువుదండను చెరుపుకొనకయే తలవెండ్రుకలను కట్టుకొన్నది. ఆశిఖను శాపము తీఱిన వెంటనే నాదుఃఖము తీఱి నేను పోయి విప్పవలయును. అంతవఱకును ఆశిఖ సంస్కారములేక అట్లే ఒకటే జడగా అంటుగట్టుకొని యుండును. దానిని తాcకిన యెడల అందలివెండ్రుకలవేదులయందు నొప్పిగలుగును. మఱియు ఆయేకవేణి కఠినముగాను ఎగుడుదిగుడుగాను ఉండును, విశాలమైనచెక్కిలిపైc బడియుండును, దానిని నాసఖి ఎక్కువగానెదిగియున్నగోళ్లుకల తనచేతితో చెక్కిలినుండి పలుమాఱు ఆవలికి త్రోసివేయుచుండును. అట్లుండు నాతన్విని నీవు చూడుము.

వ.—'ఆద్యే' - నాతోడియెడcబాపు కలిగినదినమందే నాకాంతవిరహవ్రతమారంభించినది. 'బద్ధా'-తలవెండ్రుకలు తమంతటఁ అట్లు అంటుకట్టుకొనిపోలేదు,

౹ఁటి యేమనిన, ఆ కాంత వానిని విరహవ్రతార్థము అట్లు కట్టుకొన్నది. 'దామ హిత్వా'-విరహవ్రతముగావున పువ్వులసరములను తలలో ధరింపలేదు. 'మయా ఉద్వేష్టనీయామ్'- మహాపతివ్రతగావున నేను విప్పవలెను అయంటుజడను అట్లే ధరించియుండును; 'స్పర్శక్లిష్టామ్' - దువ్వుట మొదలయిన సంస్కారములు లేనందున తాఁకిన నొప్పి గలిగించును. 'అయమితనఖేన' - గోరుకొనలు గిల్లివేయకుండుట వ్రతార్థమును, దేహసంస్కారనిరపేక్షతచేతను. 'అసకృత్' - పలుమారు త్రోయుట చిత్తభ్రమచేత.

సా సన్న్యస్తాభరణ మబలా పేశలం ధారయన్తీ
శయ్యోత్సఙ్గే నిహిత మసకృ ద్దుఃఖదుఃఖేన గాత్రం
త్వా మ ప్యస్రం నవజలమయం మోచయిష్య త్యవశ్యం,
ప్రాయ స్సర్వో భవతి కరుణావృత్తి రార్ద్రాన్తరాత్మా. 32.

నేతి.—అబలా = దుర్బలా, సంన్యస్తాభరణం = కృశత్వా త్పరిత్యక్తాభరణమ్, అసకృత్ = అనేకశః, దుఃఖదుఃఖేన = దుఃఖప్రకారేణ * 'ప్రకారే గుణవచనస్య' ఇతి ద్విర్భావః, శయ్యోత్సఙ్గే నిహితం, పేశలం = మృదులం, గాత్రం = శరీరం, ధారయన్తీ = వహన్తీ, అనే నాత్యన్తాశక్త్యా మూర్ఛావస్థా సూచ్యతే, సా = త్వత్సఖీ, త్వా మపి, నవజలమయం = నవామ్బురూపమ్, అస్రం=బాష్పమ్, అవశ్యం=సర్వథా, మోచయిష్యతి*'ద్వికర్మసు పచాదీనా ముపసంఖ్యానమ్' ఇతి ముచేః పచాదిత్వా ద్ద్వికర్మకత్వం, తథాహి, ప్రాయః=ప్రాయేణ, ఆర్ద్రాన్తరాత్మా = మృదుహృదయః - మేఘ స్తు ద్రవాన్తశ్శరీరః, సర్వః, కరుణా=కరుణామయీ వృత్తిః = అన్తఃకరణవృత్తిః - యస్య సకరుణావృత్తి ర్భవతి; అస్మి న్నవసరే సర్వథా త్వయా శీఘ్రం గన్తవ్య మనన్తరదశాపరిహారా యేతి సందర్భాభిప్రాయః. ననుకిమిద మాదిమాం చక్షుఃప్రీతి ముపే క్ష్యావస్థాన్తరా ణ్యేవ తత్రభవా న్కవి రాదృతవాన్? ఉచ్యతే—

† 'సంభోగో విప్రలమ్భ శ్చ ద్విధా శృఙ్గార ఇష్యతే
సంయుక్తయో స్తు సంభోగో విప్రలమ్భో వియుక్తయోః.
పూర్వానురాగ మానాఖ్య ప్రవాస కరుణాత్మనా
విప్రలమ్భ శ్చతు ర్ధాత్ర ప్రవాస స్తత్ర చ త్రిధా.
కార్యతః సంభ్రమా చ్ఛాపా దస్మి న్నాద్యే తు శాపజః.
ప్రాగసంగతయో ర్యూనోః సతి పూర్వానురఞ్జనే
చక్షుఃప్రీత్యాదయోఽవస్థా దశ స్యు స్తత్క్రమో యథా.

దృష్ట్వైన స్సఙ్గసఙ్కల్పా జాగరః కృశతా రతిః
హ్రీత్యాగో న్మాద మూర్ఛాన్తా ఇత్యనఙ్గదశా దశ.
పూర్వసఙ్గతయో రేవ ప్రవాస ఇతి కారణాత్
న తత్ర పూర్వవ చ్చక్షుఃప్రీతి రుత్పత్తు మర్హతి.
హృత్సఙ్గస్య తు సిద్ధ స్స్యా ద్యవిచ్ఛేదోఽత్ర వర్ణ్యతే
అన్యా శ్చ పూర్వవ ద్భావ్యా ఇతి తావ ద్వ్యవస్థితిః.
వైయర్థ్యా దాదిమాం హిత్వా వైరస్యా దన్తిమాం తథా
హృత్సఙ్గాది రిహాచష్ట కవి రష్టా వితి స్థితిః.
యత్సాదృశ్యం లిఖన్తీతి పద్యేఽస్మి న్ప్రతిపాదితా
చక్షుఃప్రీతి రితి ప్రోక్తం నిరుత్తరకృతా న తత్.
చక్షుఃప్రీతి ర్భవే చ్చిత్రే ష్వదృష్టచరదర్శనాత్
యథా మాలవికారూప మగ్నిమిత్రస్య పశ్యతః.
ప్రోషితానాం చ భర్తౄణాం క్వ దృష్టాదృష్ట పూర్వతా
అథ తత్రాపి సందేహే స్వకలత్రాణి పృచ్ఛతు
కిం భర్తృప్రత్యభిజ్ఞా స్యా త్కిం వై దేశికభావనా
ప్రవాసా దాగతే స్వస్తి న్నిత్యలం కలహై ర్వృథా.' ఇతి.

అబలా = దుర్బలయు, సన్న్య...రణమ్ - సన్న్యస్త = వదలఁబడిన-ఆభరణమ్ = భూషణములుగలదై (ఆతన్వి కృశించినందున కంకణహారాద్యాభరణములు ఆమెదేహమునుండి జాఱిపోయిన వని యర్థము), అసకృత్ = మాటిమాటికి, దుఃఖదుఃఖేన = దుఃఖప్రకారముగా, శయ్యోత్సఙ్గే - శయ్యా = పాన్పుయొక్క - ఉత్సఙ్గే = ఉపరిభాగమందు, నిహితమ్ = ఉంపఁబడిన, పేశలమ్ = మృదువయిన, గాత్రమ్ = శరీరమును, ధారయన్తీ = ధరించుచున్నదియునై, (ఇటు అత్యంతాశక్తిచే మూర్ఛావస్థ సూచింపఁబడుచున్నది), సా = ఆనీచెలి, త్వామపి = నిన్నుఁగూడ, నవ జల మయమ్ = నూతన జల రూప మయిన, అస్రమ్ = బాష్పమును, అవశ్యమ్ = తప్పకుండ, మోచయిష్యతి-విడుచునట్లు చేయఁగలదు; (అట్లేగదా), ప్రాయేణ = తఱచుగా, ఆర్ద్రాన్తరాత్మా - ఆర్ద్ర = మృదువైన - అన్తరాత్మా = హృదయముగలవాఁడు (మేఘునిశరీరము లోపల ద్రవమయముగదా), సర్వః = ఎల్లవాఁడును, కరుణావృత్తిః - కరుణా = దయామయమయిన - వృత్తిః - అంతఃకరణవృత్తిగలవాఁడు, భవతి = అగును. కావున ఈయవసరములో నీవు త్వరగాపోయి అనంతరదశను అనఁగా మరణమును తప్పింపవలయును అని భావము.

తా.—నీచెలి కృశించినందున ఆభరణములు జాఱిపోఁగా నిరాభరణమైనతన మృదుదేహమును పలుమాఱు కష్టముతో శయనముమీఁద ఉంచి మూర్ఛితయై ప్రాణములతో నుండును. ఆస్థితిలో నున్నయాలతాంగిని చూడఁగానే నీకును కన్నీళ్లు గలుగును, ఏల యనఁగా-మృదుహృదయముగలవారికెల్ల ఒరులదుఃఖమును చూచిన కరుణ కలుగును గదా. ఆమూర్ఛాదశ మాఱక యట్లే యుండునేని యంతిమదశ కలుగును గావున దానిని వారించుటకై నీవు త్వరగా పోవలయును.

వ.—'సన్న్యస్తాభరణమ్'—కార్శ్యముచే తొడవులు మానిన దని మల్లినాథసూరి వ్యాఖ్య, [అరతిచే ఆభరణములను రోసిన దని నేఁదలంచెద.] 'అబలా'-సహజముగానే దుర్బల, అందుమీఁద ఈవిరహము, కావున దీనిని భరించి బ్రతుకుట దుర్ఘటము. 'పేశలమ్' - శయనముకన్న ఆదేహమే మృదువు - శయనము ఆకోమలదేహమును కందఁజేయును,కనుక ఆతన్వి 'దుఃఖదుఃఖేన' - దుఃఖప్రకారముగా దేహమును శయనమం దుంచును; సదా కూర్చుండలేక నిలుచుండలేకయు శయనముపైఁ బడునేగాని శయనసౌఖ్యముకొఱకుఁ గాదని భావము. 'శయ్యోత్సఙ్గే' - నపుంసకలింగమయినశయన శబ్దమును చెప్పక స్త్రీలింగమయినశయ్యాశబ్దమును చెప్పుటచే - కష్టమువచ్చినకూఁతురు తనతల్లి (ఉత్సఙ్గ) యొడిలోఁ బడి మూర్ఛితురాలైనరీతిగా నని భావము. 'ధారయన్తీమ్' - అనుటచే మరల నన్నుఁ గూడునాశచే ప్రాణములు కాపాడుకొనుచు ఉండును గాని ప్రాణముమీఁదియాశచేతఁ గాదని భావము. 'త్వాం ముఞ్చనీ' అనక 'త్వాం మోచయిష్యతి' అనుటచే ఆస్థితి చూపఱకు మిక్కిలి జాలి కలిగించుననియు, 'అవశ్యమ్' అనుటచే కఠిన చిత్తులకుఁగూడ జాలిపుట్టించును మృదుహృదయునికి నీకు జాలిపుట్టించుటయందు సందేహము లేనేలేదనియు, 'అస్రం మోచయిష్యతి' అనుటచే ఆవియోగినిని చూడఁగానే నీవు రాల్చువర్షబిందువులు బాష్పము లగునుగాని సామాన్యములయినచినుకులు గావనియు, భావము.

జానే సఖ్యా స్తవ మయి మనః సంభృతస్నేహ, మస్మా
దిత్థంభూతాం ప్రథమవిరహే తా మహం తర్కయామి,
వాచాలం మాం న ఖలు సుభగమ్మన్యభావః కరోతి
ప్రత్యక్షం తే నిఖిల మచిరా ద్భ్రాత రుక్తం మయా యత్. **33.**

న స్వీదృశీం దశా మాప న్నేతి కథం త్వయా నిశ్చిత మత ఆహ జాన ఇతి.—హే మేఘ, తవ సఖ్యా మనో మయి, సంభృతస్నేహం = సంచితానురాగం, జానే, అస్మాత్ = స్నేహజ్ఞానకారణాత్, ప్రథమవిరహే - ప్రథమగ్రహణం దుఃఖాతిశయద్యోతనార్థం, తాం = త్వత్సఖీమ్, ఇత్థంభూతాం = పూర్వోక్తావస్థా మాపన్నామ్,

అహం తర్కయామి. నను సుభగమానినా మేష స్వభావో య దాత్మని స్త్రీణా మనురాగప్రకటనం తత్రాహ వాచాల మితి.—సుభగ మాత్మానం మన్యత ఇతి సుభగమ్మన్యః * 'ఆత్మమానే ఖశ్చ' ఇతి ఖశ్ప్రత్యయః * 'అరుర్ద్విషత్' ఇత్యాదినా ముమాగమః-తస్య భావః-సుభగమ్మన్యభావః = సుభగమానిత్వం, మాం, వాచాలం = బహుభాషిణం, న కరోతి ఖలు, సౌన్దర్యాభిమానా న్నప్రలపామీ త్యర్థః + 'స్యాజ్జల్పాక స్తు వాచాలో వాచాటో బహుగర్హ్యవాక్' ఇత్యమరః * 'ఆలజాటచౌ బహుభాషిణి' ఇత్యాలచ్ప్రత్యయః, కింతు హే భ్రాతః మయోక్తం యత్ 'ఆధిక్షామామ్' ఇత్యాది తత్, నిఖిలం = సర్వమ్, అచిరాత్ = శీఘ్రమేవ, తే = తవ, ప్రత్యక్షం-భవిష్యతీతి శేషః.

ఇట్టిదశలో నుండునని నీ వెట్లు నిశ్చయించుకొందువు అను నాశంకకు చెప్పచున్నాఁడు:—

(హే మేఘ = ఓయి మేఘుఁడా), తవ = నీయొక్క, సఖ్యాః = చెలియొక్క, మనః = మనస్సును, మయి = నాయందు, సంభృతస్నేహమ్ - సంభృత = నింపఁబడిన - స్నేహమ్ = చెలిమిగలదానినిగా, జానే = ఎఱుఁగుదును, అస్మాత్ = స్నేహజ్ఞానము నెడియీ కారణమున, అహమ్ = నేను, ప్రథమవిరహే - ప్రథమ = మొదటిదయిన - విరహే = వియోగమందు (ప్రథమ మనుట దుఃఖాతిశయమును తెలుపుటకు), తామ్ = ఆనీచెలిని, ఇత్థంభూతామ్ = పూర్వోక్తమయినయవస్థలో నుండుదానినిగా, తర్కయామి = ఊహించెదను. తమ్ము స్త్రీలు కామించిరని ప్రకటించికొనుట అందగాండ్ర మని తలంచుకొను కాముకులకు స్వభావము - అనునందులకు చెప్పచున్నాఁడు —సుభగమ్మన్యభావః = సుందరమానిత్వము - అనఁగా తన్ను తాను అందగానినిగా తలంచుకొనుగుణము, మామ్ = నన్ను, వాచాలమ్ = మిక్కిలిమాటలాడువానినిగా, నకరోతిఖలు = చేయదుగదా, నేను సుందరుఁడను అనునభిమానముచేత నిట్లు వదరుటగాదు-అని యర్థము, (మఱియేమనిన), భ్రాతః = తమ్ముఁడా, యత్ = ఏది, మయా = నాచే, ఉక్తమ్ = చెప్పఁబడినదో (తత్ = అది), అఖిలమ్ = సమస్తమును (ఆధిక్షామా మిత్యాదిగా చెప్పఁబడినదెల్లను), అచిరాత్ = శీఘ్రముగానే, తే = నీకు, ప్రత్యక్షమ్ = ప్రత్యక్షము, (భవిష్యతి = అగును).

తా.—నాప్రియ యిట్టియవస్థలో నుండునని యెట్లు ఎఱుంగుదు వనఁగా - ఆప్రియకు నాయం దత్యంతానురాగ మని నాకు తెలియును, ఇదియు ప్రథమ విరహము, ప్రథమవిరహమున దుఃఖము అధికము గదా - ఈ కారణములంబట్టి నేను ఆరమణిస్థితి పైఁజెప్పినయట్లుండునని యూహించుచున్నాను. అందగాండ్రమని తలంచుకొను కాముకులు తమ్ము స్త్రీలు కామించినట్లు చెప్పకొనుట సహజమే

అయినను నేను ఆతరగతివాఁడను గాను, త్వరగానే నీవే పోయి నేను చెప్పినయ వ్యథను ప్రత్యక్షముగాఁ జూడఁగలవు.

వ.—యక్షుఁడు 'మమ భార్యా' అనుటకు లజ్జించి 'తవ సఖీ' అనుట. 'భ్రాతః' - బంధుకృత్యము చేయుచున్నాఁడుగావునను, మైత్రీవిశేషముకొఱకును, తల్లిని జూచునట్లు నిశ్శంకముగా ఆమెను జూడవచ్చు ననియు, ఆమె తల్లియంబోలె గౌరవింపఁదగిన పతివ్రతయనియు సూచించుటకును, 'తమ్ముఁడా' అని పిలుచుట.

రుద్ధాపాఙ్గప్రసర మలకై రఞ్జనస్నేహశూన్యం
ప్రత్యాదేశా దపి చ మధునో విస్మృతభ్రూవిలాసం
త్వ య్యాసన్నే నయన ముపరిస్పన్ది శఙ్కే మృగాక్ష్యాః
మీనక్షోభా చ్చలకువలయ శ్రీతులా మేష్య తీతి. 34.

రుద్ధేతి.—అలకైః, రుద్ధా అపాఙ్గయోః ప్రసరా యస్య త త్తథోక్తమ్, అఞ్జనేన స్నేహః (స్నైగ్ధ్యం) తేన శూన్యమ్, అపిచ=కించ, మధునః=మద్యస్య, ప్రత్యాదేశాత్ = నిరాకరణాత్ - పరిత్యాగా దిత్యర్థః + ప్రత్యాదేశో నిరాకృతిః ఇత్యమరః, విస్మృతో - భ్రూవిలాసో = భ్రూభఙ్గో యేన తత్, నయనస్య రుద్ధాపాఙ్గప్రసరత్వాదికం విరహసముత్పన్న మితి భావః, త్వ య్యాసన్నే సతి - స్వకుశలవార్తాశంసి నీతి శేషః, ఉపరి = ఊర్ధ్వభాగే - స్పన్దతే = స్ఫురతి - ఇత్యుపరిస్పన్ది, తథా చ నిమిత్తనిదానే 'స్పన్దా స్త్వక్షిచ్ఛత్త్రలాభం। లలాటే పట్టబన్ధం సుకమ్। ఇష్టప్రాప్తిం దృశోరూర్ధ్వ। మపాఙ్గే హాని మాదిశేత్' ఇతి, మృగాక్ష్యాః = త్వత్సఖ్యాః, నయనం-వామమితిశేషః। 'వామభాగ స్తు నారీణాం పుంసాం శ్రేష్ఠస్తు దక్షిణః। దానే దేవాదిపూజాయాం స్పన్దేఽలంకరణేఽపిచ' ఇతి స్త్రీణాం వామభాగప్రాశస్త్యాత్, మీనక్షోభాత్ = మీనచలనాత్ చలస్య కువలయస్య - శ్రియా = శోభయా - తులాం = సాదృశ్యమ్, ఏష్య తీతి, శఙ్కే = తర్కయామి*'తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీ యాన్యతరస్యామ్' ఇత్యత్ర సదృశపర్యాయస్య తులాశబ్దస్య ప్రతిషేధా దత్ర చ సాదృశ్యవాచిత్వా త్తద్యోగేఽపి తృతీయా.

అలకైః = ముంగురులచేత, రుద్ధాపాఙ్గప్రసరమ్ - రుద్ధ = అడ్డగింపఁబడిన- అపాఙ్గ = కడగంటియొక్క - ప్రసరమ్ = వ్యాపించుటగలది, అఞ్జనస్నేహశూన్యమ్ - అఞ్జన = కాటుకచేతనగు - స్నేహ = జిడ్డుచేత - శూన్యమ్ = విరహితమును, అపిచ = మఱియు, మధునః = మద్యముయొక్క, ప్రత్యాదేశాత్ = మానుకొనుటచేత (అనఁగా మద్యము త్రాగుటను మానినందున), విస్మృతభ్రూవిలాసమ్-విస్మృత

= మఱవఁబడిన - భ్రూవిలాసమ్ = బొమవిలాసముః గలదియు, త్వయి ఆసన్నే (సతి) = నీవు సమీపగతుఁడవు (అగుచుండఁగా)-అనఁగా నాకుశలవార్తనుచెప్ప నుండఁగా, ఉపరిస్పన్ది - ఉపరి = ఊర్ధ్వభాగమునందు - స్పన్ది = అదరుచున్న దియు, (అయిన), మృగాక్ష్యాః నయనమ్ = ఆలేడికంటియొక్క (ఎడమ) కన్ను (ఊర్ధ్వభాగమున కన్ను అదరిన ఇష్టప్రాప్తి కలుగును - స్త్రీలకు ఎడమపార్శ్వము అదరుట ప్రశస్తము), మీనక్షోభాత్ - మీన = మత్స్యములయొక్క - క్షోభాత్ = కలఁతవలన, చల...లామ్ - చల = కదలుచున్న - కువలయ = కలువలయొక్క శ్రీ = శోభతో - తులామ్ = సామ్యమును, ఏష్యతి ఇతి = పొందును అని, శఙ్కే = ఊహించెదను.

తా.—కేశసంస్కారము లేనందున నాప్రేయసి యెడమకంటి ప్రక్కను ముంగురులు వ్రేలుచుండును. వానియడ్డుచే అకంటినుండి క్రేవచూపులు ప్రసరింపకుండును, ఆకంట కాటుకయుండదు. మఱియు విరహము సంభవించినప్పటినుండి మద్యసేవ మానినది గావున మద్యపానమువలనఁ గలుగునవైన బొమవిభ్రమములు ఇప్పుడు ఆనయనమున బొత్తిగా నుండవు. మఱియు ఆవామనయనము నాక్షేమవార్తను నీవు చెప్పఁబోవునప్పుడు ఇష్టప్రాప్తిసూచకశకునముగా ఉపరిభాగమందు అదరును. లేడికన్నులవంటికన్నులుగలదైన నాప్రియయొక్క యాయెడమకన్ను ఆస్థితిలో ఎట్లుండు నని తలంతు ననఁగా క్రింద నీళ్లలో మత్స్యములు కలఁతపెట్టఁగా పైని చలించుచున్న కలువవలె శోభిలుచుండు నని తలంచెదను.

వ.—'అలకైః రుద్ధ'-అనుటచే కేశసంస్కారము లేదనియు, 'స్నేహ' అనుటచే కాటుక యుండదు సరియేగదా దానిజిడ్డయినను ఉండదనియు, కాటుకమాని ఎనిమిదిమాసములు అగు ననియు, 'విస్మృత' - మఱచియేపోయిన దనుటచే - భ్రూవిలాసములు మద్యసేవవలనఁ గలుగునుగాన - మద్యసేవ మాని ఎనిమిదిమాసములు అగునుగావునను-భ్రూవిలాసములు మాని అప్పటికి బహుకాల మగుననియు భావము. అక్షివర్ణన ప్రస్తుతము గావున 'మృగాక్ష్యాః' అన్నాఁడు.

వామ శ్చాస్యాః కరరుహపదై ర్ముచ్యమానో మదీయై
ర్ముక్తాజాలం చిరపరిచితం త్యాజితో దైవగత్యా
సంభోగాన్తే మమ సముచితో హస్తసంవాహనానాం
యాస్య త్యూరుః సరసకదళీ స్తమ్భగౌర శ్చలత్వమ్. 35.

వామ ఇతి.—మదీయైః, కరరుహపదైః=నఖపదైః + 'పునర్భవః కరరుహో నఖోఽస్త్రీ నఖరోఽస్త్రియామ్' ఇత్యమరః, ముచ్యమానః = పరిహీయమాణః,

నఖాఙ్క-రహిత ఇత్యర్థః-ఊర్వో ర్నఖపదాస్పదత్వం తు రతిరహస్యే 'కణ్ఠ కుక్షి కుచ పార్శ్వ భుజోరః। శ్రోణి సక్థిషు నఖాస్పదమాహుః' ఇతి, చిరపరిచితం=చిరాభ్యస్తం, ముక్తాజాలం = హార్త్రికసరమయం కటిభూషణం, దైవగత్యా = దైవవశేన, త్యాజితః - సమ్ప్రతి నఖపదోష్మాభావేన శీతోపచారస్య తస్య వైయర్థ్యాదితి భావః * త్యజతే ర్ణ్యన్తాత్ కర్మణి క్తః * 'ద్వికర్మసు పచాదీనాం చోపసఙ్ఖ్యానమిష్యతే' ఇతి పచాదిత్వా ద్ద్వికర్మకత్వం, సంభోగాన్తే మమ, హస్తసంవాహనానాం = హస్తేన మర్దనానాం + 'సంవాహనం మర్దనం స్యాత్' ఇత్యమరః, సముచితః = యోగ్యః, సరస ఇతి యః పరిపక్వో న శుష్కశ్చ సవివక్షితః-తత్రైవపాణ్డిమ సమ్భవాత్-స చాసౌ కదళీస్తమ్భ శ్చ స ఇవ - గౌరః=పాణ్డురః + 'గౌరః శరీరే సిద్ధార్థే శుక్లే పీతేఽరుణేఽపి చ' ఇతి మాలతీమాలాయామ్,అస్యాః ప్రియాయా వామ ఊరుః, చలత్వం = స్పన్దనం, యాస్యతి = ప్రాప్స్యతి 'ఊరోః స్పన్దా ద్రతిం విద్యా దూర్వోః ప్రాప్తిం సువాససః' ఇతి నిమిత్తనిదానే.

మదీయైః = నావైన, కరరుహ పదైః = గోళ్ల చిహ్నములచేత (నఖక్షతములచేత), ముచ్యమానః = విడువఁబడుచున్నదియు (నఖాంకములులేనిదియని యర్థము), చిరపరిచితమ్ = చిరకాలము అలవాటుపడిన, ముక్తాజాలమ్ = ముత్తెపుసరులుగానుండు కటియలంకారమును, దైవగత్యా = దైవవశమున, త్యాజితః = వదలివేయనట్లు చేయఁబడినదియు, (ఇప్పుడు నఖక్షతముల వేఁడి లేనందున శీతోపచారమయినయాముక్తాజాలము నిష్ప్రయోజనముగావున దానిని ఇపుడు ధరించుట లేదని భావము), సంభోగాన్తే - సంభోగ = సురతక్రీడయొక్క అన్తే = అవసానమందు, మమ = నాయొక్క, హస్తసంవాహనానాం - హస్త = చేతితో - సంవాహనానాం = ఒత్తుటలకు, సముచితః = అలవాటైనదియు, సరస గౌరః - సరస = పరిపక్వమై యెండకయున్న- కదళీస్తమ్భ = అరఁటికంబమువలె- గౌరః = తెల్లనిదియు, (ఐన), అస్యాః = ప్రేయసియొక్క, వామః ఊరుః = ఎడమతొడ, చలత్వమ్ = అదరుటను, యాస్యతి=పొందఁగలదు, అనఁగా ఎడమతొడ యదరు ననుట. ఎడమతొడ యదరుట రతిలాభమును సూచించును.

తా.—పూర్వము సురతక్రీడలయందు నేను ఆప్రేయసితొడయందు నఖక్షతములు చేయుచుంటిని, వానివలనివేఁడిని పోఁగొట్టుకొనుటకు ప్రియ ముక్తాసరమయమయినచల్లనికటిభూషణమును సదా ధరించుచుండినది. ఆతొడను సంభోగాంతమందు నేను నాహస్తముతో పూర్వము ఒత్తుదును. ఇప్పుడు దైవవశమున మాకు వియోగము కలుగఁగా ఆయూరువునందు ఆనఖక్షతములు లేవు, తదర్థమైనముక్తాజాలంబును లేదు, ఆయొత్తుటయు లేదు, చక్కఁగా నెదిగిన పై శోభిల్లకయున్న

యరఁటికంబములవలె తెల్లగా నుండునట్టియాయెడమయూరువు నాక్షేమమును నీవు తెలుపునప్పుడు రతిలాభశకునముగా అదరును.

ప.—'వామః'- స్త్రీలకు ఎడమయూరువు అదరుట శుభముగాని కుడిది యదరుట శుభముకాదు. 'జాలమ్'-జాలము గానియెడల ఊరువులయందలి నఖక్షతములకు తగులునట్లు ధరించుట శక్యముగాదు. 'చిరపరిచితమ్'-చిరకాలమిత్రమునుంబోలె జాలమును వదలుట అతిదుఃఖకర మనియు, వదలకయే యుండరాదాయనిన, 'దైవగత్యా'-దైవకృతమై అనివార్యమయిన వియోగమువలన వదలుట అనియు, 'త్యాజితః' అని ణిజంతప్రయోగముచే ఊరువుచేఁ దనకిష్టముకానిముక్తాజాలత్యాగమును దైవగతి బలాత్కారమున చేయించినదనియు,భావము. 'హస్త' అనుట ప్రీత్యతిశయమును ద్యోతనసేయుచు 'సరసకదళీస్తమ్భగౌర'మై నేత్రోత్సవ మిడునట్టి యాయూరువులను ఒత్తుటకు యక్షుఁడు తానే యభిలషించుచుండెనని తెలుపుచున్నది. 'సంవాహానామ్' అని బహువచనము బహుప్రకారములను సూచించుచున్నది; మఱియు, ఆమె వలదన్నను ఇతఁడే మరల మరల ఒత్తుచుండె ననియుందెలుపుచున్నది. 'సరస' అనుట పరిపక్వతను తెలుపును, పరిపక్వమయిన దానియందే విశేషము జలముండును; 'స్తమ్భ' అనుట ఏపుగా ఎదుగుటను తెలుపును; ఏపుగా ఎదిగి పరిపక్వమయినయరఁటియందుఁగదా గౌరత్వ ముండును, 'గౌరః'-ఎప్పుడును వస్త్రావృతమై యుండుటచే ఊరువులు గౌరముగా నుండును; మఱియు నిపుడు విరహపాండిమచే సహజమయిన గౌరత్వము హెచ్చియుండును, గావున కేవలకదళిని ఉపమగా చెప్పక 'సరసకదళీస్తంభము'ను చెప్పినాఁడు.

వి.—కొందఱు వ్యాఖ్యాతలు 'సరసకదళీగర్భగౌరః' అని పఠించిరి; కొందఱు ఆ పాఠమే శ్రేయమని తలంచిరి. కదళియొక్క పైపట్టలు పసరుగా నుండుటవలన ఊరువులకు ఉపమానములు గామిచే పైపట్ట లూడ్చినకదళియే లక్షణచే లభించుచున్నది. మఱియు సరసవిశేషణము అట్టిదానినే సూచించుచున్నది. కావున 'గర్భ' అను పాఠముకన్న పుష్టి మొదలయిన యితరధర్మములను సూచించుటచే 'స్తమ్భ' అనుపాఠమే శ్రేయము.

తస్మిన్కాలే జలద యది సా లబ్ధనిద్రాసుఖా స్యా
దన్వాస్యైనాం స్తనితవిముఖో యామమాత్రం సహస్వ,
మాభూ దస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధే కథంచిత్
సద్యఃకణ్ఠచ్యుతభుజలతాగ్రన్థి గాఢోపగూఢమ్. 36.

తస్మిన్నితి.— హే జలద, తస్మిన్కాలే = త్వదుపసర్పణకాలే, సా = మత్ప్రియా, లబ్ధం నిద్రాసుఖం యయా తాదృశీ - స్యాద్యది = స్యాచ్చేత్, ఏనాం = నిద్రాణామ్, అన్వాస్య = పశ్చాదాసిత్వేత్యర్థః * ఉపసర్గవశాత్సకర్మకత్వమ్, స్తనితవిముఖః = గర్జితపరాఙ్ముఖః - నిశ్శబ్దస్సన్ - అన్యథా నిద్రాభఙ్గః స్యాదితి భావః, యామమాత్రం = ప్రహరమాత్రం + 'ద్వౌ యామ ప్రహరౌ సమౌ' ఇత్యమరః, సహస్వ = ప్రతీక్షస్వ, శక్తయోరేకవారసురతస్య యామావధికత్వాత్స్వప్నేఽపి తథా భవితవ్యమిత్యభిప్రాయః - తథాచ రతిరహస్యే + 'ఏకవారావధి ర్యామో రతస్య పరమో మతః। చణ్డశక్తిమతో ర్యూనో రుద్భటక్రమవర్తినోః' ఇతి; యామసహనస్య ప్రయోజనమాహ మాభూదితి - అస్యాః = ప్రియాయాః, ప్రణయిని = ప్రేయసి, మయి, కథంచిత్ = కృచ్ఛ్రేణ, స్వప్నలబ్ధే సతి, గాఢోపగూఢం = గాఢాలిఙ్గనం * నపుంసకే భావే క్తః, సద్యః = తత్క్షణం, - కణ్ఠాత్ - చ్యుతః = స్రస్తో - భుజలతయోః - గ్రన్థిః = బన్ధో - యస్య తత్తథోక్తం, మాభూత్ = మాస్తు, కథంచిల్లబ్ధస్యాలిఙ్గనస్య విఘాతో మాభూదిత్యర్థః; న చాత్ర నిద్రోక్తిః 'తామున్నిద్రామి'తి పూర్వోక్తేన నిద్రాచ్ఛేదేన విరుధ్యతే - పునః సప్తమాద్యవస్థాసు పాక్షికనిద్రాసంభవాత్ - తథాచ రసరత్నాకరే + 'అశక్తి రోదనం నిద్రా నిర్లజ్జానర్థవాగ్భ్రమః। సప్తమాదిషు జాయన్తే దశాభేదేన వా శుచా' ఇతి.

జలద = మేఘుఁడా, తస్మిన్కాలే=ఆసమయమందు (నీవు సమీపించుసమయమున), సా = ఆనాప్రియతమ, లబ్ధ...సుఖా—లబ్ధ = పొందఁబడిన - నిద్రా = నిద్రచేనయిన - సుఖా = సుఖముకలది, స్యాత్ యది = అగునేని, ఏనామ్ = అ చెలిని, అన్వాస్య=కనుపెట్టుకొనియుండి, స్త ... ఖః-స్తనిత = ఉఱుమునకు - విముఖః = పరాఙ్ముఖుఁడవై - ఉఱుమక - శబ్దము చేసిన నిద్రాభంగ మగు నని భావము), యామమాత్రమ్ = జామునేపుమాత్రము, సహస్వ = ఎదురుచూచుచుండుము, (శక్తిగలవారికి ఒకమాఱు సురతము యామకాలము పట్టును-స్వప్నమందును అట్లే అగునని భావము,) జాము ఎదురుచూచుటకు ఫలమును చెప్పుచున్నాఁడు:— అస్యాః = ప్రియకు, ప్రణయిని = ప్రియుఁడనయిన, మయి = నేను, కథంచిత్ = ఎట్టకేలకు, స్వప్నలబ్ధే సతి—స్వప్న = కలలో - లబ్ధే ఇతి = దొరకినవాఁడను కాఁగా, గాఢోపగూఢమ్ - గాఢ = దృఢమయిన . ఉపగూఢమ్ = కవుఁగిలి, సద్యః = తత్క్షణమే, కణ్ఠ ... గ్రన్థి — కణ్ఠ = మెడనుండి - చ్యుత = జాఱినదైన - భుజలతా = తీఁగలవంటిభుజములయొక్క - గ్రన్థి = ముడిగలది, మా

భూత్ = కాకుండునుగాక; ఎట్టకేలకు లభించినయాలింగనమునకు సద్యోవిఘాతము కాకుండునుగాక యని యర్థము.

తా.—మేఘుఁడా, నీవు పోయి చూచుసమయమున నాప్రియకు నిద్రాసుఖము లభించియుండెనేని నీవు ఉఱుమక నిశ్శబ్దుఁడవై నిద్రాభంగమునేయక జాము నేపుమాత్రము కనుపెట్టుకొని యుండుము. ఏలయన, ఎట్టకేలకు సఖికి నిద్రపట్టి నేను కలలో లభించి అప్పుడే తీఁగలవంటి తనభుజములతో నాకంఠమును బిగువుగా కవుంగలించుకొని యుండఁగా తత్క్షణమే ఆయాలింగనమునకు విఘాతము కలుగకుండునుగాక.

'జలధర' యనక నీరిచ్చువాఁడా యని యర్థముగునట్లు 'జలద' యనుట ఉపకారిత్వమును సూచించును; లోకోపకారివి గావున నిన్ను యాచించెద ననియు, నీవు నాకోరిక చేసెదవనియు భావము. 'లబ్ధ' అనుటచే నిద్ర పట్టుట అరుదని తెలియుచున్నది. 'స్తనితవిముఖ'త నిద్రాభంగము కాకుండుటకు. 'యామమాత్రమ్' - జాము నేపు కనుపెట్టుటకు కారణము టీకలోనే చెప్పఁబడియున్నది. అస్వప్నము అనిద్రలో ఎప్పుడు వచ్చునో యని శంక యేని - నిరంతరచింతావశమున మొదటనే వచ్చునుగావున నిరీక్షించుట బహుశః సఫలమే యగును. ఆసమయమున నిద్ర వచ్చునని యూహించుట యేల యనఁగా - మేఘుముమీఁది చల్లగాలిచే నిద్ర కలుగుట సాధారణమే, అత్యంతము బడలియున్నయబలకు కలుగుట మఱియు ఉపపన్నముగా నున్నది. 'ప్రణయిని' - ప్రణయినిగాన నిరంతరము చిరకాంక్షితుఁడ ననియు అట్టి నాతోడిసమాగమమునకు భంగముచేయుట క్రూరకృత్యమనియు భావము. 'కథంచిత్'-అనుటచే నిద్రపట్టుట అరుదనియు, 'లతా' అనుటచే ముడివేయుటకు అనుకూల మనియు, కనుకనే 'గ్రంథి'-ముడివేయు ననియు అనఁగా తన్నువిడిచి మఱి పోకుండునట్లు నామెడకు తన్ను కట్టివేసికొను ననియు భావము.

వి.—కొందఱు వ్యాఖ్యాతలు 'యామమాత్రమ్' అనుచో పద్మినీజాతి స్త్రీయొక్క నిద్ర జాము నేపే యనియు, అందుచే జాము నేపుమాత్రమే కనుపెట్టు మనుట యనియు వివరించినారు.

తా ముత్థాప్య స్వజలకణికాశీతలే నానిలేన
ప్రత్యాశ్వస్తాం సమ మభినవై ర్జాలకై ర్మాలతీనామ్
విద్యుద్గర్భః స్తిమితనయనాం త్వత్సనాథే గవాక్షే
వక్తుం ధీరః స్తనితవచనై ర్మానినీం ప్రక్రమేథాః 37.

తామితి.—తాం = ప్రియాం, స్వస్య - జలకణికాభిః = జలబిన్దుభిః - శీతలే నానిలేన, ఉత్థాప్య = ప్రబోధ్య, ఏతేన తస్యాః ప్రభుత్వా ద్వ్యజనానిలసమాధి ర్వ్యజ్యతే-యథాహ భోజరాజః 'మృదుభిర్మ్రదనైః పాపే శీతలై ర్వ్యజనైః స్తనా । ప్రభుతాం చ మధురై ర్గీతై ర్నిద్రాతో బోధయే త్ప్రభుమ్' ఇతి, అభినవైః = నూతనైః, మాలతీనాం జాలకైః సమం = జాతి కుట్మలై స్సహ + 'సుమనా మాలతీ జాతిః' ఇతి 'సాకం సత్రా సమం సహ' ఇతి + 'క్షారకో జాలకం క్లీబే కలికా కోరకోఽస్త్రియామ్' ఇతి చామరః, ప్రత్యాశ్వస్తాం - శిశిరానిలసంపర్కా త్పునరుజ్జీవితామిత్యర్థః * శ్వసేః కర్తరి క్తః * 'ఆదితశ్చ' ఇతి చకారా దిట్ప్రతిషేధః, ఏతే నాస్యాః కుసుమసౌకుమార్యం గమ్యతే, త్వత్సనాథే = త్వత్సహితే + 'సనాథం సప్రభం ప్రాహు స్సహితే చిత్తతాపిని' ఇతి శబ్దార్ణవే గవాక్షే, స్తిమితనయనాం = కోఽసా వితి విస్మయా న్నిశ్చలనేత్రాం, మానినీం = మనస్వినీమ్ - అనుచిత్యాసహిష్ణుమిత్యర్థః విద్యు ద్గర్భోఽన్తస్థో యస్య స విద్యుద్గర్భః-అన్తర్లీనవిద్యుత్క ఇత్యర్థః + 'గర్భో' ఽపవరకేఽన్నేఽగ్నౌ సుతే పవనసంకటే । కుక్షిస్థజన్తౌ చ' ఇతి యాదవః - దృష్టిప్రతిఘాతేన వక్తు ర్ముఖావలోకనప్రతిబన్ధకత్వా న్నవిద్యోతితవ్యమితిభావః, ధీరో = ధృష్టస్సన్ - అన్యథా స్ఖలద్వాదిత్వేన అనాశ్వాసనప్రసఙ్గా దితి భావః, స్తనితవచనైః - స్తనితా న్యేవ వచనాని తై ర్వక్తుం, ప్రక్రమేథాః=ఉపక్రమస్వ * విధ్యర్థే లిఙ్ * 'ప్రోపాభ్యాం సమర్థాభ్యామ్' ఇ త్యాత్మనేపదమ్.

తామ్ = ప్రియను, స్వజ...లేన - స్వ = నీయొక్క - జలకణికా = నీటిబిందువులచేత - శీతలేన చల్లనిదైన, అనిలేన=గాలిచేత, ఉత్థాప్య = మేలుకొలిపి, (దీనిచేత ఆమె ప్రభువుగావున వీవనలగాలితో మేలుకొలుపుట సూచింపఁబడుచున్నది), అభినవైః = క్రొత్తలయిన, మాలతీనాం జాలకైః సమమ్ = జాజి మొగ్గలతోఁ గూడ, ప్రత్యాశ్వస్తామ్=చల్లగాలి తగులుటచేత మఱల ఉజ్జీవింపఁబడినదియు, (జాజిమొగ్గలతోఁగూడ ననుటచే ఆమె పువ్వువలె సుకుమారమయిన దని తెలుపఁబడుచున్నది), త్వత్ సనాథే - త్వత్ = నీతో - సనాథే=కూడుకొన్నదయిన, గవాక్షే = కిటికీలో, స్తిమితనయనామ్ - స్తిమిత = ఎవ రితఁడు అని ఆశ్చర్యముచేత) నిశ్చలమైన - నయనామ్ = కన్నులుగలదియు, (అగు), మానినీమ్ = అనాచిత్యము నోర్వని నాప్రియభామను, విద్యుద్గర్భః—విద్యుత్ = మెఱుపు - గర్భః = లోపలఁగలవాఁడవై (మెఱుపుఁదీఁగను లోపల అణఁచుకొని యని యర్థము-మెఱసిన యెడల దృష్టి ప్రతిహతమై మాటలాడువారిముఖము అగపడక పోవునుగాక మెఱయఁ గూడదని భావము), ధీరః = దిట్టతనముకలవాఁడవై (అటుగాక తడఁబడుచు పలికిన ఊరడింపు గలుగ దని భావము) స్తనితవచనైః - స్తనిత = ఉఱుములే అనెడు -

వచనైః = మాటలచేత, వక్తుమ్ = సంభాషించుటకు, ప్రక్రమేథాః = ఆరంభింపుము.

తా.—ఆకోమలి యుత్కృష్టప్రకృతిగాన ప్రభువులను విసనకఱ్ఱలచల్లగాలిచే నిద్రలేపునట్లు ఆకొమ్మను నీవు నీచినుకులచే తడసి చల్లనైనగాలితో నిద్రలేపుము. అట్టి నీచల్లగాలిచే జాజిమొగ్గలును వానివలెనే ఆసుకుమారియు నేదదేఱిన పిమ్మట సందేశమును ఆచెలువకు చెప్పనారంభింపుము. అట్లు సందేశమును చెప్పు సమయమందు నీవు కూర్చుండుకిటికీపైపు అపూర్వపురుషుడవు నీవెవరవో అని ఆయువిద నిశ్చలనేత్రములతో చూచుచుండును. నీవును మెఱుమక మెఱపును నీలోపలనే నిలుపుకొని దిట్టడవుగా నీయుఱుములనెడి మాటలచే నామానవతితో నాసందేశమును చెప్పుము.

వ.—'సజలకణికాశీతలేనానిలేన' - అనుట యక్షసుందరియొక్క ప్రాభవమును సూచించుచున్నది. ఉఱిమి యడావడి చేసిన భయపడును అపాయముగలుగు నని భావము. 'ప్రత్యాశ్వస్తామ్' - చల్లగాలిచే బడలికతీఱిన సందేశమును వినుటకు తగినస్థితికి వచ్చునని భావము. 'మాలతీనామ్' - జాజిమొగ్గలతోఁగూడ ననుటచే ఈమె వానివలె కోమలమయిన దనియు, మేఘముమీఁదినుండి వీచెడిశిశిరానిలమునకు జాజి యెంత రెక్కనునో ఈమెయు అంత నేదదేఱునదనియు భావము 'జాలకైః' నిండారవిరిసిన జాజిపువ్వు లయిన శిశిరానిలమునకు మఱి పుష్టిని పొందనేరవు సరిగదా, రాలిపోయినను పోవును గావునను, మొగ్గలయిన పుష్టిని పరిమళాతిశయమును పొందునుగావునను, మొగ్గలను చెప్పినాఁడు. యక్షవరారోహకు ఎపుడును ఎలజివ్వనంపుసౌభాగ్యమే, విరహఖేదమందు ఒడలిసంస్కారములు అలంకారములును లేమిచేత ఆసౌభాగ్యము ముకుళితమై యుండును, మేఘునివార్తచే అఖేద మెడలఁగానే వెండియు విజృంభింపఁదొడంగును. మొగ్గయు చినుకులకు రెక్కని యనంతరము వికసిల్లి నెత్తావులు వెదచల్ల సాగును. యువతికి విరహముచే కార్శ్యమును పొందిమయు, జాజిమొగ్గకు వికసిల్లమిచే నయినసన్నఁదనమును నైసర్గికమయిన తెల్లఁదనమును, గలవు. జాతి వర్షేతరర్తువులం బూవదు, అది ఆశ్వాసనమునకు మేఘైకశరణము, యువతియు యక్షునితలంపున సందేశరూపాశ్వాసమునకు మేఘైకశరణ. ఇట్టి నీసామ్యమెల్ల తుల్యయోగితావిధముచేత కవి సూచించినాఁడు. సమయమునకు నీచలువలేనియెడల జాజిమొగ్గ ఏప్రకారము వాడి యెండిపోవునో, ఆప్రకారమే కాంతయు ఆసమయమునకు నీవు ఆయాసము తీర్పనియెడల గ్రుక్కి కథావశిష్టయగు ననియు భావము. 'అభినవైః' —ఎదిగిన మొగ్గలు వాన లేమిని కొంతవఱకు సహింపఁగలవు - కేవలము లేతమొగ్గలయిన వఱపును సహింప

క్క నూడిపోవును-అనియు, ఆమె స్థితి యిట్టి లేఁత మొగ్గలవంటి దనియు, తెలుపుటకు ఖిక్రి లేఁత మొగ్గలను జెప్పినాఁడు. 'విద్యుద్గర్భః'—మెఱుపుఁదీఁగను ఇటునటు ఖెఱయనీయక నీలోనే యుంచుకొనుము అనుట యేలయనఁగా, మెఱసినయెడల ఆమెకన్నులు చీకటిగ్రమ్మి భయమై ఇతనిముఖమును జూడలేక సందేశమును వినుటయే సంభవింపదు. మెఱుపు బొత్తిగా లేకయే పోయినను చీకటిచేతనే ఇతని మొగ మగపడక ఇతఁ డెవరో తెలియక సందేహభయములు కలిగి సందేశము వినుటయు తెలిసికొనుటయు సంభవింపవు. మెఱుపు కదలక లోపల నుండిన వెలుతురుండును, ఇతని మొగ మగపడును, ఇతఁ డెవరో తెలియును, కార్యము నెఱవేఱును. విద్యుద్గర్భుఁడుగావున వెలుతు రుండుటచేత ఇతఁడు కంటి కగపడఁగా ఇతఁ డెవరో యని యామె 'స్తిమితనయనామ్'—నిశ్చలనేత్రములతో చూచును. 'మానినీమ్'—మానవంతురాలు కావున తనభర్త ప్రవాసమం దుండ పరపురుషుఁడు రాత్రివేళ ఒంటిపాటున గవాక్షాదిమార్గముల తన్ను సమీపించి తనతో సంభాషించుటయను ననుచితవ్యవహారమును సహింపదు. మఱి తనభర్తనుండియే నిజమైనసందేశము తెచ్చిన భర్తృమిత్రుఁ డని తెలిసిన, సహించును. ఆనమ్మకము సందేశహరుఁ డైనమేఘుఁడు తబ్బిబ్బుమాటలుగా పలుకు నేని గలుగదు, మహానర్థము గలుగును. కావున 'ధీరః'—దిట్టతనముతో భాషింపుమని, భావము. గర్జిత నిర్ఘోషాది శబ్దవర్ణములు కఠోరమయినమహాధ్వనిని సూచించునట్లే మృదులలితవర్ణకలితమయిన స్తనితశబ్దము ఉఱుమును తెలుపునది యైనను ఇట ప్రకరణానురోధముగా మృదుధ్వనిగలయుఱుము నే బుద్ధిస్థము చేయుచున్నది. కనుక ఆమె బెదరునట్లు బడబడమను నుఱుములుగా భాషింపక మెల్లనివి గంభీరములు మృదువులు నయినయుఱుములుగా (ఉత్తరశ్లోకమునఁ జెప్పఁబడిన మంద్రస్నిగ్ధధ్వనులతో) భాషింపుము అని కవిహృదయము.

వి.—ఇచట కొందఱు వ్యాఖ్యాతలు 'విద్యుద్గర్భః' అనుచో పరపురుషభాషణ దోషమును నివారించుటకై 'విద్యుత్'-మెఱుపుఁదీఁగ యనెడునీభార్య 'గర్భః'—'మీయిరువుర నడుమను గలవాఁడవై' యని వివరించినారు. ఆపక్షమున 'పశ్య సాధ్వీం నిశీథే' అని పూర్వోక్తము విరోధించును, నిష్ఫలమును అగును. కావున పెద్దిభట్టుగారు ఆవ్యాఖ్యను నిరసించి ఈవిశేషణమునకు అన్యథాప్రయోజనము చూపినారు.

భర్తుర్మిత్రం ప్రియ మవిధవే విద్ధి మా మమ్బువాహం
తత్సందేశై ర్హృదయనిహితై రాగతం త్వత్సమీపమ్
యో బృన్దాని త్వరయతి పథి శ్రామ్యతాం ప్రోషితానాం
మన్ద్రస్నిగ్ధై ర్ధ్వనిభి రబలావేణిమోక్షోత్సుకాని. 38.

సమ్ప్రతి దూతస్య శ్రోతృజనాభిముఖీకరణచాతురీ ముపదిశతి - భర్తురితి.— విధవా గతభర్తృకా న భవతీతి - అవిధవే = సభర్తృకే - అనేన భర్తృజీవనసూచనా దనిష్టాగమశఙ్కాం నిరస్యతి, మాం, భర్తుః = తవపత్యుః, ప్రియం మిత్రం = ప్రియసుహృదం, తత్రాపి, హృదయ నిహితైః = మనసి స్థాపితైః, తత్సందేశైః - తస్య=భర్తుః-సందేశైః, త్వత్సమీప మాగతమ్, భర్తృసన్దేశకథనార్థ మాగత మిత్యర్థః, అమ్బువాహం = మేఘం, విద్ధి = జానీహి ; న కేవల మహం వార్తాహరః కింతు ఘటకోఽపీత్యాశయే నాహ-యోఽమ్బువాహః = మేఘః, అబలానాం= స్త్రీణాం - వేణయ-స్తాసాం - మోక్షే = మోచనే - ఉత్సుకాని, పథి, శ్రామ్యతాం = శ్రాన్తి మాపన్నానాం, ప్రోషితానాం=ప్రవాసినాం-పాన్థానామిత్యర్థః, బృన్దాని = సఙ్ఘాన్, మన్ద్రైః గమ్భీరైః - అతఏవ-స్నిగ్ధైః = మధురైః, ధ్వనిభిః = గర్జితైః-కరణైః, త్వరయతి, పాన్థోపకారిణో మే కిము వక్తవ్యం సుహృత్సూపకారిత్వ మితి భావః.

శ్రోతలను తనమాటలు వినుటకు అభిముఖులనుగా చేసికొనునేర్పును మేఘునికి యక్షుఁ డుపదేశించుచున్నాఁడు.

అవిధవే = విధవ కానిదానా (యక్షు ఏ మనిష్టము వచ్చునో యని మనస్సులో పడుచున్న దిగులు భర్త జీవించియున్నాఁడని సూచించుచున్న యీసంబోధనచేత నిరసింపఁబడుచున్నది), మామ్ = నన్ను, భర్తుః = నీపతియొక్క, ప్రియంమిత్రమ్ ప్రియమిత్రునిఁగా, హృదయనిహితైః—హృదయ = మనస్సులో - నిహితైః = ఉంచుకొనఁబడిన, తత్సందేశైః—తత్ = అతనియొక్క - సందేశైః = వాచికములతో, త్వత్సమీపమ్—త్వత్ = నీయొక్క - సమీపమ్ - చెంతకు, ఆగతమ్ = వచ్చినవానినిఁగా, (భర్త చెప్పినవార్తను నీకు చెప్పుటకు వచ్చితి నని యర్థము), అమ్బువాహమ్ = మేఘునిఁగా, విద్ధి = ఎఱుఁగుము; 'నేను కేవలవార్తాహరుఁడనుగాను మఱి యేమనిన ఘటకుఁడనుకూడ' నని తెలుపుచున్నాఁడు:—యః = ఏ మేఘుఁడు, ఆబ... కాని - అబలా = అబలలయొక్క అనఁగా స్త్రీలయొక్క - వేణి = జడలయొక్క - మోక్ష = విప్పుటయందు - ఉత్సుకాని = కోరికతో ఉద్యుక్తములయి, పథి = మార్గమందు, శ్రామ్యతామ్ = ఆయాసపడుచున్న, ప్రోషితానామ్ = దేశాంతరగతులయొక్క అనఁగా బాటసారులయొక్క, బృన్దాని = సమూహములను, మన్ద్రస్నిగ్ధైః—మంద్ర = గంభీరములును - స్నిగ్ధైః = శ్రావ్యములు నయిన, ధ్వనిభిః = ధ్వనులచేత, త్వరయతి = అవసరపెట్టునో; అట్టి మేఘుఁడను నేను-అపరిచితులైన బాటసారులకే ఉపకారము చేయునట్టి నేను మిత్రులవిషయములో ఉపకారము చేయుట చెప్పవలయునా, అని భావము.

తా.—ఓసుమంగలీ నేను నీభర్తకు ప్రియమిత్రుఁడను మేఘుఁడను అతనియొద్దనుండి నీకు కుశలవార్తను తెచ్చినాఁడను. ఆవార్తను మఱవక మిక్కిలిజాగ్రత్తతో మనస్సులో పెట్టుకొని తెచ్చితిని. స్వాభావికముగానే నేను విరహపీడితులైనబాటసారులను తమనిమిత్తమై విరహవ్రత మాచరించుచుండు ప్రియతమలకడకు పొమ్మని శ్రావ్యమయిన గంభీరధ్వనులతో త్వరపెట్టువాఁడను, మిత్రులయిన మిమ్ముఁ గూర్చుటకు నేను యత్నించుట యేమి యాశ్చర్యము?

వ.—పూర్వశ్లోకములో 'స్తిమితనయనాయామ్' అనుటచే నితఁడెవరో యనిశంకించుచు నతనివైపు ఆమె చూచుచుండు నని చెప్పఁబడినదిగదా. ఆశంకనే ఇందు 'భర్తుర్మిత్రమ్' అనుటచే నివారించుచున్నాఁడు. కాంతుని మిత్రుఁడు గావునను— 'ప్రియమ్' సామాన్యముయిన మిత్రుఁడుగాక ప్రియమిత్రుఁడుగావునను - అనౌచిత్యదోషము లేదని ఆమె మేఘుఁ డచట నుండుటకు అంగీకరించు ననియు, 'ఏల వచ్చినాఁడు?' నాకాంతుని వృత్తాంతము నేమయిన చెప్పవచ్చినాఁడా ? అనునాశంకకు - 'అవిధవే' - అని నీభర్త బ్రతికియున్నాఁ డని సూచించుటచేత మగనిక్షేమమునకు సంతసిల్లి అతనివృత్తాంతము నితఁ డెఱిఁగియున్నాఁడు, అవశ్యము ఇతనిమాటలు వినవలయు నని యామె యాసక్తిపడు ననియు, అందఱు వచ్చునట్లు ఇంటిద్వారముగుండ రాక కిటికీగుండ అగపడనేల యనుసందేహమునకు - 'అమ్బువాహమ్'- నేను మేఘుఁడను భూమికి అంటిసంచరించువాఁడను కాను ఉన్నతప్రదేశములందు సంచరించువాఁడను - కావున గవాక్షగతుఁడనై భాషించుచున్నాను - అనియు, 'హృదయనిహితైః' అనుటచే మఱవక మార్పక మిగుల జ్ఞప్తితో అతనివార్తలను తెచ్చితి ననియు, 'త్వత్సమీపమ్' అనుటచే ఆసందేశములు నీకే అనియు, 'శ్రామ్యతామ్' అనుటచే విరహార్తు లనియు, 'వేణి' అనుటచే విరహవ్రతధారిణు లనియు, అందుచేత పతివ్రత లనియు, అందుచేత ఆపాంథులయందు అత్యంతానురక్త లనియు, కావుననే తద్వియోగముచే ఆపాంథులు 'శ్రామ్యతామ్' పీడితులగుచున్నా రనియు, 'అబలా' - అబలలును పతివ్రతలును విరహిణులును అగుటచే త్వరగా భర్తలు వచ్చి కూడనియెడల నాస్త్రీలు బ్రతుకరనియు, అట్టియపాయము మేఘోదయముచేతనే కలుగును కాన ఆపాపము తనకే కలుగు ననుభయముచేతను కనికరముచేతను తాను ఆభర్తలను 'మన్ద్రస్నిగ్ధైః' - మంచిమాటల మందలించి 'త్వరయతి' - ఇండ్లకుఁ గాంతలప్రాణము కాపాడు మని తఱుము ననియు, అనఁగా మేఘోదయము కాఁగానే పాంథులు విరహ మోర్వకయు కాంతలప్రాణము నిలుపుకొనుటకును తమతమ తావులకు త్వరగా పోయి చేరుదు రనియు, పాంథమాత్రులనే వారికాంతలతోఁ గూర్చు నేను

మిత్రులయిన మిమ్ముఁ గూర్చుట వింతగాదనియు, అనఁగా నీభర్త నిన్ను త్వరలోఁ గూడుననియు భావము. 'భర్తుః మిత్రమ్ ప్రియమ్ అవిధవే మా మమ్బువాహమ్' అనువదము లున్నవరుసచేత క్రమముగా యక్షికి భర్తృప్రశంస యని యవధానంబును, శ్రవణేచ్ఛయు, సాయము కలుగు నను నిశ్చయమును, పతి బ్రతికియున్నాఁడని యెఱుకయు, దివ్యపురుషుఁడైన మేఘుఁడు తోడ్పడినందున తమవియోగము తీఱిపోవు నని యాశ్వాసమును, సందేశారంభముననే కలిగింపఁబడినవి.

ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీ వోన్ముఖీ సా
త్వా ముత్కణ్ఠోచ్ఛ్వసితహృదయా వీక్ష్య సంభావ్య చైవ
శ్రోష్య త్యస్మాత్పర మవహితా సౌమ్య సీమన్తినీనాం
కాన్తోదన్త స్సుహృదుపనత స్సఙ్గమా త్కించి దూనః. 39.

భర్తృసఖ్యాదిజ్ఞాపనస్య ఫలమాహ ఇతీతి — ఇతి = ఏవమ్, ఆఖ్యాతే సతి, పవనతనయం = హనూమన్తం, మైథిలీవ = సీతేవ, సా = మత్ప్రియా, ఉన్ముఖీ, ఉత్కణ్ఠయా = ఔత్సుక్యేన - ఉచ్ఛ్వసిత హృదయా = వికసిత చిత్తా సతీ, త్వాం వీక్ష్య, సంభావ్య = సత్కృత్య - చ, అస్మాత్ = భర్తృమైత్రీజ్ఞానాత్, పరం సర్వం శ్రోతవ్యమ్, అవహితా = అప్రమత్తా సతీ శ్రోష్య త్యేవ. అత్ర సీతాహనూమదుపమానా దస్యాః పాతివ్రత్యం మేఘస్య దూతగుణసంపత్తి శ్చ వ్యజ్యతే. తద్గుణాస్తు రసాకరే † 'బ్రహ్మచారీ బలీ ధీరో మాయావీ మానవర్జితః। ధీమా నుదారో నిశ్శఙ్కవక్తా దూతః స్త్రియాం భవేత్' ఇతి. నను వార్తామాత్రశ్రవణా దస్యాః కో లాభ ఇత్యాశ ఙ్కాయ్ర్థా న్తరం న్యస్యతి;— హే సౌమ్య = సాధో, సీమన్తినీనామ్ = వధూనామ్ + 'నారీ సీమన్తినీ వధూః' ఇత్యమరః, సుహృదా = సుహృన్ముఖేన - ఉపనతః = ప్రాప్తః సన్-సుహృత్పదం విప్రలమ్భశఙ్కానివారణార్థమ్, కాన్తస్య-ఉదన్తః = వార్తా - కాన్తోదన్తః + 'వార్తా ప్రవృత్తి ర్వృత్తాన్త ఉదన్తః స్యాత్' ఇత్యమరః, సఙ్గమాత్ = కాన్తసంపర్కాత్, కించిదూనః = ఈషదూనః - తద్వదే వానన్దకా రీత్యర్థః.

భర్తృసఖుఁడ నని మేఘుఁడు చెప్పకొనుటవలనిఫలమును యక్షుఁడు తెలియఁజేయుచున్నాఁడు:—

ఇతి = పూర్వోక్తవచనము, ఆఖ్యాతే = నీచేఁ జెప్పఁబడఁగా (నీవు చెప్పఁగా), పవనతనయమ్ = హనుమంతుని, మైథిలీ ఇవ = సీతయుంబోలె, సా-అనా ప్రియతమ, ఉన్ముఖీ = మొగమెత్తినదై, ఉత్క . . . దయా—ఉత్కణ్ఠా = ఔ

త్సుక్యముచేత - ఉచ్ఛ్వసిత = వికసించిన - హృదయా = మనస్సుగలదై, త్వామ్ = నిన్ను, వీక్ష్య = చూచి, సంభావ్య చ = సత్కరించియు, అస్మాత్ = ఈభర్తృమైత్రీజ్ఞానమువలన, పరమ్ = తర్వాత చెప్పఁబడుసర్వమును, అవహితా (సతీ) = చిత్తైకాగ్ర్యముగలదై, శ్రోష్యత్యేవ = తప్పకుండ వినును; వార్త విన్నమాత్రాన ఆమెకు ఏమిఫల మనిన - చెప్పుచున్నాఁడు:—(హే) సౌమ్య = (ఓయి) సాధూ, సీమన్తినీనామ్ = స్త్రీలకు, సుహృదుపనతః — సుహృత్ = చెలికానిమూట - ఉపనతః = వచ్చినటువంటి (సుహృత్తనుట మోసము ఉండ దని తెలుపుటకు), కాన్తోదన్తః - కాన్త = ప్రియునియొక్క - ఉదన్తః = వార్త, సంగమాత్ = కాంతునితోడి కలయికకంటె, కిఞ్చిత్ ఊనః = కొంచెముతక్కువ - దానివలెనే ఆనందము నిచ్చునని యర్థము.

తా.—ఇట్లు భర్తృమిత్రుఁడ నని నీవుచెప్పఁగా ఆంజనేయుని సీతయుంబోలె నాప్రియ మొగమెత్తి చూచి భర్తృవార్తాశ్రవణకుతూహలయై నిన్ను సత్కరించి అటుపై నీవుచెప్పునది యెల్ల మిగుల శ్రద్ధతో వినును. వార్తకే ఇంతశ్రద్ధయు సత్కారమునా యనిన స్త్రీలకు నమ్మకమయినమిత్రుఁడు తెచ్చిన భర్తృసందేశము ఇంచుమించుగా భర్తృసమాగమమువలె ఆనందకరము గదా.

వ.—'పవనతనయమ్' - వాయుదేవుని కుమారుఁ డని వాయుప్రస్తావము చేయుటచేత ఆంజనేయుని గొప్పతనమును ఎట్టితావున కేనియు పోఁగలవాఁ డని గమనసామర్థ్యమును సూచించుట. 'మైథిలీ' - మిథిలాపతి యయిన మహానుభావునకి జనకునికి కూఁతు రని సీతాదేవియొక్క మహానుభావతను అయోనిజత్వాది ప్రధానవిశేషణములను సూచించుట. సీతాంజనేయులకు పోల్చుటచేత యక్షరమణి సీతవంటిపతివ్రత యనియు మేఘుఁడు బ్రహ్మచారివరేణ్యుఁడును మిత్రకార్యధురంధరుఁడు నైన హనుమంతునివంటి సత్పురుషుఁ డనియు స్త్రీయొద్దకు దూతగాఁ బంపుటకు తగిన సాధు వనియు - సూచించుట; 'మైథిలీ వోన్ముఖీ' - చెట్టుమీఁదనుండి 'రాజా దశరథో నామ రథకుఞ్జరవాజిమాన్' అని యారంభించి శ్రీరామువృత్తాంతమును ప్రస్తావించిన యాంజనేయుని సీత చెట్టువైపు మొగమెత్తి చూచినట్లు ఇచట తనభర్తను ప్రస్తావించుచు గవాక్షమున నుండు మేఘుని యక్షసీమంతిని తలయెత్తి చూచు నని భావము. 'ఇవ' - చూచుట సత్కరించుట వినవలసినదియెల్ల వినుట ఈ విషయములయందెల్ల సీతతో యక్షాంగనకు సాదృశ్యము చెప్పఁబడినది. 'సీమన్తినీనామ్'—సీమంతముగలవారికి అనఁగా సభర్తృకలకు, 'సుహృదుపనతః'-సుహృత్తనుటచే అసత్యసందేశముగా దని సూచన. 'సీమన్తినీనామ్ ...... ఊనః' - అనునీ

యథార్థాంతరము సీతాదేవివిషయమందును చెల్లియున్నది; ఆంజనేయుఁడు సుహృత్తు గదా.

తా మాయుష్మ న్మమ చ వచనా దాత్మన శ్చోపకర్తుం
బ్రూయా ఏవం తవ సహచరో రామగిర్యాశ్రమస్థః;
అవ్యాపన్నః, కుశల మబలే పృచ్ఛతి త్వాం వియుక్తః
పూర్వాభాష్యం సులభవిపదాం ప్రాణినా మేత దేవ. 40.

సంప్రతి సన్దిశతి:—హే ఆయుష్మన్ * ప్రశంసాయాం మతుప్ - పరోపకార శ్లాఘ్యజీవితేత్యర్థః, మమవచనం (ప్రార్థనావచనం) తస్మాచ్చ, ఆత్మనః = స్వస్య, ఉపకర్తుం-చ-పరోపకారే ణాత్మానం కృతార్థయితు మిత్యర్థః * ఉపకారక్రియాం ప్రతి కర్మత్వేఽపి 'త స్యానుకరోతీ'త్యాదివ త్సమ్బన్ధమాత్రవివక్షయా మాత్మన ఇతి షష్ఠీ న విరుధ్యతే-యథాహ భారవిః † 'సా లక్ష్మీ రుపకురుతే యయా పరేషామ్' ఇతి-తథా శ్రీహర్ష చరితే† 'సాధూనా ముపకర్తుం లక్ష్మీం ద్రష్టుం విహాయసా గన్తుం। నకుతూహలి కస్య మన శ్చరిత ఇచ్ఛ మహాత్మనాం శ్రోతుమ్' ఇతి-తథాచ క్వచిత్కావ చిద్ద్వితీయాదర్శనా త్సర్వత్రతథే తి నాథవదన మనాథవచన మేవ, తాం=ప్రియామ్, ఏవంబ్రూయాః, కిమిత్యాహ - హేఅబలే, తవ, సహచరః = భర్తా, రామగిరేః (చిత్రకూటస్య) ఆశ్రమేషు తిష్ఠతీతి రామగిర్యాశ్రమస్థః సన్, అవ్యాపన్నః=న మృత ఇత్యర్థః, వియుక్తః = వియోగం ప్రాప్తో దుఃఖీ సం స్త్వాం కుశలం పృచ్ఛతి*దుహ్యాదిత్వాత్ పృచ్ఛతే ర్ద్వికర్మకత్వం, తథాహి, సులభవిపదామ్ = అయత్నసిద్ధవిపత్తీనాం, ప్రాణినామ్, ఏత దేవ, పూర్వాభాష్యమ్ = ప్రథమ మవశ్యం వక్తవ్యం * 'కృత్యాశ్చ' ఇత్యావశ్యకార్థే ణ్యత్ప్రత్యయః.

సందేశమును యక్షుఁడు చెప్పచున్నాఁడు:

హే ఆయుష్మన్ = ఓయి పరోపకారశ్లాఘ్య జీవనుఁడా, మమ = నాయొక్క, వచనాచ్చ = ప్రార్థనావచనమువలనను, ఆత్మనః = నీకు, ఉపకర్తుం చ = ఉపకారము చేసికొనుటకును, తామ్ = నాప్రియతమను, ఏవం బ్రూయాః = ఇట్లు పలుకుము; హే అబలే = ఓ కోమలీ, తవ సహచరః = నీభర్త, రామగిర్యాశ్రమస్థః సన్ - రామగిర్యాశ్రమ = చిత్రకూటాశ్రమములయందు - స్థః సన్ = ఉన్నవాఁడై; అవ్యాపన్నః = బ్రతికియున్నవాఁడై, వియుక్తః సన్ = వియోగదుఃఖముకలవాఁడు నయి, త్వామ్ = నిన్ను, కుశలమ్ = క్షేమమును, పృచ్ఛతి=అడుగుచున్నాఁడు. సులభవిపదామ్'—సులభ = అయత్నముగాఁగలిగెడు - విప

ర్తానామ్ = విపత్తుకలవారగు, ప్రాణినామ్ = ప్రాణులకు, ఏతదేవ = ఇదియే అనఁగా కుశలమే, పూర్వాభాష్యమ్ - పూర్వ = ప్రథమమందు-ఆభాష్యమ్ = అవశ్యముగాఁ బలుకవలసినది.

తా.—ఓయి పరోపకారశ్లాఘ్యజీవనుఁడా, నేను ప్రార్థించుచున్నా నని కని కరముచేతను, పరోపకారము చేసి నిన్ను కృతార్థుని చేసికొనుటకును నాప్రియతమతో 'ఓయబలా, నీభర్త రామగిర్యాశ్రమములయం దున్నాఁడు, బ్రదికియేయున్నాఁడు, వియోగదుఃఖము ననుభవించుచున్నాఁడు,నిన్ను కుశల మడుగుచున్నాఁడు, 'అని చెప్పుము. సులువుగా విపత్తినొందు ప్రాణులతో ముందుగాఁ జెప్పవలసినది యీ కుశలప్రశ్నయే కదా.

వి.—'సహచరః' - నిన్నెప్పుడును బాయనివాఁడు, దైవయోగమున నిన్ను విడిచెనుగాని అన్యథా నిన్ను వదలఁడు, అట్టివాఁడు తనయేలికయయిన కుబేరుని యొద్ద కొలువులో అశ్రద్ధచేసి యీ ప్రవాసమునకు పా లయినందులకు కారణము † నీవేగదా. కనుక అట్టి యనురక్తునిపై నీవు అధికానురాగము చూపవలయు నని భావము. 'రామగిరి' - చిత్రకూట మనక 'రామగిరి' అని రామనామగ్రహణమునకు రామదేవుని కృపచేత ఈవియోగము మీకు తీఱునుగాక అని యభిప్రాయము. 'అవ్యాపన్నః'—'కుశలీ' అనక 'అవ్యాపన్నః' అనుటచే నిను మఱలఁగలయు నాశచే బ్రతికిమాత్ర మున్నాఁడుగాని అన్యథా యీవియోగమునకు మరణము నొందవలసినవాఁడే యనియు, 'అబలే' - నీవు అబలవుగావున ఈవియోగము భరించితివో భరింపలేక మృతి నొందితివో అని నీనిమిత్తమై మిగుల భయపడుచు న్నాఁ డనియు, 'త్వాం కుశలం పృచ్ఛతి'-నీవు కుశలముగానున్న అతఁడు కుశలియే-నీకు ఏమయిన నపాయము గలిగిన అతఁడు బ్రతుకఁ డనియు, భావము.

అఙ్గే నాఙ్గం ప్రతను తనునా గాఢతప్తేన తప్తం
సాస్రే ణాశ్రుద్రుత మవిరతోత్కణ్ఠ ముత్కణ్ఠితేన
ఉష్ణోచ్ఛ్వాసం సమధికతరోచ్ఛ్వాసినా దూరవర్తీ
సఙ్కల్పై స్తై ర్విశతి విధినా వైరిణా రుద్ధమార్గః. 41

అఙ్గేనేతి.-కించ, దూరవర్తీ=దూరస్థః-న చాగన్తుం శక్యత ఇత్యాహ, వైరిణా = విరోధినా, దైవేన, రుద్ధమార్గః = ప్రతిబద్ధవర్త్మా, స తే సహచరః, తనునా = కృశేన, గాఢతప్తేన = అత్యన్తసన్తప్తేన, సాస్రేణ = సాశ్రుణా, ఉత్కణ్ఠా వేద నాస్య సంజాతోత్కణ్ఠితం తే నోత్కణ్ఠితేన * 'తదస్య సఞ్జాతమ్' ఇ తీతచ్ప్ర

త్యయాః-ఉత్కణ్ఠితే ర్వాక్తరిక్తః, సమధికతరమ్ (అతిప్రబలమ్) ఉచ్ఛ్వసితీతి సమధికతరోచ్ఛ్వాసి తేన దీర్ఘనిశ్వాసినేత్యర్థః * తాచ్ఛీల్యే ణినిః, అఙ్గేన = స్వశరీరేణ, ప్రతను = కృశం, తప్తం = వియోగదుఃఖేన ప్లుష్టమ్, అశ్రుద్రుతమ్=అశ్రుక్లిన్నమ్ + 'అశ్రు నేత్రామ్బు రోదనం చాస్ర మస్రు చ' ఇత్యమరః, అవిరతోత్కణ్ఠమ్ = అవిచ్ఛిన్నవేదనమ్, ఉష్ణోచ్ఛ్వాసం = తీవ్రనిశ్వాసం + 'తిగ్మం తీవ్రం ఖరం తీక్ష్ణం చణ్డ ముష్ణం కటు స్మృతమ్' ఇతి హలాయుధః, అఙ్గం = త్వదీయం శరీరం, తైః = స్వసంవేద్యైః, సఙ్కల్పైః=మనోరథైః-మనోవ్యాపారైః, విశతి = ఏకీభవతీత్యర్థః. అత్ర సమానురాగిత్వజ్ఞానా న్నాయికాయాః నాయకేన స్వసమానావస్థత్వ ముక్ష్ని యోక్తమ్.

(కించ = మఱియు), దూరవర్తీ = దూరస్థుఁడును, వైరిణా=విరోధి అయిన, దైవేన = విధిచేతను, రుద్ధమార్గః - రుద్ధ = అడ్డగింపఁబడిన - మార్గః=దారి కలవాఁడును, అయిన, (సః=ఆనీసహచరుఁడు), తనునా=కృశమును, గాఢతప్తేన —గాఢ = అత్యంతము - తప్తేన = కాఁగినదియు, సాస్రేణ = బాష్పములతోఁ గూడుకొన్నదియు, ఉత్కంఠితేన = వేదనగలదియు, సమ ... సినా-సమధికతర = అత్యంతాధికముగా - ఉచ్ఛ్వసినా = నిట్టూర్పుచున్నదియు, (అయిన), అఙ్గేన = తనశరీరముతో, ప్రతను=కృశమును, తప్తమ్ = కాఁగినదియు, అశ్రుద్రుతమ్= అశ్రు = బాష్పములచే - ద్రుతమ్ = తడిసినదియు, అవి ... ణ్ఠమ్-అవిరత = ఎడతెంపులేని-ఉత్కణ్ఠమ్ = వేదనకలదియు, ఉష్ణోచ్ఛ్వాసమ్ - ఉష్ణ = తీవ్రమయిన-ఉచ్ఛ్వాసమ్-నిట్టూర్పుగలదియు, (అయిన), అఙ్గమ్ = నీశరీరమును, తైః = తనకుమాత్రమే తెలియునవైన, సంకల్పైః = మనోరథరూపములయిన మనోవ్యాపారములతో, విశతి = ప్రవేశించుచున్నాఁడు (నీతో నేకీభవించుచున్నాఁడు). నాయికయందు తా నెంతయనురక్తుఁడో నాయికయు తనయందు అంత యనురక్తురాలని యెఱిఁగినవాఁడై యక్షుఁడు తా నేయవస్థలో నున్నాఁడో ఆమెయు ఆయవస్థలోనే ఉండు నని యూహించి యిట్లు చెప్పినాఁడు.

తా.—దైవవశమున నీయొద్దకు రా శక్తుఁడు గాక దూరవర్తియయియున్న నీనాయకుఁడు కృశము గాఢతప్తము సబాష్పము సవేదనము దీర్ఘతరోచ్ఛ్వాసయుక్తము నయిన తనశరీరముతో అట్టిదే అయిననీశరీరమును సంకల్పరూపముగా ప్రవేశించి నీతో ఏకీభవించుచున్నాఁడు.

శబ్దాఖ్యేయం దపి కిల తె యః సఖీనాం పురస్తాత్
కర్ణే లోలః కథయితు మభూ దాననస్పర్శలోభాత్ ...

సోఽతిక్రాన్తః శ్రవణవిషయం లోచనాభ్యా మదృశ్య
స్త్వా ముత్కణ్ఠావిరచితపదం మన్ముఖే నేద మాహ. 42.

సంప్రతి స్వావస్థానివేదనాయ ప్రస్తౌతి శబ్దాఖ్యేయమితి.— హే అబలే యస్తే ప్రియః సఖీనాం, పురస్తాత్ = అగ్రే, ఆననస్పర్శే=త్వన్ముఖసంపర్కే—లోభాత్ =గర్ధనాత్, శబ్దాఖ్యేయం - శబ్దేన = రవేణ - ఆఖ్యేయ-ముచ్చైర్వాచ్య - మపి, యత్ తద్వచన మపీతి శేషః, కర్ణే = శ్రోత్రే, కథయితుం, లోలః = లాలసః, అభూత్కిల + 'లోలుపో లోలుభో లోలో లాలసో లమ్పటోఽపి చ' ఇతి యాదవః, శ్రవణవిషయం = కర్ణపథమ్, అతిక్రాన్తః, తథా, లోచనాభ్యా మదృశ్యః, అతిదూరత్వా ద్ద్రష్టుం శ్రోతుం చ న శక్య ఇతిభావః, స తే ప్రియః త్వా ముత్కణ్ఠావిరచితాని పదాని (సుప్తిఙన్తశబ్దా వాక్యాని వా) యస్యతత్ తథోక్తం + 'పదం శబ్దే చ వాక్యే చ' ఇతి విశ్వః, ఇదం = వక్ష్యమాణం 'శ్యామాస్వఙ్గమ్' ఇత్యాదికం, మన్ముఖేనాహ = మద్వ్యవధానేన స ఏవ బ్రూత ఇత్యర్థః.

ఇప్పుడు తనయవస్థను తెలుపువాఁడై ప్రస్తావముచేయుచున్నాఁడు :—

యః తే ప్రియః = ఏనీ ప్రియుఁడు, సఖీనామ్ = చెలికత్తెలయొక్క, పురస్తాత్ = ఎదుట, ఆన...భాత్ - ఆనన = నీముఖముయొక్క - స్పర్శే = స్పర్శయందు - లోభాత్ = ఆశచేత, శబ్దాఖ్యేయమ్ - శబ్ద = బిగ్గరగనైనమాటలచేత - ఆఖ్యేయమ్ = చెప్పఁదగినది, యత్ = ఏదికలదో, (తత్) అపి = (దానిని) కూడ, కర్ణే = చెవిలో, కథయితుమ్=(ఇతరులకు వినఁబడకుండ) చెప్పుటకు, లోలః-కోరిక గలవాఁడు, అభూత్ కిల = అయెనోగదా, శ్రవణవిషయమ్ = చెవియొక్కమార్గమును, అతిక్రాన్తః = దాఁటినవాఁడును, (అనఁగా అతనిమాట ఈదూరమునకు వినఁబడదనుట), లోచనాభ్యామ్=నేత్రములతో, అదృశ్యః = చూడనశక్యుఁడును (కన్నులకగపడఁడనుట), అయిన, సః = ఆనీప్రియుఁడు, త్వామ్ = నిన్నుగూర్చి, ఉత్కణ్ఠావిరచితపదమ్ - ఉత్కణ్ఠా = విరహవేదనచేత-విరచిత = కూర్పఁబడిన-పదమ్ = మాటలుగలదైన, 'శ్యామాస్వఙ్గమ్' మొదలయినయీచెప్పఁబోవుదానిని, మన్ముఖేన = నానోటిచేత, ఆహ = చెప్పుచున్నాఁడు, అతఁడన్నమాటలే నేను పలుకుచున్నానని యర్థము.

తా.—ఎవఁడు చెలికత్తెలయెదుట నీకపోలస్పర్శసుఖమును మానలేక బాలకవారియెదుటనే దాని ననుభవించుటకై బిగ్గరగా చెప్పఁదగనివిషయమునే నీచెవిలో రహస్యముగా చెప్పఁగోరునో, నీయం దత్యంతానురక్తుఁడయిన నీ ప్రియుఁడు ఇప్పుడు నీకంటికగపడకయు నీచెవికి వినఁబడకయు దూరగతుఁడై యుండుటచేత విర

హావేదనావినోదముకై తాను రచియించినయీవాక్యములను నీయెదుట చెప్పుమని నన్ను పంపినాఁడు. అతఁడు రచియించినవాక్యములనే నేను చెప్పఁబోవుచున్నాను.

వ.—'కర్ణే' - చెలికత్తెలను మోసపుచ్చి వారియెదుటనే కాంతాకపోలస్పర్శసుఖము ననుభవించుటకై యీయుపాయము పన్నినాఁడు. 'అతిక్రాన్త' - దగ్గఱ నున్నచో ఇతరునిచే వార్తను పంపఁడు, తానే నీతోఁ బలుకును. 'ఉత్కణ్ఠా'-నిన్నుం గూర్చి యీవాక్యములను రచియించుటయే యీవిరహమునందు అతనిప్రాణములను నిలిపినవినోదము. 'మన్ముఖేన' - మాటలు అతనివి, ఉచ్చారణ నాది, కనుక వాని యందలి రసాతిశయమెల్ల నీకై యతఁడు పొందినదేగాని నాకల్పన గాదు.

శ్యామా స్వఙ్గం చకితహరిణీప్రేక్షణే దృష్టిపాతం
వక్త్రచ్ఛాయాం శశిని శిఖినాం బర్హభారేషు కేశాన్
ఉత్పశ్యామి ప్రతనుషు నదీవీచిషు భ్రూవిలాసాన్
హన్తైకస్మిన్ క్వచిదపి న తే చణ్డి సాదృశ్య మస్తి. 43.

సదృశ ప్రకృతి స్వప్నదర్శన తదఙ్గస్పృష్ట స్పర్శాఖ్యాని చత్వారి విరహిణాం వినోదస్థానాని - తథాచోక్తం పతాకాయామ్.

† 'వియోగేఽయోగే వా ప్రియజన సదృశానుభవనం
తత శ్చిత్రం కర్మ స్వపనసమయే దర్శన మపి
తదఙ్గస్పృష్టానా ముపనతవతాం స్పర్శన మపి
ప్రతీకారోఽనఙ్గవ్యథితమనసాం కోఽపి గదితః.'

ఇతి; తత్ర సదృశవస్తుదర్శన మాహ శ్యామాస్వితి.—శ్యామాసు = ప్రియఙ్గులతాసు + 'శ్యామా తు మహిళాహ్వయా।లతా గోవన్దనీ గున్ద్రా ప్రియఙ్గుః ఫలినీ ఫలీ' ఇత్యమరః, అఙ్గం=శరీరమ్, ఉత్పశ్యామి=సౌకుమార్యాదిసామ్యాత్త్వదఙ్గ మితి తర్కయామీత్యర్థః, తథా చకితహరిణీనాం ప్రేక్షణే తే దృష్టిపాతం, శశిని = చన్ద్రే, వక్త్రచ్ఛాయాం = ముఖకాన్తిమ్, తథా, శిఖినాం = బర్హిణాం, బర్హభారేషు = బర్హసమూహేషు, కేశాన్, ప్రతనుషు = స్వల్పాసు, నదీనాం వీచిషు † అత్ర వీచీనాం విశేషణోపాదానేఽపి నాయుక్తగుణగ్రహదోషః- భ్రూసామ్యనిర్వాహాయ మహత్త్వదోషనిరాకరణార్థత్వాత్తస్యేతి - తదుక్తం రసరత్నాకరే † 'ధ్వన్యుత్పాదే గుణోత్కర్షే భావోక్తౌ దోషవారణే। విశేషణాద్విశేష్యస్యనాస్త్యయుక్తగుణగ్రహః' ఇతి_ గుణో విశేషణం, భ్రూవిలాసాన్, 'భ్రూపతాకాః' ఇతి పాఠే భ్రువః పతాకా ఇవే త్యుపమితసమాసః, ఉత్పశ్యామీతి సర్వత్ర సమ్బధ్యతే, తథాపి నాస్తి మన్నో

నిర్వృతి రత్యాశయే నాహ హ న్తేతి-హ న్త = విషాదే+'హ న్త హర్షే౽నుకమ్పాయాం వాక్యారమ్భ విషాదయోః' రిత్యమరః, హే చణ్డి = కోపనే + 'చణ్డ స్త్వత్యన్త కోపనః' ఇత్యమరః * గౌరాదిత్వాత్ జీష్ - ఉపమానకథనమాత్రేణ న కోపితవ్య మితి భావః, క్వచిదపి = కస్మిన్నపి, ఏకస్మి న్వస్తుని, తే = తవ, సాదృశ్యం నాస్తి, అతో న నిర్వృణో మీ త్యర్థః; అనే నాస్యాః సౌన్దర్య మనుపమ మితి వ్యజ్యతే.

సదృశవస్తుదర్శనమును జెప్పుచున్నాఁడు:—

శ్యామాసు = ప్రియంగులతలయందు, అఙ్గమ్ = నీశరీరమును-(సౌకుమార్యాది సామ్యమువలన ప్రియంగులతలను నీశరీరముని యూహించుచున్నాను అని యర్థము), చకి...క్షణే - చకిత = బెదరిన - హరిణీ = ఆఁడులేడియొక్క-ప్రేక్షణే = చూపునందు, దృష్టిపాతమ్ = నీచూపును, శశిని = చంద్రునియందు, వక్త్రచ్ఛాయామ్ - వక్త్ర = నీముఖముయొక్క - ఛాయామ్ = కాంతిని, శిఖినామ్ = నెమళ్లయొక్క, బర్హభారేషు-బర్హ = పింఛములయొక్క - భారేషు = మొత్తములయందు, కేశాన్ = నీతల వెంట్రుకలను, ప్రతనుషు = మిక్కిలిచిన్నవయిన, నదీవీచిషు = ఏటితరఁగల యందు, భ్రూవిలాసాన్ = నీబొమలయొక్క-విభ్రమములను,(ఉత్పశ్యామి = ఊహించుచున్నాను అని అంతట నన్వయించును);(అయినను తనమనస్సునకు దుఃఖశాంతి లేదని తెలుపుచున్నాఁడు:—) హన్త = అయ్యో, చణ్డి = ఓకోపస్వభావురాలా — (నీకు ఉపమానములను చెప్పినమాత్రమునకు నాపై కోపింపవలదనిభావము),క్వచిదపి= దేనను, ఏకస్మిన్ = ఒకవస్తువునందు, తే = నీకు, సాదృశ్యమ్ = సామ్యము, నాస్తి = లేదు, (కాన నాదుఃఖము తీఱదు అని భావము), ఇందువలన ఆమె సౌందర్యము సాటిలేని దని తెలియుచున్నది.

తా.—ప్రియంగులతలయందు నీశరీరమును, బెదరినలేడిచూపులందు నీచూపులను, చంద్రునియందు నీముఖమును, నెమలిపురులందు నీకేశభారమును, ఏళ్లలోనిపిల్లతరంగములందు నీబొమవిభ్రమములను, తలంచుచున్నాను; అంతయేగాని, అయ్యో! నీకొక్కతెకు సాదృశ్యము ఇన్నివస్తువులలో చెదరియున్నదేగాని నీతో పూర్ణసామ్యము ఏవస్తువునందును ఎచటను గనఁబడదు, కావున నాదుఃఖమునకు శాంత్యుపాయము లేదు.

వ.—'చకిత' - 'బెదరిన' యనుట చాంచల్యముకొఱకు. పురుషులచూపున నిశ్చలత యెట్లు శ్రేష్ఠమో స్త్రీలచూపున చాంచల్యము అట్లే శ్రేష్ఠము. 'శిఖినామ్ - పుల్లింగము ఆఁడునెమళ్లకు పింఛభారము ఉండదు గావున. 'బర్హభారేషు' భారమనుట కేశకలాపముయొక్క సమృద్ధిని తెలుపును. 'ప్రతనుషు' - చిన్నవైన

అధికముగా వలించుచు మాఱుచు భ్రూవిలాససామ్యము నొందును. 'చణ్డి' అనుట నీకు సాటి కలదన్నమాత్రమునకే అలుగవలదనుటయు మఱియు నీవు నాకు దర్శన మీయక నన్ను ఇన్నిపాట్లఁ బెట్టుచున్నావని నిర్దోష యైనను ప్రియమీఁద ప్రేమాతిశయముచే తప్పుపెట్టుటయు. ఒకచోటనే పూర్ణసాదృశ్యము లేదని ఖేదపడుట యేల యనఁగా-ఒక్క చోటనే యున్నయెడల తద్దర్శనముచే విరహశోకము కొంత శమించును - అట్టిభాగ్యము లేకపోయె నని సూచించుటకు.

త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైః శ్శిలాయా
మాత్మానం తే చరణపతితం యావ దిచ్ఛామి కర్తుమ్,
అస్రై స్తావ న్ముహు రుపచితై ర్దృష్టి రాలుప్యతే మే
క్రూర స్తస్మి న్నపి న సహతే సఙ్గమం నౌ కృతాన్తః. 44.

సప్రతి ప్రతికృతిదర్శన మాహ త్వామితి. — హేప్రియె, ప్రణయేన = ప్రేమాతిశయేన - కుపితాం=కుపితావస్థాయుక్తాం, త్వాం=త్వత్ప్రతికృతి మిత్యర్థః, ధాతవో (గైరికాదయః) + 'ధాతు ర్వాతాది శబ్దాది గైరికాది త్వగాదిషు' ఇతియాదవః - త ఏవ రాగా (రఞ్జకద్రవ్యాణి + 'చిత్రాదిరఞ్జకద్రవ్యే లాక్షాదౌ ప్రణయేచ్ఛయోః। సారఙ్గాదౌ చ రాగః స్యా దారుణ్యే రఞ్జనే పుమాన్' ఇతిశబ్దార్ణవే-తై ర్ధాతురాగైః, శిలాయాం = శిలాపట్టే, ఆలిఖ్య = నిర్మాయ, ఆత్మానం = మామ్ - (మత్ప్రతికృతి మిత్యర్థః,) తే = తవ - చిత్రగతాయా ఇత్యర్థః, చరణపతితం-కర్తుం తథా లిఖితుం యావ దిచ్ఛామి తావ దిచ్ఛాసమకాలం ముహుః - ఉపచితైః=ప్రవృద్ధైః, అస్రైః =అశ్రుభిః కర్తృభిః + 'అస్ర మశ్రుణి శోణితే' ఇతి విశ్వః, మే దృష్టిః, ఆలుప్యతే =ఆవ్రియత ఇత్యర్థః, తతో దృష్టిప్రతిబన్ధనా న్లేఖనం ప్రతిషిధ్యత ఇతి భావః, క్రూరః =ఘాతుకః + 'నృశంసో ఘాతుకః క్రూరః' ఇత్యమరః, కృతాన్తః = దైవం + 'కృతాన్తో యమ సిద్ధాన్త దైవాకుశలకర్మసు' ఇత్యమరః, తస్మిన్నపి = చిత్రేఽపి, నౌ = ఆవయోః * 'యుష్మదస్మదోః షష్ఠీచతుర్థీ ద్వితీయాస్థయో ర్వా నావౌ' ఇతి నావాదేశః, సఙ్గమం = సహవాసం, న సహతే, సఙ్గతిలేఖనమ ప్యావయో రసహమానం దైవం సాక్షాత్సఙ్గతిం న సహత ఇతి కిము వక్తవ్య మి త్యపిశబ్దార్థః.

చిత్తరువు చూచుటను చెప్పుచున్నాఁడు.

(హోప్రియె = ఓప్రేయసీ), ప్రణయకుపితామ్ - ప్రణయ = ప్రేమాతిశయము చేత - కుపితామ్=కోపగించినయవస్థలోనున్న, త్వామ్ = నీప్రతిమను, ధాతురాగైః- ధాతు = గైరికాదులనెడు - రాగైః=రంజకద్రవ్యములతో, శిలాయామ్ = రాతిప

లకమీఁద, ఆలిఖ్య = వ్రాసి, ఆత్మానమ్ = నా ప్రతిమను, తే = చిత్రరువులోనున్న నీ యొక్క, చరణపతితమ్-చరణ = అడుగులలో - పతితమ్ = పడిన వానినిగా, కర్తుమ్ = వ్రాయుటకు, ఇచ్ఛామి యావత్ = ఎంతలో కోరుదునో, తావత్ = అంతలో (అనఁగా కోరినతత్క్షణమే), ముహుః = మాటిమాటికి, ఉపచితైః = వృద్ధిపొందిన, అస్రైః = బాష్పములచే, మే దృష్టిః = నా చూపు, ఆలుప్యతే = హరింపఁబడు చున్నది, (దృష్టిప్రతిబంధముచే వ్రాఁత యసాధ్యమగుచున్నది); క్రూరః = ఘాతుక మైన, కృతాన్తః = దైవము, తస్మిన్ అపి = చిత్రమందుఁగూడ, నౌ = మనయొక్క, సంగమమ్ = సహవాసమును, న సహతే = ఓర్వదు, (మన సాక్షాత్సహవాసముమాట చెప్పవలయునా - అని అపిశబ్దార్థము).

తా.—నీ ప్రతిమ చేతనయినను కొంచెము విరహవినోదము కలుగునుగాక అని ప్రణయకుపితనుగా నిన్ను రాతిపలకమీఁద గైరికాదులగురంగువస్తువులతో వ్రాసి నాఁడను, పిమ్మట నన్ను నీకోపమును పోఁగొట్టుటకై నీపాదములలో పడినవానినిగా నీప్రతిమక్రింద వ్రాయుటకు ఆరంభింపఁగానే నాకన్నులలో మాటిమాటికి బాష్పములు నిండి దృశ్యము అగపడకపోవుటచే నేను కోరినట్లు నా ప్రతిమను వ్రాయనేరకయు న్నాను. క్రూరమైనదైవము చిత్తరువులోఁగూడ మన సంగమమును ఓర్వకున్నది!

వి.—'ప్రణయకుపితామ్'-ప్రణయకుపిత యనఁగా తనమీఁద భర్తకు విపాటి ప్రణయముకలదో యని తత్పరీక్షార్థము నిష్కారణముగా కోపించునట్టి కాంత. ప్రణ యకోపమును చిత్తరువులో చూపఁగలవాఁడగుటచే, అందులోను మంచి చిత్రఫలక ముండుఁగాక ఉత్తమమైన రంజకద్రవ్యములతోనుంగాక విషమముగానుండు రాతిపల కమీఁద జేగురురాలు మొదలైనయధమసాధనములతో ప్రణయకోపమును వ్రాయఁగల వాఁడగుటచే యక్షుఁడు చిత్తరువువిద్యయందు మిగుల నేర్పరి యనియు, ఇట్లే దీని వంటి యితరవిద్యలగు సంగీతాదులయందును విదగ్ధుఁ డనియు, నెఱుంగనగు. 'అస్రైః'- వియోగదుఃఖాతిభారముచేత బాష్పములు ఉప్పతిల్లుట. 'దైవము సంగమమును ఓర్వదు' అనుటచే బాష్పములు తనవశములో కట్టుపడక త్రోసికొని వచ్చినవని భావము. చిత్తరువువ్రాఁత యనుప్రకృతకార్యమునకు భంగము కలుగునట్లుగా బా ష్పము లుప్పతిల్లుట వియోగాతిభారమును సూచించును. ఆవియోగాతిభారము యక్షుకాంతమీఁదియనురాగాతిశయమును సూచించును. 'అపి' - చిత్తరువునందే మనసంగమమును ఓర్వనిక్రూరదైవము మనసాక్షాత్సంగమము నోర్వనే యోర్వదు - అని భావము.

మా మాకాశప్రణిహితభుజం నిర్దయాశ్లేషహేతో
ర్లబ్ధాయాస్తే కథమపి మయా స్వప్నసందర్శనేషు
పశ్యన్తీనాం న ఖలు బహుశో న స్థలీదేవతానాం
ముక్తాస్థూలా స్తరుకిసలయే ష్వశ్రులేశాః పతన్తి. 45.

మామితి.—సుప్తస్య విజ్ఞానం స్వప్నః + 'స్వప్నః సుప్తస్య విజ్ఞానమ్' ఇతి విశ్వః-సందర్శనం సంవిత్ + 'దర్శనం సమయే శాస్త్రే దృష్టౌ స్వప్నేఽక్ష్ణి సంవిది' ఇతి శబ్దార్ణవే-స్వప్నా ఇతి సందర్శనాని విజ్ఞానాని స్వప్నసందర్శనాని * చూతవృక్షాదివ త్సామాన్యవిశేషభావేన సహప్రయోగః-తేషు, మయా, కథమపి=మహతా ప్రయత్నేన, లబ్ధాయాః=గృహీతాయాః-దృష్టాయా ఇతి యావత్, తే=తవ, నిర్దయాశ్లేషః = గాఢాలిఙ్గనం-సఏవ హేతు స్తస్య-నిర్దయాశ్లేషార్థమిత్యర్థః * 'షష్ఠీ హేతు ప్రయోగే' ఇతిషష్ఠీ, ఆకాశే = నిర్విషయే - ప్రణిహితభుజం = ప్రసారితబాహుం, మాం, పశ్యన్తీనాం స్థలీదేవతానాం, ముక్తాః మౌక్తికానీవ స్థూలాః, అశ్రులేశాః= బాష్పబిన్దవః, తరుకిసలయేషు - అనేన చేలాఞ్చలే నాశ్రుధారణసమాధిః ధ్వన్యతే, బహుశో, నపతన్తిఖలు-కింతు పతన్త్యేవేత్యర్థః - నిశ్చయే నఞ్ద్వయప్రయోగః - తథాచాలంకారసూత్రం † 'స్మృతి నిశ్చయ సిద్ధార్థేషు నఞ్ద్వయప్రయోగః' ఇతి: † 'మహాత్మ గురు దేవానా మశ్రుపాతః క్షితౌ యది । దేశభఙ్గో మహాదుఃఖం మరణం చ భవే ద్ధ్రువమ్' ఇతి క్షితౌ దేవతాశ్రుపాతనిషేధదర్శనా ద్యక్షస్య మరణాభావసూచనార్థం తరుకిసలయేషు పతన్తీ త్యుక్తమ్.

స్వప్నదర్శనమును చెప్పుచున్నాఁడు:—

స్వప్నసందర్శనేషు - స్వప్న = కలలనెడు - సందర్శనేషు = జ్ఞానములలో, మయా = నాచేత, కథమపి = మహాప్రయత్నముచేత, లబ్ధాయాః = పొందఁబడిన దానవైన (అనఁగా నాకు అగపడినదానవైన), తే = నీయొక్క, నిర్దయాశ్లేషహేతోః - నిర్దయ = గాఢమయిన - ఆశ్లేషహేతోః = కౌఁగిలింతకొఱకు - (నిన్ను గాఢముగా కౌఁగిలించుకొనుటకై), ఆకాశే = శూన్యమందు-ప్రణిహితభుజమ్ - ప్రణిహిత = చాఁపఁబడినటువంటి-భుజమ్ = బాహువులుగలిగిన-(చేతులు చాఁచినటువంటి), మామ్ = నన్ను, పశ్యన్తీనామ్=చూచుచున్న, స్థలీదేవతానామ్ = వనదేవతలకు (అనఁగా వనదేవతలనేత్రములనుండి), ముక్తాస్థూలాః-ముక్తా = ముత్తెములయంతలేని - స్థూలాః = పెద్దవైన, అశ్రులేశాః = బాష్పకణములు, తరుకిసలయేషు = చెట్ల చిగుళ్లయందు, బహుశః = విస్తారముగా, నపతన్తి న ఖలు = పడనే పడుచున్నవి.

తా.—కలలోనేనియు నిన్నుఁ గందునాయని నిద్రనుకోరి యెన్నియుపాయము లకో గాని నిద్రరాక ఎట్టకేలకు రాఁగా, అందులోను స్వప్నము వచ్చి ఆస్వప్నములోను నీవు అగపడఁగా, నిన్ను బిగువుగా కౌఁగిలించుటకై నేను చేతులు చాఁచినప్పుడు నీవు వాస్తవముగా అక్కడ లేనందున శూన్యముమీఁదికే చాఁపఁబడిననాచేతులను చూచిన వనదేవతలు నాస్వప్నము నూహించి 'పాపము! వీఁడు కలలో కాంతను కౌఁగిలించుకొనుచున్నాఁడు. అయ్యో! వట్టిభ్రమయే గాని వాస్తవముగా అది వీనికి దొరకదాయెఁగదా!' అని నాపై కనికరముచేత దుఃఖించి చెట్లచిగుళ్లయందు ముత్తెములంతలేసి పెద్దబాష్పములను విస్తారముగా రాల్చుచుందురు.

వ.—'ప్రణిహితభుజమ్' - స్వప్నములో ఆకాశగమన దేశాంతరసంచారాదికమును స్వాప్నికశరీరమేకదా చేయును, అట్టిసమయములో ఈవాస్తవదేహము కదలక శయ్యయందు ఉన్నది యున్నట్టే గదా యుండును; అట్లే ఇచటను యక్షునియొక్క స్వాప్నికశరీరమే గదా ఆలింగనార్థము చేతులు చాఁచును, దానిని వనదేవతలు చూచుట యెట్లు? దేవతామహిమచేత చూచిరివో, ఆస్వప్నమందు స్వాప్నిక యక్షుఁడు స్వాప్నిక యక్ష కాంతను కౌఁగిలించును గావున శూన్యమువైపు చేతులు చాఁచె ననుట యెట్లు? అనిన:—స్వప్నమందు అత్యంతభావోద్రేకముతో కలుగువృత్తిని ఈవాస్తవదేహము అనుకరించుటయు లోకములోఁ గలదుగావున యక్షునివాస్తవదేహముయొక్క చేతులే శూన్యము నాలింగంపఁబోవుచు వనదేవతల కగపడినవని యెఱుఁగవలయును. మనోవృత్తిని దేహచేష్ట అనుకరించినందున ఆవృత్తి మిగుల దృఢముగా నుండెననియు అందువలన యక్షునికి కాంతమీఁది యనురాగము మితిలేనిదనియు తెలియుచున్నది. 'నిర్దయ' - దయలేని -అనఁగా ఆకౌఁగిలింతవలన కాంత కేమినొప్పి కలుగునో యనుచింతలేని కౌఁగిలింత, కాంతకుఁ గలుగుపీడను కూడ మఱచి తనకుమాత్రము తృప్తియగునట్లు అత్యంతగాఢముగా ఆలింగనముచేయుటచేత ఆయాలింగనము అతనికి ఎంతప్రియమో అది లేమిచే నతనికి ఎంతశోకమో తెలియుచున్నది. ఆయాలింగన మంతప్రియమగుటచే ఆకాంతమీఁది యనురాగము మితిలేని దనియు అంతయనురాగము కలుగుటకు కాంతయొక్కగుణాతిశయములు లోకోత్తరము లనియు తెలియుచున్నది. 'కథమపి' - వియోగములో నిన్నుఁగూడుటకు స్వప్నముహేతువు, స్వప్నమునకు నిద్రహేతువు, వియోగదుఃఖముచేత అనిద్రకలుగుట అసంభవప్రాయ మయినది, అట్టినిద్ర కలుగునట్లు ఎన్నియో యుపాయములు చేయుదును, చేయఁగా చేయఁగా ఎప్పుడో ఒకప్పుడు నిద్రవచ్చును, అప్పుడు నిన్నుకలలోఁ గందును, అని భావము. 'నపత న్తినఖలు' అని రెండు నఞ్శబ్దములు ప్రయోగించుట నిశ్చయద్యోతనార్థము. 'తరుకిసలయేషు' - దేవతలయశ్రు

పులు నేల రాలిన మరణము కలుగునని శాస్త్రము గావున యక్షునికి మరణముకాకుండుటకై ఆదేవతలు తమయశ్రువులను నేల రాలనీయక చిగురుటాకులలో పడఁజేసిరి. మఱియు చీరకొంగు మొగమున కడ్డముంచుకొని బాష్పములు కొంగులో గ్రహించునటు అనియు భావము. 'తరు' అనుట వనదేవతలు తరువులయందు నివసింతురుగావున. 'బహుశః' అనుటచే ఎన్నిపర్యాయములో ఇటు నేను మిథ్యాభూతములయిన కలలలో నిన్నుఁగూడి మేల్కొని 'అయ్యో! ఇంతయు అవాస్తవమేగదా!' యని దుఃఖమునకు పాలగుచున్నాను' అనియు భావము. 'ముక్తాస్థూలాః' - పెద్దబాష్పములు దుఃఖాతిరేకమువలన కలుగును. వనదేవతలు రాల్చిన బాష్పములు ఆరాల్చిన కాలమందు స్వప్నములోనున్న యక్షుని కెట్లు తెలియు ననిన - తరుకిసలయములయందు స్థూలబిందువులు పూర్వములేనివి తాను మేలుకొన్నపిమ్మట అగపడి వనదేవతల బాష్పములని యతనిచే ఊహింపఁబడును, అని వివరణము.

భిత్త్వా సద్యః కిసలయపుటాన్ దేవదారుద్రుమాణాం
యే తత్క్షీరస్రుతిసురభయో దక్షిణేన ప్రవృత్తాః
ఆలిఙ్గ్యన్తే గుణవతి మయా తే తుషారాద్రివాతాః
పూర్వం స్పృష్టం యది కిల భవే దఙ్గ మేభి స్తవేతి. 47.

ఇదానీం తదఙ్గస్పృష్టవస్తుదర్శన మాహ భిత్త్వేతి.—దేవదారుద్రుమాణాం, కిసలయపుటాన్ = పల్లవపుటాన్, సద్యో భిత్త్వా, తత్క్షీరస్రుతిసురభయః-తేషాం = దేవదారుద్రుమాణాం - క్షీరస్రుతిభిః = క్షీరనిష్యన్దైః-సురభయః = సుగన్ధయః- తుషారాద్రిజాతత్వే లిఙ్గ మిదం; యే వాతాః; దక్షిణేన=దక్షిణమార్గేణ * తృతీయా విధానే ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానా త్తృతీయా - సమేన ధావ తీతివత్-తత్రాపి షష్ఠః కరణస్య ప్రతీయమానత్వాత్ * 'కర్తృకరణయో రేవ తృతీయా' ఇతి భాష్యకారః, ప్రవృత్తాః = చలితాః, హే గుణవతి = సౌశీల్యసౌకుమార్యాదిగుణసంపన్నే, తే తుషారాద్రివాతాః, పూర్వం = ప్రాక్, ఏభిః=వాతైః తవాఙ్గం స్పృష్టం భవే ద్యది కిలేతి సంభావిత మేత దితి బుద్ధ్యేత్యర్థః + 'వార్తాసంభావ్యయోః కిల' ఇత్యమరః, మయా, ఆలిఙ్గ్యన్తే = ఆశ్లిష్యన్తే; అత్ర "వాయూనాం స్పర్శ్యత్వేప్యమూర్తత్వే నాలిఙ్గనాయోగా 'దాలిఙ్గ్యన్త' ఇత్యభిధానం యక్షస్యోన్మత్తత్వాత్ ప్రలపిత మి త్యదోషః" ఇతి వద న్నిరుత్తరకారః స్వయమే వోన్మత్తప్రలాపీ త్యుపేక్షణీయః,

ఆమె గాత్రమునకు తగిలినవస్తువును స్పృశించుట యనువినోదమును చెప్పుచున్నాఁడు:—

దేవదారు ద్రుమాణామ్ = సరళవృక్షములయొక్క, కిసలయపుటాన్ = చిగురు సంపుటములను, సద్యః = అప్పుడే, భిత్త్వా = విఱిచి, ఏత...భయః — ఏతత్ = ఈసరళకిసలయములయొక్క - క్షీర = పాలయొక్క - స్రుతి = ఓడికలచేత - సురభయః = పరిమళవంతములైన, యే వాతాః = ఏ వాయువులు, దక్షిణేన = దక్షిణమార్గముగా, ప్రవృత్తాః = బయలువెడలినవో, హేగుణవతి = ఓసౌశీల్యసౌకుమార్యాది గుణసంపన్నురాలా, తే = ఆ, తుషారాద్రివాతాః = హిమవత్పర్వతపు వాయువులు, పూర్వమ్ = ముందుగా, ఏభిః = ఈవాయువులచేత, తే = నీయొక్క, అఙ్గమ్ = శరీరము, స్పృష్టమ్ = తాఁకఁబడినది, భవేద్యది కిల = అయియుండును, ఇతి = అని, మయా = నాచేత, ఆలిఙ్గ్యన్తే = కౌఁగిలించుకొనఁబడుచున్నవి.

తా.—దేవదారుకిసలయములను అప్పుడే విఱిచి ఆపాలచే పరిమళించుచు దక్షిణముఖముగా ఇచటికి వీచుచున్నహిమత్పర్వతపు వాయువులను, ఓగుణవంతురాలా, అవి ముందుగా నీశరీరమును స్పృశించి యుండు ననుతలంపుచే నేను ఇచట కౌఁగిలించుకొనుచున్నాను.

వి.—'భిత్త్వా' - 'విఱిచి' అనుటచే దేవదారుకిసలయములు పెళుసనియు, వాయువు వేగముగా నున్నదనియు, 'సద్యః' - అప్పుడే అనుటచే వాయువు కడువేగముగా వీచుచున్నదనియు, అందుచేత ఇప్పుడే నిన్నుతాఁకి నీస్పర్శమునఁగలిగిన పరిమళాదిసకలగుణాతిశయములను నాయొద్దకు తెచ్చిన దనియు, విలంబముగా వీచిన ఆగుణాతిశయములు మధ్యదారిలోనే చెదరి హారణమై పోవుననియు, త్వరగా వచ్చినందున అట్లు పోలేదనియు భావము. మఱియు వేగముచే గాలి దట్టముగా నున్నదని సూచితమగుచున్నది, 1దట్టముగానున్నఁగదా ఆలింగనార్హ మగును. 'కిసలయ' - పుష్పమయిన సులువుగా విఱుగదు, పాలుండవు, చిగురైన సులువుగా విఱుగును, పాలుండును. 'పుటాన్' - దొన్నెవలె ఒకటి నొకటి మూసికొని యుండుచిగుళ్లు విస్తరిల్లిన చిగుళ్లకంటె లేఁతవిగాన సులువుగా విఱుగును, వానియందు పాలును ఎక్కువగా నుండును. 'స్రుతి' అనుట క్షీరము అతిసమృద్ధిగా నున్నదని సూచించుచున్నది. 'దేవదారుద్రుమాణామ్' - దేవదారువృక్షములు హిమవంతమునందే గాని ఇతరత్ర లేవు. అందుచే ఆపాలవాసన ఈగాలి హిమవంతమునుండి వచ్చుచున్న

1 శక్య మరవిన్దసురభిః । కణవాహీ మాలినీతరఙ్గాణామ్
అఙ్గై రనఙ్గతప్తై । రవిరళ మాలిఙ్గితుం పవనః. శాకుంతలము.

దనుటకు గుఱుతు, అలకానగరము హిమవంతములో నున్నది. 'దక్షిణేన' అనుటచే ఈయుత్తరపుగాలి వీచుకాలము తొలకరివానలకాలము గాదని తెలియుచున్నది. అట్టికాలమున గాలి ఉత్తరమునకు వీచును, కావుననే మేఘుఁడు ఉత్తరమునకుపోయి అలకానగరమున సందేశ మందించును. 'ఆలిఙ్గ్యన్తే'-ఆలింగనార్హత గాలిదట్టముగా నున్నదని తెలుపుచున్నది. 'గుణవతీ' - నీగుణములు తగిలియున్నవని యీగాలిని కౌఁగిలించుచున్నానుగాని గాలియొక్క శీతలత్వాదిగుణములకొఱకుఁగాదు. 'వాతాః' అనుబహువచనముచేత తఱచుగా ఇట్లు ఆలింగనముచేయుచుందును అని భావము. నిన్ను తాఁకినదానియాలింగనముకూడ నాకు ప్రాణరక్షకముగానున్నది, నీసాక్షా దాలింగనము ఎట్లు రక్షించునో చెప్పవలయునా అని భావము.

ధారాసిక్తస్థలసురభిణ స్త్వన్ముఖ స్యాస్య బాలే
దూరీభూతం ప్రతను మపి మాం పఞ్చబాణః క్షిణోతి,
ఘర్మాన్తే వై వద బత కథం వాసరాణి వ్రజేయుః
దిక్సంసక్తాప్రవిరళఘనావ్యక్తసూర్యాతపాని. 47.

ధారేతి.—ధారాభిః=ఉదకధారాభి - సిక్తం యత్ - స్థలం=భూః - తదివ-సురభిణః = పరిమళవతః, త్వన్ముఖస్య = త్వదాననస్య, దూరీభూతం = దూరస్థమ్, అతఏవ, ప్రతనుమ్ = అతికృశం, తథాభూతమపి మాం, పఞ్చబాణః=పఞ్చ బాణాః శరా అరవిన్దాదయో యస్య సః మన్మథః, క్షిణోతి = బాధతే * క్షిణోతే ర్లట్; ఘర్మాన్తేవై=గ్రీష్మాన్తే తు-వర్షాకాలే ఇత్యర్థః, దిక్షు (సమ్యక్సక్తాః) సంసక్తాః అప్రవిరళాః (మేదురాశ్చ) యే ఘనాః (మేఘాః) తైః అవ్యక్తః సూర్యస్య ఆతపః యేషు తాని వాసరాణి, కథం = కేన ప్రకారేణ, వ్రజేయుః = గచ్ఛేయుః, బత= కష్టం, వద=బ్రూహి.

హేబాలే = ఓబాలా, ధారా...ణః - ధారా = నీటిధారలచేత-సిక్త=తడుపఁబడిన - స్థల=భూమివలె - సురభిణః = పరిమళయుక్తమయిన, త్వన్ముఖస్య = నీముఖమునకు, దూరీభూతమ్ = దూరమయినవానిని, (అందుచేతనే), ప్రతనుమపి = మిక్కిలికృశించినవానినైనను, మామ్ = నన్ను, పఞ్చబాణః = అయిదుబాణములుగలవాఁడు-మన్మథుఁడు, క్షిణోతి = బాధించుచున్నాఁడు; ఘర్మాన్తేవై - ఘర్మ = గ్రీష్మకాలముయొక్క-అన్తేవై=తుదయందయిననో (అనఁగా వర్షాకాలమందైననో), దిక్సం...పాని - దిక్=దిక్కులయందు - సంసక్త=మిక్కిలి అంటిన - అప్రవిరళ = దట్టమయిన - ఘన = మేఘములచేత-అవ్యక్త=అస్పష్టమైన - సూర్య = సూర్యు

నియొక్క—ఆతపాని=ఎండగలవైన, వాసరాణి = దినములు, కథమ్ = ఏరీతిగా, ప్రజేయుః=గడచునో, బత = అయ్యో, వద = చెప్పుము.

తా.—ఓబాలికా, సీతోడివియోగముచే మిగుల కృశించియున్నను నన్ను ఈగ్రీష్మర్తువునందే మన్మథుఁడు తనయైదుబాణములతోను గొట్టుచున్నాఁడు. గ్రీష్మర్తువునందే నాకష్ట మిట్లున్నదిగదా వర్షధారలకు తడిసినభూమియందు నీముఖపరిమళమువంటిపరిమళము పుట్టి నీముఖాఘ్రాణచుంబనాదికమును స్మరణకు తెచ్చి నాకు అధికతాపమును గలిగించునట్టి యీయాసన్నవర్షర్తువునందు సూర్యుఁ డగపడక ఎండయగపడక యుండునట్లు దిక్కులనెల్ల సందులు లేకుండ మేఘము లావరించునప్పుడు నాకు ఎంతశ్రమ గలుగునో నీవే యూహించుకొనఁగలవు.

వ.—'బాలే'-'నీవు చిన్నదానవు నాకష్టము నెఱుఁగవు చెప్పెదను వినుము' అనెడి భావముతోను, ఆమెయు తనతో సమానమయినదురవస్థలో నుండు నను కనికరముచేతను, 'బాలే' - 'చిన్నదానా' అని సంబోధన. 'త్వన్ముఖస్య దూరీభూతమ్' అనుటచే 'భవన్ముఖచుంబనాఘ్రాణములు లేక నేను కడు శ్రమపడుచున్నా'నని భావము. 'ధారానిక్తస్థలసురభిణః' - అనుటచే వర్షమువలన భూమినుండి లేచుపరిమళము నీముఖపరిమళమును జ్ఞప్తికి తెచ్చి నాకు మహాయాసమును పెట్టుననియు, 'ప్రతనుమపి' - అని అపిశబ్దముచే మన్మథుఁడు కనికరములేనివాఁ డనియు, 'పఞ్చబాణః'-అనుటచే ఒక్క-బాణమునకే ఆఁగలేని నన్ను, అయిదు బాణములతోను తన సకలాయుధములతోను కొట్టుచున్నాఁ డనియు, 'వై' అనుటచే గ్రీష్మమందే యింత దురవస్థ కలిగిన ఇఁక వర్షర్తువునందు ఎంతకలుగునో చెప్పవలయునా యనియు, 'సూర్య' అనుట సూర్యుఁడు ఆకాశములో ఏమూలనున్నాఁడో తెలియనంత దట్టముగా మేఘము లావరించు ననియు, సూర్యునే క్రమ్మివేయు మేఘములు చంద్రనక్షత్రములం గ్రమ్ముట చెప్పవలయునా యనియు, భావము.

వి.—'ఘర్మాన్తే'-యక్షుఁడు ఆషాఢప్రథమదినమందు సందేశించుచున్నాఁడు గాన అప్పటి కింక గ్రీష్మము ఒకమాసము శేషించి యుండును. ఉత్థానైకాదశికి ఇతనిశాపాంతముగాన, సందేశ మంపెడునాఁటికి 'శేషా న్మాసా న్గమయ చతురః'- నాలుగుమాసములశాపము శేషించియుండునుగావునను, ఆషాఢప్రథమదినము మొదలు ఉత్థానైకాదశికి నాలుగుమాసముల పదిదినములు గావునను, మేఘునిపయనమునకు పదిదినములు పోఁగా, యక్షికి ఈసందేశ మందునాఁటికి ఇంకను గ్రీష్మము ఇఱువది దినములు శేషించియుండును.

సంక్షిప్యేత క్షణఇవ కథం దీర్ఘయామా త్రియామా
సర్వావస్థా స్వహరపి కథ మ్మన్దమన్దాతపం స్యాత్
ఇత్థం చేత శ్చటులనయనే దుర్లభప్రార్థనం మే
గాఢోష్ణాభిః కృత మశరణం త్వద్వియోగవ్యథాభిః. 48.

సంక్షిప్యేతేతి.—దీర్ఘా యామాః ప్రహరా యస్యాం సా దీర్ఘయామా విరహవేదనయా తథా ప్రతీయమా నేత్యర్థః, త్రియామా = రాత్రిః, † 'ఆద్యన్తయో రర్ధయామయో ర్దినవ్యవహారా త్త్రియామా' ఇతి క్షీరస్వామీ, క్షణ ఇవ, కథం = కేనప్రకారేణ, సంక్షిప్యేత = లఘూక్రియేత, అహరపి సర్వావస్థాసు = సర్వకాలేష్విత్యర్థః, మన్దమన్దః = మన్దప్రకారః * 'ప్రకారే గుణవచనస్య' ఇతి ద్విరుక్తిః * 'కర్మధారయవదుత్తరేషు' ఇతి కర్మధారయవద్భావా త్సుపోలుక్-మన్దమన్దాతపమ్ = అత్యల్పసంతాపం, కథం స్యాత్, హేచటులనయనే = చఞ్చలాక్షి, ఇత్థమ్ = అనేనప్రకారేణ, దుర్లభప్రార్థనమ్ = అప్రాప్యమనోరథం, మే = మమ, చేతః, గాఢోష్ణాభిః = అతితీవ్రాభిః, త్వద్వియోగవ్యథాభిః, అశరణమ్ = అనాథం, కృతమ్.

దీర్ఘయామా - దీర్ఘ = దీర్ఘములైన - యామా = జాములుకలదైన, త్రియామా = రాత్రి, (విరహవేదనచే దీర్ఘముగా తోఁచుచున్నదని యర్థము), క్షణఇవ = క్షణకాలముగా, కథమ్ = ఏప్రకారము, సంక్షిప్యేత = హ్రస్వముచేయఁబడునో, అహరపి = పగలుకూడ, సర్వావస్థాసు = సకలావస్థలయందును (సర్వకాలములయందును అని యర్థము), మన్దమన్దాతపమ్-మన్దమన్ద = మందప్రకారమైన - అత్యల్పపు వేఁడిగలదైన, ఆతపమ్ = ఎండగలది, కథమ్ = ఎట్లు, స్యాత్ = అగునో, హే చటులనయనే = ఓచంచలాక్షీ, ఇత్థమ్ = పైనిచెప్పినప్రకారము, దుర్లభప్రార్థనమ్ - దుర్లభ = నెఱవేఱఁజాలని - ప్రార్థనమ్ = కోరికగలదైన. మే = నాయొక్క, చేతః = మనస్సు, గాఢోష్ణాభిః = మిక్కిలివేఁడియైన, త్వద్వి...థాభిః - త్వత్ = నీతోడి _ వియోగ = ఎడఁబాటుయొక్క - వ్యథాభిః = బాధలచేత, అశరణం కృతమ్ = రక్షకములేనిదిగాఁ జేయఁబడినది.

తా.—నీతోడివిరహమువలని వేఁడి నోర్వఁజాలక నేను ఎంత నేపటికిని వేగని రాత్రులు క్షణముగా హ్రస్వమగునుగాక అనియు, పగలు సర్వదిశలయందును వేఁడిలేనిదిగానే ఎండ యుండవలయుననియు, కోరు కొనుటయేగాని ఆకోరిక యేమియు తీఱుటలేదు. అందువలన నాకు రక్షక మేమియు లేక బాధపడుచున్నాను.

ప.—'క్షణఇవ' - విరహతాపము రాత్రియందు ఎక్కువగాన రాత్రికాలము క్షణభోవలయు ననియు, 'మన్దమన్దాతపమ్'-పగలు విరహతాపమును ఆతపతాపమును రెండును చేరిన దుస్సహములుగాన అందొకటియైనయాతపతాపము తగ్గవలయు ననియు, ప్రార్థన.

న త్వాత్మానం బహు విగణయ న్నాత్మనై వావలమ్బే
త త్కల్యాణి త్వమపి నితరాం మాగమః కాతరత్వమ్
క స్యైకాన్తం సుఖ ముపనతం దుఃఖ మేకాన్తతో వా
నీచై ర్గచ్ఛ త్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ. 49.

నచ మదీయదుర్దశాశ్రవణా ద్భేతవ్య మిత్యాహ నత్వితి.—'నత్వితి' ఏకం వాక్యం - తుశబ్దో భేదకః - కింతు న భేతవ్య మిత్యర్థః - అథవా 'నన్వితి' పాఠః-నన్వి త్యామన్త్రిణే + 'ప్రశ్నావధారణానుజ్ఞానునయామన్త్రిణే నను' ఇత్యమరః-నను ప్రియే, బహు విగణయన్ = శాపాన్తే స త్యేవ మేవం కరిష్యా మీ త్యావర్తయన్, ఆత్మానం = మామ్, ఆత్మనైవ=స్వేనైవ * 'ప్రకృత్యాదిభ్యఉపసంఖ్యానమ్' ఇతి తృతీయా, అవలమ్బే = ధారయామి - యథాకథఞ్చి జ్జీవా మీ త్యర్థః, తత్ = తస్మాత్కారణాత్, హేకల్యాణి = సుభగే - త్వత్సౌభాగ్యే నైవ జీవా మీతి భావః * 'బహ్వాదిభ్య శ్చ' ఇతి జీష్, త్వమపి, నితరామ్ = అత్యన్తం, కాతరత్వం=భీరుత్వం, మాగమః = మాగచ్ఛ -* 'గమే ర్లాజి లుజ్' * 'న మాఙ్యోగే' ఇ త్యడాగమాభావః: తాదృక్సుఖినో రావయో రీదృశి దుఃఖే కథం న బిభేమీ త్యాశ జ్క్యాహ-కస్యేతి కస్య జనస్య, ఏకాన్తం = నియతం, సుఖమ్, ఉపనతం = ప్రాప్తమ్, ఏకాన్తతః = నియమేన, దుఃఖం వోపనతం, కింతు, దశా=అవస్థా, చక్రస్య(రథాఙ్గస్య)నేమి (స్తదన్తః)+ 'చక్రం రథాఙ్గం తస్యాన్తేనేమిః స్త్రీ) స్యాత్ప్రధిః పుమాన్' ఇత్యమరః-తస్యాః - క్రమేణ (పరిపాట్యా) + 'క్రమః శక్తౌ పరిపాట్యామ్' ఇతి విశ్వః, నీచైః = అధః, ఉపరిచ, గచ్ఛతి = ప్రవర్తతే, ఏవం జన్తోః సుఖదుఃఖే పర్యావర్తేతే ఇత్యర్థః.

తనదుర్దశను విని భయపడవలదని చెప్పుచున్నాఁడు :—

న తు = కింతు న భేతవ్యమ్ = నాదుర్దశను విని భయపడవలదు, [లేక,నను = ఓప్రియురాలా], (అహమ్ = నేను), బహు = నానావిధముల, విగణయన్ = 'శాపాంతమున ఇట్లు చేసెదను అట్లు చేసెదను' అని మనస్సులో తలపోయుచు, ఆత్మానమ్ = నన్ను, ఆత్మనైవ = నాచేతనే, అవలమ్బే = ప్రాణములతో నిలుపుకొనుచున్నాను (జీవించియున్నాను), తత్ = కావున, హేకల్యాణి = ఓసౌ

భాగ్యవతీ, త్వమపి = నీవును, నితరామ్ = అత్యంతముగా, కాతరత్వమ్ = దిగులును, మాగమః = పొందవలదు; అట్లు సుఖించుమునకు ఇట్టిదుఃఖము కలిగినప్పుడు ఎట్లు దిగులుపడకుండును అనిన :—కస్య=ఎవరికి, ఏకాన్తమ్ = శాశ్వతముగా, సుఖమ్ = సౌఖ్యము, ఉపనతమ్ = ప్రాప్తించును, ఏకాన్తతః = శాశ్వతముగా, దుఃఖంవా = దుఃఖముగాని, (ఉపనతమ్ = ప్రాప్తించును, కింతు = మఱియేమన), దశా = అవస్థ, చక్ర...మేణ - చక్ర = చక్రముయొక్క-నేమి = కడకమ్మియొక్క- క్రమేణ = వరుసచేత, నీచైః = క్రిందికిని, ఉపరి చ =మీఁదికిని, గచ్ఛతి=పోవును: ప్రాణికి సుఖదుఃఖములు ఒకటివెంబడి నొకటి వచ్చుచుండు నని భావము.

తా.—నాదుర్దశను విని నీవు భయపడవలదు. శాపము తీఱినపిమ్మట అనుభవించుటకు నానాసుఖములను తలపోయుచు ప్రాణములను బిగియఁబట్టుకొని యున్నాను. నీవును అట్లే ప్రాణములను నిలుపుకొని యుండుము, అతిభయము పొందకుము. ఎవరికిని సుఖదుఃఖములు శాశ్వతములు గావు. బండిచక్రంపుఁగడకమ్మివలె దశ క్రిందికిని మీఁదికిని తిరుగుచుండును. కనుక ఇప్పుడు దుఃఖము కలిగినందున మనకును ఇది తీఱినపిమ్మట సుఖము కలుగును, దానిని అనుభవించుటకై మనము ఇప్పుడు బ్రతికియుండవలసినది.

వ.—'కల్యాణి' - నీసౌభాగ్యముచేత నేను జీవించియున్నాను అనిభావము 'విగణయన్' - తలపోయుచుండుట బ్రతికియుండుటకు ఉపాయము.

శాపాన్తో మే భుజగశయనా దుత్థితే శార్ఙ్గపాణౌ,
శేషా న్మాసా న్గమయ చతురో లోచనే మీలయిత్వా,
పశ్చా దావాం విరహగణితం తం త మాత్మాభిలాషం,
నిర్వేక్ష్యావః పరిణతశరచ్చన్ద్రికాసు క్షపాసు. 50.

న చ నిరవధిక మేతద్దుఃఖ మిత్యాహ శాపాన్త ఇతి.—శార్ఙ్గం నామ ధనుః పాణౌ స్థితం యస్య స తస్మిన్ - శార్ఙ్గ పాణౌ = విష్ణౌ * 'సప్తమ్యుపమాన' ఇత్యాదినా బహువ్రీహిః * 'ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠాసప్తమ్యౌ భవతః' ఇతి వక్తవ్యాత్పాణిశబ్ద స్యోత్తరనిపాతః,భుజగః (శేషఏవ) శయనం తస్మా దుత్థితే సతి, మే, శాపాన్తః = శాపావసానమ్ - భవిష్య తీతి శేషః, శేషాన్=అవశిష్టాన్, చతురో మాసాన్ - మేఘదర్శనదినప్రభృతి హరిబోధదినాన్త మిత్యర్థః - దశదివసాధిక్యం త్వత్ర న వివక్షిత మి త్యుక్తమేవ, లోచనే మీలయిత్వా=చక్షుషీ నిమీల్య-గమయ=ధైర్యేణాతివాహ యేత్యర్థః, పశ్చాత్=అనన్తరం, త్వం చాహం చావామ్ * 'త్యదాదీని సర్వై ర్నిత్యమ్' ఇత్యేకశేషః- * 'త్యదాదీనాం మిథో ద్వన్ద్వే య త్పరం త చ్ఛిష్య

తే' ఇ త్యస్తదః శేషః, విరహే - గణితమ్ = ఏవమేవం కరిష్యామితి మన స్యావర్తితం తంతం * వీప్సాయాం ద్విరుక్తిః - సర్వమిత్యర్థః, ఆత్మనోః = ఆవయోః - అభిలాషం = మనోరథం, పరిణతాః = ప్రౌఢాః - శరచ్చన్ద్రికాః యాసాం తాసు, క్షపాసు = రాత్రిషు, నిర్వేక్ష్యావః = భోక్ష్యావహే * విశతే ర్లృట్ + 'నిర్వేశో భృతి భోగయోః' ఇత్యమరః. అత్ర కైశ్చిత్ నభోనభస్యయో రేవ వార్షికత్వాత్కథ మాషాఢాదిమాసచతుష్టయస్య వార్షికత్వ ముక్తమితి చోదయిత్వర్తుత్రయ పక్షాశ్రయణా దవిరోధ ఇతి పర్యహారి - త త్సర్వ మసంగతమ్ ; అత్ర గతశేషా శ్చత్వారో మాసా ఇత్యుక్తం కవినా - నతు తే వార్షికా ఇతి ; తస్మా దయ మనుక్తోపాలమ్భ ఏవ. యచ్చ నాథే నోక్తం 'కథ మాషాఢాదిచతుష్టయా త్పరం శరత్కాలః' ఇతి - తత్రా ప్యాకార్తికసమాప్తేః శరత్కాలానువృత్తేః పరిణతశరచ్చన్ద్రికా స్విత్యుక్తం, నతు తదైవ శరత్ప్రాదుర్భావ ఉక్త ఇ త్యవిరోధ ఏవ.

తనదుఃఖమునకు అంతము లేకపోదు అని చెప్పుచున్నాఁడు:—

శార్ఙ్గపాణౌ = విష్ణువు, భుజగశయనాత్ = శేషశయ్యనుండి, ఉత్థితే సతి = లేచినవాఁ డగుచుండఁగా, (విష్ణువు శేషశయనమునుండి నిద్రలేచినప్పుడు), మే = నాకు, శాపాన్తః - శాప = శాపముయొక్క - అన్తః = అవసానము - (అప్పటికి నాశాపము తీఱును), శేషాన్ = మిగిలియుండెడు, చతురః మాసాన్ = నాలుగు నెలలను, లోచనే మీలయిత్వా = కన్నులు మూసికొని (విరహదుఃఖమును ఓర్చుకొని), గమయ = గడపుము, పశ్చాత్ = అటుపిమ్మట, ఆవామ్ = మన మిరువురము, విరహగణితమ్ - విరహ = వియోగమందు - గణితమ్ = కోరుకొనఁబడిన, తంతమ్ = ఆయా, ఆత్మాభిలాషమ్ - ఆత్మ - మనయొక్క, అభిలాషమ్ = కోరికను, పరి...కాసు పరిణత = ముదిరిన - శరచ్చన్ద్రికాసు = శరత్కాలపు వెన్నెలగలవైన, క్షపాసు = రాత్రులయందు, నిర్వేక్ష్యావః = అనుభవింపఁగలము.

తా.—ఈదుఃఖము నిరవధికము గాదు. విష్ణుమూర్తి శేషశయనమునుండి మేల్కొనునప్పటికి నాకు శాపావసానము నియమింపఁబడినది. కనుక నిఁక శేషించియుండునాలుగు మాసములును ఎట్లో విరహతాపము నోర్చుకొని జీవించియుండుము. అటుతర్వాత మనము ఇప్పు డీవిరహావస్థలో తలపోసికొనెడు సకలభోగములను శరత్కాలపు ముదురువెన్నెలరాత్రులలో అనుభవింపఁగలము. అందునిమిత్తమై మనము బ్రతికియుండవలసినది.

వి.—'భుజగశయన'-అనుట మత్స్యకూర్మాద్యవతారవ్యావర్తకము. 'లోచనే మీలయిత్వా'-ఇది యొకలోకోక్తి, దీనికి ఓర్పుతో నని యర్థము. 'చతురో మాసాన్'-

యక్షుఁడు మేఘునితో సంభాషించుచున్న యాదినము మొదలు విష్ణువు మేల్కొనున ప్పటికి నాలుగుమాసముల పదిదినముల వ్యవధానముగదా, అందులో పది దినములు మేఘునికి పయనమునకు పోయిన, ఈసందేశము యక్షరమణికిఅందునాఁటికి సరిగా నాలుగుమాసములే శేషించియుండును. 'పరిణతశరచ్చన్ద్రికాసు' - ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికమాసములో పదిదినములును, ఇప్పటికి శేషించిన శాపకాలము. ఆశ్వయుజకార్తికములు శరదృతువుగావున శాపము తీఱు నప్పటికి ముదిరిన శరదృతువుగా నుండును. కనుకనే 'పరిణతచన్ద్రికా' అనఁగా పండువెన్నెల, అనిచెప్పినాఁడు. 'క్షపాసు'—యామినీ రాత్రి ఇత్యాదిపదములను జెప్పక క్షయింపఁజేయునది యనునర్థముగలక్షపా శబ్దమును చెప్పుటచే ఆరాత్రులు వీరిసర్వదుఃఖములను క్షయము నొందించు నని భావము. శరచ్చంద్రికారాత్రులఁ జెప్పుట ఆరాత్రులు అతిమనోహరములు గాన.

భూయ శ్చాహ - త్వ మపి శయనే కణ్ఠలగ్నా పురా మే
నిద్రాం గత్వా కిమపి రుదతీ సస్వరం విప్రబుద్ధా;
సా న్తర్హాసం కథిత మసకృ త్పృచ్ఛత శ్చ త్వయా మే
'దృష్టః స్వప్నే కితవ రమయ న్కామపి త్వం మ' యే'తి. 51.

సంప్రతి తస్యా మేఘే వఞ్చకత్వశఙ్కానిరాసా యాతిగూఢ మభిజ్ఞానము పదిశతి భూయ ఇతి.—హేఅబలే, భూయశ్చ =పునరపి - త్వద్భర్తా మన్ముఖే నేతి శేషః మేఘవచన మేతత్, కి మి త్యత ఆహ.—పురా = పూర్వం-పురాశబ్దశ్చి రాతీతే+ 'స్యా త్ప్రబన్ధే చిరాతీతే నికటాగామికే పురా' ఇత్యమరః, శయనే మే కణ్ఠలగ్నాపి త్వం-గళే బద్ధస్య కథమపి గమనం న సంభవే దితిభావః, నిద్రాం గత్వా, కిమపి= కేన వా నిమిత్తే నేత్యర్థ, సస్వరం=సశబ్దమ్- ఉచ్చైరిత్యర్థః రుదతీసతీ విప్రబుద్ధా - ఆసీ రితి శేషః; అసకృత్ = బహుశః, పృచ్ఛతః - రోదనహేతు మితి శేషః, మే = మమ, 'హే కితవ త్వం కామపి రమయ న్మయాస్వప్నే దృష్ట' ఇతి త్వయా సా న్తర్హాసం యథా తథా కథితం చేతి, త్వద్భర్తా భూయ శ్చాహేతి యోజనా.

మేఘుఁడు వంచించుచున్నాఁ డేమో యని యక్షి శంకింపకుండుటకై యక్షుఁడు గూఢమైనగుర్తు ను చెప్పుచున్నాఁడు:—

(హే అబలే = ఓ యబలా), భూయ శ్చ=ఇంకను మరల, ఆహ =నీప్రియుఁడు నాగుండ చెప్పుచున్నాఁడు, (ఇంతవఱకు మేఘునిమాట, నాఁబోవునది యక్షునివాక్యము), పురా = పూర్వము, శయనే = శయ్యయందు, మే = నా

యొక్క, కణ్ఠలగ్నా అపి - కణ్ఠే = మెడయందు - లగ్నా అపి = తగిలియున్న దానవు అయినను, (తన మెడకు అంటుకొని యున్న సమయమందే తాను అన్యత్ర పోవుట యసంభవమని భావము), నిద్రామ్ = నిద్రను, గత్వా = పొంది, కిమపి = ఏనిమిత్తముచేతనో, సస్వరమ్ = శబ్దముతో (బిగ్గరగా), రుదతీ = ఏడ్చుచు, విప్రబుద్ధా = మేలుకొన్న దానవు అయి, అసకృత్ = పలుమాఱు, పృచ్ఛతః = అడుగుచున్న, మే = నాకు (హే) కితవ = (ఓయి) మోసగాఁడా, త్వమ్ = నీవు, కామపి = ఎవతెనో, రమయన్ = క్రీడింపఁజేయుచు, మయా = నాచేత, స్వప్నే = కలలో, దృష్టః = చూడఁబడితివి, ఇతి = అని, త్వయా = నీచేత, సాన్తర్హాసమ్ = లోలోపలి నవ్వుతోఁగూడ, కథితం చ = చెప్పఁబడినది, (అని నీభర్త చెప్పినాఁడు అని యోజన).

తా.— మేఘుఁడు వంచించుచున్నాఁడేమో అని యక్షి శంకింపకుండు నట్లు యక్షుఁడు తనకును ఆమెకును మాత్రమే తెలిసిన తమరహస్యవృత్తాంతము నొకదానిని మేఘముఖమున చెప్పుచున్నాఁడు. అది ఏమనినః— పూర్వ మొకప్పుడు ఒకరాత్రి యక్షభామ యక్షునికంఠమును కౌఁగిలించుకొనియే నిద్రించి యొకకల గనినది, అందులో అతఁడు మఱియొక కామినితో క్రీడించినట్లు చూచి బిగ్గరఁగా ఏడ్చుచు మేలుకొనినది, అతఁడును మేల్కొని యేమి యిది యని పలుమాఱు అడుగఁగా ఆమె లోలోపల నవ్వుచు 'ఓయి మోసగాఁడా, నీవు మఱియొక కాంతతో క్రీడించుచు నాకు కలలో అగపడితివి' అని చెప్పిన దనుట.

వి.— 'భూయశ్చాపి' - కడమ యన్నివిషయములనుండియు వేఱుచేసి ఈ వృత్తాంతమును చెప్పుట ఇది సందేశమునందు నమ్మకము కలిగించునదగుటచే అత్యంత ప్రధానము గావున. 'స్వప్నే' - అట్టిస్వప్నము ఆమెకు వచ్చుటకు కారణము లేద నఁగా - ఇతఁడు సర్వకామినులకును అభిలషణీయములైన సౌందర్యాదిగుణములు గలవాఁ డగుటయు, అందుచే బహుకామినులు ఇతనిని కామించుచుండుటయు, ఇతఁడు తనకత్యంతప్రియుఁ డగుటచే ఎప్పు డెవతెయొక్క వలలోఁ బడునో యని తా నెప్పుడును భయపడుచుండుటయు. 'రుదతీ' - రోదనము ఈర్ష్యాతిశయమును అనురాగాతిశయమును తెలుపుచున్నది. 'కితవ' - కలలో తప్పుచేసినందులకే అతనిని మోసగాఁడనుచున్నది, అందువలన తనకలలో నయినను అతఁ డన్యకామినిం దలఁచుట అతనితప్పుగా ఆమె తన స్నేహాతిశయముచేత 'నీకట్టిచింతలు లేనియెడల నా కిట్టిస్వప్నమేల కలుగును' అని యతనియందు వాస్తవము కాకపోయినను శంకను ఆరోపించికొని అట్లు సంబోధించినది; ఇది ఆమెయొక్క రాగాతిశయమును తెలుపుచున్నది. 'సాన్తర్హాసమ్' - కితవుఁడు కాఁడనియు, కల అబద్ధమనియు సంతోషమును, తన

భయమే తనకు ఆరీతికలను తెచ్చినదని లజ్జను, అంతర్హాసము తెలుపుచున్నది. 'అసకృత్'-పలుమాఱు అడిగినందాక చెప్పకపోవుట లజ్జను తెలుపుచున్నది. 'కామపి'-ఆకలలో అగపడినరమణి తా నెఱిఁగినదిగాక ఎవతెయో అగుట వాస్తవముగా అతఁడెవతెనుగాని కామించియుంట లేదనియు ఆమెకు కేవలప్రేమాతిశయజన్యము యిన భయముచేత అట్టికల వచ్చినదనియు సూచించుచున్నది. ఈరహస్యమును చెప్పివంపుటచేత యక్షాంగనకు నిరంతరము తన్నే తనవృత్తాంతములనే యక్షుఁడు చింతించుచున్నాఁడని గొప్ప సమాశ్వాసము కలుగును.

ఏతస్మాన్మాం కుశలిన మభిజ్ఞానదానా ద్విదిత్వా
మా కౌలీనా దసితనయనే మ య్యవిశ్వాసినీ భూః
స్నేహా నాహుః కిమపి విరహే ధ్వంసిన స్తే త్వభోగా
దిష్టే వస్తు న్యుపచితరసాః ప్రేమరాశీభవన్తి. 52.

ఏతస్మా దితి.— ఏతస్మాత్ = పూర్వోక్తాత్, అభిజ్ఞాయతేఽనేనే త్యభిజ్ఞానం (లక్షణం) తస్య దానాత్ (ప్రాపణాత్), మాం, కుశలినం=క్షేమవన్తం, విదిత్వా=జ్ఞాత్వా, హే అసితనయనే, కులే (జనసమూహే) భవాత్-కౌలీనాత్=లోకప్రవాదాత్-ఏతావతా కాలేన పరాసుర్నో చే దాగమిష్య తీతి జనప్రవాదా దిత్యర్థః + 'స్యా త్కౌలీనం లోకవాదే యుద్ధే పశ్వహిపక్షిణామ్' ఇత్యమరః,మయి విషయే, అవిశ్వాసినీ=మరణశఙ్కినీ, మా భూః=న భవ * భవతే ర్లుఙ్ * 'న మాఙ్యోగే' ఇ త్యడాగమప్రతిషేధః ; న చ దీర్ఘకాలవిప్రకర్షా త్పూర్వస్నేహనివృత్తి రాశఙ్క్యే త్యాహ స్నేహానితి.—కిమపి=కింవా నిమిత్తం న విద్మ ఇతి శేషః, స్నేహాన్=ప్రీతీః, విరహేసతి= అన్యోన్యవిప్రకర్షేసతి, ధ్వంసినః=వినశ్వరాన్, ఆహుః, త త్తథా న భవతీ త్యభిప్రాయః, కింతు, తే= స్నేహాః, అభోగాత్ = విరహే భోగాభావాద్ధేతోః *ప్రసజ్యప్రతిషేధేఽపి నఞ్సమాస ఇష్యతే, ఇష్టే వస్తుని విషయే, ఉపచితో రసః (స్వాదో) యేషు తే-ఉపచితరసాః సన్తః=ప్రవృద్ధతృష్ణా ఇత్యర్థః+'రసో గన్ధరసే స్వాదే తిక్తాదౌ విషరాగయోః' ఇతివిశ్వః, ప్రేమరాశీభవన్తి = వియోగాసహిష్ణుత్వ మాపద్యన్త ఇత్యర్థః. స్నేహప్రేమ్ణో రవస్థాభేదా ద్భేదః-తదుక్తమ్

† 'ఆలోక నాభిలాషౌ । రాగస్నేహౌ తతః ప్రేమా
రతిశ్శృఙ్గారో యోగే । వియోగతో విప్రలమ్భ శ్చ' ఇతి;

తదేవ స్ఫుటీకృతం రసాకరే-

† 'ప్రేమా దిదృక్షా రమ్యేషు తచ్చిన్తా త్వభిలాషకః
రాగ స్తత్సఙ్గబుద్ధిః స్యా త్స్నేహ స్తత్ప్రవణక్రియా;

తద్వియోగాసహం ప్రేమ రతి స్తత్సహవర్తనమ్
శృఙ్గార స్తత్సమక్రీడా సంభోగః సప్తధా క్రమాత్' ఇతి.

ఏతస్మాత్ = పూర్వోక్తమైన, అభిజ్ఞానదానాత్—అభిజ్ఞాన = గుర్తుయొక్క-దానాత్ = ఇచ్చుటవలన (తెలియఁజేసినయీగుర్తువలన), మామ్ = నన్ను, కుశలినమ్=క్షేమముగలవానినిగా, విదిత్వా = తెలిసికొని, అసితనయనే = నల్లకన్నులదానా, కౌలీనాత్ = లోకవాదమువలన, మయి = నావిషయమై, అవిశ్వాసినీ = మరణశంకగలదానవు, మాభూః = కాకుము, కిమపి = కారణమెఱుఁగముగాని, స్నేహాన్ = ప్రీతులను, విరహే సతి = ఎడఁబాపుగలిగినప్పుడు, ధ్వంసినః = నశించువానినిగా, ఆహుః = చెప్పుదురు, (అయినను), తే = ఆస్నేహములు, అభోగాత్ = అనుభవములేనిహేతువువలన, ఇష్టే వస్తుని = ఇష్టమయిన వస్తువువిషయమై, ఉపచితరసాః—ఉపచిత = వృద్ధిపొందిన - రసాః=రుచికలవై, ప్రేమరాశీభవన్తి= ప్రేమరాసులగును (వియోగమును సహింపలేనిదశను పొందును అని యర్థము).

తా.—నా పంపిన యీగుర్తుచేత నేను క్షేమముగా నున్నానని తెలిసికొనుము. నేను మృతిఁబొందితి నని లోకులమాటలవలన తలంపకుము. స్నేహములు విరహమందు నశించునని చెప్పుదురుగాని ఆమాట సరిగాదు, మఱియేమనిన అనుభవము నిలిచిపోయినహేతువుచేత ఆస్నేహములు ఇష్టవస్తువువిషయమై అత్యంతాస్వాదనీయములై వియోగమును భరింపఁజాలని వగును.

వ.—'కుశలినమ్'— నేను కుశలినని యెఱింగిన నీవు జీవించియుందు వని నా కుశలమును నీకు తెలిపితిని, అట్లే నీవు కుశలముగా నున్న నేను జీవింతునుగావున నీవు జీవించియుండవలసినది. 'కౌలీనాత్'-ఇదే సమయ మని మనమీఁద కిట్టనివారు మన కపాయము గలిగించుటకై నేను మృతినొందితి నని ప్రకటింతురు, అట్టి లోకవాదములను నమ్మవలదు. 'ఏతస్మాత్'— నేను పంపిన రహస్యమయిన యభిజ్ఞానము వలన ఆలోకవాద మబద్ధమని యెఱుంగుదువు. 'స్నేహాన్'—నశించిపోవునవి విశేషస్నేహములు గావు సామాన్యస్నేహములే యని బహువచనస్వారస్యము.

ఆశ్వాస్యైవం ప్రథమవిరహోదగ్రశోకాం సఖీం తే
శైలా దాశు త్రినయనవృషోత్ఖాతకూటా న్నివృత్తః
సాభిజ్ఞానం ప్రహితకుశలై స్తద్వచోభి ర్మ మాపి
ప్రాతఃకున్దప్రసవశిథిలం జీవితం ధారయేథాః. 53.

ఇత్థం స్వకుశలం సంప్రేష్య ఇదానీం తత్కుశలసందేశానయనం యాచతే - ఆశ్వాస్యేతి.—ప్రథమవిరహేణ - ఉదగ్రశోకాం = తీవ్రదుఃఖాం, తేసఖీమ్, ఏవం

= పూర్వోక్తరీత్యా, ఆశ్వాస్య = ఉపజీవ్య, త్రినయనస్య వృషేణ (వృషభేణ) - ఉత్ఖాతాః = అవదారితాః - కూటాః = శిఖరాణి - యస్య తస్మాత్ + 'కూటోస్త్రీ శిఖరం శృఙ్గమ్' ఇత్యమరః, శైలాత్ = కైలాసాత్, ఆశు, నివృత్తః సన్ = ప్రత్యావృత్తః సన్, సాభిజ్ఞానం = సలక్షణం యథా తథా, ప్రహితం = ప్రేషితం - కుశలం యేషు తైః తస్యాః = త్వత్సఖ్యాః - వచోభిః, మమాపి, ప్రాతఃకున్దప్రసవమివ - శిథిలం = దుర్బలం, జీవితం, ధారయేథాః = స్థాపయ * ప్రార్థనాయాం లిఙ్.

ఆమెయొక్క కుశలవార్తను తనకు తెమ్మని మేఘుని యక్షుఁడు ప్రార్థించు చున్నాఁడు:—

ప్రథ...శోకామ్—ప్రథమ = మొదటి-విరహ = వియోగముచేత - ఉదగ్ర = తీవ్రమయిన - శోకామ్ = దుఃఖముగలదైన, తే సఖీమ్ = నీచెలిని, ఏవమ్ = పూర్వోక్తప్రకారముగా, ఆశ్వాశ్య = ఊరడించి, త్రిన...కూటాత్—త్రినయన = మూఁడుకన్నులవానియొక్క - అనఁగా శివునియొక్క - వృష = వాహనమైన యెద్దుచేత - ఉత్ఖాత = కోరాడఁబడిన - కూటాత్ = శిఖరములుగలదైన, శైలాత్ = కొండనుండి, అనఁగా కైలాసమునుండి, ఆశు = శీఘ్రముగా, నివృత్తః సన్ = మరలినవాఁడవై, సాభిజ్ఞానం = గుర్తుతోఁగూడ, ప్రహితకుశలైః—ప్రహిత = పంపఁబడిన - కుశలైః = క్షేమవార్తగలవైన, తద్వచోభిః = ఆప్రియతమయొక్క మాటలచేతను, ప్రాతః...థిలమ్ — ప్రాతః = ప్రాతఃకాలమందలి - కున్దప్రసవ = మల్లెపువ్వువలె - శిథిలమ్ = దుర్బలమైన, మమ జీవిత మపి = నాప్రాణమును గూడ, ధారయేథాః = నిలుపుము.

తా:—తొలివియోగముచేత నత్యంతశోకాతురయైన నాకాంతను పైఁజెప్పిన రీతిని ఓదార్చి కైలాసమునుండి శీఘ్రముగా మరలి గుర్తుతోఁగూడ నాప్రియ చెప్పువార్తను నాకందించి నాప్రాణమును కాపాడుము.

వ:—'త్రినయనవృష'—కైలాసముయొక్క మహిమాతిశయవర్ణనము. శివునకు అతనియెద్దునకును వందనం బాచరింపుమనియు, సామాన్యవృషభములకు ఆచట ప్రవేశము లేదనియు, భావము. 'ఉత్ఖాతకూట'—అని వర్షాకాలమందలివృషభస్వభావము వర్ణింపఁబడినది. శివునియెద్దు శిఖరములను కోరాడుచుండుటను చూచుట మనోహరముగా నుండుననియు, అయినను అట్టివినోదమును చూచుచు అచట కాలహరణము సేయక నాప్రాణములను నిలుపుటకై, 'ఆశు'—త్వరగా రావలసిన దనియు, 'సఖీం తే' నామూలమున నాకాంతయు నీకు చెలియయినది గనుక ఆనా ప్రేయసిప్రాణములను నీవు రక్షింపవలసినయక్కఱ నీకుఁ గలదనియు, 'సాభిజ్ఞానమ్'-నే నొప్పుకొనుటకు చిహ్నము లేవలయుననియు, 'ప్రహిత'-నీవు ఒరులవలన నెఱిఁగి

తెచ్చు కుశలవార్తను నేనుకోరను ఆనాప్రియ స్వయముగా నీచేత చెప్పిపంపెడుమాటు నే ఇక్కడనాకు ఒప్పగింపు మనియు, 'శిథిలమ్'—అట్టివార్త లేక నాప్రాణ మిప్పుడు పోనున్న దనియు, 'అపి'—ప్రియాప్రాణమును రక్షించునట్లే 'మమ జీవితం ధారయేథాః'—నాప్రాణమునుకూడ రక్షింపు మనియు, 'ప్రాతఃకున్దప్రసవశిథిలమ్'—ప్రాతఃకాలపుమల్లెమొగ్గ నుఁవుగా ఊడిపోవున - గాలికే రాలును - గాన ఆసాదృశ్యము చెప్పుటచేత తనబ్రదుకు కడు సందేహములో నున్నదనియు, భావము.

కచ్చి త్సౌమ్య వ్యవసిత మిదం బన్ధుకృత్యం త్వయా మే
ప్రత్యాదేశా న్నఖలు భవతో ధీరతాం కల్పయామి
నిశ్శబ్దోఽపి ప్రదిశసి జలం యాచిత శ్చాతకేభ్యః
ప్రత్యుక్తం హి ప్రణయిషు సతా మీప్సితార్థక్రి యైవ. 54.

కచ్చిదితి.—హేసౌమ్య = సాధో, ఇదం మే, బన్ధుకృత్యం = బన్ధుకార్యమ్ * దేవదత్తస్య గురుకుల మితివ త్ప్రయోగః, వ్యవసితం కచ్చిత్ = కరిష్యామీతి నిశ్చితం కిం + 'కచ్చి త్కామప్రవేదనే' ఇత్యమరః = అభిప్రాయజ్ఞాపనం కామప్రవేదనమ్; న చ తే తూష్ణీమ్భావా దనఙ్గీకారం శఙ్కే యత స్త్వే స ఏ వోచిత ఇత్యాహ.—ప్రత్యాదేశాత్ = కరిష్యామి ఇతి ప్రతివచనాత్ + 'ఉక్తిరాభాషణం వాక్య మాదేశో వచనం వచః' ఇతి శబ్దార్ణవే, భవతః = తవ, ధీరతాం = గమ్భీరత్వం, న కల్పయామి = న సమర్థయే-ఖలు, తర్హి కథ మఙ్గీకారజ్ఞానం తత్రాహ.—యాచితఃసన్, నిశ్శబ్దోఽపి = నిర్గర్జితోఽపి - అప్రతిజానానోఽపీత్యన్యత్ర, చాతకేభ్యో జలం, ప్రదిశసి=దదాసి; యుక్తం చైతత్, ప్రణయిషు=యాచకేషు విషయే, ఈప్సితార్థక్రియైవ = అపేక్షితార్థసంపాదన మేవ, ప్రత్యుక్తం = ప్రతివచనమ్, క్రియా కేవల ముత్తర మిత్యర్థః

† 'గర్జతి శరది న వర్షతి। వర్షతి వర్షాసు నిఃస్వనో మేఘః,
నీచో వదతి న కురుతే। న వదతి సుజనః కరోత్యేవ.' ఇతి భావః.

తనప్రార్థనను మేఘుఁ డంగీకరించె నని ప్రశ్నపూర్వకముగా యక్షుఁడు కల్పించుచున్నాఁడు.—

హేసౌమ్య = ఓయిసాధూ, త్వయా = నీచేత, ఇదమ్ = ఈ, మే = నాయొక్క, బన్ధుకృత్యమ్ = బంధుకార్యము, వ్యవసితం కచ్చిత్ = పూనుకొనఁబడినదా? నీవు బదులు పలుకకుండుటచేత అనంగీకారమును శంకింపను - ఏలయనఁగా బదులుపలుకకుండుటయే నీకు స్వభావమై యున్నది. అనిచెప్పుచున్నాఁడు:—ప్రత్యా

దేశాత్ = చేసెద నని మాట యిచ్చుటచేత, భవతః = నీయొక్క, ధీరతామ్ = గాంభీర్యమును, న కల్పయామి ఖలు=సాధింపనుగదా, బదులుచెప్పుట నీగాంభీర్యమునకు లోపము తెచ్చును; అటయిన అంగీకార మెట్లు తెలియు ననిన:—యాచితః సన్=వేఁడుకోఁబడినవాఁడవై, నిశ్శబ్దో౽పి=ఉఱుమకయే-వాగ్దానము చేయకయే, చాతకేభ్యః = వానకోయిలలకు, జలమ్ = నీటిని, ప్రదిశసి = ఇచ్చుచున్నావు; ఇది యుక్తమే అని చెప్పుచున్నాఁడు:—సతామ్=సజ్జనులకు, ప్రణయిషు=యాచకులవిషయమందు, ఈప్సి...యైవ—ఈప్సిత = కోరఁబడిన-అర్థ = ప్రయోజనము యొక్క - క్రియైవ = చేయుటయే, ప్రత్యుక్తం హి = బదులుమాట గదా.

తా.—ఓయి సాధూ, నాకొఱకు ఈబంధుకార్యమును నీవంగీకరించితి వని తలంచెదను. నీవు బదులుమాట చెప్పకుండుట అనంగీకారసూచకము గాదు; మఱి యేమనిన, అది నీస్వభావము. బదులుమాట చెప్పుట నీగాంభీర్యమునకు లోపము. (ఉఱుమకయే) వాగ్దానములు పలుకకయే నీవు నిన్ను యాచించు చాతకములకు జలము నిచ్చుచున్నావు, నావిషయమందును అట్లే చేసెదవు; ఏలయనిన సత్పురుషులు యాచకులకార్యమును చేయుదురుగాని చేసెద మని పలుకరు.

వ.—'బన్ధుకృత్యమ్'—ఈయుపకారము సామాన్యము గాదు. ఇంతగొప్ప యుపకారమును ఆప్తబంధువే గాని చేయఁడు. కావున దీనిని చేయుటచేత మేఘుఁడు యక్షునికి ఆప్తబంధు వాయె ననియు, 'సతామ్'—అనుటచే మేఘుఁడు సజ్జనుఁడనియు, సజ్జనుఁడుగాన లోకైకకుటుంబుఁ డనియు, భావము.

ఏత త్కృత్వా ప్రియ మనుచితం ప్రార్థనా దాత్మ నో మే
సౌహార్దా ద్వా విధుర ఇతి వా మ య్యను క్రోశబుద్ధ్యా
ఇష్టా న్దేశా న్జలద విచర ప్రావృషా సంభృతశ్రీ
ర్మాభూ దేవం క్షణమపిచ తే విద్యుతా విప్రయోగః. 55.

సంప్రతి స్వాపరాధసమాధానపూర్వకం స్వకార్య స్యావశ్యకరణం ప్రార్థయమానో మేఘం విసృజతి ఏతదితి.—హేజలద, సౌహార్దాత్ = సుహృద్భావాద్వా. * 'హృద్భగసిన్ధ్వన్తే పూర్వపదస్య చ' ఇ త్యుభయపదవృద్ధిః, విధురః = వియుక్తః, ఇతి = హేతోః + 'విధురం తు ప్రవిశ్లేషే' ఇత్యమరః, మయి విషయే, అనుక్రోశబుద్ధ్యా = కరుణాబుద్ధ్యా - వా, ఆత్మనః = తవ, అనుచితమ్ = అననురూపమపి, మే = మమ, ఏతత్, ప్రియం=సందేశహరణం, ప్రార్థనాత్ కృత్వా, ప్రావృషా = వర్షాభిః + 'స్త్రియాం ప్రావృట్ స్త్రియాం భూమ్ని వర్షాః' ఇత్యమరః,

సంభృతశ్రీః = ఉపచితశోభః సన్, ఇష్టాన్ = స్వాభిలషితాన్, దేశాన్విచర, యథేష్టదేశేషు విహరేత్యర్థః * 'దేశకాలాధ్వగన్తవ్యాః కర్మసంజ్ఞా హ్యకర్మణామ్' ఇతి వచనాత్కర్మత్వమ్, ఏవం = మద్వత్, క్షణమపి = స్వల్పకాలమపి, తే = తవ, విద్యుతా - కళత్రేణేతి శేష, విప్రయోగః = విరహః, మాభూత్ = మాస్తు * 'మాఙి లుఙ్' ఇత్యాశిషిలుఙ్, † 'అన్తే కావ్యస్య నిత్యత్వా త్కుర్యా దాశిష ముత్తమామ్. సర్వత్ర వ్యాప్తయే విద్వా న్నాయకేచ్ఛానురూపిణీమ్' ఇతి సారస్వతాలంకారేదర్శనాత్కావ్యాన్తే నాయకేచ్ఛానురూపోఽయ మాశీర్వాదః ప్రయుక్త ఇత్యనుసంధేయమ్.

యక్షుఁడు తా నిచ్చినశ్రమకు మన్నింపుమని వేఁడుచు తనకార్యమును అవశ్యము చేయుమని ప్రార్థించుచు మేఘుని పంపుచున్నాఁడు:—

హే జలద = ఓయి మేఘుఁడా, మయి = నాయందు, సౌహార్దాద్వా = స్నేహము చేతఁ గాని, విధుర ఇతి వా = విరహి నను హేతువుచేతఁగాని, అనుక్రోశబుద్ధ్యా(వా) =(నాపై) కనికరముగలమనస్సుచేతఁ (గాని), ఆత్మనః = నీకు, అనుచితమ్ = తగనటువంటిదైనను, మే = నాకు, ఏతత్ ప్రియమ్ = వార్తనుకొనిపోవుటయనెడియీప్రియమును, ప్రార్థనాత్ = నా వేఁడుకోలువలన, కృత్వా = చేసి, ప్రావృషా = వర్షాకాలముచే, సంభృతశ్రీః—సంభృత = వృద్ధినొందిన-శ్రీః = శోభకలవాఁడవై, ఇష్టాన్ = ఇచ్ఛవచ్చినట్టి, దేశాన్ = దేశములను, విచర = తిరుగుము, ఏవమ్ = నావలె, క్షణమపి = క్షణకాలమయినను, తే = నీకు, విద్యుతా = (నీభార్య అయిన) మెఱుపుఁదీఁగతో, విప్రయోగః = వియోగము, మాభూత్ = కలుగకుండునుగాక.

తా.—ఓయి మేఘుఁడా, నాయందు స్నేహముచేతనో, విరహినను హేతువుచేతనో, నాయందు కనకరముచేతనో, నీబోఁటిగొప్పవానికి తగనట్టిసందేశహరణక్రియారూపమైన యీయుపకారమును నాకు చేసి ఆపుణ్యమువలన వర్షాలక్ష్మిచే నత్యంతము శోభిల్లుచు, నీకిష్టమైనదేశములు తిరుగుము. ఎప్పటికిని నాకుఁ గలిగినట్లు నీకు నీభార్యయయిన మెఱుపుఁదీఁగతో వియోగము కలుగకయుండునుగాక.

వ.—'జలధర' అనక 'జలద' యనుట ఉపకారశీలతా సూచకము, 'అనుచితమ్'-వార్తాహరణ మనునది ఎవరికైనను సామాన్యులకు చెప్పవలసినపని. మేఘునివంటిగొప్పవారికి చెప్పఁదగినది కాదు - అంత గొప్పవారు చేయనంగీకరించునదియుఁ గాదు. అనుచితమయినను చేయుటచేత మేఘునియొక్క సాధుత్వపరోపకారిత్వాదిసుగుణాతిశయములు వెల్లడియగుచున్నవి. 'ప్రావృషా...మాభూ ద్విద్యుతా విప్రయోగః'.—వర్షాకాలములో ప్రాయికముగా మెఱుపులు మెఱయుచుండుటయు

విస్మృతి అణఁగిపోవుటయు స్వాభావికము; అందు వర్షర్తువునందలివిద్యుత్సంగతిని ఈ పుణ్యమునకు ఫలముగా కల్పించి చెప్పినాఁడు. 'మభూత్ విప్రయోగః'—మంగళార్థము కావ్యాంతమున ఆశీర్వచనము ప్రయోగింపఁబడినది. 'ప్రావృషా విద్యుతా'—స్త్రీలింగస్వారస్యముచే వానకారనెడియత్తగారిచే అలంకరింపఁబడినవాఁడై మెఱపనెడుభార్యను ఎడఁబాయక క్షేమముగా నుండు మని స్ఫురించుచున్నది. 'విప్రయోగః'—విప్రయోగముకంటె కీడు లేదనియు తదభావముకంటె మేలులేదనియు యక్షుఁడు స్వానుభవముచే తెలిసికొన్నాఁడు కావున, తనమహోపకారికి ఆకీడు లేకుండను ఆమేలు కలుగునట్లును ఆశీర్వదించినాఁడు. మంగళార్థము కావ్యాంతమందు ఆశీర్వాదము.

తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే
ప్రాణాం స్తస్యా జనహితరవో రక్షితుం యక్షవధ్వాః
ప్రాప్యోదన్తం ప్రముదితమనాః సాపి తస్థౌ స్వభర్తుః
కేషాం న స్యా దభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్. 56.

తదితి.—జలధరవరః = (పుష్కలావర్తకానాం వంశే జాతత్వాత్) జలధరాణాం వరః (శ్రేష్ఠో) మేఘః, తస్యాః యక్షవధ్వాః, ప్రాణాన్ = అసూన్, రక్షితుం, జనాయ - హితః = ఇష్టః - శ్రోత్రయో ర్మధుర ఇతి యావత్ - రవః = ధ్వనిః - యస్య తథాభూతః సన్, తస్య = యక్షస్య - సందేశం = వాచికం పూర్వోక్తం + 'సందేశవా గ్వాచికం స్యాత్' ఇత్యమరః, దివ్యవాచా-దివి భవాః దివ్యాః దేవాః - తేషాం వాక్ తయా, చచక్షే = ఉక్తవాన్ * చక్షిఙో లిట్, 'కామరూపం మఘోనః' ఇతి పూర్వం యక్షేణై వోక్తత్వాత్ తదానీం మేఘః దేవాకారీభూత్వా తాదృగ్వాచా యక్షసందేశం యక్షవధ్వా ఉవా చేత్యర్థ, సా యక్షవధూ రపి స్వభర్తుః - ఉదన్తం = కుశల స్యాగమనస్య చ వార్తాం, ప్రాప్య = ప్రాప్యేత్యర్థః, ప్రముదితమనాః = సంహృష్టచిత్తా సతీ, తస్థౌ = అతిష్ఠత్; తథాహి - ఉత్తమేషు కేషాం ప్రార్థనా అభిమతఫలా న స్యాత్-ఉత్తమేషు పురుషేషు సర్వేషాం ప్రార్థనా అభిమతఫలా స్యా దే వేత్యర్థః. సామాన్యేన విశేషసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః.

జలధరవరః = పుష్కలావర్తకములవంశములో పుట్టినందున మేఘములలో శ్రేష్ఠుఁడయిన యాతఁడు, తస్యాః = ఆ, యక్షవధ్వాః = యక్షాంగనయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, రక్షితుమ్ = కాపాడుటకు, జన...రవః సన్—జన = జనులకు - హిత = ఇష్టమైన (చెవికి మధురమైన) రవః సన్ - ధ్వనికలవాఁ

డై, తత్సందేశమ్—తత్ = ఆయక్షునియొక్క - సందేశమ్ = వాచికమును, దివ్య వాచా—దివ్య = దేవతలయొక్క - వాచా - వాక్కుతో, చచక్షే = చెప్పెను. సాపి = ఆయక్షవధువుకూడ, స్వభర్తుః = తనభర్తయొక్క, ఉదన్తమ్ = కుశలము యొక్కయు రాకయొక్కయు వార్తను, ప్రాప్య=పొంది (విని), ప్రముదితమనాః సతీ—ప్రముదిత = మిగులసంతోషించిన-మనాఃసతీ = మనస్సుకలదై, తస్థౌ=ఉండెను. తథాహి = అట్లేకదా. ఉత్తమేషు = గొప్పవారియందు, కేషామ్ = ఎవరి యొక్క, ప్రార్థనా = వేడికోలు, అభిమతఫలా—అభిమత = ఈప్సితమే - ఫలా= ఫలముగాఁగలది - అనఁగా - సఫలమైనది, నస్యాత్ = కాదు? ఉత్తములు ఎల్ల వారిప్రార్థనలను సఫలముచేయుదు రని యర్థము.

తా.—పుష్కలావర్తకములనెడి యుత్తమమేఘములవంశమందు జన్మించిన యామేఘశ్రేష్ఠుఁడు పూర్వోక్తమయిన యక్షునిసందేశమును ఆయక్షవధువుయొక్క ప్రాణములను రక్షించుటకై జనహితమైనధ్వనికలవాఁడై దేవరూపమును తాల్చి దేవవాక్కుతో ఆమెకు చెప్పెను. ఆమెయు ఆవార్తవలన తనభర్త కుశలముగా నున్నాఁడు గదా యనియు, వచ్చునుగదా యనియు, తెలిసికొని సంతుష్టమానసయై యుండెను. గొప్పవారిని ప్రార్థించినయెడల ఎవరికార్యమైనను నెఱవేఱక మానదు.

వ.—'జలధరవరః'- వరుఁడు కావుననే ఉపకారము చేసినాఁడు. 'దివ్యవాచా' - వట్టియుఱుమువలన అభిప్రాయము తెలియదుగాన దివ్యవాక్కున చెప్పెను. 'ప్రాణాన్ రక్షితుమ్' - ఆసందేశమును అందింపకపోయిన యక్షవధువు ఆసమయములో తప్పక మృతి పొందును. 'జనహితరవః' - జనమాత్రమునకే అతనిధ్వని ఇష్టముగా నుండును, యక్షాంగనకైననో మఱియు నిష్టముగా నుండును; అతని రవము ఎల్లవారికిని ఇష్టముగావుననే దానిని విని కుబేరుఁడును వెంటనే శాపమును మరలించెను.

శ్రుత్వా వార్తాం జలదకథితాం తాం ధనేశోఽపి సద్యః
శాప స్యాన్తం సదయహృదయః సన్విధా యాస్తకోపః
సంయోజ్యై తౌ విగళితశుచౌ దంపతీ హృష్టచిత్తౌ
భోగా నిష్టా నభిమతసుఖాన్ ప్రాపయామాస భూయః. 57.

శ్రుత్వేతి.—ధనేశః = కుబేరోఽపి, జలదకథితాం - జల ముదకం సంతాప సంతప్తాయ దదాతీతి జలదః - అనే నాస్య పరోపకారిత్వం స్పష్టీకృతం - జలదేన-కథితామ్ = ఉక్తాం, తాం = తాదృశీం - సదైన్యా మితి యావత్, వార్తాం =

యక్షస్య వార్తాం, శ్రుత్వా, సద్యః = యక్షవార్తాశ్రవణకాల ఏవ, సదయహృదయః = దయాసహితచిత్తః, అతఏవ, అస్తకోపః = [illegible] యక్షవిషయకరోషః సన్, శాపస్య, అన్తమ్ = అవసానం, సన్నిధాయ = సన్నిహితంకృత్వా - కతిచిద్దినానాన్యవశిష్టాన్య ప్యవిగణయ్యే త్యర్థః, విగళితశుచౌ = నివృత్తవ్యసనౌ, 'అత ఏవ', హృష్టచిత్తౌ = సంతుష్టమానసౌ, ఏతౌ = పూర్వోక్తౌ, దంపతీ - జాయాచ పతిశ్చ దంపతీ * జాయాశబ్దస్య జంభావో దంభావ శ్చ నిపాత్యతే, సంయోజ్య, అభిమతసుఖాన్-అభిమతం సుఖం యేషు తాన్, అతఏవ, ఇష్టాన్ = ఇచ్ఛావిషయీభూతాన్, భోగాన్, భూయః = పునరపి పూర్వవత్, ప్రాపయామాస = గమయామాస.

ఇతి శ్రీ పదవాక్యప్రమాణపారావారపారీణ

మహామహోపాధ్యాయ కోలచలమల్లినాథసూరివిరచితయా

సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతో

మహాకవి శ్రీకాళిదాసవిరచితే మేఘసందేశే మహాకావ్యే

ఉత్తరమేఘః సమాప్తః.

ధనేశోపి = కుబేరుఁడును, జలదకథితామ్ = మేఘునిచే చెప్పఁబడిన,తాం వార్తామ్ = జాలిపుట్టించునట్టి యాయక్షసందేశమును, శ్రుత్వా = విని, సద్యః = తత్క్షణమే, సదయహృదయఃసన్=దయతోఁగూడుకొన్న చిత్తముగలవాఁడై, అందు చేతనే, అస్తకోపఃసన్ - అస్త = తొలఁగింపఁబడిన - కోపఃసన్ = యక్షునిమీఁది రోషముకలవాఁడై, శాపస్య = శాపమునకు, అన్తమ్ = అవసానమును, సన్నిధాయ = దగ్గఱఁగాఁజేసి - (అప్పుడే శాపము తీర్చివేసి), విగళితశుచౌ - విగళిత = జాఱిపోయిన - శుచౌ = దుఃఖముగలవారైన, (అందుచేతనే,) హృష్టచిత్తౌ = సంతోషించినమనస్సుకలవారైన, ఏతౌ = ఈభార్యాపతులను, సంయోజ్య=కూర్చి, అభిమతసుఖాన్ - అభిమత = వారికిష్టమైన - సుఖాన్ = సుఖములుగలవైన (అనఁగా వారికిష్టమైన), భోగాన్ = భోగములను, భూయః = మరల మునుపటి వలె, ప్రాపయామాస = పొందించెను.

తా.—కుబేరుఁడుగూడ మేఘుఁడుచెప్పినయావార్తను విని జాలి పడి తత్క్షణమే యక్షునికి శాపావసానము ననుగ్రహించెను. అట్లు ఆదంపతులను దుఃఖము తీర్చి సంతుష్టులంజేసి మరలఁగూర్చి కుబేరుఁడు కాంక్షితభోగములను మునుపటివలెనే వారికి కలుగఁజేసెను. అట్లు వా రతనికరుణచే మరల క్షేమము పొందిరి.

వ.—'జలద' అనుట పరోపకారిత్వమును సూచించుటకు. 'సంయోజ్య ప్రాపయామాస' - [illegible]ంతప్రయోగములు చేయుటచే కుబేరుఁడు కరుణించి తానే ప్రయత్నపూర్వముగా వారిని కూర్చి సంతుష్టులం జేసి యిష్టభోగముల నొసంగె నని యర్థము, వారే శాపావసానఫలముగా తామే గూడిభోగము లనుభవించి రనిగాదు. 'అపి' - దండించినప్రభువుకూడ కనికరించె ననుటచే ఇతరులకు ఎంతజాలి కలిగెనో చెప్పవలయునా యని యర్థము ఇచటను 'ధనేశః' అని ప్రయోగమే గాని 'ధనదః' అని కాదు; ఉపకారి కనికరించుట యాశ్చర్యముకాదు, ధనమే ప్రధానముగా చూచుకొనువాఁడు కనికరించుట యాశ్చర్యము. 'భోగా నిష్టా నభిమతసుఖాన్ ప్రాపయామాస భూయః' - అనుట కావ్యాంతమందు మిగుల మంగళశ్రుతిగా నున్నది. ఇందువలన కవి వ్యాఖ్యాత్రధ్యాపయితృ పఠిత్రాదుల కెల్ల మంగళ ముద్దేశింపఁబడిన దని యెఱుంగునది.

ఆంధ్రవివరణముతోఁడి యుత్తరమేఘము

సమాప్తము.

—o—

